## పూర్వపక్షనయనము.

3—తా. పూర్వపక్షనయనము, అనగా దినముగ్రహించిన పగలు అనియు పక్షముగ్రహించిన శుక్లపక్షమనియు తెలిసికొన వలయును రాత్రిమరణమును కృష్ణపక్షమరణంబును ఆహితాగ్నికి యోగ్యమైనది కాదు. కాబట్టి యాహుతులవలన దివానయనము సిద్ధింపజేయవలయును. అది యేతీరు ననగా, పూర్వపక్షరాత్రియందు మృతియందు సంశయము తోచినయెడల సాయంకాలాగ్నిహోత్రమును జేసి యప్పుడే ప్రాతరగ్నిహోత్రమును జేయవలయును పూర్వపక్షములో పగటియందు మృతి నొందినవానికి ప్రాతరగ్నిహోత్ర మొక్కటియేగాని మరేమియుజేయ నక్కరలేదు బహుళపక్షమునందు మరణసంశయము కలిగినప్పుడు సాయంకాలమునందే ప్రాతరాహుతులను జేసి పూర్వపక్షమును సిద్ధింపజేయవలయును. దర్శయాగమును జేయవలయును. అది యేవిధముగా ననగా, బహుళపక్ష సాయంకాలంబున మరణసంశయము కలిగినప్పుడు ఆదినము మొదలు అమావాస్యపర్యంతము మిగిలినదినముల సాయంకాల హోమములనుజేసి పక్షహోమ న్యాయముగా జేయవలయును. అప్పుడే ఆమరు దిన ప్రాతఃకాలము మొదలు శుక్లపాడ్యమివరకునుండు ప్రాతఃకాలహోమములను జేయవలయును. మరియు బహుళపక్షములో పగటియందే మరణసంశయము కలిగినప్పుడు ముందుగా ప్రాతరాహుతునేజేసి పిమ్మట సాయంకాలాహుతులను జేయవలయును. ఇట్లుచేసిన పూర్వపక్షనయనము సిద్ధించును. తిరిగిజీవించినను అగ్నిహోత్రములను దర్శయాగములను తిరిగిజేయ నక్కరలేదు.

## పక్షములో మిగిలిన దినముల హోమవిషయము

౪—తా. మరణము నొందినయెడల మృతాగ్నిహోత్ర విధిప్రకారముగానే యాపక్షములో మిగిలినదినములను లెక్కపెట్టి నొక్కొక్కసారిగ్రహించుచు భిన్నతంత్రముగానే సాయంకాల ప్రాతఃకాల రెండు హోమములను జేయవలయునని కొందరు నుడివిరి ఆజేయువిధానము పూర్వపక్షనయనము అనుదానిలో జెప్పబడినది. ఈవిధముగానే త్రికాండియును జెప్పెను. రాబోవు దర్శాధిదేవతులకు ముందుజెప్పబోవు విధముగా పూర్ణాహుతులను జేయవలయును పాత్రపూరణకొరకు అగ్నిహోత్రోచ్ఛేషణము నుంచవలయును; స్థాలియందు మిగిలినది యుచ్ఛేషణమని చెప్పబడును మృతాగ్నిహోత్ర స్థాలియందును తృణాపహారమును జేయ

వలయును పూర్వాహుతికి ప్రధానముగాను ఉత్తరాహుతులకు అంగత్వముగాను జెప్పబడెను. పక్షహోమ న్యాయానుసారముగా హోమములు గార్హపత్యదక్షిణాగ్నులలో లేవనియు ఆహవనీయాగ్నియందే జేయవలయుననియు కపర్దిస్వామి చెప్పెను. గార్హపత్యాగ్నియందు నాలుగాహుతులును అన్వాహార్యపచనమునందు నాలుగాహుతులును మంత్రరహితముగా జేయవచ్చునని మరియొకరు చెప్పిరి. ప్రోషితమరణంబున అగ్నిగుప్త్యర్థమైన హోమమునందు సాంగముగా సమస్తము మంత్రరహితముగా నగ్నిహోత్రము జేయవలయునని భాష్యకారుండగు ధూర్తస్వామిచే జెప్పబడెను. పక్షహోమ న్యాయానుసారముగా నేర్పడిన పూర్వపక్షనయనాగ్నియందును మృతాగ్నియందును పక్షములో మిగిలిన హోమమునందును అపరాగ్ని హోత్రములంమను హోమములున్నవి. పక్షహోమములను శేషహోమములను సమస్యచేసి జేయవలయునని త్రికాండి చెప్పెను. దాని విధాన మెట్లనగా, పాడ్యమియందు సాయంకాలమునందుగాని లేక ఆపదసంభవించిన దినమునందుగాని మొదలిడి అమావాస్యపర్యంత దినసంఖ్యలచే గ్రహించవలయును. ఉన్నయనము నాలుగుపర్యాయములు మరియొకపాత్ర సహాయముగాగల నిత్యస్రుక్కునందు మరియొకస్థూలస్రుక్కుతో ఉన్నయనము జేయవలయును. ఒకసమిత్తు ఒకహోమము ఒకపర్యాయము హస్తసమ్మార్జనము ఒక్కపర్యాయము ఉపస్థానము జేయవలయును. ఈప్రకారముగానే ప్రాతహోమముల గురించియు జేయవలయును. పిమ్మట నగ్నిహోత్రములను ఆరోపణజేయుట గాని ధారణజేయదగినవా రున్నయెడల ధారణగాని జేయవలయును

## దర్శపూర్ణమాసాదులకు పూర్ణాహుతులు జేయవలసిన విధానము.

౫—తా. ఆహితాగ్ని బహుకాలము దర్శపూర్ణయాగములు చేయని పక్షమునందు మరణము విషయమై సంశయము కలిగిన యెడల దర్శపూర్ణమాసములకు నుక్తకాల మతిక్రమించెనేని ముందుగా ప్రాయశ్చిత్తము నిమిత్తమై పథికృద్వైశ్వానరేష్టులను జేసి పిమ్మట దర్శపూర్ణమాసయాగములను జేయవలయును. శుక్లపక్షమందు మృతిసంశయము కలిగెనేని అనంతరము అతిపన్నములగు దర్శప్రధాన దేవతలకు పూర్ణాహుతులను జేయవలయును ఇట్లు చేయుటకు విధానమంతయు "చిరకాలమకృత దర్శపూర్ణమాసాది" అనునది మొదలు "పూర్వవత్పూర్ణాహుతీర్జుహుయాత్" అనువరకు నుండు గ్రంథముచే దెలిసికొనవలెను

## పిండపితృ యజ్ఞ లోపమునకు ప్రాయశ్చిత్తము.

౬—తా. పిండపితృ యజ్ఞలోప ప్రాయశ్చిత్తముకొఱకు సంకల్పముజేసి ఆజ్యమును నాలుగుసారులు గ్రహించి "మహాహవిర్హోతా" అను మంత్రముతో హోమముజేసి ఆయగ్నిని విడిచి ప్రాచీనావీతముగా పిండపితృయజ్ఞ దేవతులకొఱకు పూర్ణాహుతిని జేసెదనని సంకల్పముజేసి దక్షిణాగ్నిని విహరించి యుపవీతముగా పండ్రెండుసారులు ఆజ్యమును గ్రహించి "సోమాయ" అనుమంత్రముచే హోమముజేసి తిరిగి పండ్రెండు సారులు గ్రహించి "యమాయ" అనియు "తిరిగి పండ్రెండు సారులు గ్రహించి "అగ్నయే" అను మంత్రములచే హోమములను జేయవలయును. ఈప్రకారము పైగ్రంథముచే దెలిసికొనవలెను

## పశుయాగ పూర్ణాహుతి విధానము.

౭—తా. పశుయాగము జేయనందుకు ప్రాయశ్చిత్తము నిమిత్తమై పథికృద్వైశ్వానరేష్టుల సంబంధమగు హోమములనుజేసి యాజ్యాపురోను వాక్యాదులతో పూర్ణాహుతుల రెంటిని జేయవలయును. పురోడాశము మొదలగునవి దీనికి నంగము అందువలన అతిపన్నలోప నివృత్తి పూర్ణాహుతి దీనికిలేదు.

## ఆగ్రయణ లోప ప్రాయశ్చిత్తము.

౮—తా. ఆగ్రయణలోప ప్రాయశ్చిత్త నిమిత్తమై పూర్వము వలెనే పథికృద్వైశ్వానరేష్టుల ప్రత్యామ్నాయ పూర్ణాహుతులను జేయవలయును. ఆగ్రయణేష్టిని జేయక నవీనాన్నమును భుజింపగూడదు గాన తద్దోషనివృత్తికొఱకు వైశ్వానరేష్టిని జేయవలయును గాన దాని స్థానంబున పూర్ణాహుతినిజేసి ఆగ్రయణేష్టి దేవతులకు నాజ్యముతో పూర్ణాహుతులను జేయవలయును. ఆగ్రయణమునకు నగ్నిహోత్రము ప్రధానదేవతగాన పూర్ణాహుతిలేదు. ఈప్రకార మన్నియాపత్తులయందు జేయవలయును దీని విధానము పైగ్రంథముచే దెలిసికొనవలెను.

## నక్షత్రేష్టిలోప నివృత్తివిషయము.

౯—తా ఈప్రకారము నక్షత్రేష్టులు దివస్యేనీష్టులు అపాఘేష్టులు తురాయణేష్టులు ప్రారంభించి చేయుచుండగా మధ్యను మృతివిషయమై సంశయము దోచినయెడల మిగిలిన యిష్టిప్రధాన దేవతులకు నాలుగు పర్యాయములు ఆజ్యమును గ్రహించుచు నాయాదేవతుల కొఱకు

వేరువేరుగా నాయాపురోనువాక్యములతో హోమములను జేసి పూర్ణాహుతులను జేయవలయును.

చాతుర్మాస్యలోపమును పూర్తిజేయుట.

౧౦—తా. వైశ్వదేవము ప్రారంభించినది మొదలు నాలుగుపర్వములు సమాప్తికాక పూర్వము చాతుర్మాస్యలనడుమ మరణసంశయము కలిగినప్పుడు కొన్నియిష్టులు చేయనిపక్షమునందు శేషించినపర్వములకు ఆజ్యము నాలుగుపర్యాయములు గ్రహించుచు వానివానికి చెప్పబడిన యాజ్యాపురోనువాక్యలతో ప్రధానదేవతలకొఱకు పూర్ణాహుతులను జేయవలయును మరియు వైశ్వదేవము ప్రారంభించినపిమ్మట బహుళపక్షములో మరణసంశయము కలిగినప్పుడు పూర్వమువలెనే సాయంకాల ప్రాతఃకాలాహుతులనుజేసి యజమానుని శుక్లపక్షనయనునిగాజేసి దర్శపూర్ణమాసేష్టులనుజేసి మిగిలిన పర్వములను లెక్కించి వానిప్రధానదేవతులకు ప్రత్యామ్నాయముగా పూర్ణాహుతులను జేయవలయును శుక్లపక్షమునందు సందేహము కలిగినయెడల ప్రత్యామ్నాయముగా దర్శపూర్ణమాసేష్టులు సంభవించనియెడల పూర్వమువలెనే చతుర్గృహీతమగు నాజ్యముతో ప్రధానదేవతులకొఱకు పూర్ణాహుతులు మొదలగు సమస్తమును జేయవలయును ఆశ్వలాయనులు ఆశ్వలాయన సూత్రప్రకారముగాను ఆపస్తంబులు ఆపస్తంబ సూత్రప్రకారముగాను పశ్చాత్తము జేసి ఆయాసూత్రములయందు జెప్పబడిన యాజ్యాపురోనువాక్యాలతో పూర్ణాహుతులను జేయవలయును.

ఇష్టినడుమ మరణించిన విషయము.

౧౧—తా. ఇష్టిమధ్యయందు యజమానిగతించినను మరణించిన పిమ్మట హవిస్సులు ఆసన్నమైనను సమస్తహవిస్సులవలన సర్వాహుతులను జుహువునందు నొక్కసారిగానే గ్రహించి అన్ని దేవతులమంత్రములను చతుర్థ్యంతముతో నుచ్చరించి యొక్కస్వాహాకారముతోనే హోమము జేయవలయును. దీనివివరము "అగ్నయే" అనునది మొదలు "మహేంద్రయాజినః" అనువరకునుండు గ్రంథమువలన దెలియబడుచున్నది. పూర్వదినమునందుగాని హవిస్సులు నిష్పన్నములుకాక పూర్వముగాని మృతినొందినయెడల మంత్రరహితముగానే ప్రధానహవిస్సుల నాయత్తపరచి అన్నింటివలన నొక్కసారిగానే యొక్కచోటనే గ్రహించి పూర్వమువలెనే హోమము జేయవలయును. భార్య మరణించినను భర్తతో

సమానమైనదియే గాన ఆప్రకారమే జేయవలయును. ఇట్లు జేయుటవలన ప్రధానము సిద్ధించుటవలన ప్రయాజాది సర్వాంగములు సిద్ధించును. అంతయును మంత్రరహితముగానే జేయవలయునని కొందరనిరి. ఇష్టుల యందువలెనే ఆగ్రయణ పశుబంధాదులయందును జేయవలయును.

పునరాధేయ కాలములు.

౧౨—తా. ఉత్సర్గేష్టిని జేసి యగ్నిహోత్రములను వదలినపిమ్మట పునరాధేయమునకు సంకల్పించకమునుపే మరణసంశయము కలిగినయెడల మూడుదినములలోపల పునరాధేయము జేయగూడదని కాత్యాయనుడు చెప్పినను అగ్నిహోత్రములు లేకుండా దహనసంస్కారము జేయుట అయోగ్యము గాన పునరాధేయము జేయవలయును. మరణకాలము సంభవించినను సమస్తఆపత్తులయందును వెంటనే పునరాధేయము జేయ వచ్చునని త్రికాండి మొదలగువారుచెప్పిరి. కాబట్టి మృతి సంశయము కలిగి నప్పుడు నేష్టికముగా పునరాధేయమును జేసి ఉక్తకాలముకాని దోష నివృత్తికొఱకు ప్రాయశ్చిత్తమగు సర్వప్రాయశ్చిత్తమును జేసి సాయం కాలాగ్నిహోత్రములు మొదలగునవి చేయవలయును. శుక్లపక్షము నందు మరణసంశయము కలిగినయెడల ఇష్టితోగూడ పునరాధేయమును జేసి అనుక్తకాల దోషనివృత్తికొఱకు ప్రాయశ్చిత్తము జేసి ప్రాతరగ్ని హోత్రమును జేసి అతిపన్నమైన దర్శయాగమును జేసి సాయంకాలాగ్ని హోత్రాదులను జేయవలయును. బహుళపక్షమున మరణసంశయము కలిగినయెడల ఇష్టితోగూడ పునరాధేయమును జేసి కాలాపరాధ దోష నివృత్తికొఱకు ప్రాయశ్చిత్తమును జేసి ప్రాతరగ్నిహోత్రము సమనంత రాతిపన్న పూర్ణిమాయాగముజేయ నక్కరలేదు. అనంతరము సాయం కాల ప్రాతఃకాలాహుతులవలన యజమానుని పూర్వపక్షసహితునిగా జేసి రాబోవు దర్శపూర్ణమాసాధి దేవతులకొఱకు పూర్ణాహుతులను జేయవలయును. అగ్నిహోత్రముత్పన్నమైన పిమ్మట పునరాధేయమునకు సంకల్పముజేయక పూర్వమే యాహితాగ్ని మృతుండగుచేని త్రేతాధా నము జేసినపిమ్మట సమనంతరాతిపన్నయాగముగాని అట్టియాగముజేయ నందుకు ప్రాయశ్చిత్తముగాని చేయతగినదికాదు. పూర్ణిమాయాగమును జేసి యగ్నిహోత్రములను విడువవలయునను వాక్యమువలన అగ్ని హోత్రమునకు నిషేధము కలుగగానే సర్వవిధులయందును మృతహో మము నియతమైనది గనుక మృతాగ్నిహోత్రము జేయవలయునని కపర్ది

స్వామి భాష్యకారాదులచేత జెప్పబడెను. ఇదియే అగ్నిగుప్తర్థమైన మృతాగ్నిహోత్రము మృతాగ్నివిధాన మేతీరుననగా, అగ్నిహోత్రలోప ప్రాయశ్చిత్త రహితముగానే మృతాగ్నిహోత్రము జేయవలయును. పునరాధేయమునకు సంకల్పించినపిమ్మట మృతినొందినయెడల ప్రేతాధానము జేసి ప్రాయశ్చిత్తరహితముగా మృతాగ్నిహోత్రమును జేసి దర్శపూర్ణయాగములకు కాలాతిక్రమణదోషనివృత్తి నిమిత్తమై ప్రాయశ్చిత్తమును జేసి పూర్ణాహుతులను జేయవలయునని కొందరు చెప్పిరి పునరాధేయ సంకల్పకాలమునకు పూర్వముగాని పరమందుగాని బహుళపక్షములో మరణించిన యెడల సాయం ప్రాతరాహుతులచే యజమానునకు పూర్వపక్షనయనము సిద్ధింపజేసి రాబోవు దర్శయాగమును జేయవలయునని కొందరుచెప్పిరి. పెనిమిటితో సమానమైనది గాన మృతినొందినప్పుడు భార్యకు కూడ యీవిధముగానే చేయవలయును. అగ్నిహోత్రము ప్రారంభించి పూర్ణాహుతిని జేయకమునుపు యజమానునికి మరణము సంభవించెనేని పూర్ణాహుతి మొదలు సమస్తము మృతాగ్నిహోత్రమువలెనే చేయవలెను. మొదటి యాహుతిజేసిన పిమ్మట యజమానుడు గతించినయెడల ఆహనీయాగ్నిలో దక్షిణభాగమందైన చల్లనిభస్మయందు "అగ్నయేక వ్యవాహనాయ స్వాహా" అనునట్టి ఉత్తరాహుతి నుంచవలయును. హవిస్సును ప్రాశనజేయ నక్కరలేదు. మృతాగ్నిహోత్రన్యాయముగా తృణప్రహరణానంతరము అగ్నిహోత్రమును సమాప్తముజేసి పితృమేధము చేయవలయును. మరియు ఉత్తరాహుతి లేదనియు "ప్రేతేమాత్యా" అనునది మొదలుకొని ప్రేత్యకృత్యమును జరిగించుచు "పరేయువాగ్సమితి" అని చెప్పబడు సృదాహుతినే యుత్తరాహుతిస్థానమందు హోమముజేసి పితృమేధమునే చేయవలయును గాని అగ్నిహోత్ర సమాప్తిలేదని కొందరిమతము. సామాన్యము విశేషములేకుండుటవలన బహుళపక్షమునందు ఆహుతులచే పూర్వపక్షనయనము లేదు. భార్య మృతినొందినను పెనిమిటితో సమానమైనది గాన ఈప్రకారమే చేయవలయును.

## ప్రతి వసంత సోమయాగ విషయము.

౧౩—తా. ప్రతివసంతకాల సమయమునందును సోమయాగము జేయుటకు సంకల్పముజేసి సోమయాగము జేయనిపక్షమందు మృతిసంశయము కలిగినప్పుడు ఆయాసవనసోమ దేవతలకొఱకు వారివారి సూత్ర

ములలో జెప్పబడిన యాజ్యలతో చతుర్గృహీతమగు నాజ్యముచే సవనసోమ దేవతులకొఱకు పూర్ణాహుతులను జేయవలయును. సూత్రములో పురోనువాక్యల నుదహరించలేదు కాబట్టి చెప్పనవసరము లేదు. దీనివిధానము "సవనసోమ దేవతాభ్యః" అనునది మొదలు "తమగ్నిం పరిత్యజ్య" అనువరకునుండు గ్రంథముచే దెలిసికొనవలయును. అగ్నివిడువబడి పునరాధేయ సంకల్పితకాలము గడచియుండగా ప్రతి వసంత సోమయాగము విషయమై సోమము జేయబడకుండెనేని వసంతకాలాతిక్రమ ప్రాయశ్చిత్తము నిమిత్తమై సప్తదశాగ్నిష్టుత్ స్థానమున సవనసోమ దేవతులకొఱకు పూర్ణాహుతులను జేసెదనని సంకల్పము జేసి పూర్వమువలెనే పూర్ణాహుతులను జేయవలయును. అనంతర మతిపన్న వసంత సోమ దేవతులకు పూర్ణాహుతులను జేయవలెను. ఈప్రకారము మరణానంతరమందును చేయవలయునని కొందరనిరి. భార్య మరణించినను ఈప్రకారమే చేయవలయును. ఇట్లు చేసినను యజ్ఞలోపము లేదని చెప్పుటవలన మరణసంశయము కలిగినప్పుడే చేయవలయును గాని మరణించిన పిమ్మట జేయగూడదు అగ్నిహోత్రేష్టి పశువులకు జీవించియున్నప్పుడేగాని మరణించిన పిమ్మట నధికారము లేదని చెప్పబడెను. మరణశంక గలవాడు ప్రతినిధిరూపమగు కర్మలను జేసినను యజ్ఞలోపము లేదు. ప్రతినిధిగా జేయబడు కర్మమధ్యయందు మృతినొందెనేని కర్మలన్నియు మరణముతో సమాప్తినొందును కాబట్టి యజ్ఞమును జేసినవాడే యగును యజ్ఞమునందు అవభృదముతో నన్నికర్మలు పూర్తియగునట్లు దహనముతో నన్నియు పూర్తియగును దహనమే యవభృదము.

దేశాంతర మరణమును గురించి.

౧౮—తా. గృహమునం దగ్నిహోత్రములనుంచి యజమాని దేశాంతరమువెళ్లి యచ్చట మృతినొందగా ఆవృత్తాంతమును వినినతోడనే యాతని భార్య స్నానముజేసి సంకల్పముజేసి యామెచే నియమింపబడిన ఋత్విక్కులచే పాథికృతేష్టిని చేయించవలయును. భార్యయొక్క అనుమతిచే నుద్దేశదేవతకొఱకు త్యాగము అధ్వర్యుడే చేయవలయును. భార్యయే తనశక్తి ననుసరించి దక్షిణ నివ్వవలయును. యాజమాన్యమును వహించిన కర్మలయందు నధ్వర్యుడే సమంత్రకముగా నాహుతులను జేయవలయును. దేశాంతర మృతిశ్రవణ నిమిత్తమైన ప్రయోగము దహనము ననుసరించినది కాబట్టి పాథికృతేష్టి సంబంధాగ్ని

హోత్రములను మరణించిన యజమానుని శరీరముతో సంబంధించువరకు నెప్పుడును ధరించియుండవలయును. పితృమేధవిధియందును ఈప్రకారమే విహారణము పాథికృతేష్టియందు నధ్వర్యుడే పితృమేధాంతము జేయవల యును. ఇష్టినిజేయలేని పక్షమునందు నగ్నిహోత్రములను విహరించి పాథికృతేష్టిస్థానమునందు పూర్ణాహుతుని జేయుటకు నధ్వర్యునిగా నియ మింపబడిన సుతులు మొదలగువారు ప్రాచీనావీతులై చతుర్గృహీతమగు నాజ్యముతో పూర్వమువలెనే పూర్ణాహుతుని జేయవలయును. ఈయ గ్నులను పితృమేధాంతము వరకు నిత్యము చేయవలయును. ఆదినము నందుగాని మరుదినమునందుగాని శరీరమునుగాని యెముకలనుగాని.ఆయ గ్నులవద్దకు తెచ్చువరకు అగ్నిహోత్రకాలము సమీపించినప్పుడు మృతా గ్నిహోత్రము జేయువిధానముచే వత్సలేని యావుపాలతోగాని వత్స గల యావుపాలతోగాని యగ్నిగుప్తికొఱకు ప్రాతస్సాయంకాలము లందు నగ్నిహోత్రమును జేయుచుండవలయును.

అగ్నిగుప్తి హోమము.

౧౫—తా. దర్శపూర్ణమాసములు నిత్యములైనను జీవించియుం డు నంతవరకు అని చెప్పుటవలన మరణించిన పిమ్మట నవి నివృత్తించుచు న్నవి. అగ్నిసంరక్షణ నిమిత్తమై యగ్నిహోత్రమును జేయుచుండ వల యును. అగ్నిసమీపమునందు మృతినొందినను అగ్నిసంస్కార పర్యంత ము నీవిధముగానే హోమమును జేయుచుండవలయును. ఈప్రకారమగ్ని హోత్రము జేయుచుండగా సమీపదేశములోనే మృతినొందిన యెడల మృతశరీరము నూనెబోసిన గంగాళములోనుంచి దానిని యొకబండిమీద దీసుకుని రావలయును, లేక బహుదూరముగా నున్నయెడల లౌకికార ణులవలన నగ్ని నుదయింపజేసి దానిచే మృతశరీరమును దహించి యస్థు లను కృష్ణాజినమునం దుంచి నూతనవస్త్రముచేజుట్టి దానిని యొకపొడుగు గానుండు వాసమునకు గట్టి భూమియం దుంచకుండా తీసుకుని రావల యును. అట్లు తెచ్చువారు మృత్పాత్రలయందే భుజింపుచు ఆయజమాని గ్రామ పొలిమేరయం దుంచవలయును. ఇట్లు శరీరమునుగాని యెముకల నుగాని తెచ్చిన పిమ్మట యజమానిభార్య బ్రాహ్మణులకు సమస్త యజ్ఞ పాత్రలనిచ్చి యినుము మృత్తిక సంబంధమగు పాత్రలను నీటిలో విడిచి రాతిపాత్రలను కుమారునకిచ్చి పైతృమేధిక సంస్కారముకొఱకు గృహ మునం దుండెడి యగ్నిహోత్రములను ప్రత్యక్షముగా దెచ్చి అస్థులసమీ

పమునందుంచి స్థానముల నేర్పరచి యాయగ్నుల యందుంచి షడ్గుణిత షడబ్ద ప్రాయశ్చిత్తముజేసి పాత్ర చయన రహితముగా నుత్క్రాంతి గోదానాదులనుజేసి పైతృమేధిక సంస్కారమును జేయవలయును. ఈపక్షములో పాత్రచయన దానముల విషయమై రెండుపక్షములుగా నున్నది అగ్నిసమీపమునందు మృతినొందినవానికి పాత్రచయనము తప్పక చేయవలయును.

ప్రతికృతిదాహ విషయము.

౧౯—తా. దేశాంతర మరణంబునందును ప్రతికృతి దహనమందును చయనదానముల గుఱించి వికల్పముగా జెప్పబడెను. భార్యమరణించినను ఈవిధముగా దెలిసికొనవలయును. శరీరముగాని యెముకలుగాని దొరకని పక్షమునందు 320 వై మోదుగాకు తొడిమెలను దెచ్చి కృష్ణాజినమునందు మనుష్యాకారముగా నుంచవలయును. అది యెట్లనగా, నలుబది తొడిమెలచే శిరస్సును పదింటిచే కంఠమును యాభైయాభైచే రెండుచేతులను వానిలోనే వ్రేళ్లను పదితొడిమెలచేతను ముప్పదిచే హృదయమును యెనిమిదింటిచే శిశ్నమును పంద్రెండుచే వృషణములను డెబ్బదిడెబ్బదిచే రెండుపాదములను వానిలోనే పదింటిచే కాలివ్రేళ్లను కల్పించి మోదుగ నారతోగాని దర్భలచేగాని సంధులను బిగించవలయును. అట్లు మోదుగాకు తొడిమెలు దొరకని పక్షమునందు దర్భలతోనైన మృతుడైనవాని యాకారముజేసి స్నానముజేయించి యలంకరింపజేసి కంఠ ప్రదేశము దక్షిణముగాను రోమములు క్రిందుగానుండునట్లు కృష్ణాజినమును బోర్లవేసి దానిపైని యజమానుని ప్రతికృతిని వెల్లకిలగానుంచి నూతనవస్త్రమును గప్పిబంధువులందరు చుట్టునుగూర్చుండి "అయసి నారాయణశర్మా" "ఇమేఅగ్నయ" అనుమంత్రముచే నభిమంత్రణ జేయవలయును. అనంతరము ఉత్క్రాంతి గోదానము మొదలు పైతృమేధిక కర్మనంతయును జరుపవలయును. ఇట్లు ప్రేతాదానము జెప్పబడెను. ఉత్క్రాంతి గోదానాదికము సమానము యెముకలు దొరికినయెడల తిరిగి దహనము చేయవలయును. దొరకని పక్షమునందు పలాశవిధిగా సంస్కారము జేయవలయును. భార్య మృతినొందిన నీప్రకారమే చేయవలయును.

కక్ష దహనము.

౨౦—తా. ఆహితాగ్ని పరదేశమువెళ్లి మృతినొందిన పిమ్మట మృతవార్త తెలిసి యెప్పుడు మృతినొందినది తెలియని విషయములో

మొదట యింటినుండి యేదిక్కుగా ప్రయాణమై వెళ్లినో యాదిక్కున నుండు కక్షమునుగాని యక్కడనుండు తృణాదులనుగాని (కక్షమనగా దున్నబడనిదియు గడ్డి మొదలగు వానిచే గప్పబడిన బీటిప్రదేశము) ఆహితాగ్నిసంబంధమగు అగ్నిహోత్రములచే మంత్రరహితముగానే దహించవలయునుగాని పైతృమేధిక విధానములేదు. లేక మోదుగాకు త్రొడిమెలతో ప్రతికృతినిజేసి పైతృమేధిక విధిప్రకారముగాను దహనసంస్కారము జేయవచ్చును. కక్షదహనమునందును ప్రతికృతి దహనమునందు నుదక దానాది క్రియలన్నియును సమానముగానే చెప్పబడినవి.

పితృమేధసంస్కారలోపము.

౧౮—తా. రెండుపక్షములందును సమస్తపాత్రల నిచ్చుటయు మృత్పాత్రలను ఇనుపపాత్రలను జలములో విడుచుటయు జేయవలయును. ప్రతికృతిదహనము జేసినప్పుడంతటను "అయమస్యసౌయస్యత ఇమే అగ్నయ" అనుమంత్రమును బంధువులందరును తప్పక పఠించవలయును.

మరియు నీవిషయమును గురించి విశేషముగా జెప్పబడుచున్నది.

౧౯—తా. ఆహితాగ్ని యితరదేశము వెళ్లినప్పుడు ఇంటియందలి నశించిన యగ్నిహోత్రములు యజమానుని బ్రవేశించుచున్నవి. అందువల్లనే యజమానుడే యగ్నిహోత్రము లనియు ఔపాసనమే యజమానుడనియు యజమానుడు అగ్నిహోత్రమునకు కారణమనియు శ్రుతియందు జెప్పబడెను. ఎవని యగ్నిహోత్రములు ధరింపబడకయుండెనో అట్టివాని శరీరము యెముకలు దొరకని పక్షమునందు ప్రతిపత్తినిమిత్తమై యగ్నిహోత్రములకును శరీరాస్థులకును ఒకదానితో నొకటి పరస్పరసంబంధ మపేక్షించి యుండుటవలనను త్రేతాధానంబుచే నగ్న్యుత్పాదనము శక్యము కాకపోవుటవలన పితృమేధసంస్కారమునకు లోపము సంభవించును. "పితుఃపుత్రేణ కర్తవ్యాః" అను వచనానుసారముగా తండ్రికి పిండదానము ఉదకదానము మొదలగు క్రియలను కుమారుడు చేయవలయును. అది యేవిధముగా ననగా, శిలనుసంపాదించి యుదకదానాద్యౌర్ధ్వదైహిక క్రియలనన్నియు జేయవలయును. అగ్నిహోత్రము మృతినొందిన యజమానుని శరీరము యెముకలుండిన యగ్నిహోత్రములుండువిధము కాబట్టి ఇవియన్నియు నొకదానితో నొకటి సంబంధించియున్నది కాబట్టి అస్థులు శరీరము లేని సమయమునందు దహనాది కర్మ

లోపించును గాన శిలనుస్థాపించి సుతులు మొదలగువారు ఉదకదానాది క్రియలనన్నియు జేయవలయును. మృతినొందిన భార్యకు నీవిధముగానే చేయవలయును. బ్రాహ్మణులకు పాత్రలనన్నియునిచ్చి మృణ్మయపాత్రలను నీటిలో విడువవలయును. ఇట్టి పాత్రలను పుచ్చుకున్నందువలన దోషము లేదని దానవిధియందు జెప్పబడినది. కాబట్టి పాత్రలను గ్రహించినవారు వారివారి యజ్ఞకర్మానుష్ఠానమునందు నుపయోగపరుచు కొనవచ్చునని తెలిసికొనవలయును.

## ఆహితాగ్నికి దుర్మరణ విషయము.

౨౦—తా. ఆహితాగ్ని యేకారణముచేత నైనను పతితుడగు నేని యార్ధ్వదైహికకర్మలను బొందింపజేయుటకు తగినవాడుకాడు. అట్టి వాని యగ్నిహోత్రములను జలమునందును ఔపాసగ్నిని రాజబాటయం దును విడిచి లౌకికాగ్నిచే యజ్ఞపాత్రలను దహింపవలయును. ఆప్రకా రముగానే స్మృతియును జెప్పెను. పతితులైనవారికి దహనము అస్థిసంచ యము అంత్యకర్మ అశ్రుమోచనము పిండదానాదులు ఇతరమగు శ్రాద్ధ ములు మొదలగున వేవియునుజేయ నవసరములేదని బ్రాహ్మపురాణంబున జెప్పబడియె. ఆత్మత్యాగము జేసికొనిన వారియొక్క పతితులైనవారి యొక్క మృతకళేబరములను గంగలో విడువవలయునుగాని అగ్నిదాహా దికర్మల నేమియుజేయ నక్కరలేదు. అట్టివాని యాశౌచమును లేదు. ఎవడైనను తెలియక దాహాదికర్మలను జేసెనేని రెండు తప్తకృచ్ఛ్రము లను జేసి నందువలన పరిశుద్ధుడగును. అట్టి పతితులైన వారిశవములను దెలియక స్పృశించిన మహాసాంతపన ప్రాయశ్చిత్తముచేతను తెలిసిస్పృ శించిన తప్తకృచ్ఛ్రముచేతను పవిత్రుడగును ఇట్లు స్మృతి చంద్రికాదుల యందు జెప్పబడెను. మరియు మహాపాతకదోష దూషితుడై తండ్రి గతిం చిన పిమ్మట కుమారుడు వృద్ధిశ్రాద్ధాదులను జేయుసమయంబున తండ్రి పేరును విడిచి పితామహుడు మొదలగు పైవారిముగ్గురు నామములనే చెప్పవలయును. పితామహుడును పతితుడయ్యెనేని ఆయనతండ్రి మొద లుకొనియును ప్రపితామహుడును పతితుడయ్యెనేని వానితండ్రిమొదలు ముగ్గురునామములను జెప్పవలయును. ఇందులో నడుమ నెవడైన నొకడు పతితుడయ్యెనేని వానినివిడిచి వానికిపూర్వము పరమునుండు వారినామ ములను జెప్పవలయునని త్రికాండి చెప్పెను. తండ్రి పతితుడైనను సన్య సించినను దుర్మరణము నొందినను పూర్వము తండ్రియే పితరులకు దర్శ

శ్రాద్ధాదులను జేసెనో వారికే కుమారుడును దర్శశ్రాద్ధాదులను జేయవల యునని విజ్ఞానేశ్వరమందు జెప్పబడియె.

దుర్మరణ ప్రాయశ్చిత్తము.

౨౧—తా. దుర్మృతినొందిన యాహితాగ్నికి ధర్మశాస్త్ర ప్రకారముగా స్మార్తప్రాయశ్చిత్తమును జేసి శ్రౌత ప్రాయశ్చిత్తమును జేసి పిమ్మట పైతృమేధికమును జేయవలయును. అగ్నిహోత్రము కొఱకు విహరించిన యాహవ నీయాగ్నియందే చతుర్గృహీతముగా నాజ్యముచే ప్రాయశ్చిత్తహోమములను జేయవలయును. ఆహితాగ్ని పిడుగువల్లను సర్పవృశ్చికములవల్లను సింహ వ్యాఘ్రములవల్లను వరాహములవల్లను పశువుల వల్లను మృతినొందిన యెడల "అగ్నిర్మూర్ధా" మొదలు "గోభ్య ఇదం" అను వరకు నుండు గ్రంథములోగల మంత్రములచే నాయా మరణములకు నాయాహోమములను చతుర్గృహీతముగా జేయవలయును. దుర్మరణముల గుఱించి యీప్రాయశ్చిత్తములనే జేయవలయునని సూత్రమునందు బహుపర్యాయములు చెప్పబడెను. మరియు నొక్కదోషమును గురించి శ్రౌతస్మార్త ప్రాయశ్చిత్తములకు సముచ్చయమున్నదా లేదా యని ప్రశ్న కలుగగా నారెండింటికి పరస్పర విరోధమున్న యెడల స్మృతికంటె శృతి బలీయము గనుక స్మృత్యుక్త ప్రాయశ్చిత్తమును విడువవలయును. అట్లు కాని పక్షంబున శ్రౌతస్మార్త ప్రాయశ్చిత్తంబుల జేయవలయునని న్యాయ విదులగువారు చెప్పిరి. పురుషాపరాధము కలిగినప్పుడు స్మార్త ప్రాయశ్చిత్తంబును సముచ్చయముగా జేయవలయునని శతద్వయీ వ్యాఖ్యానకారుడు చెప్పెను. స్మృతి చంద్రికాది గ్రంథములయందు "పాషండ మాశ్రితా స్తేనా" అను మొదలు "పతితా స్తే ప్రకీర్తితాః" అనువరకు నుండు గ్రంథముచే ఆయా దుర్మరణంబుల నొందినవారికి జేయవలసిన విధానమును జెప్పుచు పుత్త్రులు మొదలగు వారికి శవదర్శన సంబంధమగు నాశౌచముగాని దహనాదులవరకు నాశౌచముండదనియు విధి ప్రకారముగా దహన సంస్కారాదులను జేయనవసరము లేదనిరి. యజ్ఞపాత్రలతో గూడ ఆహితాగ్నిని యగ్నులతో దహించవలయునని చెప్పియుండుట వలన దహననిషేధము అన్యవిషయముగాని ఆహితాగ్ని విషయము కాదు. అగ్నుల నుదకంబునం దుంచుటయు యజ్ఞపాత్రలను దహించుటయు త్రేతాగ్ని త్యాగము మొదలగు [illegible] ఆహితాగ్నికి నితర స్మృతులయందు జెప్పబడెను. ఆత్మత్యాగము పతితులు సర్పాదిహతులు

మొదలగు మరణముల విషయమై వారి మృతకళేబరములను గంగలో విడువవలయును. వారి యాశౌచము లేదు వారికి దహనాది సంస్కారము ను లేదు. తెలియక వారిని గురించి యేవిధమైన కర్మలను జేసినను వారికి జెందవు. అట్టివారిశవముల స్పృశించినందు వలన మహాసాంతపనాది ప్రాయశ్చిత్తంబుల జేసికొనవలయునని యున్నది. తెలియక స్పృశించిన సచేల స్నానము జేసి యుపవాసము జేయవలయును. కాబట్టి ఆత్మఘాతకులు మొదలగు దుర్మరణుల కందరికిని దహనము ఉదకదానము పిండదానము శ్రాద్ధాదులు మొదలగువాని నిషేధము ఒకసంవత్సర పర్యంతముండును. సంవత్సరము గడచిన పిమ్మట కుమారుడు తండ్రినిగురించి దహనాది సంస్కారములన్నియు సమంత్రకముగా జేయవచ్చునని చెప్పబడెను. కాబట్టి దుర్మరణము నొందినవారికి సంవత్సరము గడచిన పిమ్మట దుర్మరణ ప్రాయశ్చిత్తము జేసి యనంతరము నారాయణబలిని పిమ్మట నౌర్ధ్వదైహిక క్రియలను జేయవలయును. బంధువులు శాస్త్రవిధిగా మొదటి దినంబున పాలాశదహనము రెండవదినమున సంచయనము మూడవదినమున పిండోదక దానములు నాల్గవదినంబున శ్రాద్ధమును జేయవలయును. ఈవిధానము ఆహితాగ్ని మాతాపితరుల కంటె నితరుల విషయమని తెలిసికొనవలయును.

## దాహాద్యాశౌచము.

౨౨—తా. అనగ్నిమత...యథావిధి, అను వచనానుసారముగా పతితుడైన యాహితాగ్నికి ప్రాయశ్చిత్తము జేసి దహనాది సంస్కారమును ప్రారభించినది మొదలు సుతులు మొదలగువారికి నాశౌచము కలిగియుండును. యథావిధిగా సంస్కారము జేయునంతవరకు సంధ్యాది క్రియలను జేయుటకు నభ్యంతరము లేదు. దాహాదారభ్య అను ప్రమాణముచేత అహితాగ్ని పతితుడైనను గాకున్నను మరణించినది మొదలు యథావిధిగా దహనము జేయునంతవరకు ఆశౌచము లేదు.

## దుర్మరణము నొందినవానికి దాహాద్యాశౌచ విధానము.

౨౩—తా. ఆహితాగ్నులుగాని తల్లిదండ్రులు గతించిన యెడల బ్రాహ్మణులలో దశరాత్రాశౌచము పతితుడైన యాహితాగ్ని గతించిన యథావిధిగా ప్రాయశ్చిత్తమును జేసి దహనసంస్కారము జేసినది మొదలు కొని యాశౌచము ఇతరదేశమునందు మృతినొందినవానికి యథావిధిగా దహనాదికర్మలను జేయునంతవరకు పుత్రులు మొదలగువారికి నాశౌచ

ము లేదు. సంధ్యావందనాది క్రియలకు లోపము లేదు. ఆహితాగ్నికి శాస్త్రప్రకారముగా దహనాది కర్మలు ఏకారణము వల్లను జరుగకుండిన యెడల వానియాశౌచము పట్టనక్కరలేదు. దహనసంస్కారాదులు జరిగి నది మొదలు పదిదినములు పట్టవలయును. ఆహితాగ్ని కానివానికి నేకార ణంబుచేతనైనను సకాలమున దహనాది సంస్కారములు జరుగక కొంత కాలమునకు జరిగెనేని యది మొదలుకొని యేయాశౌచము పదిదినముల లోపల జరిగినయెడల మిగిలిన దినములతోనే శుద్ధియగును. మరణవార్త వినునప్పటికి దహనాదులు జరుగక పదిదినములు గడిచినయెడల దహనా దులు జరిగించే దినము మొదలుకొనియే గాని వినినంతనే యాశౌచము గ్రహింప నక్కరలేదు.

## త్రిరాత్రాశౌచము.

౨౪—తా. మరణము మొదలుకొని యాశౌచము పట్టినవానికి సకాలములో కర్మ జరుగక మరియొకప్పుడు జరిగినవిషయములో మూడు దినములు ఆశౌచము జెప్పబడెను. అదివరకు నాశౌచము పట్టనిపుత్రు నకు కర్మ ప్రారంభించినది మొదలు పదిదినములు పూర్ణాశౌచము దుర్మర ణంబు నొందినయెడల బ్రాహ్మణులలో పదిదినముల లోపలగాని దాటిన పిమ్మటగాని శుద్ధియును లేదు. ఆశౌచమును లేదు. కాబట్టి శుద్ధినొంది దహనము జేసి యది మొదలు ఆశౌచమవలంబించి యుదక పిండదానాదులు శ్రాద్ధమును జేయవలయును. ఆశౌచమును పట్టుచుండగా తర్వాత దహ నము జరిగినయెడల మిగిలిన దినములలోనే శుద్ధియగును. తల్లిదండ్రులను దహనము చేసినపిమ్మట వారివారి వర్ణములకు జెప్పబడిన ప్రకారముగా పుత్రాదులు ఆశౌచమును గ్రహింపవలయును. సపత్నులకును దంపతు లకు నీప్రకారమే యొకరొకరియాశౌచము పరస్పరము గ్రహింపవల యును. సపిండులకు మూడుదినంబులు తల్లిదండ్రులు మృతినొందినప్పుడు పదిదినములలో కుమారుడు కర్మను జేయుటకు శక్తిలేనివాడయ్యెనేని సమర్థుడగు పర్యంతము నియమముతో నుండి పిమ్మట మూడుదినము లా శౌచముపట్టి దహనాదులను జరిపి యథావిధిగా శ్రాద్ధమును జరుపవల యును కాల మతిక్రమించినపిమ్మట నౌర్ధ్వదైహిక కర్మ జేసినందువలన యాశౌచము కర్తకేగాని యితరులకు లేదు. సూతకములోపల నందరికిని సమానము. సపత్నులకు దంపతులకు పరస్పరము తెలిసికొనదగిన దనే మాట తనయులులేని వారిగురించియని తెలిసికొనవలయును. బుద్ధిపూర్వ

కముగా ప్రాణత్యాగము జేసికొనినట్టియు పతితులైనవారును గతించిన యెడల నౌర్ధ్వదైహిక కృత్యములేదని చెప్పబడియుండగా నటువంటి తల్లిదండ్రుల విషయమై కుమాళ్లు చేయవలసిన విధానము నీక్రిందచెప్ప బోవురీతిగా యాజ్ఞవల్క్యునిచే జెప్పబడెను.

దుర్మృతి నొందినవానికి జేయవలసిన నారాయణ బలి విధానము.

౨౫—తా. మృతినొందినవానికి నౌర్ధ్వదైహిక కృత్యము జేయ నిషేధమందు లోకులు నిందింతురు. కాబట్టి నారాయణబలిని చేసినయెడల పరిశుద్ధులగుదురు గాని మరియొకవిధంబున శుద్ధిలేదని యముడుచెప్పెను. విష్ణును గురించిగాని శివుని గురించిగాని చేయబడినబలి దుర్మృతినొందిన వానిని పరిశుద్ధినిజేయును గాన ముందుగా నారాయణబలిని జేసినపిమ్మట శ్రాద్ధాదులనన్నియు జేయవలయును. దుర్మరణము నొందినవారికి సంవత్స రము గడచినపిమ్మట త్రిరాత్రాశౌచముపట్టి ప్రేతకృత్యమును జేయవల యునని వ్యాసుడు చెప్పెను. భస్మను అస్థులను దెచ్చి క్షీరములచే ప్రో క్షించి శవదహనము జేసినవిధముగానే దహించవలెనని హారీతుడు చెప్పెను. దుర్మరణము నొందినవారికి నారాయణబలిని గురించి కొందరు సంవత్సరము గడచినపిమ్మట ననియు, కొందరు ఆరుమాసము లనియు కొందరు మూడుమాసము లనియు కొందరు బ్రాహ్మణుల ననుజ్ఞపొంది తత్కాలంబునే చేయవచ్చుననియు జెప్పిరి. ప్రాయశ్చిత్తవిషయమై నిట్లు చెప్పబడెను. సంవత్సరము గడచినపిమ్మట ప్రాజాపత్యాదికృచ్ఛ్రము తప్త కృచ్ఛ్రము చాంద్రాయణ కృచ్ఛ్రముజేసి పిమ్మట నారాయణబలిని యనం తరము ఔర్ధ్వదైహికకృత్యము జేయవలెను. ఆరుమాసములకు నీచెప్పిన ప్రాయశ్చిత్తములకు ద్విగుణముగా ననియు మూడుమాసములకు త్రిగుణ ముగా ననియు మూడుపక్షములకు చతుర్గుణముగాను తత్కాలమం దైదురెట్లుగాను ప్రాయశ్చిత్త మాచరింపవలయునని కొందరు చెప్పిరి. సంవ త్సరమునకు రెండురెట్లు మూడుసంవత్సరములు గడిచినపిమ్మట మొదట తత్కాలమందు నాలుగురెట్లుగాను ఆరుమాసములకు మూడురెట్లు సంవ చెప్పినవిధముగానే యనియు వృద్ధపరాశరుడు చెప్పెను. దుర్మరణము నొందిన హేతువుల ననుసరించి కాలవ్యవధికూడ కొందరిట్లు చెప్పిరి. అగ్నిహోత్రము పిడుగు జలము త్రాడు చండాలుడు బ్రాహ్మణుడు వీరి వలన మరణము నొందినయెడల క్రమముగా నొకసంవత్సరము మొదలు ఆరుసంవత్సరముల పర్యంతము శుద్ధిలేదిది శస్త్రము విషము జలము

మొదలగువానివల్లను బుద్ధిపూర్వకముగాను బ్రాహ్మణులవల్లను మృతి నొందినవారికి మూడుసంవత్సరములు గడచినపిమ్మట ప్రాయశ్చిత్తము జేసి యనంతర మౌర్ధ్వదైహిక కృత్యమును జేయవలయునని సంవర్తుడు చెప్పెను పూర్వోక్త ప్రాయశ్చిత్తములను జేయనిపక్షమున నిట్లు కాల వ్యవధి చెప్పబడెనుగాని లేనియెడల దుర్మరణము నొందినవారిని గురించి బ్రాహ్మణుల ననుజ్ఞపొంది ప్రాజాపత్యాది కృచ్ఛ్రప్రాయశ్చిత్తంబులజేసి యనంతరము నారాయణబలిని పిమ్మట నౌర్ధ్వదైహిక కృత్యమును తత్కాలమందే యథావిధిగా జేయవచ్చునని దక్షుడు అపరార్కుడు మొదలగు వారు చెప్పిరి.

దేశవిశేషమందు జరిగిన మరణవిషయము.

౨౬—తా. అకస్మాత్తుగా దైవవశంబున వనము మార్గము గ్రామము నగరము గుడిసె గృహము మొదలగు వానియందును మంటపము గోపురము ప్రాసాదము హర్మ్యము (మేడ) మొదలగు వానియందును మరణమునొందిన వారివిషయమై కృచ్ఛ్ర అతికృచ్ఛ్ర సౌమ్యసాంతపనాది ప్రాయశ్చిత్తంబుల నాచరించి వ్రతానంతరమున గోదానము బ్రాహ్మణభోజనంబును జరుపవలయును. దుర్మరణము నొందినవారికి శుద్ధివిషయమై నారాయణబలి ముఖ్యముగా జేయవలయు ననిరి. పతితులు మొదలగు వారు మృతినొందినయెడల సంవత్సరానంతరము గయ సూర్యపాదము మొదలగు పుణ్యప్రదేశములయందు విష్ణుప్రీతిగా వారికి శ్రాద్ధముల జరుపవలయునని పురాణముల జెప్పబడియె. సమస్తలోకములకు రక్షకుడు నారాయణమూర్తి గాన ఆయనను, స్మరించినంతమాత్రమున సమస్త సురాపానాది మహాపాతకములు నశించును. ఆయన ప్రీతికరముగా జేయబడిన పూజ శ్రాద్ధాదులు మంత్రసంస్కార రహితమ్ములైనను సమస్తపాపములను పోగొట్టి సుగతినికలుగజేయును. కాబట్టి నారాయణబలిని ముఖ్యముగా జేయవలయునని నారదుడు చెప్పెను.

దుర్మరణము నొందినవానికి జేయదగిన సంస్కారవిషయము.

౨౭—తా. పారస్కరుడు దుర్మృతినొందిన యాహితాగ్నిని గురించి యిట్లుచెప్పెను. చండాల శ్వపాక గోబ్రాహ్మణులు మొదలగు వారివలన మృతినొందిన యాహితాగ్నిని మొదట మంత్రరహితముగా లౌకికాగ్నిచే దహించి యాయెముకలను తీసికొని వెళ్లి పాలచే దడిపి పిమ్మట దుర్మరణ ప్రాయశ్చిత్తాదులను జేసి యతని త్రేతాగ్నులచే వారివారి శాఖా

సూత్రప్రకారంబుగా నస్థులను దహించవలయును. హారీతుడు మొదలగు వారు నీవిధముగానే చెప్పుచు దుర్మరణదోష నివృత్తికొరకు పాలాశము మొదలగువానిచే పురుషాకృతిని జేసి నూతనవస్త్రము గప్పి శ్మశానమునకు తీసికొనివెళ్లి పాత్రచయనము జేసి ప్రాజాపత్య కృచ్ఛ ప్రాయశ్చిత్తము లను జేయవలయుననిరి. ఈప్రాజాపత్య కృచ్ఛము ప్రమాదముచే నాహితాగ్ని మృతినొందిన యతని కుమారుడు శక్తుడు కాని పక్షములో దెలిసికొనవలయును. కుమారుడు సమర్థుండగునేని పూర్వము చెప్పబడిన తప్త చాంద్రాయణాది కృచ్ఛములను జేసి లేక షాణ్మాస కృచ్ఛములనైనను జేసి పదిగాని అయిదుగాని గోదానములను జేసి శాస్త్రప్రకారముగా పుత్రులు మొదలగువారు దహనాది శ్రాద్ధసంస్కారముల నన్నియు జేయవలయు ననిరి. ఈప్రకారము దుర్మరణము విషయమై యనేకు లనేకవిధముగా జెప్పుటవలన వికల్పముగా నున్నవని తెలిసికొనవలెను.

ప్రమాద దుర్మరణ విషయము.

౫౮—తా. చండాలాదులవలన దుర్మరణంబు నొందిన వానిని గురించి షాణ్మాస కృచ్ఛము జేయవలయునని ఛాగలేయుడు చెప్పెను. ఇతర స్మృతులయందును దోషనివృత్తికొఱకు షాణ్మాస ప్రాయశ్చిత్తమే చెప్పబడెను. చండాలాదులవలన దుర్మరణము నొందినవాని విషయమై పుత్రాదులు నూరుగాని పదునైదుగాని ప్రాజాపత్య కృచ్ఛముల జేయ వలయుననియు లేక చాంద్రాయణ కృచ్ఛ అతికృచ్ఛముల నైనను కాల మును శక్తిని ననుసరించి చేసిన శుద్ధుడగునని హస్తామలకుని మతము. మరియు ప్రమాదముచే దుర్మృతినొందిన వారికి శుద్ధి విషయమై రెండు చాంద్రాయణ కృచ్ఛములను నాలుగు తప్తకృచ్ఛములను జేసి యథావిధిగా దహనాది సంస్కారముల జేయవలయునని శంఖుడు చెప్పెను.

బుద్ధిపూర్వక మరణ విషయము.

౫౯—తా. ఏబ్రాహ్మణుడైనను బుద్ధిపూర్వకముగా మరణము నొందిన యెడల సుతులు మొదలగువారు 300 ప్రాజాపత్య కృచ్ఛ ప్రాయశ్చిత్తములనుజేసిన యెడల దోషము నివృత్తియగునని హస్తామలకుడు వచించె, ఆప్రకారముగానే వసిష్ఠుడును జెప్పెను. జల, అగ్ని, శస్త్రాదులచేత మృతినొందిన వారినిగురించి యొక చాంద్రాయణ కృచ్ఛము రెండుతప్త కృచ్ఛములను జేయవలయునను విషయము బుద్ధిపూర్వకముగా మరణము నొందినవారిని గురించి కాదు జ్ఞాతులని యనుకొందరనిరి.

కృచ్ఛ్రప్రతినిధి గురించి చెప్పబడును.

౩౦—తా. దేశకాల పాత్రశక్తుల ననుసరించి సమస్త క్రియలను జేయదగియున్నది. అందువలన నితర యుగములకు కలియుగమునకు విశేషభేదముండెనుగాన పూర్వోక్త కృచ్ఛ్రములను జేయుటకు కలియుగములో శక్తిలేనివారి విషయమై కృచ్ఛ్రప్రతినిధిగా యజ్ఞపార్శ్వుడు గోదానముల జేయవలయునని యిట్లుచెప్పెను. ప్రాజాపత్యమునం దొక్కధేనువనియు సాంతపనమునందు రెండుగాని మూడుగాని గోదానము లనియు మహాసాంతపనమునందు మూడు గోదానము లనియు చాంద్రాయణమునం దైదుగాని నాలుగుగాని గోదానము లనియు పరాకము తప్తకృచ్ఛ్రము కృచ్ఛ్రమునందు రెండురెండు గోదానములనియు జెప్పెను. మరియు సాంతపనమం దొక నిష్కమనియు లేక రెండుగాని మూడుగాని చాంద్రాయణమునందు నాలుగుగాని యైదుగాని గోవులనియు పురాణవేత్తలు చెప్పిరి. మరియు నిష్కవిషయమును గురించి చతుర్వింశతి మతములో నారదుడు చెప్పిన దేమనగా, ప్రాజాపత్యమునందు నొక్కగోవు సాంతపనమునందు రెండుగోవులు పరాకతప్త కృచ్ఛ్రములయందు మూడుమూడు గోవులు చాంద్రాయణమునం దెనిమిది గోవులనియు దానమిచ్చిన పిమ్మట తనశక్తికొలది విశేషముగా దక్షిణల నిచ్చిన దోషనివృత్తియగునని చెప్పెను. చాంద్రాయణ కృచ్ఛ్రమునందు ప్రతినిధిగా నెనిమిది గోదానముల జేయవలయునను సంగతి ధనవంతుల విషయమని చెప్పబడెను.

శక్తిలేనివారి విషయము.

౩౧—తా. చాంద్రాయణాది కృచ్ఛ్రప్రాయశ్చిత్తంబుల జేయుటకు శక్తిలేనివారివిషయమై పురాణంబున నిట్లు చెప్పబడెను. ప్రమాదవశమున జల అగ్ని విష శస్త్ర మొదలగు వానివలన మృతినొందినవాడు పతితుడు కాడు. కాబట్టి వానికి సకాలమందే దహనాది సంస్కారముల జేయదగుననియె. ప్రమాదమున నగ్నిజలాదులచే మృతినొందిన వానిగురించి యాశౌచమునుబట్టి దహనపిండోదకాదులను జేయవచ్చునని అంగిరసుండు చెప్పెను. ఎప్పుడుచేసినను ప్రాయశ్చిత్తముచేసి చేయవలయును. ప్రాణావసానకాలంబున ప్రాణోత్క్రమణ ప్రాయశ్చిత్తంబు జేసినయెడల మృతినొందినను పరిశుద్ధుడే యగును. కాబట్టి యుదకదానము మొదలగు సమస్త ప్రేతకార్యములను జేయదగునని గౌతముడు చెప్పెను. వ్యాధి మదిమి మొదలగు కారణంబులవలన శౌచాదిక్రియలను జేసికొనలేక వైద్యమును

జేసికొనలేనివాడై బాధ నోర్వజాలక అగ్నిజలాదులవలన నాత్మహత్య జేసికొనిన వానివిషయమై త్రిరాత్రాశౌచముపట్టి మొదటిదినంబున దహనముజేసి రెండవదినంబున అస్థిసంచయనము మూడవదినంబున ఉదకపిండదానంబులజేసి నాల్గవదినంబున శ్రాద్ధమును జరుపవలయునని శాతాతపుడు చెప్పెను. వైద్యమునకు సాధ్యముగాని మహావ్యాధులచే పీడింపబడి బాధనుసహింపలేక శస్త్ర జల అగ్ని విషము మొదలగు వానివలన మృతి నొందెనేని రెండు చాంద్రాయణముల జేయవలయునని పురాణంబుల జెప్పబడెను. చండాలురు మొదలగువానివలన మృతినొందిన వానివిషయమై పాపనివృత్తికొఱకు తప్తకృచ్ఛ్రమును జేయవలయునని అపరార్కుడు చెప్పెను. ఇది చూడాకర్మ జేయబడని వానినిగురించి చెప్పబడెను. ప్రమాదమున అగ్ని మొదలగు వానివలన మృతినొందిన వానివిషయమై యారు ప్రాజాపత్యకృచ్ఛ్రముల జేయవలయు ననెడి బృహదంగిరస్సుని వచనము ఉపనయనము కాని వానివిషయమని తెలియదగినది.

బుద్ధిపూర్వకముగా మరణించిన వానివిషయము.

3౨—తా. ఉపనయన సంస్కారము జరిగినపిమ్మట నేదోయొక కష్టమువలన బుద్ధిపూర్వకముగా మృతినొందినవాని పాపనివృత్తికొఱకు ఎనిమిది ప్రాజాపత్యకృచ్ఛ్రములను గాని చాంద్రాయణ కృచ్ఛ్రమును గాని జేయవలయునని యాంగిరసముని చెప్పెను. పైనచెప్పబడుచుండెడి చండాలవ్యాఘ్ర సర్పాదులవలన దైవవశముచే మృతినొందినవాని పాపనివృత్తి కొఱకు షాణ్మాసకృచ్ఛ్ర మాచరింపవలయునను శాస్త్రము ఉపనయనము కాని వానిగురించి చెప్పబడెనని తెలిసికొనవలయును.

దుర్మరణ ప్రాయశ్చిత్త ప్రయోగము.

33—తా. దుర్మరణము నొందినవాని గురించి యార్ధ్వదైహిక కర్మను జేయదలచిన సుతాదులు వేదవిదులగు బ్రాహ్మణులను కొందరిని పిలచి సభికులనుగా నుంచి కర్మనుజేయువాడు స్నానముజేసి సంకల్పము జేసినవాడై తనశక్తికొలది దక్షిణను తీసికొని సభికులచుట్టును మూడు పర్యాయములు తిరిగి ప్రదక్షిణ జేసినవాడై ఓసభాసదులారా! నాచే సమర్పింపబడిన దక్షిణను గ్రహించి దుర్మరణము నొందిన మాతండ్రియొక్క పాపమును పోగొట్టునట్టి తగిన ప్రాయశ్చిత్తము నిర్ణయించి చెప్పి నన్ను కృతార్థునిగా జేయవలయునని సభికులను ప్రార్థింపవలయును. పిమ్మట సభికులు చేయవలసిన విధాన మేమనగా, ఉదకము అగ్ని శస్త్ర

ము విషము సర్పము బ్రాహ్మణుడు చండాలుడు మొదలగు వానిలో ప్రమాదవశముచే దేనివలన మృతినొందినో యామరణ కారమును దెలిసి కొని వాని పాపనివృత్తికొరకు చాంద్రాయణము తప్తకృచ్ఛత్రయము షాణ్మాస కృచ్ఛ్రము పదిఅయిదు గోదానములు మొదలగు విధానములను ధర్మశాస్త్రాను సారముగా విచారించి చెప్పవలయును. మరియు సంవత్స రానంతరము ప్రాజాపత్యాది కృచ్ఛ్రములను నారాయణ బలిని జేసి పిమ్మట నౌర్ధ్వదైహిక కృత్యమును జేయవలయునని కొందరిచే జెప్పబడినను "షాణ్మాసా ద్ద్విగుణంకార్యం" అను ప్రమాణముచే జెప్పబడిన పదునైదు కృచ్ఛ్రములను పంచగుణితములనుగా జేయగా డెబ్బదియైదగును. సద్య స్కాల పక్షములో నిట్టి పచస ప్తతి సంఖ్యగల ప్రాజాపత్య కృచ్ఛ్రస్వరూప మగు ప్రాయశ్చిత్తమును బ్రాహ్మణానుజ్ఞను బొంది జేయవచ్చునని యు న్నదిగాన ఓయజమానుడా! నీతండ్రి దుర్మరణము నొందెననియు దానికి తగిన ప్రాయశ్చిత్తమును విధించి చెప్పవలసిన దనియు మమ్ముగోరితివిగాన సముద్రములో బ్రవేశించునట్టి మహానదిలో స్నానముజేసి గోదానాదు లను ప్రాజాపత్యాది కృచ్ఛ్రములను జేసిన నీతండ్రియొక్క దుర్మరణదోష ము నివృత్తియగు ననియు సభికులు చెప్పవలయును. అనంతరము యజ మానుడు తనశక్తికొలదియు విచారించి సభికులచే నిర్దిష్టమైన ప్రాయశ్చి త్తములను మహానదీ స్నానమును గోదానములను జేసి మృత్తికాస్నాన ములను జేయించి చేసినవారికి తగిన దక్షిణలనిచ్చి సభికులకును తనశక్తి కొలది దక్షిణతాంబూలముల నిచ్చి తనతండ్రి దోషమువలన విముక్తు డయ్యెనని యాసభికులచే ననిపించుకొని పిమ్మట నారాయణబలిని జేసి పిమ్మట యథావిధిగా నౌర్ధ్వదైహిక కృత్యమును జేయవలయును. ఇట్టి విధానము మూలమువలన తెలిసికొనవలయును.

నారాయణ బలి విధానము.

౩౮—తా. దుర్మరణము నొందినవానికి సంస్కారములను జేయక ముందు సంవత్సరానంతరముగాని ఆరుమాసములు మూడుమాసములు మూడుపక్షములుగాని గడచిన పిమ్మటనైనను లేక సద్యస్కాలమందైనను ప్రాయశ్చిత్తముజేసిన పిమ్మట నారాయణబలిని జేసి యనంతరము దహనాది శ్రాద్ధాంత సంస్కారముల నన్నియు జేయవలయును.

నారాయణబలి ప్రయోగవిధానము.



౩౯—తా. తనతండ్రియొక్క దోషనివృత్తికొరకు సభ్యనిర్దిష్ట

మైన ప్రాయశ్చిత్తమును జేసికొనినపిమ్మట నేకాదశియం దైనను శ్రవణ రోహిణి మొదలగు యోగ్యనక్షత్రయుక్త తిథులయందైనను స్నానము ఆచమనము ప్రాణాయామాదులను జేసి తండ్రి మొదలగు వారియొక్క దుర్మృతినొందుటచే గలుగబోవు పిశాచత్వాదిదోషములు తొలగి యౌర్ధ్వదైహిక సంస్కారమునకు యోగ్యత కలుగుటకై నారాయణబలిని జేయుచున్నానని సంకల్పముచేసి శ్రోత్రియ గృహమువలన నగ్నిహోత్రమును దీసికొనివచ్చి "యత్రక్వచాగ్నిం" అను విధిప్రకారమున శుభ్రప్రదేశంబున ప్రతిష్ఠాపనజేసి ప్రయోగవిధిజేసి తండులములను పచనము జేసి యభిఘరించి తూర్పుదిక్కునందుగాని యుత్తరదిక్కునందుగాని యుంచి తిరిగి యభిఘరించి యగ్నిప్రార్థనాదికమంతయు జేసి ముఖాహుతిని గావించి పురుషసూక్తములో ప్రతిబుుక్కుతోను పలాశసమిధ చెరువు ఆజ్యము మిళితముగా పదియారు బుుక్కులకు పదియారు హోమములను జేసి జయాది పరిషేచనాంతము జేసి తిరిగి పురుషసూక్తమును పఠించి నారాయణాష్టాక్షరీమంత్రమును జపియించి యగ్నిసమీపమున పరచబడిన దర్భలయందు మిగిలిన చరువును బలిగానుంచి కేశవాది పండ్రెండునామములచేత పన్నిద్దరు బ్రాహ్మణులను ప్రేతనుద్దేశించి యొకబ్రాహ్మణుని యావాహనముజేసి యాపద ముగ్గురిని భుజింప జేయవలయును. బ్రాహ్మణులు భుజించినపిమ్మట భుక్తశేషాన్నము (అనగా పాకశేషము) హోమశేషాన్నమును మిళితముజేసి దానిలో తేనె నెయ్యి నువ్వులనుంచి పదమూడు పిండములనుజేసి వానిలో పండ్రెండు పిండములను ప్రాగగ్రములుగా నుంచబడిన దర్భలయందు కేశవాది నామోద్దేశ్యముగాను దక్షిణాగ్రములుగా నుంచబడిన దర్భలయందు నొకపిండమును ప్రేతోద్దేశ్యముగా నుంచి తిలోదకములను వానిసమీపమున విడచి క్రియలనన్నియు పూర్తిజేసి యాపిండముల నుదకములో నుంచవలయును. ఈవిధానమంతయు "తతఃకర్తా ప్రాణానాయమ్య" అనునది మొదలు "పిండానప్సుప్రక్షిపేత్" అనువరకునుండు మూలముచే దెలిసికొనవలయును.

బోధాయనమత నారాయణబలి విధానము.

3౬—తా. దుర్మృతినొందిన వారిని గురించి విష్ణుబోధాయన మతానుసారమగు నారాయణబలి విధాన మిట్లు చెప్పబడెను తానుశ్రాద్ధమును జేయ నుద్దేశించుకొనిన ప్రదేశంబును శుభ్రపరచుకొని శాస్త్రోక్త కాలమందు గాని శుక్లైకాదశియందు గాని ప్రాతఃకాలమున స్నానాది

క్రియలనుజేసి విష్ణుని వైవస్వతుని యముని సక్రమముగా నావాహనాది విధులచే బూజించి వారిసమీపమున నువ్వులు తేనె నెయ్యి కలిపినయన్న ముతో పదిపిండములనుజేసి ప్రేతను విష్ణుస్వరూపునిగా ధ్యానించుచు దక్షిణాగ్రములుగా పరచబడిన దర్భలయందు దక్షిణముఖముగా నుండి ప్రాచీనావీతముజేసికొని పెడమరలచేతితో పిండములనుంచి గంధాదు లచే బూజించి యాపిండములను పరిశుభ్రమగు నీటిలో విడువ వలయును. పిమ్మట రాత్రి 7 దునుగాని 5 దునుగాని లేక యిద్దరిగాని బ్రాహ్మణులను నిమంత్రణజేసి యారాత్రి యుపవాసము జాగరణమునుజేసి మరునాడు మధ్యాహ్నంబున విష్ణు మొదలగు దేవతులను బూజించి నిమంత్రణజేయ బడిన బ్రాహ్మణుల నేకోద్దిష్టవిధానముచే భుజింపజేసి వారు తృప్తినొందిన పిమ్మట వారిసమీపమున దర్భలనుపరచి విష్ణువు బ్రహ్మ శివుడు సోమకుడు ఈనలుగురనుద్దేశించి నాలుగు పిండములను నామగోత్రాదులచే ప్రేతను విష్ణుస్వరూపునిగా ధ్యానించి వానినుద్దేశించి అయిదవపిండము నుంచ వలయును. అనంతరము వారిలో విద్యాదిసుగుణములచే నధికమైన నొక నికి విశేషముగా వస్త్రములు ఆభరణములు గోవులు బంగారము మొదల గునవి ప్రేతస్వరూపబుద్ధిగాను మిగత బ్రాహ్మణులకు విశేష దక్షిణలనిచ్చి సంతోషపెట్టవలయును. అనంతరము పవిత్ర సహితపాణులగు ఆబ్రాహ్మ ణులచే ప్రేతకొఱకు తిలసహిత ఉదకకుంభదానము జేయించి తానును జేసి యిట్లు చేయబడిన నారాయణబలిచే ప్రేతపాప విముక్తుడయ్యెనని యాబ్రాహ్మణులచే ననిపించి వారికి దక్షిణలనిచ్చి పంపించి పిండముల నుద కములో వైచి తాను స్నానముజేసి మిగిలిన పదార్థమునంతయు బంధు వులు మొదలగు వారితోగూడి భుజింపవలయును. ఇట్లు నారాయణబలి విధానము జెప్పబడియెను.

## సర్పహతునకు నాగబలివిధానము.

౩౭—తా. సర్పముచే మృతినొందిన వానిగురించి యైదుపడ గలు గల సర్పప్రతిమను దారువుతోగాని మృత్తికతోగాని చేయించి సంవత్సరములోపుగానే భాద్రపద శుక్లపంచమియందుగాని మరియొక మాసమునందైనను శుక్లపంచమియందు ప్రారంభించి సంవత్సరపర్యంతము ప్రతిశుక్లపంచమియందు నుపవాసముండి యారాత్రి పూర్వము చేయించ బడిన సర్పప్రతిమను పంచామృతములచే స్నానముజేయించి పరిమళగంధా క్షత పుష్పాదులచే బూజించి ధూపదీపములనిచ్చి నమస్కరించవలయును.

ఇట్లు అనంత వాసుకి శంఖ పద్మ కమల కర్కోటక ధృతరాష్ట్ర శంఖపాల కాళింగ తక్షక కపిల అను నామములలో నొక్కొకనామముచే నొక్కొకమాసమునందు బూజింపుచు పాయసము అపూపములను బలిగానిచ్చి రాత్రి జాగరణముచేసి మరునాడు ముగ్గురు బ్రాహ్మణులను పాయసభక్ష్యాదులచే భుజింపజేసి దక్షిణలనిచ్చి పంపవలయును. ఇట్లు సంవత్సరముచేసి యనంతరము శుక్లపంచమియందు పూర్వముగానే చేసి బంగారపు సర్ప ప్రతిమను ఆవును వస్త్రములను బ్రాహ్మణునకు దానమిచ్చి మిగిలిన బ్రాహ్మణులను తృప్తిగా భుజింపజేసి దక్షిణలనిచ్చి సర్పప్రీతికొఱకు నాగసూక్తములను పఠింప జేయవలయును. ఇట్లుచేసి మరియు రెండుపక్షముల పంచములయందును పిండితో దృఢముగా సర్పప్రతికృతినిచేసి శుభ్రపరచబడిన ప్రదేశమునందుంచి తెల్లని గంధపుష్పాక్షతాదులచే బూజించి ఆవుపాలు ఉండ్రాళ్లు మొదలగునవి నివేదనచేసి సర్పసూక్తములచే ధ్యానించి ఓనాగమా! సర్పహతుడగు నీప్రేతను పాపమువలన దొలగజేయుమని ప్రార్థించి బంధువులతో గూడ నివేదనజేయబడిన క్షీరాదుల ననుభవించవలయును. ఇట్లు చేసినపిమ్మట సంవత్సరాంతమందు నారాయణబలిని యథావిధిగా జేసి యనంతర మౌర్ధ్వదైహికకర్మను శాస్త్రప్రకారముగా జరుపవలయును.

ఆహితాగ్నికి అగ్నినిర్ణయము.

3౮—తా. ఆహితాగ్ని తనభార్యకంటె ముందుగా మృతినొందెనేని భార్యనిమిత్తమై ఔపాసనాగ్నిని గృహమునందుంచి యాహితాగ్నిని త్రేతాగ్నులచే దహనము చేయవలయును. భార్య ముందుగా మృతినొందిన పెనిమిటినిమిత్తము ఔపాసనాగ్నిని గృహమునందుంచి త్రేతాగ్నులతో భార్యను దహనము చేయవలయును. భార్యాభర్తలలో ముందుగా గతించినవారిని త్రేతాగ్నులతో దహించవలయునని యున్నది. ఆహితాగ్ని వెనుక మృతినొందిన ప్రేతాధానముకొరకు అగ్నిహోత్రము ఔపాసనాగ్నియు కావలసియున్నందున ఔపాసనాగ్నియే యజమానుడని చెప్పియుండుటచేతను ఆహితాగ్ని ఉత్సృష్టాగ్నిగాని విధురాగ్నిగాని విచ్ఛిన్నాగ్నిగాని అయినయెడల వాని యగ్నిహోత్రములు నశించినవియే యగును. కాబట్టి భార్య ముందుగా మృతినొందిన విషయములో తాను తిరిగి వివాహము జేసికొనుటకు నుద్దేశ్యములేక ఆస్తిక్యబుద్ధిచే నగ్నిహోత్రాది కర్మలను జేసికొన దలచినప్పుడు వేరుగా మధింపబడిన

లౌకికాగ్నిచే భార్యను దహింపవలయును. పిమ్మట తానుంచుకొనిన ఔపాసనాగ్ని త్రేతాగ్నులచే మృతినొందినప్పుడాహితాగ్నికిదహనసంస్కారము జేయవలయును. ఇట్లు నిర్మంథ్యాగ్నిచే భార్యను దహించి యుత్సర్గేష్టి చేసి యగ్నిహోత్రములను విడిచి తిరిగి తాను యాగాదులను జేయదలచినప్పుడు అగ్న్యాధానము చేయవలయును. ఇందులో కొన్నిసమయముల యందు స్త్రీకర్తృకమైన కర్మ లోపించుచున్నది. కొన్నిసమయముల యందు భార్య చెప్పదగిన మంత్రములను తానే చెప్పుకొనవలయును. ఈ విషయమంతయు మొదటినుండియు "స్వభాషతే" అనువరకునుండు గ్రంథమువలన తెలియదగినది. ముందుగా మృతినొందిన యాహితాగ్నివెనుక మృతినొందిన యాతనిభార్యను ఔపాసనాగ్నిచేతనే దహించవలయునని కొందరిమతము. పెనిమిటికంటె వెనుక మృతినొందిన యాహితాగ్ని భార్యను ఆహితాగ్ని కాని వానిభార్యను నిర్మంథ్యాగ్నిచే దహించవలయునని చెప్పుటవలన ఆహితాగ్ని కాని వానిభార్యకు ఔపాసనాగ్ని వికల్పము. నిర్మంథ్యాగ్ని విషయములో లౌకికారణులచే నగ్నినిమథించి దానియందున నాహితాగ్నికి వలెనే పైతృమేధిక విధిప్రకారముగా నంతయు జరుపవలయును.

## స్నాతక బ్రహ్మచారి విషయము.

౩౯—తా. స్నాతక బ్రహ్మచారికి నిర్మంథ్యాగ్ని శ్రోత్రియాగ్నియు ఉపనయనముకాని పురుషులకును వివాహముకాని స్త్రీలకు ఉత్తపనాగ్ని లౌకికాగ్నియునని చెప్పియున్నది. ఆహితాగ్ని మృతుండగునేని యజ్ఞపాత్రచయనముజేసి త్రేతాగ్నులతో దహించవలయు ననియు మరియొక యగ్నిచే దహింపగూడదనియు నున్నది కాబట్టి యగ్నినివదలిన యాహితాగ్ని విషయమై త్రేతాగ్ని సంధానము జేయవలసియున్నది. ఆతనికి మరియొక విధానము చెప్పబడియున్నది. అది యెట్లనగా, ఉత్సృష్టాగ్ని (ఉత్సర్గేష్టిజేసి విధిపూర్వకముగా నగ్నులను విడిచినవాడు) విధురాగ్ని (ముందుగ భార్య మృతినొందుటచే నామె నిమిత్తమై త్రేతాగ్నుల వదలినవాడు) అగునేని యాతను మరణించినప్పుడు పూర్వముండెడి యరణులచే నగ్నిని మథించి యాయగ్నిచే దహనము చేయవలయును. దాని వివరమెట్లనిన, అగ్నిరహితుడైన యాహితాగ్ని మృతినొందినప్పుడు వాని భార్యగాని పుత్రాదులుగాని స్నానాచమనములను జేసి దర్భలను ధరించి దర్భలయందు [illegible] ప్రాణాయామ సంకల్పాదులను జేసి ప్రేతనాథు

గోత్రాదులను జెప్పి ప్రేతయొక్క పైతృమేధిక కర్మనిమిత్తమై విచ్ఛిన్నాగ్నులను ప్రేతాధానవిధిచే తిరిగి సంధానము చేయుచున్నానని సంకల్పముజేసి ప్రేతాధాన విధికొరకు నధ్వర్యుని వరించవలయును. ఇట్లు వరింపబడిన యధ్వర్యుడు ప్రాచీనావీతుడై మంత్రరహితముగా నగ్న్యాయతనోద్ధరణంబుచేసి ప్రోక్షించి యజమానాయతనమందు ప్రేతనుంచి గార్హపత్యాయతనము దరణులనుంచి "యస్యాగ్నయేజుహ్వతో" అను మంత్రము నుచ్చరింపుచు నగ్నినిమథించి దానిని ప్రజ్వలింపజేసి "ఉపావరోహ" అను మంత్రముచే నుపావరోహణముజేసి మంత్రరహితముగా నాహవనీయాగ్ని నుద్ధరించి యటులనే మంత్రము నుచ్చరింపకయే ఆహవనీయ దక్షిణాగ్నులను ప్రజ్వరిల్లజేసి ద్వాదశ గ్రహీతముగా స్రుక్కుతో నాజ్యము నాహవనీయాగ్నియందు హోమము జేయవలయును. ఆయగ్నిహోత్రములందే మృతాగ్నిహోత్ర విధానమునుజేసి "ప్రేతేమాత్యాః" అని ప్రారంభించి చేయదగిన కర్మలనన్నియు జేయవలయును. విధానమంతయు మూలము వలన తెలిసికొన వలయును.

అరణులు నశించినవానికి ప్రేతాధానము.

౪౦.—తా. ఆహితాగ్ని ఉత్సృష్టాగ్నియు విచ్ఛిన్నాగ్నియు విధురాగ్నియునై గతించినను అరణులులేనివాడై గతించినను పూర్వమువలెనే వానిభార్యాపుత్రాదులలో కర్మజేయునట్టి వారొకరు స్నానసంకల్పాదులనుజేసి యొక నధ్వర్యుని నియమించగా నతడును ప్రాచీనావీతము జేసికొని "యోశ్వత్థశ్శమీగర్భ" అను మంత్రముచే నూతనారణులను దెచ్చి "అశ్వత్థాద్ధవ్యవాహోద్ధి" అను మంత్రముచే నరణుల నభిమంత్రించి యగ్ని నుద్భవింపజేసి ప్రేతాధాన పూర్వకముగా నాయగ్నిహోత్రముల యందే మృతాగ్నిహోత్రమును జేయవలయును. దానియందే దహనాది సంస్కారములను జేయవలయును. దీని వివరము ౩౯ సంఖ్యగలదానిలో చెప్పబడెను. "నష్టేష్వగ్నిషు" అనునది మొదలు "మంత్రకమీరితం" అను వరకు త్రికాండిచే జెప్పబడిన గ్రంథమునందు నిదియే చెప్పబడెను. ఈప్రకారము ప్రేతాధానముజేసిన పిమ్మట పూర్వపక్ష నయనము దర్శపూర్ణమాసాదులకు పూర్ణాహుతులను జేయవలయునని కొందరు నుడివిరి.

అరణిసమారూఢాగ్ని గలవాని మరణమును గురించిన విధానము.

౪౧.—తా. అగ్నిహోత్రము లరణులయందు సమారూఢమైన పిమ్మట నాహితాగ్ని మృతినొందినను యాతని గురించి వారియొక విధాన

మేమియు లేదు. పూర్వము జెప్పినరీతిగానే త్రేతాధానము జేయవలయును. ఉపావరోహ అను మంత్రము శాఖాంతరీయము గాన వికల్పము. ఇట్లు పుత్రాదులచే నియమింపబడిన యధ్వర్యుడు ప్రాచీనావీతుడై పూర్వమువలెనే యగ్న్యాయతనముల నుద్ధరించి ప్రోక్షణజేసి యజమానాయతనమందు ప్రేతనుంచి గార్హపత్యాయతనమం దరణులనుంచి "యస్యాగ్నయ" అను మంత్రముచే మధించి యగ్నిని ప్రజ్వరిల్లజేసి పుత్రులు మొదలగువారు ప్రేతయొక్క కుడిహస్తమును అన్వారంభణజేసి "ఉపావరోహ" అనుమంత్రమును పఠించి పూర్వమువలెనే విహరణాదికమును జేసి మృతహోమాంతము సమానముగానే చేయవలయును. మంత్రరహితముగా నగ్నులను విహరించి ఆజ్యమును పండ్రెండు పర్యాయములు స్రుక్కునందు గ్రహించి ఆహవనీయాగ్నియందు మంత్రరహితముగా హోమము జేయవలయును అగ్నిహోత్రలోప ప్రాయశ్చిత్తము జేయ నక్కరలేదు.

ఆత్మసమారూఢమైనవాని మరణవిధానము.

౮౨—తా. అగ్నిహోత్రముల నాత్మారోపణము జేసికొనినపిమ్మట నాహితాగ్ని మృతినొందెనేని పూర్వమువలెనే సుతాదులు అగ్న్యాయతనోద్ధరణము జేసి ప్రోక్షించి యజమానాయతనమునందు ప్రేతనుంచి గార్హపత్యాయతనమందు లౌకికాగ్నిని ప్రతిష్ఠించి సుతాదులు ప్రేతయొక్క కుడిహస్తమున న్వారంభణపూర్వకముగా "ఉపావరోజాతవేద" అను మంత్రమును జెప్పి ఉపావరోహణము జేయవలయును. అనంతరము విహరణము మొదలు మృతహోమాంతమువరకు పూర్వమువలెనే సమానము. ముందుగా భార్య మరణించుటచే నామెకొరకు నగ్నుల నుపయోగపరచిన విధురాహితాగ్ని మరణమును గురించియు పెనిమిటి మృతినొందిన పిమ్మట మృతినొందిన యాహితాగ్ని భార్యయొక్క మరణమును గురించియు హారీతుడు మొదలగువారి వచనానుసారముగా త్రేతాధానవిధిచే నగ్నులను పుట్టించి మృతాగ్నిహోత్రమును జేసి త్రేతాగ్నులతో దహనాదులను జేయవలయును. దర్శపూర్ణమాసాదులు లేవు. "ప్రేతేమాతా" అనునది మొదలు సమానముగానే కర్మనంతయు జేయవలయును. పెనిమిటికంటె ఆహితాగ్ని భార్య ముందుగా మృతినొందినప్పుడు త్రేతాగ్నులతో నామెను దహింపవలెను. భార్య మృతినొందుకాలమునకు అగ్నులు విచ్ఛిన్నమైనయెడల ప్రేతాధానవిధిచే నగ్నులను తిరిగి పుట్టించి అగ్నిహోత్రాదులను జేసి "ప్రేతేమాతా" అనునట్టి కర్మల నన్నింటిని

పూర్వమువలెనే సమానముగానే జేయవలయునని తెలిసికొనవలయును.

### మృతాగ్ని హోత్ర ప్రయోగము.

౪౩—తా. పుత్రాదులు ముందు విహరించియున్న యగ్నిహోత్రములయందు దూడలేనట్టి యావుపాలతో గాని వత్సగల యావుపాలతో గాని ప్రాచీనావీతముగా అగ్నిగుప్తికొరకు హోమము జేయవలయును. సమిధాధానాది కర్మనంతయు సాంగముగా మంత్రరహితముగానే చేయవలయును. ఈక్రియలనన్నియు నగ్నిహోత్రమునకు దక్షిణభాగమునందు చేయవలయును. "విహారస్య దక్షిణతః" అనునది మొదలు "సాహ్యాగ్నిహోత్రస్య సగ్‌స్థితిః" అనువరకునుండు గ్రంథముచే జెప్పబడిన విధానమంతయు పుత్రాదులు చేయవలయును ఇక్కడ ధాగాశ్రవణము మొదలు ఉత్తరపరిషేచనాంతము వరకునుండు కర్మలు లోపించుచున్నవి. తనగృహమునందు గాని యితరప్రదేశమునందుగాని మృతినొందిన యాహితాగ్నికి దహనాది క్రియలు జరుగునంతవరకు మృతాగ్నిహోత్రము జేయుచుండవలయును మృతాగ్నిహోత్రవిధానమును జెప్పిన సమయములయందు నీదిగువను జెప్పబోవు రీతిగా జేయవలయును. తృణప్రహరణమంతి మాగ్నిహోత్రమునందే జరుపవలెను. అగ్నిహోత్రోచ్ఛేషణమగ్నిసమీపమునందే యుంచవలయును. అగ్నిసమీపమున మృతినొందిన యాహితాగ్నికి పాత్రచయనము ముఖ్యముగా జేయవలయును. ఇతరదేశమునందు మృతినొందినవాని విషయమందును ప్రతికృతిదహనమునందును పాత్రచయన దానాదులు వికల్పములుగా జెప్పబడెను. "ప్రేతేమాత్యా" అనునది మొదలు మిగిలిన కర్మలనన్నియు సమానముగానే చేయవలయునని తెలిసినకొనవలయును.

### పితృమేధ ప్రయోగవిధానము.

౪౪—తా. అగ్నిహోత్రము లుండగా మరణసంశయము గలిగినప్పుడు విహరణము జేయుట శ్రేష్ఠము. మృతినొందినప్పుడు విహరణము క్షీరహోమమును జేయవలయును త్రేతాగ్ని సన్నిధానమందు మరణము జరిగిన వానియొక్క శరీరమునుగాని అస్థులనుగాని ఆహరణముచేసి సంస్కారపర్యంతము క్షీరహోమమును జేయవలయును. పూర్వము చెప్పబడిన విధముగా అగ్న్యుత్పాదనము చేయవలెను. మరణావస్థ సమీపించినప్పుడు ఆతనిని స్నానముజేయించి శరీరశుద్ధికొరకు షడ్గుణిత షడబ్ద ప్రాయశ్చిత్తమును గాని షడబ్ద ప్రాయశ్చిత్తమును శాస్త్రప్రకారముగా

జేయించవలయును. మనుష్యుడు జీవించియుండగా జేసికొనవలసిన ప్రాయశ్చిత్తాదులు శాస్త్రమునందు జెప్పినంతనే జేయవలయును. మృతినొందినప్పుడు దానికి ద్విగుణముగాను దహనమైనపిమ్మట అస్థులకు త్రిగుణముగాను పాలాశవిధానమునందు చతుర్గుణముగాను జెప్పబడెను. అందువలన జీవించియుండగానే ప్రాయశ్చిత్తము జేసికొనుట ముఖ్యమైయున్నది. కాబట్టి శుభ్రమైన ప్రదేశమునందు గోమయంబుచే నలికి దర్భలను దక్షిణాగ్రములుగా పరచి నువ్వులను చల్లి మృతినొందబోవు వానిని దక్షిణశిరస్సుగా బరుండబెట్టి సుఖముగా ప్రాణంబులుపోవు నిమిత్తమై ఉత్క్రాంతిసంజ్ఞిక గోదానమును పుత్త్రులు మొదలగువారు చేయవలయును. అదియేవిధముగా ననగా, "పుత్రాదిః ప్రాణానాయమ్య" అనునది మొదలు "దశదానాని కుర్యాత్" అనువరకునుండు గ్రంథప్రకారముగా జెప్పబడినవిధానముచే పుత్రాదులు స్నానము సంకల్పమును జేసి తండ్రియొక్క నామగోత్రములను జెప్పి వానియొక్క సుఖముగా ప్రాణోత్క్రమణముకొరకు వత్ససహితయు పాలనిచ్చునదియు నగు గోవును సాలంకారముగాను సమస్తపాప నివృత్తికొరకు తిలసహిత కాంస్యపాత్రను వైతరణీనదిని దాటుటకు వైతరణీసంజ్ఞిక గోదానమును బ్రాహ్మణులను పూజించి యిచ్చి వానికి తగిన దక్షిణలను కూడ నివ్వవలయును. ఇట్లు దానములనిచ్చునప్పు డాఫలములు ముమూర్షుడగు నాతండ్రికి జెందునవియేగాని నాకు జెందునవిగావని కర్త బలుకవలయును. అనంతరము శక్తికొలదియు దశదానములను కూడ చేయవలయును. మరణింపబోవువాడు తెలివితో నుండెనేని వానిచేతనే జేయించవలెను. శౌనకమతానుసారముగా దశదానములు దిగువ చెప్పబడును.

### దశదానమంత్రములు.

రశి—తా. కుమారుడు మొదలగువారు ముమూర్షుడగు తన తండ్రినిగురించి దశదానములను జేయుటకు స్నానసంకల్పాదులను జేసి బ్రాహ్మణులను పూజించి స్వర్గలోక ప్రాప్తికొరకు గోదానమును భూదానహిరణ్యదానములను అప్సరస్సుల లోకముకొరకు దాసీదానమును పాపక్షయముకొరకు తిలదానమును ఇంద్రలోక స్వర్గలోక భోగములకొరకు శయ్యాదానమును స్వర్గఫలముకొరకు ఆజ్యదానమును చంద్రలోకప్రాప్తికొరకు వస్త్రదానమును స్వర్గలోకము నిమిత్తము ధాన్య బీజదానములను ఇంద్రలోకభోగముకొరకు ముమూర్షువుయొక్క ఖట్వాసహిత శయ్యా

దానమును చేయవలయును. తెలివితోనున్నయెడల స్వయముగానే చేయవలెను. దీనివిధానము మంత్రములు మూలమువలన తెలిసికొనవలయును ఉత్క్రాంతి గోదానమును వైతరణీ గోదానమును దశదానములను మృతినొందినప్పటికిని జేసి, పిమ్మట దహనము జేయవలయును.

ముమూర్షువునకు జేయదగిన విధులు.

౨౬—తా. మరణమాసన్నమైన వానికి వ్యాసుడు చెప్పిన విధి ప్రకారమేమనగా, మరణచిహ్నములను కనిపెట్టి శుభమగు ప్రదేశము నందుగాని దేవాలయము గంగాది పుణ్యనదీ తీరములయందును పవిత్రమగు వృక్ష సమీపమందును దక్షిణాగ్రములుగా దర్భలనుపరచి వానిపైన దక్షిణ శిరస్సుగాను వెల్లకిలగా బరుండపెట్టి వానిని గురించి పుత్రాదులు గోభూహిరణ్యతిలాది దానములను కుటుంబవంతుడును దరిద్రుడునగు బ్రాహ్మణులకు నివ్వవలయును. అందువలన స్వర్గాది పుణ్యలోకములు కలుగును. మరణమాసన్నమైన వారికి దానములు కర్ణజపమంత్రములు స్నేహితునితో సమానమై పుణ్యలోక సహాయకారులగును. కాబట్టి మరణసంశయము దోచినప్పుడు గోదానాదులును కర్ణమంత్రజపమును జరుపవలయును. కర్తస్నానముజేసి ముమూర్షువు బ్రహ్మవేత్తయగునేని కుడిచెవియందు బ్రహ్మవిదాప్నోతిపరం "భృగుర్వై వారుణిః" మొదలగు వేదాంతవాక్యములను పఠించవలయును బ్రహ్మవేత్త కానివానికిని స్త్రీలకును "ఆయుషః ప్రాణగ్ంసంతను" అను వాక్యమును చెవియందు పఠించవలయును. మృతినొందిన తర్వాతనైనను పైనచెప్పబడిన యుత్క్రాంతి గోదానాదులును కర్ణమంత్రజపమును ముఖ్యముగా జరిపించవలయును, మృతినొందిన పిమ్మట పుత్రాదులు బంధువులు మొదలగు వారందరును కేశములనుపాంసు నిర్మార్జనము మొదలగు క్రియలను జేయవలయును. ఆటుపిమ్మట కర్తస్నానముజేసి యూర్ధ్వోచ్ఛిష్టాది షణ్ణిమిత్త ప్రాయశ్చిత్త విధులను జరుపవలయును. ఈవిధానము నంతయును "మ్రియమాణం నరందృష్ట్వా" అను మొదలు చివర వరకు నుండు గ్రంథముచే దెలిసికొనవలయును.

షణ్ణిమిత్త ప్రాయశ్చిత్త విధానము.

౨౭—తా. ఊర్ధ్వోచ్ఛిష్టము అధోచ్ఛిష్టము అంతరిక్ష మరణము ఆశౌచమరణములలో నొకటి కలిగినప్పుడు కృచ్ఛ్రత్రయమును రెండు దోషములు కలిగినప్పుడాఱుప్రాజాపత్యములును, అన్నియు కలిగినప్పుడు,

(౧౫) పదినైదు ప్రాజాపత్యములు నాచరింపవలయునని పరాశరాదులు చెప్పిరి. భృగువు అయిదనియు, అంగిరస్సు ఆఱనియు, అస్పృశ్యస్పృష్ట మరణమునం దాఱుకృచ్ఛ్రము లనియు చెప్పిరి. సమస్తవాటికిని శక్తి ననుసరించి ద్వాదశవార్షిక ప్రాయశ్చిత్తమును జేయవలయు ననిరి. మఱియు స్మృతి తత్వ నిర్ణయాది గ్రంథములయందు పైనుదహరింపఁబడిన మరణములయందును, ఖట్వాది (మంచం) మీాద మరణ, అగ్నిమరణ, అస్నానమరణ చండాలాదిజనిత మరణాదులయందును, బ్రాహ్మణానుజ్ఞను బొంది ప్రత్యేక ప్రత్యేకముగా, మూఁడు కృచ్ఛ్రములను జేయుటచే, దోషవిముక్తికలుగునని చెప్పఁబడి యుండెను, కాఁబట్టి యావిధిప్రకారము జేసి పిమ్మట దహనము చేయవలయును. లేనియెడల దోషవిముక్తి కలుగదు, మూలమువలన దీనివివరము తెలియఁబడుచున్నదని తాత్పర్యము.

దహనకర్తృ ప్రాయశ్చిత్తము.

౪౮—తా. తండ్రి మృతినొందినప్పుఁడు కుమారుఁడు మొదలగు వారు దహనాదిక్రియలను జేయుటకు స్వశరీర పవిత్రతా స్వరూపమగు నధికారము కలుగవలయును కాఁబట్టి తాము ముందుగా నేడు, అయిదు, మూఁడు, రెండు,గాని కృచ్ఛ్రప్రత్యామ్నాయరూపమయిన ప్రాయశ్చిత్తములను జేసికొని పిమ్మట పైతృమేధిక కర్మను ప్రారంభించవలయునని శాస్త్రమునందు జెప్పియున్నది. అందువలన స్నానాచమన ప్రాణాయామాదులను జేసి సంకల్పముజేసి పరిషత్ప్రదక్షిణాదులను కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తములను జేసి పిమ్మట పైతృమేధిక కృత్యమును జేయవలయును. (అనఁగా) ఈవిధానమంతయును మూలగ్రంథమువలన ప్రయోగములను దెలిసికొని సప్రయోగసహితముగా జరుపవలెనని తాత్పర్యము.

భద్రతిథ్యాదులయందు మరణవిషయము.

౪౯—తా. భద్రతిథులు మొదలగు వానియందు మరణించినను దహనము చేసినను కలుగునట్టి దోషనివృత్తికొఱకు భూమినిగాని ప్రత్యామ్నాయముగా ఏతన్మూల్యము హిరణ్యమును అనగా శక్తిననుసరించిన ద్రవ్యమునుగాని బ్రాహ్మణునకు దానమివ్వవలయునని తాత్పర్యము.

త్రిపాద నక్షత్ర మరణవిషయము.

౫౦—తా. ద్విపాద, త్రిపాద, నక్షత్రములయందు దహనమరణములు జరిగినయెడల తద్దోష పరిహారముకొఱకు హిరణ్యయుక్తముగా వస్త్రదానమును, ఆదిత్య, మంగళ, శుక్ర, శని,వారములయందు దహన

మరణములు జరిగినయెడల వస్త్రదానమును జేయవలయును. ఇట్లుజేసిన ఆయాదోషములు నివృత్తియగును.

ధనిష్ఠా పంచకమరణము.

౫౧—శ్లో. ధనిష్ఠాపంచకములో మరణదహనములు జరిగినప్పుడు 81 పలముల యెత్తు గలిగి నటువంటిదిగాని లేక దానిలో సగముయెత్తు గాని నాల్గవవంతు యెత్తు గలదిగాని లేక తొమ్మిది ఆఱు మూడుపలములు యెత్తుగల కంచును "యానిపాపాన్యనేకాని" అనుమంత్రమును జెప్పి బ్రాహ్మణునకు దానమివ్వవలయును.

—{ ధనిష్ఠాపంచక మరణమును గుఱించి మఱియొక విశేషముగా జెప్పఁబడెను }—

౫౨—శ్లో. ఆవిశేష మేమనగా, ప్రేతనుచితియందు పరుండబెట్టిన పిమ్మట ముఖములో బంగారపు ముక్కనుంచి "వహావపాంజాతవేద"యను మంత్రమును జెప్పుచు మూడు హోమములను జేయవలయును. మూడు పర్యాయములయందు నిదియే మంత్రము. భద్రతిథి, ద్విపాద, త్రిపాద, నక్షత్ర ఆది మంగళ శుక్రవారములు మొదలగు వానియందలి దహన మరణాదులయొక్క దోష నివృత్తికొఱకు హిరణ్యాదానము మొదలగు తగినదానములనిచ్చి శాంతిని జరుపనియెడల మఱియు నిటులనే మూడు పర్యాయములు జరిగి వారివంశము నశించునని యున్నది గాన శాస్త్ర ప్రకారము జరుపవలయును. అదియేతీరు ననగా, భద్రతిథియందు భూమి యును, త్రిపాద నక్షత్రమునందు బంగారమును, వారమును గుఱించి వారాధిపతియగు గ్రహముయొక్క వర్ణమునుగల వస్త్రమును, ద్విపాద నక్షత్రమునందు ఆవును, నందరిక్తతిథులయందు ధాన్యమును, దానము ల నివ్వవలయును. ధనిష్ఠాపంచకమరణము విషయమై ముఖమునందు ఐదురత్నములనుంచి "వహావపాంజాతవేద" యను మంత్రావృత్తిచే మూడుఆహుతులను జేసినయెడల దోషనివృత్తియగును.

తిథివారనక్షత్ర పునర్దహన విషయము.

౫౩—శ్లో. నింద్యములగు తిథివార నక్షత్రములు మూడును కూడినేని "అస్మాత్త్వమధిజాతోసి" అనుమంత్రముచే నాజ్యముతో నొక హోమమును శవాగ్నిహోత్రమునందు జేయవలయును. పిండిలో నువ్వులను కలిపి ద్విపాదులైతే రెండుపిండములను త్రిపాదులైతే మూడుపిండములను,జేసి శవమునకు సమీపమునందుంచి శవమునకువలెనే యలంక

రించి, శవముతోఁగూడ దహించవలయును. ఇట్లు జేసిన దోషము నశించును. ఇదియే పునర్దహనమని చెప్పఁబడును.

దహనాదిక్రియలను జేయతగినవారు.

౫౪—తా. కుమారుఁడు, పౌత్రుఁడు, పౌత్రుని కుమారుఁడు, కుమార్తె కుమారుఁడు, భార్య, సోదరుఁడు, సోదరునికుమారుఁడు, తండ్రి, తల్లి, కోడలు, తోఁబుట్టువ, మేనల్లుడు, జ్ఞాతులు, ప్రేతయొక్క ఆస్తిని తీసికొనినవాడు, ఇట్లు చెప్పఁబడియున్నది గాన వీరిలో ముందుముందుగా జెప్పబడినవారు లేనిపక్షమున తర్వాత చెప్పఁబడినవారు పిండము నివ్వ తగినవా రగుదురు మఱియొకరి మతము ఔరసుఁడు క్షేత్రజ్ఞుఁడు దౌహిత్రుఁడు పుత్రుఁడు సోదరపుత్రుఁడు సపిండీకరణము జేయవచ్చుననిరి. వీరు లేనిపక్షమున భార్యయు, ధనమును, తీసికొనినవాడును జేయవచ్చుననిరి. మఱికొందరు కుమారుఁడు లేనిపక్షమున భార్యయు ఆమెయు లేనిపక్షమున సోదరుఁడును జేయవచ్చుననిరి.

—{ ఉపనయనము కానివానికి పితృసంస్కారాధి కారమును గుఱించిన విషయము. }—

౫౫—తా. ఉపనయనము కానివానికి మాతాపితరుల ప్రేతకృత్యములకంటె నితరములగు నేకర్మలయందు నధికారము లేదనియు వేదమును పఠింపగూడదనియు మనువుచెప్పెనుగాన ఒక్కకుమారుడై యుపనయనము కాకపోయిన పక్షమునందు మంత్రముల నుచ్చరింపుచు తల్లిదండ్రుల ప్రేతకృత్యములను జేయవచ్చునని సుమంతుఁడు, విశ్వామిత్రుడు, జెప్పిరి.

సవతితల్లి విషయము.

౫౬—తా. పుత్రులులేక భార్య మృతినొందినప్పుఁడు సవతి కుమారుడుండినను పెనిమిటియే దహనాది సపిండాంత కర్మలనన్నియు జేయవలయునని సంగ్రహకారుఁడు చెప్పెను. ఒకనికి ఇద్దరు ముగ్గురు భార్యలున్నపక్షమున పుత్రుఁడులేని భార్య గతించినప్పుఁడు పెనిమిటియే కర్తగాని సవతికుమారుఁడు కర్తగాడని స్మృతిసార సముచ్చయమను గ్రంథమున చెప్పఁబడెను మఱియు పెనిమిటి లేనియెడల సవతికుమారుఁడును అతను లేని పక్షమున వానికుమారుఁడును అతడును లేని పక్షములో సమీప వారసులలో నెవరైనను జేయవచ్చును. ఎవరికిని సంతానము లేనివిషయములో దత్తకుమారుడైనను ఇరుపురకు ఉదకపిండదానాది క్రియలను

జేయవచ్చును. పుత్రుడులేని స్త్రీకి సవతికుమారుడు వాడు లేనియెడల క్షేత్రజాదులువారు లేని పక్షములో పెనిమిటి ప్రేతకృత్యమును జేయవలయునని కాలాదర్శమునందు జెప్పఁబడెను. అనేకభార్యలుండగా వారిలో నొకభార్యకు కుమారుడుండెనేని మిగిలిన భార్యలందఱు సంతానవంతులే యగుదురు కాఁబట్టి సవతికుమారుఁడు జేయవచ్చునని మనువు చెప్పెను. తల్లికి తనకు జన్మించిన కుమారుఁడు కర్మను జేయవలయును. అతను లేని పక్షమున సవతికుమారుఁడు తదభావమందు క్షేత్రజాదులు వారును లేని విషయమునందు పెనిమిటియు అతడును లేని విషయములో సపిండులును కర్తలని కాత్యాయనుడు చెప్పెను. కుమారునకు తండ్రియు తమ్మునకు అన్నగారును మరియొక కర్తయున్నప్పుడు కర్మను జేయఁగూడదు. ప్రేమచే జేయవలయునని యున్నయెడల కర్తచే సపిండీకరణము చేయించువాడై మిగతషోడశాంతము తాను జేయవలయును. కర్తలేని పక్షములో కుమారునికి తండ్రియు, తమ్మునకు నన్నయు, దహనాది సపిండనము మొదలగు కృత్యములను జేయవచ్చును అనఁగా వారివారికి కుమాళ్లులేని పక్షమునందు జెప్పఁబడెను. మఱియు పారస్కర వచనాను సారముగా కుమారుఁడు సోదరుఁడు దౌహిత్రుఁడు జ్ఞాతి అల్లుడు మొదలగు వారిలో మొదటిదినమునందు నెవడు కర్మను జేయునో వాఁడే పదిదినముల పర్యంతము జేయవలయునని యున్నది. కుమారుఁడు లేనప్పుడు జ్ఞాతులు తదభావమందు శిష్యులు వారును లేనప్పుడు ఋత్విక్కులు ఆచార్యులు మొదలగువారు ఎవరు ప్రథమసంస్కారమును జేయుదురో వారే పదిదినముల పర్యంతము కర్మను జేయవలయును. సగోత్రుఁడుగాని అన్యగోత్రుఁడుగాని స్త్రీగాని పురుషుఁడుగాని ప్రథమ దినమునందు కర్మను ప్రారంభించి చేసినవాడే పదిదినముల పర్యంతము జేయవలయును. కుమారుఁడు రోగము మొదలగు కారణములచే కర్మనుజేయుటకు వీలులేని సమయమందు ప్రతినిధివిధానము ప్రాయశ్చిత్తము మొదలగునవి యున్నవిగాన అట్టి సమయమందు పదిదినముల పర్యంత మితరునిచే జేయింపవచ్చును.

## పైతృమేధిక సంకల్ప విధానము.

౫౭—తా. కర్త సభవారికి మూడుపర్యాయములు ప్రదక్షిణము జేసి దక్షిణనను సమర్పించి శరీర శుద్ధికలిగి కర్మను జేయుటకు యోగ్యత కలిగేనిమిత్తము తగినప్రాయశ్చిత్తమును నిర్ణయించి చెప్పవలయునని సభ

చైవ ఖట్వాయాం మరణేతథా॥ చండాలశ్వాన సంస్పృష్టే ప్యాకాశే మరణేసతి। చండాలాన్మరణేవాపి త్రిభిః కృచ్ఛ్రైః పృథక్ పృథక్॥ శుధ్యతీతి శేషః॥ విప్ర (వాక్యప్రధానేన) శ్యానుసారేణ ప్రత్యాఖ్యాయ విధిర్యథా। కృత్వాతు దహనంకార్య మన్యథాకిల్బిషీ భవేత్.

—(*) దహనకర్తృ ప్రాయశ్చిత్తం. (*)—

౨౮. కర్త్రాధికార సిధ్యర్థంత్రీన్ కృచ్ఛాన్ సప్తపంచవా। చరేత్ ద్వావాత్మశక్త్యాద్యైః పైతృమేధిక మాచరేత్॥ కర్తాకృత ప్రాణాయామః ప్రాచీనావీతీ పితుర్గోత్రస్య శర్మణః ప్రేతస్యమరణకాలే సంభావితానా మూర్ధ్వోచ్ఛిష్టాధో చ్ఛిష్టాంతరిక్షమరణఖట్వామరణాశౌచ మరణాస్నాన మరణపర్యుషితానాం నిమిత్తానామపనోదకం ప్రాయశ్చిత్తం కరిష్య ఇతి సంకల్ప్య పరిషద్దక్షిణాం గృహీత్వా పరిషదంత్రిః ప్రదక్షిణీకృత్య పరిషద్దక్షిణాంధత్వాప్రణమ్యవిజ్ఞాపయేత్॥ అశేషే హేపరిషత్ మదీయాంవిజ్ఞాపనాం సమాకర్ణ్య మయాసమర్పితామిమాం పరిషద్దక్షిణాంస్వీకృత్య పితుర్మరణకాలేసంభావితానామూర్ధ్వో చ్ఛిష్టాధోచ్ఛిష్టాంతరిక్ష మరణ ఖట్వామరణాశౌచమరణాస్నానమరణపర్యు షితానాంమధ్యే ప్రసక్తానాంనిమిత్తానామపనోదకంప్రాయశ్చిత్తంనిశ్చిత్య। ఉపవిశ్యఉద్దిశ్యమా మనుగృహాణేతివిజ్ఞాప్య పునఃప్రణమేత్। పరిషదపి యజమానేన ఉక్తానాం ఏకైకస్య నిమిత్తస్య నిమిత్తానాం ప్రత్యేకం త్రీణి త్రీణి ప్రాజాపత్య కృచ్ఛ్రాణి ప్రాయశ్చిత్తం నిశ్చిత్య - యజమాన తవపితుర్మరణ, కాలేత్వదుక్త నిమిత్తానా మూర్ధ్వోచ్ఛిష్టాధోచ్ఛిష్టాంతరిక్ష మరణఖట్వా మరణాశౌచ మరణాస్నాన మరణపర్యుషితానాం నిమిత్తానామేకైకస్య నిమిత్తస్య ప్రత్యేకం త్రీణిత్రీణి ప్రాజాప్రత్యకృచ్ఛ్రాణిసముద్రగా మహానదీస్నానమృత్తికాస్నాన ధేనుధానాదికృత్యప్రత్యామ్నాయ రూపేణాచర। ఆచరితేతవపితామరణకాలేసంభావితేభ్యః త్వదుక్తనిమిత్తేభ్య ఉర్ధ్వోచ్ఛిష్టాదిభ్యో ముక్తోభవిష్యతీత్యుపదిశేత్॥ తతః కర్తాప్రాణానాయమ్య పితుర్గోత్రస్యశర్మణః ప్రేతస్యమరణకాలె సంభావితానా మూర్ధ్వోచ్ఛిష్టాది నిమిత్తానామపనోదకం ప్రాయశ్చిత్తం పరిషదుపదిష్టం శక్య ప్రత్యామ్నాయ రూపేణా చరిష్య ఇతి సంకల్ప్య॥ ఏకైకస్యనిమిత్త స్యత్రీణిత్రీణి ప్రాజాపత్యకృచ్ఛ్రాణిధేను ధానముద్రగామహానదీస్నాన మృత్తికాస్నానాది ప్రత్యామ్నాయరూపేణా చరిత్వామృత్తికాస్నాన కర్తృభ్యః ... తన్నయహిరణ్యాం తేభ్య స్సంప్రదదే

నమః । నమమేతి యథాశక్తి దక్షిణాందత్వాపరిషదం ప్రార్థయేత్॥ యజమానస్యపితా— గోత్రః— శర్మా ప్రేతః మరణకాలెసంభావితేభ్యః ఊర్ధ్వోచ్ఛిష్టా ధోచ్ఛిష్టా స్నానమరణాదిభ్య స్సర్వేభ్యః పాపేభ్యోముక్తో భూయాదితి భవంతో బ్రువంతు, ఇతి బ్రూయాత్ పరిషదపిఉచ్చైస్తథాస్త్వితిబ్రూయాత్॥ ఇతి షణ్నిమిత్తప్రాయశ్చిత్తం॥

—(*) భద్రతిథ్యాదా: (*)—

౨౮. భద్రతిథౌ మరణ దహనాభ్యాం యోదోష స్సమజనితద్దోషపరిహారార్థం భూదానం తన్మూలహిరణ్యాదానంవా కరిష్యఇతిసంకల్ప్య తన్మూలం హిరణ్యంవా దద్యాత్॥

—(*) త్రిపాన్నక్షత్రే. (*)—

౨౦. త్రిపాన్నక్షత్రేమరణ దహనాభ్యాం యోదోష స్సమజనితద్దోష పరిహారార్థంస హిరణ్యం వస్త్రదానం కరిష్యఇతి సంకల్ప్య హిరణ్యందద్యాత్॥ భానుభౌమ భృగుశనివారేషు మరణదహనాభ్యాం యోదోషస్స మజనితద్దోష పరిహారార్థం వస్త్రదానం కరిష్య ఇతి సంకల్ప్య వస్త్రందద్యాత్॥

—(*) ధనిష్ఠాపంచకే. (*)—

౨౧. ధనిష్ఠాపంచకే- మరణ దహనాభ్యాంయో దోషస్సమజనితద్దోషపరిహారార్థం కాంస్యదానం కరిష్య ఇతిసంకల్ప్య। యానిపాపాన్యనేకానీతి మంత్రేణ కాంస్యందద్యాత్॥ లోకాక్షిః॥ ఏకాశీతి పలంకాంస్యం తదర్థంవా తదర్థకం। నవషట్త్రి పలంవాపి దద్యాద్వి ప్రాయశక్తితః॥

—(*) ధనిష్ఠాపంచకమరణేవిశేషః. (*)—

౨౨. హిరణ్యంశకలముఖేన్య స్యాషుతిత్రయం తత్రవహావ పాంజాం వేదఇతి మంత్రేణ। తత్కాలే వాన్యకాలె వాచై తత్సర్వం సమాచరేత్॥ యదినక్రియతె శాంతి స్తత్ఫలంచా శునశ్యతి॥ తత్ప్రకారః॥ వహావపాంజాతవేదః సత్యాఏతా అశివస్సంతుకామై స్వాహేతి మంత్రా వృత్త్యాఅహుతి త్రయంచిత్యాం నిక్షిప్త ప్రేతముఖే హిరణ్యశకలం నిధాయ తస్మిన్ జుహుయాత్। అగ్నయేజాత వేదస ఇదం॥ మృతికాలె దాహకాలెదద్యాచ్ఛాంత్యై ధనాదికం। భద్రే త్రిపదనక్షత్రే భృగ్వంగారక వాసరే। మరణందహనం వాస్యాత్త్రివారం తాదృశంభవేత్। భద్రే భూమిః ప్రదేయాస్యాత్త్రి పాదేషు హిరణ్యకం। వారే వారాధి దైవత్యం వాసో

వారిని కోరవలయును. అనంతరము వారు యజమానునిశక్తి ననుసరించి ప్రాజాపత్యకృచ్ఛ్రత్రయ ప్రత్యామ్నాయముగా మూడుగోదానముల జేయవలయు ననియు దానికి శక్తిలేని పక్షములో హిరణ్యరూపముగా నేదో కొంచెము దానము బ్రాహ్మణునకు జేయవలయు ననియు జెప్పవలయును. పిమ్మట యజమానుఁడు సభవారిచే నిర్ణయింపఁబడినరీతిగా జేసి యోగ్యతనుబొంది పిమ్మట పైతృమేధిక కర్మను జేయవలయును.

## పైతృమేధిక ప్రయోగము.

సూ—తా. మనుజుడు మృతినొందిన పిమ్మట పుత్త్రులు మొదలగు వారు కేశవిప్రంసనము పాంసునిరసనము జేయుదురు. పిమ్మట కర్తస్నానముజేసి ఆచమనముజేసి అగ్నులను విహరించి మృతాగ్నిహోత్రమును జేసి పవిత్రమును ధరించి ప్రాణాయామమునుజేసి సంకల్పమును జేసినవాడై ప్రాచీనావీతముజేసికొని తండ్రియొక్క నామగోత్రాదులను జెప్పి శ్రౌతాగ్నులు యజ్ఞపాత్రలు ఔపాసనములతో పైతృమేధిక కర్మతో సంస్కరించుచున్నాననియు తల్లికి ఈప్రకారముగానే స్త్రీలింగ శబ్దస్వరూపముగా తల్లియొక్క గోత్రనామముల జెప్పి సంకల్పము జేయవలయును. తల్లిదండ్రులకు ఏకకాలమునందు మృతిసంభవించిన పక్షములో సమానతంత్రముగానే పుంలింగముతో తండ్రిగోత్రనామములును స్త్రీలింగముతో తల్లిగోత్రనామములును జెప్పుచు నొక్కొక్కక్రియ నుభయులకు నొక్కసారిగానే చేయుచుండవలయును. ఇట్లు తల్లిదండ్రులకు జెప్పెడి మంత్రములకు కూడ స్త్రీలింగ పుంలింగభేదములతో జెప్పవలయునని కొందరనిరి. అట్లుచెప్ప నక్కర లేదని భాష్యకారులు చెప్పిరి అనంతరము గార్హపత్యాయతనమునకు పశ్చిమభాగమున దక్షిణాగ్రములుగా దర్భలను బఱచి వానిమీద నువ్వులను జల్లి దానియందు "సర్వస్య ప్రతిశీవరీ" అను మంత్రమును జదువుచు ప్రేతను దక్షిణశిరస్సుగా నుండునట్లు పరుండబెట్టవలయును. ఒక్కసారిగనే జెప్పవలయునని కొందఱును, మఱికొందరు అన్నిసంవేశనములయందును వేరువేరుగా జెప్పవలయు ననిరి. తల్లికి "స్యోనాస్త్యైసుషదాభవ" అనుమంత్రమును జెప్పవలయును. స్త్రీపురుషులకు ఏకకాలమునందు జెప్పవలసివచ్చినప్పుడు "స్యోనాభ్యాం సుషదాభవ" అని ద్వివచనాంతముగా జెప్పవలయును. అనంతరము గార్హపత్యాయతనమునుండి పూర్వద్వారమునా ప్రేతనుదీసి ఆహవనీయగార్హపత్యాయతనముల మధ్యను దక్షిణాగ్రములుగా దర్భలనుబఱచి దానిమీద ప్రేతను

దక్షిణ శిరస్సుగాను కుడిపార్శ్వము నేలమీదను ఎడమపార్శ్వము పైగానుండునట్లు ఆవహనీయాయతనమునకు నభిముఖముగా ఒత్తికిలగా బరుండబెట్టవలయును. మంత్రమును జెప్పుటను గుఱించి వికల్పము. అనంతర మధ్వర్యుఁడు ప్రేతను అన్వారంభణముజేసి "పరేయువాగ్ సంప్రవతో" అనుమంత్రమును జెప్పి ఆహవనీయాగ్నియందు స్రువముతో హోమము జేయవలయును. స్త్రీవిషయములో లింగభేద మేమియును లేదు. ఈవిధముగానే గార్హపత్యాగ్నియందును జేయవలయును. ఎడమచేతితో ప్రేతను స్పృశింపుచు గార్హపత్యాగ్నిలో తూర్పుభాగమున హోమము సంవేశనమును జేయవలయును మొదటజెప్పినదియే మంత్రము. దక్షిణాగ్నియందు మంత్రవిహీనముగానే హోమము జేయవలయును. సభ్యావసథ్యలయందు తూష్ణీభూతముగానే యుంచవలయును. అనంతరము విహారమునకు దక్షిణభాగమున శుభ్రపరచిన ప్రదేశమునందు ప్రేతనుంచి స్నానముజేయించి వారివారి యాచారప్రకారము శవము నలంకరించి కాలిబొటనవ్రేళ్లను చేతిబొటనవ్రేళ్లను తెల్లనిదారముతోగట్టి వట్టివేళ్లగంధమును బూసి కృష్ణాజినమును బోర్లగిలగా పరచి దానిమీద ప్రేతను వెల్లకిలగా బరుండబెట్టి నూతనవస్త్రముతో గప్పవలయును. "ఇదంత్వావస్త్రం" అను మంత్రము జదువుచు చివరను పాదములదగ్గిర నుండునట్లు కప్పవలయును. మొదట ధరించియున్న వస్త్రమును అధ్వర్యుఁడుతీసి కుమారున కివ్వవలయును. అనంతర మధ్వర్యుఁ డుదకమును స్పృశించి ఆహవనీయమునకు పశ్చిమభాగమున దక్షిణాపవర్గములుగా పరచబడిన మూడుశాళ్లనుదాటి పిమ్మట (వ్రీహి=వడ్లగింజలను) కడిగి దక్షిణాగ్నియందు మంత్రరహితముగానే పచనము జేయవలయును. నిర్వాపము మొదలు శవాలంకరణాంతము మంత్రరహితముగానే జేయవలయును. గార్హపత్యమునందామిక్షా నిష్పత్తి విషయములో సమంత్రకముగానని కొందఱును తూష్ణీభూతము గానని మఱికొందఱనిరి. సోమయాజికిని దర్శయాగము చేయక పూర్వమందు మృతుడైనవానికి జెప్పఁబడెను. ఆమిక్షానిష్పత్తి యితరులకు లేదు. రాజగవియొక్క యుత్సర్గవిషయమునందు ల్సుకనయనము లేదు. అగ్నిహోత్రములు అగ్నిభాండములు ఉచ్ఛేషణము రాజగవి ఆమిక్ష యజ్ఞపాత్రలు కనక, శకలములు, మొదలగు వస్తువులు శవముతోఁగూడ తీసికొని పోవలయును. మఱచిపోయి వానిని తీసుకొని వెళ్లకపోయినయెడల వాటినిగుఱించి తిరిగి యింటికిరాకూడదు.

అందువలన మొదటనే శవముతో గూడ తీసికొని వెళ్లవలయును.

వాహక వరణము

౫౯—తా. ప్రేతను మోసికొని వెళ్లువారు ముందు శవమును బయిటికి తీసికొనివచ్చిన పిమ్మట అధ్వర్యుఁడు "పూషాత్వే తచ్చ్యావయతు" అను మంత్రముచే శవము నభిమంత్రించవలయును. పిమ్మట కొంతదూర ముపెళ్లిన పిమ్మట దక్షిణశిరస్సుగా ప్రేతనుంచి శవమునకు దక్షిణభాగము నందు కొంచెము గొయ్యిత్రవ్వి అక్కడ చరుస్థాలినుంచి పుత్త్రులు జ్ఞాతు లందరును ఏకవస్త్రధారులై నివీతులై కుడిప్రక్క తలవెంట్రుకలను ముడి వేసికొని యెడమప్రక్క వెంట్రుకలను విరబోసికొని కుడితొడలను కొట్టు కొనుచు మూడుసారులు తిరుగవలయును. ఇట్లు తిరుగునపుడు చిన్నవారు ముందరను పెద్దవారు వెనుక నుండవలయును. అధ్వర్యుఁడు మేక్షణము తో చరును తీసికొని మూడు పర్యాయములుంచి మంత్రరహితముగానే తిలోదకముల నుంచవలయును. అనంతర మధ్వర్యుఁడు "ప్రేతేమాత్యా" అనుమంత్రము మొదలగువానిచే మోసికొని వెళ్లుచున్న శవము నభిమం త్రణ జేయవలయును. అనంతరము సగముదూరము తీసికొనివెళ్లి అక్కడ ప్రేతనుంచి పూర్వమువలెనే బలిప్రదాన తిలోదక దానాదులను జేయవల యును. తర్వాత తీసికొని వెళ్లునప్పుఁడు "ఆయుర్విశ్వాయుః" అను మొద లు "సవితాదధాతు" అనువఱకు జెప్పవలయును. పిమ్మట మార్గములో నాల్గవవంతు దూరముండు నంతవరకు తీసికొనివెళ్లి యచ్చట శవమును దింపి పూర్వమువలెనే బలి తిలోదక దానాదులను జేసి వర్షము కురిసినను ఎంతమాత్రము నీరు నిలవనటువంటి చిన్నచిన్నతునుక లగునట్లు చరుస్థా లిని బ్రద్దల కొట్టవలయును. పిమ్మట మిగిలిన నాల్గవవంతు దూరమందు శవ మును తూష్ణీభూతముగానే తీసికొనివెళ్లి దహనప్రదేశమునకు పడమర దిక్కునందుంచి కర్తయు వాహకులు నుత్తరదిక్కునకు వెళ్లవలయును. అనంతర మధ్వర్యుఁడు "ప్రేతేమాత్యా" అనుమంత్రమును జదువుచు మోదుగమండతోగాని జమ్మిమండతోగాని దహన ప్రదేశము నుత్తర మున మొదలిడి దక్షిణసమాప్తిగా సంమార్జన చేయవలయును. ఆమం డను దక్షిణదిక్కున పారవైచి యుదకస్పర్శజేసి దహనప్రదేశము నుద్ధరణ ప్రోక్షణములజేసి హిరణ్యశకలము నచ్చటనుంచి దానిమీద దక్షిణాగ్ర ములుగా దర్భలను పరచవలయును. వానిమీద యజ్ఞసంబంధమైన కాష్ఠ ములచే చితినేర్పరచిన పిమ్మట తూర్పుభాగమునం దాహవనీయాగ్ని

పశ్చిమభాగమున గార్హపత్యాగ్నిని దక్షిణభాగమున అన్వాహార్యపచ నాగ్నిని తూర్పుభాగమున సభ్యాసభ్య ఔపాసనాగ్నులనుంచి దక్షిణాగ్రములుగాను ప్రాగగ్రములుగాను దర్భలను అగ్నులకు కాష్ఠచితికి ప్రేతకుపఱచి చితికిగాని దక్షిణాగ్నికిగాని దక్షిణభాగమందైనను పశ్చిమభాగమందైనను దక్షిణాగ్రములుగాను దర్భలను పరచి వానిమీద ప్రత్యేకముగా పాత్రాసాదనము జేయవలయును. అనంతరము రజ్జుబంధనమును ఛేదించి ఆసందీచ్ఛేదనము జేసి రజ్జుఖండములయందు కృష్ణాజినమునందు ప్రేతను వెల్లకిలగా బరుండబెట్టించి "ఏకపవిత్రేణ ప్రోక్షణీం" అనునది మొదలు "సర్వేజ్ఞాతయఃకుర్యుః" అనువరకు నుండు గ్రంథముచే జెప్పంబడిన క్రియలను జేయించవలయును. ప్రేతపత్నీ సహగమనము జేయదలచియున్న పక్షమున "ఇయంనారీపతిలోకం" అను మంత్రమును జెప్పి యధ్వర్యుడు ప్రేతతోగూడ భార్యను పరుండబెట్టించ వలయును. తిరిగి బ్రతికియుండియే బ్రహ్మచర్యనిష్ఠతో నుండవలయునని కోరిక కలిగినయెడల కర్మను జేయుచున్నట్టి సుతులు మొదలగువారు "ఉదీర్ష్వనార్యభి జీవలోక" అనుమంత్రమును జెప్పి ప్రేతపత్నిని లేవదీయవలయును. అధ్వర్యునకు సహస్రమూల్యమగు హిరణ్యమును దక్షిణ నియ్యవలయును. సహగమనాభిలాష కలిగియున్నయెడల "ఉదీర్ష్వనారీ" అనుమంత్రమును జెప్పనక్కరలేదు. సహగమన విధానమందు ప్రేతభార్యకు ముందుగా స్నానము శరీరశుద్ధియు జేయవలయును. హస్తసంమార్జనము మొదలు యిద్దరికిని జేయవలయును. పాత్రలను పగలగొట్టి యుభయులకు ప్రత్యేకముగా ఉపస్థానాదులను జేయుచు త్రికాండి వచనాను సారముగా ద్వివచనముతో మంత్రములను జెప్పవలయును. అనంతరము అధ్వర్యుడు "సువర్ణగ్ం హస్తాదా దధానామృతస్య" అనుమంత్రమును జదువుచు బంగారముతో ప్రేతయొక్క హస్తములను సంమార్జన జేయుచున్నాడు. సహగమనపక్షములో నొక్కపర్యాయమే మంత్రమును జెప్పి యుభయుల హస్తములను సంమార్జన జేయవలయును.

పాత్రచయనము.

౭౦—తా. ప్రేతను చితియందుంచిన పిమ్మట శిరస్సు ననుసరించిన యేడురంధ్రములయందు నేడుబంగారపు ముక్కల నుంచవలయును అది యెట్లనగా, ముందుగా ముఖమునందును పిమ్మట కుడినేత్రమునందు తర్వాత నెడమనేత్రమునందు పిమ్మట కుడిచెవియందు తర్వాత ఎడమ

చెవియందు పిమ్మట కుడిముక్కురంధ్రమునందు పిమ్మట నెడమరంధ్రము నందు నేదురంధ్రములయందు నేదుశకలముల నుంచవలయును లేక ఆజ్యబిందువులనైనా నుంచవలయును. ఈప్రకారముగానే భార్యకును జేయవలయును ప్రేతపైన పాత్రలనన్నియు నుంచవలయును. ధ్రువను ప్రతి లోమనుగాను దక్షిణాగ్రముగాను మిగతపాత్రలను అనులోమ ముగా నుత్తరాగ్రములుగాను ఆజ్యముతోను గూడినవిగా నుంచవల యును. సర్వతోముఖపాత్రలు చాతుర్మాస్య పాత్రలుండినయెడల వానిని కూడ నుంచవలయును ఇవియన్ని తూష్ణీభూతముగా నుంచవలయును. "ప్రేతస్యదక్షిణేహస్తేస్ఫ్యం" అనునదిమొదలు "మధ్యేసాదయతి" అను వరకునుండు గ్రంథముచే జెప్పఁబడిన విధిప్రకారము ఆయాస్థలముల యందు నాయాపాత్రల నుంచవలయును. మిగిలినపాత్రలను రెండుతొడల నడుమ నుంచవలయును. "మిత్రావరుభ్యాం త్వేతి" అనుమంత్రమును జెప్పి ఆమిక్షను చేతులయం దుంచవలయును. సంభవించి నంతవరకు సుగంధద్రవ్యములను దర్భల నుంచవలయును. ముఖమునందు తండుల ములను నువ్వుల నుంచవలయును. ఇవియన్నియు దక్షిణదిక్కునుండియే చేయవలయును. "మైనమగ్నే విదహః" అనుమంత్రమును జెప్పి తూర్పు ప్రక్క నాహవనీయాగ్నిని "శృతంయదాకరసిజాతవేదః" అనుమంత్రము ను జెప్పి పడమరప్రక్కను గార్హపత్యాగ్నిని మంత్రరహితముగా దక్షి ణమున అన్వాహార్యపచనాగ్నిని తూర్పున సభ్యావసథ్యల నౌపాసనాగ్ని నుంచి ప్రేతను దహించవలయును. స్త్రీకి ప్రత్యేకముగా జెప్పవలసినప్పు డును సహగమనమునందును లింగభేదములుగా మూలములో జెప్పబడిన ప్రకారము చెప్పవలయును. అగ్నిహోత్రునకు దహించుటయందు ప్రీతి కాఁబట్టి యీశరీరమును నీకు విడిచితిమని చెప్పవలయును. ఈప్రకార ము చేయుటయే పితృప్రీతికరమగు యాగము అనంతరము చితికి పడమర భాగమందు చిన్నకొయ్య నొకటిపాతి సన్ననిత్రాడుచే నొకమేకనుకట్టి యాత్రాడును ఈకొయ్యకుగట్టి మేకను తరుమగొట్టగా నది పారిపోవు నప్పుడు "అజోభాగస్తపసా...యత్రలోకాః" అనుమంత్రమును జెప్పవల యును. ప్రత్యేకముగా స్త్రీకి జెప్పునప్పుడు సహగమనమునందు లింగవచ నభేదములతో జెప్పవలయును. పాత్రాసాదనకాలమం దుంచబడిన ప్రదే శమునుండి యాజ్యస్థాలినిస్రువమును తీసికొని యాజ్యస్థాలియం దాజ్య మునుంచి స్రువముతో "యవతేస్యపథో...స్తైభ్యస్స్వాహా" అనునది

మొదలు "యమత్రనాధీమ స్తస్మై స్వాహా" అనువఱకుఁ జెప్పబడిన తొమ్మిది మంత్రములచే తొమ్మిది నాహుతుల నివ్వవలయును మొదటి మూడు మంత్రములను స్త్రీలకు ప్రత్యేక విషయములో స్త్రీలింగముగాను సహగమనందు ద్వివచనము గలుగునట్లుగాను మిగిలిన యాఱుమంత్రములను మొదట జెప్పినట్లుగాను జెప్పవలయును. పిమ్మట స్రువాజ్యస్థాలులను మొదటతీసిన ప్రదేశమునందునే యుంచవలయును. పునర్దహనవిధియందు నీప్రకారమే చేయవలెను. ఆపత్తునందు అగ్నిహోత్రహవణిని కృష్ణాజినమును శమ్యను ద్రుషదుపలములనుతీసి కాపాడవలయును పిమ్మట చితికి పడమరదిక్కున దర్భలను పఱచి మంత్రరహితముగా నిరసనోపవేశములను జేసి తూర్పుముఖునుగా గూర్చుండి "ప్రకేతునాబృహతా" అను మొదలు యామ్యసూక్తములను జెప్పి దహనప్రదేశమునకు పశ్చిమప్రదేశమునందు మూడుగోతులను త్రవ్వి వానిలో నిసుకగాని చిన్నరాళ్లగాని యుంచి బేసిసంఖ్యగల కలశములతో నీళ్లుజల్లి "అశ్మన్వతీరేవతీస్సగ్ంరభధ్వ" అనుమంత్రమును జెప్పుచు చిన్నవాళ్లు ముందుగాను స్త్రీలతో గూడ ప్రతిగోతినిదాటి వెళ్లవలెను ఒక్కసారియే మంత్రమును జెప్పవలయును. వానికి పశ్చిమభాగమునందు మోదుగపుల్లలుగాని జమ్మిపుల్లలుగాని రెండుచివళ్లు పైకినుండునట్లు దక్షిణోత్తరములుగాపాతి చివళ్లను సన్నని దారముచే జుట్టి దానిపై గాదాటి వెళ్లవలయును. అప్పుడు "యద్వై దేవస్య సవితుః" అనుమంత్రమును జెప్పవలయును. ఇట్లు దాటునప్పుడు అందరిని ముందు దాటనిచ్చి అధ్వర్యుఁడు "యారాష్ట్రాత్పన్నాతి" అను మంత్రమును జెప్పి అధ్వర్యుఁడు ఆమండలను తీసివేసి జలస్పర్శనము జేయవలెను. పిమ్మట జలకుంభమునకు క్రిందరంధ్రము జేసి నీరు వెనుకప్రక్కకు స్రవించునట్లుగా నాకలశమును భుజముపైనం దుంచుకొని చితికి మూడు సారులు సవ్యముగా దిరిగి యాకలశమును పగులునట్లుగా వెనుకకు గిరాటు వేయవలెను. అనంతర మందఱును సవ్యముగా యజ్ఞోపవీతము గలవారలై జలస్పర్శనము జేసి "ఉద్వయంతమసస్పరి" అను మంత్రముచే సూర్యోపస్థానము జేసి తిరిగి దహనప్రదేశమును జూడకుండా బయలుదేరి తటాకము మొదలగు జలాశయములవద్దకు వచ్చి అందఱును స్నానము జేయవలయును.

## బ్రహ్మమేధ ప్రయోగము.

౬౧—తా. బ్రహ్మవేత్తయగు నాహితాగ్నిని గుఱించి చెప్పఁబడు

చున్నది. మరణసందేహము కలిగినప్పుడే ముమూర్షువుకు జేయఁదగిన స్నానము సర్వప్రాయశ్చిత్తము సర్వావయవములందు తులసీమృత్తుకను ధరింపజేయుట విష్ణువునకు పూజించిన తులసీమాలికను వేయుట, తులసీతీర్థము నిచ్చుట, శరీరముపై జల్లుట, ఉత్క్రాంతి తిలపాత్రదానవైతరణీ గోదాన దశదానాదులను జేయించుట, పూర్వముచెప్పిన ప్రకారము అగ్నిహోత్ర దర్శపూర్ణమాసాదులను జేయించుట, ఔపాసనాగ్నియందు జేయవలసిన స్మార్తకర్మలను జేయించుట మొదలగునవి సమస్తకృత్యములను జరిపి, పిమ్మట శంకరాచార్యులు విద్యారణ్యులు మొదలగువారిచే తైత్తిరీయోపనిషత్తులందు జ్ఞానము విషయమై ముఖ్యముగా గ్రహింపబడినవియు, బ్రహ్మవల్లి భృగువల్లియను నామములచేఁ బ్రసిద్ధికెక్కిన "బ్రహ్మవిదాప్నోతిపరం భృగుర్వైవారుణిః" అను రెండు అనువాకములను బ్రహ్మవేత్త యొక్క కుడిచెవియందుఁ జెప్పవలయును. కాఁబట్టి ముందు కుమారుఁడు మొదలగువారు స్నానముజేసి ప్రాణాయామముజేసి దేశకాలములను స్మరించి గోత్రనామములను జెప్పి ముమూర్షువుకు బ్రహ్మప్రాప్తికొఱకు కర్ణమంత్రపఠనము జేయుచున్నానని సంకల్పముచేసి చెప్పవలయును. మృతినొందిన యెడల ప్రేతకు ముఖ్యులగు పుత్త్రులు మొదలగువారు ప్రాచీనావీతులై తలవెంట్రుకలను విరియబోసికొని పాంసునిరసనాది కృత్యములను జేయుదురు. అనంతర మధ్వర్యుఁడు స్నానము, ఆచమనముచేసి అగ్నులను విహరించి అగ్నిహోత్రాదులనుజేసి పవిత్రమును ధరించి ప్రాణాయామమునుజేసి దేశకాలాదుల స్మరించి ప్రాచీనావీతుడై యజమానునియొక్క గోత్రనామములను జెప్పి యీప్రేతను శ్రౌతాగ్నులు యజ్ఞపాత్రలు ఔపాసనాగ్ని మొదలగువానితో నారాయణ సాయుజ్యము నొందుకొఱకు బ్రహ్మమేధ విధిప్రకారముగా సంస్కరించుచున్నానని సంకల్పము జేయవలయును. మఱియు విశేషముకలదు. గార్హపత్యాగ్నికి ప్రక్కను దక్షిణాగ్రములుగా దర్భలనుబఱచి వానిమీద నువ్వులనుజల్లి "సర్వస్య ప్రతిశీవరీ" యను మంత్రమును జెప్పి కుడిపార్శ్వము క్రిందుగాను దక్షిణ శిరస్సుగాను గార్హపత్యాగ్నికి నభిముఖముగాను ప్రేతను పరుండబెట్టవలయును. అన్ని సంవేశనములయందు నొక్కసారియే మంత్రమును జెప్పుట, పిమ్మట గార్హపత్యాయ తనపూర్వద్వారమునుండి లీసికొనివచ్చి గార్హపత్యాహవనీయాయతనముల మధ్య దక్షిణాగ్రములుగాఁ బఱచబడిన దర్భలయందు దక్షిణ శిరస్సుగాను, నడమపార్శ్వము

క్రిందుగాను ఆహవనీయాభిముఖముగాను పరుండ బెట్టవలయును. ఇచ్చట మంత్రమును చెప్పుటయు చెప్పకుండుటయును రెండువిధములు కలదు. అనంతర మధ్వర్యుఁడు ప్రేతను స్పృశింపుచు "పరేయువాగ్ంసంప్రవతో" యను మంత్రమును జెప్పి స్రువముతో నాహవనీయాగ్నియందు హోమము జేయవలయును. పిమ్మట "చిత్తిస్స్రుక్" మొదలు, "మహాహవిర్హోతా" యను వరకునుండు నైదు మంత్రములచేత స్రువముతో నైదు ఆజ్యాహుతులను ప్రత్యేకముగా జేయవలయును. పిమ్మట గార్హపత్యమునకు తూర్పుభాగమునందును పూర్వమువలెనే దర్భలను బఱచి పరుండ బెట్టి సవ్యహస్తముతో ప్రేతను స్పృశింపుచు "పరేయువాగ్ంసం" యను మంత్రమును జెప్పి గార్హపత్యాగ్నియందు హోమముజేసి పిమ్మట "చిత్తిస్స్రుక్" మొదలగు నైదు మంత్రములచేత నాజ్యాహుతుల నైదుజేయవలయును. దక్షిణాగ్నియందు మొదటి హోమమును అయిదు హోమములును తూష్ణీభూతముగానే చేయవలయును. సభ్యావసథ్యలయం దీహోమములు లేవు. అనంతరము విహారమునకు దక్షిణభాగమునందు దర్భాస్తరణచే నేర్పరచబడిన ప్రదేశమునందుంచి క్షురకర్మ జేయించి, స్నానము జేయించి వారివారి యాచారప్రకార మలంకరించి తెల్లని దారముతో కాలిబొటనవ్రేళ్లను చేతిబొటనవ్రేళ్లను బంధించి వట్టివేళ్ల గంధమును బూసి పుష్పమాలనువేసి ఔదుంబర్యా సందియందు కృష్ణాజినమును బఱచి దానియందు వెల్లకిలగా ప్రేతను పరుండబెట్టి "ఇదంత్వావస్త్రం" యను మంత్రమును జెప్పి నూతనవస్త్రమును గప్పి పూర్వము ధరింపబడిన వస్త్రమును తీసివేయవలయును. "అథాధ్వర్యురప ఉపస్పృశ్య" మొదలు చివరవఱకు నుండు గ్రంథమునందుఁ జెప్పబడిన క్రియలనన్నియు 58-వ విషయమగు పైతృమేధిక విధానములో వివరింపఁబడిన వగుటచే నిచ్చట తిరిగి వ్రాయలేదు. కాబట్టచటచ్చట చూడవలెను.

వాహకవరణము.

ఉ. తా. బంధువులు ప్రేతను బయటికి తీసికొనివచ్చిన పిమ్మట "పూషాత్వేతశ్చ్యావయతు = భర్తాసక్భ్రియమాణోబిభర్తి" అను రెండు మంత్రములను మూలములో చెప్పినంతవరకు జెప్పి ప్రేత నభిమంత్రించవలయును. మార్గములో నాల్గవవంతు దూరము తీసికొని వెళ్లిన పిమ్మట దక్షిణశిరస్సుగా ప్రేతనుంచుట దక్షిణమున గొయ్యిత్రవ్వుట చరుస్థాలి నుంచుట చిన్నవారు ముందు పెద్దవారు వెనుకగా పుత్రులు జ్ఞాతులు

మొదలగువారందఱును శవమునకు నప్రదక్షిణముగా మూడుసారులు తిరుగుట బలిదానము తిలోదకదానము మొదలగు కృత్యములు 59-వ వాహకవరణములో జెప్పఁబడినరీతిగానే జేయవలయును. మార్గములో సగముదూరము వెళ్లినపిమ్మట నీవిధముగానే సమస్తకృత్యములను చేసి మూడువంతులదూరము వెళ్లినపిమ్మట నీవిధముగానే చేసి చరుస్థాలిని బ్రద్దలుకొట్టి దహనదేశమునకు వెళ్లి యచ్చట జేయవలసిన చితినిర్మాణము, చితియందు ప్రేతనుంచు విధానము, పాత్రచయన విధానములు మొదలగునవి పూర్వమువలెనే జేయవలయును. ఇట్లు రాజగవియొక్క యుత్సనాంతమువరకు చెప్పి యధ్వర్యుడు "ప్రేతపత్నిని ప్రేతతో సహశాయినిగా చేయించునప్పుడు, "ఇయంనారీపతిలోకం" అనుమంత్రమును "నేనేంద్రస్య" అనునది మొదలు "దేవానాంపత్న్యః" యనువరకు జెప్పవలయును. జీవించే యభిలాష యున్నప్పుడు "ఉదీర్ష్వనార్యభి" అనుమంత్రమును జెప్పవలయును. సహగమనాభిలాషయున్నప్పు డీమంత్రమును జెప్పనక్కరలేదు. అనంతరము హస్తసంమార్జనము స్నానము శరీరశుద్ధి మొదలగు కృత్యములను జేయించి యధ్వర్యుడు సహస్రమూల్యరూపమగు హిరణ్యమును దక్షిణను ఇచ్చునప్పుడు "సువర్ణగ్ంహస్తా" అనుమంత్రమును "దేవస్యత్వాసవితుః" మొదలు "ఉత్వానస్త్వాంగిరసః ప్రతిగృహ్ణాతు" అనువరకు జెప్పవలయును మఱియు "సోమాయవాసః" అనునది మొదలు "వైశ్వానరాయరథం" అనువరకునుండు వాక్యములను "దేవస్యత్వా సవితుః...నయతుదేవిదక్షిణే" అనువరకుజెప్పి పిమ్మట "సోమాయ" అను మొదలగు వాక్యములలో నొక్కొక్కవాక్యమును జెప్పి యనంతరము "తేనామృతత్వమశ్యాం...ప్రతిగృహ్ణాతు" అనునంతవరకు జెప్పవలయును. ఈవిధానము మూలములో జెప్పఁబడిన ప్రకారము గ్రహించవయును. సువర్ణముచే పత్నీహస్తముల రెంటిని సంమార్జనజేయునప్పుడు ఒక్కసారియే మంత్రమును జెప్పవలయును. అనంతరము ప్రేతను చితియందుంచి సప్తరంధ్రములయందు సప్తహిరణ్యశకలములనుగాని ఆజ్యాబిందువులనుగాని యుంచవలయును. అట్లు ప్రతిరంధ్రమునం దుంచునప్పుడు చిత్తిపన్నములో గల "సువర్ణంఘర్మం పరివేదవేనం" అను అధ్యములో గల వాక్యముల నన్నియు నెకడెక్కడ నెన్నెన్నివాక్యములను జెప్పవలెనో ఆవిధానముగా నేడుస్థలములయందును జెప్పవలయును మూలమును జూచి తెలిసికొనవలయును పిమ్మట పాత్రలనన్నియు శవముపైన నుంచ

వలయును. ఇట్లు పాత్రలనుంచునప్పుడు "అగ్నిర్యజుర్భిః" అను వాక్యమును ఆసాదన సమాప్తియగునంతవరకు ఆవృత్తిగా జెప్పవలయును. ఆవృత్తిగా జెప్పెడి పక్షమున చివరకు కొన్ని వాక్యములు మిగిలియుండుననే యుద్దేశ్యములో ఒక్కపర్యాయమే చెప్పి పాత్రనన్నియు నుంచవలయును. శాస్త్రములో జెప్పఁబడిన స్థానములయం దుంచఁగా మిగిలిన పాత్రలను రెండుతొడలనడుమనుంచి "మిత్రావరుణాభ్యాంత్వా" అనుమంత్రముచే ఆమిక్షను హస్తములయం దుంచవలయును. అనంతరము సుగంధవస్తువులు దర్భలు మొదలగునవి సంభవించి నంతవరకు చితియందుంచి తండులములను నువ్వులముఖమునం దుంచవలయును. ఇట్లుచేయు విధానమును దక్షిణభాగమునుండియే చేసి పిమ్మట దహించవలయును. "మైనమగ్నే విదహః త్పితృభ్యః" అనుమంత్రమును "జ్యోతిష్మతీంత్వాసాదయామి...జాగ్రతీంత్వాసాదయామి" అనుమంత్రములను జెప్పి తూర్పు ప్రక్కను ఆహవనీయాగ్నిని "శృతంయదాకరసి...పశినీర్భవాతి జ్యోతిష్మతీంత్వాసాదయామి" అను మంత్రములను జెప్పి పడమరప్రక్కను గార్హపత్యాగ్నిని తూష్ణీంభూతముగా దక్షిణమున అన్వాహార్యపచనాగ్నిని తూర్పుదిక్కున సభ్యావసభ్యల నౌపాసనాగ్నినుంచి దహించవలయును. అనుగమనపక్షమునం దుపస్థానమంత్రమును జెప్ప నక్కరలేదు. అప్పుడు "సహస్రశీర్షాపురుషః...సర్వంమనిషాణ" అనునట్టి నారాయణ రుక్కులను జెప్పవలయును. సహగమనపక్షములో (ఛాగ) అమంత్రణ విసర్జనములు లేవు. ప్రత్యేకపక్షములో "అజోభాజస్తపసా...యత్రలోకాః అయంవైత్వమస్మాదధి...సుకృతాం యత్రలోకాః" అనుమంత్రములను "బ్రాహ్మణఏకహోతా" అనునది మొదలు దశలు హోతలు వరకు జెప్పి ఛాగానుమంత్రము జేయవలయును. పిమ్మట స్రువముతో తొమ్మిది ఆజ్యాహుతులను జేయవలయును. అనుగమనపక్షమునందు జేయ నక్కరలేదు. ప్రత్యేకపక్షములోన వాహుతులు జేసిన పిమ్మట "ప్రయాసాయస్వాహా" అనిమొదలు "సర్వస్మైస్వాహా" అనువఱకునుండు పండ్రెండు మంత్రములచే పండ్రెండు హోమములను జేయవలయును. స్రువాజ్య పాత్రలను తీసిన ప్రదేశములయందే యుంచవలయును. పునర్దహనవిషయములో అగ్నిహోత్రహవణిని కృష్ణాజినమును శమ్యను ద్రుషదుపలములను తీసి దాచవలయును. చితికి పడమరభాగమున తూష్ణీంభూతముగా నిరసనోపవేశములను జేసి తూర్పుముఖముగా గూర్చుండి యమసూక్త

పారాయణము జేయవలయును. "ప్రకేతునా" అనుమంత్రము మొదలు తొమ్మిది మంత్రములకును "హరిగ్ంహారంతం" అనునది మొదలు "ప్రథమజామృతస్య" అనువరకునుండు 6 మంత్రములకును ప్రణవము నంతమందు జేర్చి చెప్పవలయును. పిమ్మట దహనప్రదేశమునకు పశ్చిమభాగమున గోతులను త్రవ్వుట సికతాదులను జల్లుట జలప్రోక్షణ కనిష్ఠపూర్వకముగా ఆగోతులను దాటుట పలాశశాఖలను పాతి దర్భరజ్జువును జుట్టి దానిమీదుగా దాటుట జలకుంభములో చితిచుట్టుతిరుగుట కుంభము నభిన్నముజేయుట సూర్యోపస్థానము మొదలగు కృత్యములన్నియు నిదివరకు జెప్పఁబడిన ప్రకారముగానే చేయవలయును. మఱియు నిచ్చట కొన్ని క్రియావిశేషములు మంత్రవిశేషములు మూలములో జెప్పబడిన రీతిని పరిశీలించి చూచుకొనవలయును. స్నానానంతరము యవోదనప్రాశనపర్యంతము పైతృమేధిక విధిగానే బ్రహ్మవేత్తకును జేయవలయును. ఆచార్యునకును బ్రహ్మమేధ విధిగానే చేయవలయును. ఇట్లుచేసిన విష్ణుప్రీతి యగును

అనుగమన విషయము.

౬౩—తా. పెనిమిటి మృతినొందినప్పుడు పతివ్రతయగు భార్య సహగమనముజేసిన యెడల మూడుకోట్ల యేబదివేల సంవత్సరములు లేక ప్రళయకాల పర్యంతము స్వర్గలోకమునందు పెనిమిటితోగూడ సుఖించుచుండుననియు పాములవాడు పుట్టలోనుండి సర్పమును బయటికిదీసిన విధముగానే పెనిమిటియెటువంటి పాపములను జేసినను సహగమనము జేసిన భార్య పెనిమిటిని నరకమును బొందనీయక సుగతిని పొందింప జేయుననియు జెప్పఁబడినది. పతివ్రతాలక్షణ మెటువంటి దనఁగా, పెనిమిటి కష్టపడుచుండగా తానును కష్టపడునదియు సంతోషముగా నుండెనేని తాను సంతోషముగా నుండుట ప్రవాసము వెళ్లినయెడల నలంకార శూన్యముగా నుండుట మృతినొందిన యెడల తాను మరణించుట. అను లక్షణములు చెప్పఁబడినవిగాన పతివ్రతయగు భార్యకు సహగమనము విషయమై మన్వాదిస్మృతులు విశేషఫలముగా జెప్పియున్నవి. ఈధర్మము అందఱు స్త్రీలకును వర్తించదు ఎట్లనగా, గర్భిణీస్త్రీ పసిపిల్లతల్లి పతితురాలు వ్యభిచారిణి పైనుదహరింపఁబడిన పతివ్రతా లక్షణములు లేనిస్త్రీ యిటువంటి సహగమనము జేయనక్కఱలేదు. పతివ్రతాలక్షణములు గల సర్వవర్ణస్త్రీలును సహగమనము జేయవచ్చును. స్నానము శరీరశుచిని

జేయించవలయును. ఉత్థానము లేదు కాఁబట్టి "ఉదీర్ష్వనారీ" అనుమంత్రమును జెప్పనక్కరలేదు హస్తసంమార్జన దహనప్రేతోపస్థాన అజానుమంత్రణ హోమతంత్రములయందు ద్వివచనముగా జెప్పవలయును. పెనిమిటికి జేయునట్టి సంస్కారముతోనే పూర్తియగును కాఁబట్టి భార్యకు ప్రత్యేకముగా మంత్రమును జెప్పనక్కరలేదు ప్రమాదముచే గలిగిన మరణము విషయమై మంత్రములకు వికృతిలేకుండా పితృమేధ విధికూడా నేచేయవలయునని కపర్దిస్వామిచెప్పెను. ఇద్దరుగాని అంతకు పైగాగాని యేకకాలమందు గతించినవారికి దహనము సంచయనముకూడాచేసి శ్రాద్ధము వేరుగా జేయవలయునని కొందఱును దశాహమువరకు కూడా చేసి వృషోత్సర్జనము మొదలు సపిండీకరణాంతము వఱకు వేరుగా జేయవలయునని మఱికొందరును వచించిరి. సహగమనముచేసిన స్త్రీకి వేరుగా తంత్రము లేదనియు దహనసంచయనాదు లుభయులకు నేకకాలమందు జరుగుట వలన నుభయాస్థులనేకముగానే తీయవలయుననియు నుదకపిండదానములను వేరుగానే జరుపవలయుననిరి సపిండీకరణము కూడ వేరుగా జేయనక్కరలేదని మఱికొందరు చెప్పిరి. సహగమనమునందు పెనిమిటికి జేయఁబడిన సంస్కారముతోనే భార్యా సంస్కారము సిద్ధించును. కాఁబట్టి వేరుగా మంత్రములను జెప్పుట మంత్రములకు లింగవిభక్తి వచనాదుల యూహాయు లేదని కపర్దిస్వామిచెప్పెను. మరియు పెనిమిటి మృతి నొందిన పిమ్మట దహనమునకు పూర్వము భార్య మృతినొందినను భార్య మృతినొందిన తర్వాత దహనాత్పూర్వము పెనిమిటి మృతినొందినను ప్రమాదవశముచే మృతిగలిగినప్పటికి నేకకాలదహనము గలుగుటవలన సహగమనముతో సమానమయిన దగుచు మంత్రములకు ద్వివచనాది యూహాకలుగ వలయునని త్రికాండిచెప్పెను. ఆపక్షము కపర్దిస్వామిచే నంగీకరింపఁబడలేదు. కాఁబట్టి యుగపత్ప్రమాద మరణమందును సహగమనమునందును మంత్రావృత్తియు ద్వివచనాది యూహాయును లేదు. బ్రహ్మమేధ విషయములో భార్య సహగమనముచేసి నప్పుడు బ్రహ్మమేధవిధిగానే దహించవలయునని కొందఱును స్త్రీలకు కూడదని మరికొందరును చెప్పగా నిషేధవిధి మతాంతరమందుగాని ప్రకృతవిషయము కాదని నిర్ణయించి ఆయగ్నులతోనే భార్యనుకూడ బ్రహ్మమేధవిధిగానే దహించవలయునని సిద్ధాంతపఱచిరి. వపనము ఉదకదానాదులను గుఱించి ముందు జెప్పఁబడును.

## దహనము చేయువలసినవిధి.

౬౪—తా. చితియందు శవమును వెల్లకిలగానే బరుండబెట్టి దహించవలయును; గాని అధోముఖముగాను దిగంబరినిగాను మలముతోగూడినట్టి వానిని దహించకూడదు. ఆప్రేతకు గప్పిన వస్త్రములో సగముచించి శ్మశానపాలకునకిచ్చి మిగిలిన సగను వస్త్రముతో శవమును దహించ వలయును.

## బ్రహ్మమేధ సంగ్రహకారికలు.

౬౫—తా. బ్రహ్మమేధ విధానమంతయు పితృమేధము వలెనే జేయవలయును. ఇక్కడ విశేషమేమి యనఁగా, "పరేయువాగ్ంస" అను మంత్రముతో హోమము జేసిన పిమ్మట "బ్రాహ్మణ ఏకహోతా" అనునది మొదలు దశహోతలతో హోమము జేసి తర్వాత పూషాత్వాదులయందు "భర్తాసన్భ్రియమాణః" అనువాక్యము చెప్పి ప్రేతాను మంత్రణము, ఇయంనారీ, అను మంత్రము చేజేసి, సేనేంద్రస్య, అనువాక్యముతో ప్రేత పత్నీనిపరుండబెట్టి "సువర్ణం ఘర్మం దేవస్యత్వా" అనువాక్యములతో హిరణ్యశకలముచే రెండు హస్తములను సంమార్జనముచేసి "సువర్ణం ఘర్మం" అనుమంత్రముచే సువర్ణశకలమును ముఖమునుందుంచి "బ్రహ్మాం దమగ్నిం" అనుమంత్రముతో నేత్రములయందును శతంనియుతః. అను మంత్రముతో చెవులయందును. "సువర్ణంకోశం" అని కుడిముక్కురంధ్ర మునందును. "ఇంద్రోరాజా" అని యెడమ ముక్కు రంధ్రమునందును సువర్ణశకలములనుంచి "అగ్నిర్యజుర్భిః" అనువాక్యములతో ప్రతివాక్య ముతోను అన్నిపాత్రల నన్నియవయవములందు నుంచవలయును. ఇంక పాత్రలు మిగిలియున్న యెడల తిరిగి ఆచితియందే నుంచవలయును. "మైనమగ్నే జ్యోతిష్మతీభిః" అనుమంత్రముచే దహించి సూర్యంతే చక్షుః అనువాక్యముతో నుపస్థానము జెప్పి. "అజోభాగః దశహోతలు" అను మంత్రములతో అజానుమంత్రణము జేసి యఏతస్య "స్రయాసాయస్వాహా" అను మంత్రములతో స్రువముచే నాజ్యహోమమును జేసి "ప్రకేతునా హరిగ్ంహారంతం" అను మంత్రములను పఠించి "అశ్మన్వతీః" ఆప్యాయస్వ అను మంత్రములతో అవటములనుదాటి "ఉద్వయంతమసస్పరి తరణిర్విశ్వ" అను మంత్రములతో సూర్యోపస్థానము జెప్పి ధాతాతు త్వష్ట అను మంత్రముల జెప్పి [illegible] స్థానము జేయవలయును. మిగిలిన విష

యము లన్నియు పితృమేధముతో సమానముగానే యని తెలిసికొనవల యునని తాత్పర్యము.

అనాహితాగ్నియొక్క పితృమేధ విధానము.

౬౬—తా. అనాహితాగ్నికి మరణసంశయము కలిగి నప్పుడు పూర్వమందు జెప్పఁబడినరీతిగా సర్వప్రాయశ్చిత్తముజేసి విచ్ఛిన్నాగ్ని పున స్సంధానముజేసి శుభ్రముగా జేయఁబడిన ప్రదేశము నందు దక్షిణాగ్రము లుగా పరచబడిన దర్భలయందు నువ్వులను జల్లి దక్షిణశిరస్సుగా బరుండ బెట్టి పుత్త్రులు మొదలగు కర్తలగువారు స్నానముజేసి సంకల్పముజేసి ముమూర్షువుయొక్క గోత్రనామములను జెప్పి సులభముగా ప్రాణోత్క్రమణముకొఱకు ఉత్క్రాంతి గోదానము తిలపాత్రదానము మొదలగు నవియును, దశదానాదులను జేయించవలయును. అనాహితాగ్ని యైనప్ప టికి బ్రహ్మవేత్తయగునేని కుడిచెవియందు "బ్రహ్మవిదాప్నోతిపరం భృగు ర్వై వారుణిః" అనునట్టి రెండు అనువాక్యములను జెప్పవలయును. బ్రహ్మవేత్తకాకుండెనేని యీ అనువాక్యములు జెప్పనక్కర లేదు. బ్రహ్మ జ్ఞానములేనివానికి స్త్రీలకును "ఆయుషః ప్రాణగ్ంసంతను" అనునట్టి అను వాక్యమును జెప్పవలయును. మృతినొందినప్పటికి పైన జెప్పఁబడిన విధా నముగానే జేయవలయును. ఆహితాగ్నికి త్రేతాగ్నులు యజ్ఞపాత్ర చయనము మొదలగు యజ్ఞసంబంధమగు కొన్నిక్రియలు జరుపవలసియు న్నది. ఇతరులకు నవి యక్కరలేదు. అనాహితాగ్నియైనను బ్రహ్మజ్ఞాన ముకలిగిన యెడల బ్రహ్మమేధ విధానముగానే సంస్కారము చేయవల యును. అతని భార్యకు సహ గమనాభిలాష యున్నయెడల జేయవచ్చు ను. మిగిలిన విషయములు ఇదివరలో జెప్పఁబడిన ఆహితాగ్నిని గుఱిం చిన సందర్భానుసారముగా నుండుటచే సర్వమునకు వివరింపఁబడలేదు. కాఁబట్టి మూలమునుచూచి తెలిసికొన వలయును.

వపన విధానము.

౬౭—తా. తనయులు మొదలగువారు మొదటిదినమునందు కం ఠమునకు పైభాగమునందు పదియవదినమునందు సర్వావయవములందున వపనము జేయిఁచుకొనవలెను. స్మృతులయందు నాప్రకారమే జెప్పఁబడె ను. ఆశౌచము నివృత్తియగును. కాఁబట్టి జ్ఞాతులు మొదలగువారును కర్తలును పదియవదినమునందు సర్వాంగవపనము జేయించుకొనవలెను. శుక్రవారమునందు రాత్రియందు వపనము జేయించుకొన గూడదు.

కుమారుఁడు జేయించుకొనవచ్చును. ఇది ఆశ్వలాయన విషయమని కొం దఱుచెప్పిరి. దహనమునకు పూర్వము వపనము జేయించుకొనిన యెడల పితృహత్య జేసినవాడగును. కాఁబట్టి కర్తదహనము జేసి వపనము జేయిం చుకొనవలయును ఇది యాపస్తంబీయుల మతమైయున్నది మొదటి దిన మునందు వపనము జేయించుకొనని పక్షమందు రెండవదినము మూఁడవ దినము అయిదవదినము ఏడవదినముల యందునుకూడ జేయించుకొన దగునని బోధాయనుడు చెప్పెను. ఆప్రకారమే పరాశరుడును చెప్పుచు ఏకాదశాహ్నిక శ్రాద్ధమునకు పూర్వము తప్పక జేయించు కొనవలెననెను. వపనము జేయించుకొనదగిన వారిని గుఱించి ఆపస్తంబు లిట్లుచెప్పిరి. పుత్త్రులు తమ్ములు ప్రేతకంటె చిన్నవయస్సుగల జ్ఞాతులును జేయించు కొనఁదగిన వారనిరి. మఱియు గంగ మొదలగు పుణ్యనదులయందును భాస్కరాది పుణ్యక్షేత్రముల యందును తల్లిదండ్రులయొక్కయు గురువు అనఁగా తనకంటె పెద్దవాడు యొక్కయు మరణసమయమందును ఆధా నము, యజ్ఞము, మొదలగు క్రతువుల ప్రారంభ సమయమందును, వప నము జేయించుకొనవలయు నని కాలనియమము జెప్పఁబడెను కాఁబట్టి కర్తతోగూడ జ్ఞాతులు వపనము జేయించుకొన వలయును. జ్ఞాతులలో నేడుతరములకు లోపుగాను ప్రేతకంటె చిన్నవయస్సుగలవారు పదియవ దినమునందు కర్తతోగూడ వపనము జేయించుకొన వలయునని స్మృతుల యందుఁ జెప్పఁబడెను. కాఁబట్టి ఏకాదశ దినమునకంటె ముందుగా మొద టిదినమునందును పదియవదినమునందును జేయించుకొనవలయును. మఱి యు తల్లిదండ్రులు మృతినొందిన యెడల తనయులు వపనము జేయించు కొనవలయును. తండ్రి జీవించియుండగా పుత్త్రులలో నొకడు మరణించిన యెడల వానికి కర్మనుజేయునట్టి తమ్ముడే వపనము జేయించుకొన వల యునుగాని యితర తమ్ములకు నవసరములేదు తండ్రిలేని పక్షమునందు అన్నగారికి కర్మజేయు సమయమునందు తమ్ములందరును వపనము జేయిం చుకొనవలయును. తండ్రి లేకపోయినప్పటికిని కర్తలేక తమ్మునకు కర్మ జేయవలసినప్పుడు అన్నయు వపనము జేయించుకొన వచ్చును మిగిలిన వారికి నక్కరలేదు.

### రాత్రియందు వపననిషేధము.

ఉరా—తా. రాత్రియందు దహనముచేసినను వపనరహితముగానే పిండదానాంతముజేసి మఱునాడు తలవెంట్రుకలకు మాత్రము వపనము

జేయించుకొనవలయును. తల్లిదండ్రులకు పినతండ్రి పెత్తండ్రులు వీరి భార్యలు మేనమామ, అన్న, మామ, ఆచార్యుఁడు వీరిభార్యలు మేనత్త పినతల్లి పెత్తల్లులు తనతోఁబుట్టువ వీరలు గతించినప్పుడు తానే కర్మ జేయ వలసివచ్చినయెడల క్షౌరమును జేయించు కొనవలయును. భార్య గర్భిణి తోనున్నప్పుడు తల్లిదండ్రులు మరణించినయెడల కుమారుఁడు వపన మును జేయించు కొనవలయును. అట్లు చేయించుకొనిన పక్షమునందు బ్రహ్మహత్యతో సమానమగు పాపమును జెందును. వపనము జేయించుకొను ట శవముతోఁగూడ వెళ్లుట గోళ్లను తీయించుకొనుట శ్రాద్ధము పెట్టుట గృహమును కట్టుకొనుట విశేష దూర దేశము వెళ్లుట పుత్త్రాదులకు వివా హము జేయుట సముద్రస్నానము మొదలగునవి భార్య గర్భిణితో నున్న వారు జేయగూడదు. అట్లు చేసినయెడల ఆయుఃక్షయమని చెప్పిరి. సేతువు వద్ద స్నానము జేయవచ్చునని మఱియొకరు చెప్పెను. మఱియు దహ నాదిక్రియలను పగలే ప్రారంభించి అవి పూర్తియగునంతకు రాత్రి రెండు జాములలోపుగా నయ్యేనేని అప్పుడు కర్త వపనము జేయించుకొనవచ్చు ననియు జ్ఞాతులు మరునాఁడుదయంబున వపనమును జేయించు కొనవల యుననియు మఱియొక స్మృతియందు జెప్పఁబడియె. సంతానములేని అన్న మేనమామ కుమారుఁడు పినతండ్రి పెత్తండ్రి భార్యయొక్క తండ్రి వీరలు మృతినొందినప్పుడు తాను కర్మను జేయవలసి వచ్చినప్పుడు కను బొమ్మలు హృదయము చంకలు శిఖ ఈప్రదేశములను విడిచి మిగిలిన ప్రదేశమునందు వపనము జేయించు కొనవలయును. భార్యాగర్భవతియైయై నను తల్లిదండ్రుల మరణసమయంబున సర్వావయవములందును వపనమును జేయించు కొనవలెను తమ్ములు మృతినొందినప్పుడు అన్న కర్మను జేయ వలసివచ్చెనేని వపనముజేయించు కొనవలయును. ఉపనయనము కాని వారు మరణించినప్పుడు వపన మక్కరలేదు. తండ్రి లేనివారై వయస్సు చేతనుగాని సంబంధము చేతనుగాని చిన్నవారైన జ్ఞాతులు దహనానం తరము వపనమును జేయించు కొనవలయును. ఆప్రకారముగానే కల్ప కారికయు దహనానంతరము చిన్నవారగు జ్ఞాతులు వపనము జేయించు కొనవలయునని చెప్పినది. సన్నిధానమరణమునందు జ్ఞాతులందరును వప నము జేయించు కొనవలయును. సన్నిధానమందు లేనియెడల వపన మక్క రలేదు. కర్మను జేయువాఁడు పెద్దవాఁడైనను వపనము జేయించు కొనని యెడల వానికి నాశౌచము ఎప్పుడును విడువదు. కాఁబట్టి పెద్దవయస్సు

గలవాడు మృతినొందినప్పుడు కర్మను జేయువాడు దహనమునకు పూర్వమున గాని యనంతరమున. గాని వపనమును జేయించుకొనక దహనము జేసినేని నిష్ఫలమగును. తాను నరకము నొందును. కాఁబట్టి పెద్దవారు మృతినొందినప్పుడు చిన్నవారగు జ్ఞాతులకు సన్నిధానమరణమునందు వపనమావశ్యకము. మహాగురువులయొక్క మరణమునందు గురువైనప్పటికి దహనము జేయువానికి వపనము కలదు. పెద్దవాడు మృతినొందినప్పుడు జ్ఞాతులలో నేడుతరములకు లోపుగాను చిన్నవయస్సు గలవారలు పదియవదినమునందు కర్తతో గూడ వపనము జేయించుకొనవలయును జ్ఞాతులకు రాత్రియందు వపనము లేదు. మరునాఁ డుదయంబున జేయించుకొనవలయును కనిష్ఠులయొక్క మరణమునందును కర్మ జేయువానికి వపనము శ్రుతులయందు జెప్పఁబడెను. ఉపనయనము కానివాని మరణమునందు కర్మ జేయువానికిని వపనము లేదు. తల్లిదండ్రులు, అన్న, ఆచార్యుడు, భార్య తండ్రి, వీరలుగాక యితరుల మరణమును గురించి గర్భిణీపతి వపనము జేయించుకొనినయెడల బ్రహ్మహత్యతో సమానమగు పాపము నొందును. మఱియు గర్భిణీపతియైనను మాతామహుఁడు మొదలగు మఱికొందరియొక్క మరణమునందు వపనము విధింపఁబడి యున్నది. ఆవిషయము పైనవ్రాయఁబడెను గాన నిచ్చట తిరిగి వ్రాయ లేదు. గర్భిణీపతి శవమును మోయగూడ దనియు పర్వతము నెక్కగూడ దనియు పుత్త్రునకు నుపనయనము జేయగూడదనియు జెప్పి పెద్దవారి మరణమునందు పదిదినముల పర్యంతము జ్ఞాతులతోగూడ భుజించి పదియవదినమునందు వపనమును జేయించుకొనఁదగునని మఱియొకరు చెప్పిరి పుత్త్రుడు లేనిపక్షమును మనుమడు అతను లేనియెడల మునిమనుమడు అతడును లేనియెడల కుమార్తె కుమారుడుగాని కర్మను ప్రారంభింపబోవు సమయంబున గ్రామములో గాని యూరుబైటను గాని వపనము జేయించుకొని శ్మశ్రునఖలోమములను తీయించుకొని స్నానము జేసి శాస్త్రప్రకారముగా కర్మను జేయవలయుననెడిమత మాశ్వలాయన విషయము. ఈప్రకారము స్మృతులయందు భిన్నాభిప్రాయములు కలవు గాన దహనమునకు పూర్వమందుగాని పరమందుగాని వారివారి యాచారాను సారముగా వపనము జేయించు కొనవలయును. ఇట్లు శాస్త్రనిర్ణయమువలన కర్త స్నానము జేసి, సంకల్పము జేసి తండ్రియొక్క గోత్రనామములను జెప్పి ప్రేతకు ప్రథమసంస్కారమును జేయుటకుగాను నాకు యోగ్యత కలిగె.

నిమిత్తమై వపనముజేయించుకొనవలయును. కాఁబట్టి నాచే సమర్పింపఁబడిన దక్షిణను తీసికొని యనుజ్ఞ నివ్వవలనని చెప్పి కొంతదక్షిణను సభవారికి నివ్వవలయును. అనంతర మాదక్షిణను తీసికొని సభ్యులు వపనమునకు ననుజ్ఞనివ్వగా కర్త వపనము జేయించుకొని స్నానముజేసి ప్రథమదినమునందు దహనాదిక్రియలనుజేసి చారెడుబియ్యములో నువ్వులు పెసరపప్పు కలిపి వండి ఆయన్నమును పిండముగా వేయవలయును; యథాసంభవముగా శాకమూలఫలాదుల నుంచవలయును. శాకాదిద్రవ్యములు వాయసపిండములం దుంచవలయును. మొదటిదినమునందు నేద్రవ్యము నుపయోగింతురో ఆద్రవ్యమునే పదిదినముల పర్యంతము నుపయోగించ వలెనని తాత్పర్యము.

శిలాలక్షణము.

౯—తా. అనంతరము శిలాప్రతిష్ఠ జేయవలెను. ఆశిల నాలు గంగుళములు పొడవుకలిగి యుండవలయును. మిక్కిలి పొడవుగాను మిక్కిలి పొట్టిగాను పగిలినదిగాను నుండగూడదు. మఱియు నెఱ్ఱనివర్ణము తెల్లనివర్ణము గల శిల శ్రేష్ఠంబైనది. అనేక రంగులు గలదియు నల్లనివర్ణము గలదియు నగు శిల నుపయోగింపఁ గూడదు మఱియు పచ్చియు శిరికాయప్రమాణముగ లావుగా నుండవలయును గాని యంతకుమించియు నంతకు తక్కువగా నుండగూడదని బుధులుచెప్పిరని తాత్పర్యము.

శిలాస్థాపనము.

౨౦—తా. పూర్వము జెప్పఁబడిన శాస్త్రోక్తప్రకారమగు శిలను దెచ్చి కేశవాది పంద్రెండు నామములచే స్నానముజేయించి దర్భలను జుట్టి శుభ్రమగు ప్రదేశమునందు కొంచెము పల్లముజేసి యచ్చట దక్షిణాగ్రములుగా దర్భలను బఱచి వానిమీద శిలనుంచి ప్రాణాయామము జేసి తండ్రియొక్క గోత్రనామములను జెప్పి ప్రేతకు దహనమువలన కలిగిన తాపము, దాహము, ఆకలి మొదలగునవి పోవుకొఱకు వస్త్రోదక తిలోదక పిండ ప్రదానములను జేయునిమిత్తము శిలాస్థాపనము జేయుచున్నానని సంకల్పముజేసి శిలాప్రతిష్ఠజేసి ఆవాహనాది షోడశోపచార పూజను జేయవలెను. పురుషులకు పుంలింగములతోను స్త్రీలకు స్త్రీలింగములతో నావాహనము జేయవలెను. అనంతరము మృత్తికా స్నానవస్త్రోదక తిలోదకముల నివ్వవలయును. ఈవిధముగానే జ్ఞాతులును స్నానముజేసి ప్రాచీనావీతులై దక్షిణాభిముఖులై ... ప్రేతకు తాపతృష్ణాదుల

నివృత్తికొఱకు మృత్తికాస్నాన వస్త్రోదక తిలోదకాదులను జరుపవలయును. "ధాతాపురాతు" అనేమంత్రమును జెప్పి యొకసారి నీటిలో మునిగి శిలవద్దకు వచ్చి వస్త్రమును మూడుమడతలు వేసి ప్రేతయొక్క గోత్రనామములఁ జెప్పి తాపనివృత్తి నిమిత్తమై శిలమీద నీరుపిండవలయును. ఈప్రకారము ముందుగా మూడుసారులు జేసి పిమ్మట తిలోదకములను విడువ వలయును. ఆవిధముగానే స్మృతియు జెప్పెను. ఇట్లు పదిదినముల పర్యంతము తిలోదకమును విడుచునప్పుడు ఎడమ మోకాలును వంచి నువ్వులను దర్భలను గ్రహించి తండ్రియొక్క గోత్రనామముల నుచ్చరించి దాహ నివృత్తికొఱకు తిలోదకములను ఒకసారి మంత్రముజెప్పి యూరికే రెండు సారులును విడువవలయును ఇట్లు ముమ్మారు విడువవలెను. స్త్రీలు విడవనక్కరలేదు. జ్ఞాతులు వారివారికి గల సంబంధములతో గోత్రనామములను జెప్పి విడువవలయును. మఱియు జ్ఞాతు లొకసారి వాసోదకము ముమ్మారు తిలోదకములను స్త్రీలును మంత్రవర్జితముగాను శిలమీద విడువవలయునని మరియొకరు చెప్పిరి. తిలోదకము దినమునకు నొక్కొక్కటి వృద్ధిగా విడువవలెను. తాపనివృత్తి నిమిత్తము స్నానము దాహోపశాంతికొఱకు తిలోదకమును ఆకలిపోవుటకొఱకు పిండము నుంచవలయును. ఇట్లుప్రతిదినము నొక్కొక్కటి వృద్ధిగా పదిదినముల పర్యంతము తిలోదకములను విడుచు విధాన మెట్లనగా, మొదటి దినమున మూడు, రెండవదినమున నాలుగు, మూడవదినంబున అయిదు, నాల్గవ దినంబున ఆఱు, అయిదవదినంబున ఏడు, ఆరవదినంబున నెనిమిది, యేడవ దినంబున తొమ్మిది, యెనిమిదవదినంబున పది, తొమ్మిదవదినంబున పదునొకండు, పదియవదినంబున పండ్రెండు, ఈప్రకారము తిలాంజలులను విడువవలయును. ప్రేతకు నుపకారమగుటచే ఆశౌచదినములగు పదిదినముల పర్యంతము ఆవృత్తిగా తిలాంజలులను విడువవలెను. పదియవపిండము సమాప్తియగువఱకు నేకోత్తరవృద్ధిగా తిలాంజలులను శిలమీద విడువవలయునని ప్రచేతసుడు చెప్పెను. మఱియు మొదటి దినంబున నొకటియు రెండవదినంబున రెండును ఈప్రకారము అంజలు పదిదినముల పర్యంతము దినసంఖ్య ప్రకారము విడువగా 55 తిలాంజలులగును ఇదియొకపక్షము. మఱియొకపక్ష మెట్లనగా, మొదటి దినంబున మూడు, రెండవదినంబున నాలుగును. ఈప్రకార మేకోత్తరవృద్ధిగా పదిదినముల పర్యంతమ్మును విడువగా 75 అగును. 100 అంజలుల నివ్వవలయునని మఱి

యొక పక్షముకలదు. అదియెట్లనగా, పదిదినములయందును పదిపిండము లను వేయుచున్నారు గాను పిండమునకు దశావృత్తివిధంబున పదిదినం బుల యందును పదిపదులు నూఱు, తిలాంజలుల నివ్వవలయుననిరి. దిన మునకు నొక్కటిచొప్పున పదిదినంబులకును పదితిలాంజలులేగాని యా వృత్తిలేదని మరికొందరనిరి. క్షత్రియ వైశ్య శూద్ర జాతులకును వారి వారి యాశౌచ దినసంఖ్యాను సారముగా నాశౌచము వెళ్లినంతవరకు నేకోత్తరవృద్ధిగా తిలాంజలులను విడువవలయును. నాలుగు వర్ణముల వారును పిండమును దినమునకు నొక్కొక్కటియే వేయవలయును. ఇట్లు చెప్పుటవలన=55=75=100=అని మూడుపక్షములు నిర్ణయింపఁబడినవిగాన వీనిలో మొదటినుండియు నేపక్షము నాశ్రయించి యుందురో ఆవిధము గానే జరుపవలయును. గృహద్వారమునందు గాని శ్మశానమునందుగాని తీర్థప్రదేశము నందుగాని దేవతాగృహ సమీపమునందుగాని తాను పిం డమును వేయదలచిన ప్రదేశమునందు సమస్తక్రియలను పూర్తిజేయవల యుననియు యున్నది. కాఁబట్టి ముందు దక్షిణాగ్రములుగా దర్భలను బఱచి తిలసహితముగా జలమును విడిచి తిలమిశ్రితముగా వండిన యన్న మును పిండముగానుంచి పిండముపైన తిరిగి తిలోదకమును విడువవల యును. తిలోదకమును విడుచునప్పుడెల్లను పిత్రుతీర్థముగా విడువవల యును. పిమ్మట నన్నమును వండిన పాత్రను కడిగిన జలమును, పిండము చుట్టు మూడుసారులు నపసవ్యముగానుంచి గంధమాలికలు మొదలగు నవియు నుంచవలయును. అనంతరము కర్తగాని యన్యులుగాని స్త్రీగాని స్నానముజేసిన వీనభాండమునందు పెసరపప్పు నువ్వులను కలిపి వండిన యన్నము నభిఘరించి శిలనుంచినగర్త సమీపమునందు గోమయముతో నలికి దక్షిణాగ్రములుగా దర్భనుబఱచి వెలగుపండు ప్రమాణముగల పిండమునుజేసి దక్షిణముఖముగా కూర్చుండి యెడమమోకాలును వంచి దర్భపైన తిలోదకములను విడిచి తండ్రియొక్క గోత్రనామములను జెప్పి పిత్రుతీర్థవిధిగా పిండమునుంచి తిరిగి పిండముపైన తిలోదకమును విడువ వలయును. ఇట్లుచేసిన పిమ్మట తిరిగి సంకల్పముచేసి తండ్రినిగుఱించి నాచే జేయఁబడిన మృత్తికాస్నాన వాసోదక తిలోదక పిండప్రదానములచేత ప్రేతస్వరూపుడైన నాతండ్రికి దహనజనితమైన తాపతృష్ణాక్షుత్తులు శమించుగాక యని పలికి యాపిండమును కాకులు గద్దలు మొదలగునవి తినుపర్యంతము నిరీక్షించ వలయునుగాని, వానిని తొలగకొట్టకూడదు.

పితరులు కాకాదిపక్షి స్వరూపముగా తిరుగుచుందురని శృతిచెప్పియున్నది. పిండమును కాకులు మొదలగునవి ముట్టని పక్షమునందు జలములో కలుపవలయును. పిమ్మట యమసూక్తమును పఠించుచు నగ్నిహోత్రమునందుగాని జలమునందుగాని వాయసబలినివేసి స్నానముజేసి యింటికి రావలయును. ఇట్లు పదిదినంబులు చేయవలెను. ఇట్లు చేయువిధానము మూలమువలన తెలిసికొనవలయును.

—{ రాత్రియందు తిలోదక పిండదానాదులను జేయగూడదనే విషయము. }—

౭౧—తా. రాత్రియందు సంధ్యాకాలములయందు తిలోదక పిండప్రదాన నవశ్రాద్ధాదులు చేయఁగూడదు. ఆలాచేసినయెడల నిష్ఫలము లగును. ఆప్రకారముగానే వ్యాసుఁడును మధ్యాహ్నకాలమునందే జేయవలయు ననియు పదిదినముల పర్యంతము జేయవలయు ననెను. సంస్కారము జేసినవాడే ప్రేతకు బంధువు కాఁబట్టి అట్టి సంస్కర్త పదిదినములయందును పూర్వాహ్ణమందుగాని యపరాహ్ణమందుగాని తిలోదకాదులను జరుపవలయును. మొదటిదినంబున కర్మను ప్రారంభించునప్పుడే ప్రదేశమో, యేశిలయో, పిండమునకు నుపయోగించి నదేద్రవ్యమో, యెవరు ప్రారంభించిరో, యేపాత్రతో పచనముజేముబడెనో, పదిదినములపర్యంతము నియామకముగా నవియే యుండవలయును. అందుకు వ్యత్యాసము కలిగినయెడల గడచినదినములందు జేసిన తిలోదకాది క్రియలను తిరిగి చేయవలెను ప్రాజాపత్యత్రయ ప్రాయశ్చిత్తమును జేసి తిరిగి జరుపవలయునని స్మృతియందును జెప్పఁబడెను. దేశకాలాదులవలన మార్పుకలిగినప్పుడు అపకృష్యము జేసి సమాప్తి జేసి యాశిలను మఱియొక ప్రదేశమునకు తీసికొనివెళ్లి తిరిగి ప్రారంభించి చేయవలెను. స్థలద్రవ్యాదులను శునకాదులచే స్పృశింపఁ బడకుండునట్లు జేయవలయును. అట్లు కలిగిన మూడుప్రాజాపత్య ప్రాయశ్చిత్తములు స్మృతులయందు జెప్పఁబడెను. అనంతరము పుత్త్రులు జ్ఞాతులు మొదలగువారు స్నానముజేసి తడివస్త్రములతో నింటికివెళ్లి యచ్చట స్త్రీలు చెప్పునట్టి యాచారపద్ధతినిగాని స్మృతులయందు జెప్పఁబడిన క్రియలనుగాని జరుపవలయును. తలవాకిలియందు పూర్వము జెప్పఁబడినట్టి శిల నుంచి దానియందు నందరు నుదకమును విడువవలయునని కొందరనిరి; ఆపక్షమునందును పదిదినముల పర్యంత మేకోత్తరవృద్ధిగానే చేయవలయు ననిరి. అనంతరము గృహ

ద్వారమునందుండి కర్త యితరులకు నమస్కారము జేసి వారిని పంపించి తాను జ్ఞాతులు నక్కడనే కొంచెము ఘృతప్రాశనము జేసి వేపచిగుళ్లను కొఱికి గోమయము సువర్ణము అగ్ని, ఆవాలు, యవలు, గరికె, మొద లగువానిని స్పృశించి గృహద్వారంబున పెద్దశిల నొకదానినుంచి దాని తాకుచు ముందుగా చిన్నవారును పిమ్మట పెద్దవారును క్రమముగా గృహములోనికి వెళ్లి తిరిగి బయటికి వచ్చునప్పుడు పెద్దవారు ముందు గాను చిన్నవారు వెనుకగానుండి రావలయును. మరణస్థలంబున దీపా రాధనజేయించి అచ్చట నావుదూడను సంచరింపజేసి అచ్చటికివెళ్లి యవో దకమును జల్లి యినుపనుక్కనుపాతి, నాగృహమునందు చుట్టుప్రక్క లను మేలుకలుగుగాక యని, బియ్యమునుచల్లి యనంతరము నగ్నప్రచ్ఛా దన శ్రాద్ధమును, జేయవలయును. అనంతరము రాయినిగాని అగ్నిహోత్ర మునుగాని గోమయముగాని అక్షతలనుగాని నూనెనుగాని యుదకమును గాని స్పృశించి గృహములోనికి వెళ్లవలయును. రెండు మట్టిముంతలను దెచ్చి వానిలో నొకదానియందు జలమును రెండవదానియందును క్షీర ములనుంచి యిచ్చట స్నానము జేయుమని జలసహితమైన పాత్ర నొక వుట్టియందును ఇచ్చట పానము జేయుమని క్షీరసహితమగు పాత్ర నొక వుట్టియందు నుంచవలయును. అనంతరముచేసి దినములయందు నవశ్రాద్ధ ములను మంత్ర రహితముగాను పదునొకండవ దినమునందుమాత్రము సమంత్రకముగాను జేయవలయును. ప్రతిదినమునందు జేయుచున్నట్టి వాసోదక సంఖ్యప్రకారముగా గాని లేక తిలోదక సంఖ్యప్రకారముగా 75-55 గాని శ్రాద్ధములను ఆమద్రవ్యముతో నేకోద్దిష్ట విధానముగా జేయవలయును. మొదటిదినంబున నొక్కసారిగానే జ్ఞాతులందరును భుజింప వలయునని కొందరును పుత్రులు మాత్రమేయని మఱికొందరును చెప్పిరి. ఇట్లు రెండువిధములు కలదు. కాబట్టి పదిదినముల పర్యంతము జ్ఞాతు లతోసహా కర్తలు ఏకకాలమునందు భుజియించి భూమియందే శయనిం చుచు నొకరినొకరు స్పృశింపకుండుటయు మొదలగు బ్రహ్మచర్యమును జరుపుకొనవలయును. నాల్గవ దినము ప్రశస్తముగా నుండెనేని యాదిన మునందు అస్థిసంచయనమును జేయవలయును. అస్థి సంచయనముగాక పూర్వము జ్ఞాతులును పదిదినముల పర్యంతము పుత్రులు నొకరినొకరు స్పృశింపగూడదు. నాల్గవదినమునందు సంచయనము జేయకపోయినను అదిమొదలు జ్ఞాతులు ఒకరినొకరు తాకవచ్చును. మొదటి రాత్రియందు

నన్నమును వండకూడదు కాఁబట్టి క్రయమునకు తీసికొనిగాని యైనను లేక మఱియొకరు తెచ్చియిచ్చినదైన నగు అన్నమును భుజింపవలయును. కర్త పది దినముల పర్యంతము శాకమును లవణమును వేయనట్టి పదార్థమును భుజింపుచు బ్రహ్మచర్యమును జరుపుకొనవలెను. మృతినొందిన వానిభార్య యామె జీవితకాలమంతయు భక్ష్యపాయసాదులను వర్జించి భూమియందే శయనించుచు బ్రహ్మచర్యవ్రతమును జరుపుకొనవలయును. ఇట్టి బ్రహ్మచర్యము యౌవనమునం దుండువారికేగాని బాలురకు వృద్ధులకు నక్కఱలేదు. తల్లిదండ్రులును గురువును మృతినొందిన దినమునందు కుమారుఁడుపవాసము జేయవలయును. తల్లిదండ్రులు గతించినయెడల సంవత్సర పర్యంతము క్షౌరము, అభ్యంగనము, తాంబూలము, స్త్రీసంభోగము, విడువవలయును. అన్నమొదలగువారు గతించిన తాను కర్మ జేసినప్పుడు ఆఱుమాసముల పర్యంతము పైనజెప్పఁబడిన విషయములను విడువవలయును.

## ఉదకదాన నిర్ణయము.

౭౩—తా. జ్ఞాతులు కానివారును ఒకప్పుడు తిలోదకములను విడువవలసి యున్నది. అదియేవిధమనగా, మాతామహుఁడు వానిభార్య ఆచార్యుడు వివాహమైన కుమార్తె తోబుట్టువ మేనల్లుడు మామ బుత్విక్కు మొదలగువారు గతించినప్పుడు జ్ఞాతులువలెనే ముఖ్యముగా నుదకదానము జేయవలయును. మిత్రులకు వారికి జేయవలయునని యభిలాష కలిగెనేని విడువవచ్చును తిలోదకదానము మిత్రులవిషయమై చేయకపోయినను లోపములేదు. జ్ఞాతులు దగ్గిరలేనిపక్షమునందు పదియవ దినము నన్ని తిలోదకములను విడువవలయును. త్రిరాత్రాశౌచపక్షమునందు తత్కాలమునందే యస్థిసంచయనము జేయవలయును. మొదటి దినమునందు 21 తిలాంజలులును రెండవదినమునందు నాప్రకారమే 21 యు మూడవదినమునందు 13 జలాంజలులును, విడిచి నాల్గవదినమునందు శ్రాద్ధ మాచరించవలయును; ఇది 55 జలాంజలులపక్షము 75 జలాంజలులపక్ష మెట్లనఁగా, మొదటిదినమునందు 21 రెండవదినమునందు 33 మూడవ దినమునందు 21 మొత్తము 75 అగును. నాల్గవదినమునందు శ్రాద్ధ మాచరించవలయును. ఈచెప్పఁబడిన రెండువిధములును వృద్ధివిషయము. మఱియు మొదటిదినమునందు కర్త మూడు తిలోదకాంజలులును రెండవదినమునందు 4 అంజలులును మూడవదినమునందు 3 అంజలులును

మొత్తము మూడుదినములయందు 10 తిలోదకాంజలులను విడిచి నాల్గవ దినమునందు శ్రాద్ధమును జేయవలయును. ఇదియొకవిధము, మఱియు మొదటిదినమునందు 30 జలాంజలులును రెండవదినమునందు 40 జలాంజలులును మూడవదినమునందు 30 జలాంజలులు నను పక్షమునందు మూడుదినములయందు 100 జలాంజలులను విడిచి నాల్గవదినమునందు శ్రాద్ధ మాచరింప వలయును. మొదటిదినమునం దొక్క పిండమును రెండవదినమునందు నాలుగు పిండములును మూడవదినమునం దైదు పిండములును నుంచవలయును. కొందఱు మొదటిదినమునందు మూడు పిండములును, రెండవదినమునందు నాలుగుపిండములును, మూడవదినమునందు మూడుపిండముల నుంచవలయునని, చెప్పిరి. మొదటిదినమునం దొకటి నవశ్రాద్ధమును రెండవదినమునందు రెండును మూడవదినమునందు మూడును నవశ్రాద్ధములను జేయవలయును. మఱియు శ్రాద్ధదినమునం దొక నవశ్రాద్ధమనిరి. అది యితర శాఖ విషయము. శివస్వామి నవశ్రాద్ధములను గుఱించి వివరించిన విషయములో ఆశ్వలాయన శాఖావలంబకములు 5 నవశ్రాద్ధములను ఆపస్తంబ మతానుసారులు 6 నవశ్రాద్ధములు నాచరింతురని చెప్పెను. ఆప్రకారమే యితర స్మృతులయందును మొదటి రెండుదినములయందు రెండు రెండును మూడవదినమునం దొక్కటియు నాచరింపవలయునని చెప్పఁబడెను. దైవవశముచే మొదటిదినమునందు శ్రాద్ధాదులను జేయుట సంభవించనిపక్షమునందు మూడవదినమునందు జేయవలయును. తిలోదక పిండదానాదుల గుఱించియు నిట్లే తెలిసికొనవలయును. ఈవిషయమంతయు త్రిరాత్రాపక్షము దైవయత్నముచే గాని మనుష్యయత్నముచే గాని సకాలంబున శ్రాద్ధాదుల నేదియైనను జేయుటకు వీలుకలుగని పక్షమునందు నవియన్నియు పదునొకండవ దినమునందుఁ జేయవలయును. నవశ్రాద్ధము మాసికము ఉదకుంభము మొదలగునవి యేవియైనను ఆయాయా కాలములయందు జేయుటకు దైవవశాది కారణములవలన వీలులేనియెడల పూర్వమునందాపబడిన శ్రాద్ధాదుల నుత్తరమునందు జేయఁబడు వానితో గలిపి జేయవలయునని పెద్దలు చెప్పిరని తాత్పర్యము.

బ్రహ్మచారులకు తిలోదక నిషేధము.

౭౩—తా. జ్ఞాతులు మరణించినప్పుడు బ్రహ్మచారులకును నాశౌచము లేదు. కాబట్టి జ్ఞాతులను గుఱించి బ్రహ్మచారులు తిలోదకముల

నివ్వఁగూడదు. తల్లిదండ్రులు మరణించినప్పుడు బ్రహ్మచారి యైనను కుమారునకు నాశౌచము కలదు. అందువలన తల్లిదండ్రులకు మాత్రము తిలోదకాదుల నివ్వదగును. తల్లిదండ్రులకు తిలోదక పిండదానాదుల జేయునంతవఱకు నాశౌచము విడువదు కాఁబట్టి అవి యాచరించి స్నానము జేసిన శుద్ధుడగును. బ్రహ్మచారి వివాహమగువరకు జ్ఞాతులను గుఱించి తిలోదకముఁల నివ్వఁగూడదనియు తల్లిదండ్రులకు సోదరులకు నివ్వవచ్చుననియు నిశ్చయింపఁబడెను గాన వీరికంటె నితరులకు దాహాది సంస్కారములను జేసినయెడల తిరిగి యుపనయనమును జేసికొనవలయును ఉపాధ్యాయునకు నగ్నిసంస్కారము జేయవచ్చునని కొందఱు విద్వాంసులు చెప్పిరి. యితరులకు సంస్కారాది క్రియలను జేసినయెడల పాతిత్వదోషము కలిగి బహిష్కార్యుడగును కాఁబట్టి బ్రహ్మచారి యితరులకు దహనాది సంస్కారములను జేయఁగూడదని తాత్పర్యము.

జీవపితరుడు తిలోదకములను విడువగూడదనే విషయము.

౭౮—తా. తల్లిదండ్రులు జీవించియుండు నప్పుడు ఇతరులకు తిలోదకముల నివ్వఁకూడదు. తిలోదకములను విడుచుట జ్ఞాతులతో గూడియుండుట మొదలగునవి జేయఁగూడదు. తల్లిదండ్రులు జీవించి యుండగా అన్నలు మృతినొందినప్పుడు ప్రదక్షిణాది సంగాహమును మృత్తికాస్నానము తిలోదక వాసోదకాదులును జేయవచ్చును గాని యితరులను గుఱించి చేయఁగూడదు ఆహితాగ్నికి యథావిధిగా దహనాది సంస్కారములు చేయఁబడనప్పుడు వానిని గుఱించిన యాశౌచమితరులకు లేదు. దహనమే ప్రధానముగాని మరణము ప్రధానముకాదని తాత్పర్యము.

తండ్రిజీవించియుండగా సోదరులు గతించినప్పుడు జేయువిధానము.

౭౯—తా. తండ్రి జీవించియుండగా జ్యేష్ఠభ్రాతలుగాని కనిష్ఠభ్రాతలుగాని వారిభార్యలుగాని మృతినొందినప్పుడు వారికి నౌర్ధ్వదైహికకృత్యములను జేయఁగూడదు. తల్లిదండ్రుల నాయుర్వృద్ధిని గోరువాడు సోదర మరణమునందు ప్రేతకృత్యమును జేయఁగూడదని శాస్త్రములయందు నిషేధింపఁబడినదని తెలిసికొనవలయునని తాత్పర్యము.

నగ్నప్రచ్ఛాదన విషయము.

౮౦—తా. రెండుమానెకలు ఒక ఆఢకమని చెప్పఁబడును. నగ్నప్రచ్ఛాదన శ్రాద్ధవిషయమై యామద్రవ్యమును నాలుగు రెట్లుగా నివ్వ

వలయును. నగ్నప్రచ్ఛాదనము దహనదినమునం దియ్యవలయును ఈ నగ్నప్రచ్ఛాదన శ్రాద్ధమునందు విశేషముగా పదార్థముల నివ్వవలయును గాన యెనిమిది కుంచముల బియ్యమును నాలుగుకుంచముల గోధుమలను రెండు రెండు కుంచముల మినుములు పెసలును కంచుపాత్రను వస్త్రమును శాకాదులును ఇనుపముక్కను ప్రత్తిని ఘృతపాత్రను కంబళము నివ్వవలయును ఇట్లు జేసినయెడల ప్రేతత్వము విడువఁబడును. మరియు గోబిలుడిట్లు చెప్పెను. దహనము జేసిన పిమ్మట స్నానము జేసి యొకఘటము నిండ బియ్యమునుబోసి నూతనవస్త్రముచే జుట్టి కంచుపాత్రలో నెయ్యి బోసి దానిని యాఘటమునందుంచి తనశక్తికొలది బంగారమునుంచి భగవంతుని మనస్సుచే ధ్యానింపుచు దరిద్రుడు సత్కులప్రసూతుడు శ్రోత్రియుఁడు తపస్సంపన్నుడునగు బ్రాహ్మణుని పూజించి యాతండుల పూర్ణఘటమును దానమిచ్చి సంతోషింపజేసి యాబ్రాహ్మణుని పంపవలయును. మఱియు వ్యాసుడిట్లు చెప్పెను. వస్త్రమును తండుల సహితమగు మృత్పాత్రను దీపసహితమగు కంచుపాత్రను దహనానంతర మియ్యవలయును. ఇదియే నగ్నప్రచ్ఛాదన శ్రాద్ధమనిరి ధరించునిమిత్తము వస్త్రమును, 5 కుంచముల బియ్యమును, ఉదకుంభమును, దీపముతోగూడిన లోహపాత్రను, పది నవటాకులయెత్తుగల కంచుపాత్రను, దానిలో నాల్గవవంతు బంగారము, బియ్యములో సగముగాని నాల్గవవంతుగాని నెయ్యి, బియ్యము పరిమితిగల ఉప్పు, నువ్వులు, పెసలు, మొదలగు వస్తువుల నివ్వవలయును. ఈలవణాది ద్రవ్యములను ఘృతముతో సమానముగానైన నివ్వవచ్చును. పదిపలముల ప్రత్తిని తగిన దక్షిణలను అలంకారములను, బంగారమునకంటె రెండురెట్లు స్వచ్ఛమగు వెండి నియ్యవలయును. ఇట్లు యిచ్చుటకు శక్తికలిగినయెడల చెప్పిన ప్రకారము నివ్వవలయును. లేక తనశక్తి ననుసరించియైనను సంవత్సరపర్యంతము దారిలో ననుభవించుకొఱకు నివ్వవలయును. ఇట్లు చేసినయెడల ప్రేతత్వము విడువఁబడును. ఇదియే నగ్నప్రచ్ఛాదన శ్రాద్ధమని శాస్త్రవేత్తలు చెప్పిరని తాత్పర్యము.

### నగ్నప్రచ్ఛాదన శ్రాద్ధప్రయోగము.

౭౭—కర్త ప్రాణాయామము జేసి దేశకాలములను కీర్తించి దిగంబరత్వము పోవుటకొఱకు నేకోద్దిష్టవిధానముగా ఆమద్రవ్యముతో నగ్నప్రచ్ఛాదనశ్రాద్ధమును మొదటిదినమునందు సంకల్పము జేసి శిష్టాచారముగల బ్రాహ్మణుని పిలిచి ... శ్లోకమును జెప్పి యా

బ్రాహ్మణునకు నావాహనపాదప్రక్షాళన అర్ఘ్యదాన పూజాదులనన్నియు చేయవలయును. పాదప్రక్షాళనకు వర్తులాకారముగా నొకమండలమును జేయవలయును. బ్రాహ్మణునకు నెడమప్రక్క నాసనము నుంచవలయును. అర్ఘ్యపాత్రనొక్కటియే యుంచవలెను. దానిలో గంధపుష్ప అక్షతోద కాదులనుంచి ఆయుదకమును తూష్ణీభూతముగానే బ్రాహ్మణుని చేతిలో విడిచి అర్ఘ్యపాత్రను చించివేయవలయును. కట్టుకొనుటకు పైన వేసుకొనుటకు రెండు వస్త్రముల నివ్వవలయును. అనంతరము నివ్వదగిన పదార్థములనన్నియు తూష్ణీభూతముగా అనగా మంత్రరహితముగా నచ్చటనుంచి ప్రేత తృప్తికొఱకు నుదకుంభ దక్షిణ తాంబూలాదులతో గూడ నివ్వవలయును. అనంతరము పిండప్రదానము నిమిత్తము సంకల్పము జేసి బ్రాహ్మణునకు ముందు గోమయముచే నలికి దక్షిణాగ్రములుగా దర్భలను పరచి తిలోదకమును విడిచి తిలసహితమగు బియ్యమును జలముతో కలిపి తండ్రియొక్క గోత్రనామములను జెప్పి యాతిలతండులమును పిండముగా వేసి తిరిగి తిలోదకమును విడిచి యాపిండప్రదానముచే ప్రేతకు తృప్తియగుగాక యని పలుకవలయును. వండబడిన పదార్థముగాని వండబడని పదార్థమునుగాని దేనిని బ్రాహ్మణునకు నిచ్చెదరో ఆపదార్థముతోనే అగ్నౌకరణము పిండప్రదానమును జేయవలయును. పిండప్రదానముజేయక శ్రాద్ధమును మాత్ర మాచరించినయెడల వాని సంతతి సంపదయు నశించునని చెప్పఁబడెను కాఁబట్టి శ్రాద్ధ మాచరించిన పిమ్మట తప్పకుండా పిండప్రదానము జేయవలెను. అనంతరము బ్రాహ్మణునకు హస్తశుద్ధిజేసి తండ్రినిగుఱించి చేయఁబడిన యీశ్రాద్ధముచే తృప్తినొందవలయునని యుపవీతముజేసికొని కర్త పలుకగా నాబ్రాహ్మణుడును తృప్తినొంది తిననని ప్రతివచన మియ్యవలయును. పిండమును జలములోనుంచి యాచమానమును జేయవలయును. ఈనగ్నప్రచ్ఛాదనమునకు శ్రాద్ధవిధానముగా జేయుట యున్నదని కొందరును లేదని కొందరునుడివిరి. ఇట్లు చేయుటకు శక్తిలేనివాడు ఒకవస్త్రమును, తండులసహితముగా పాత్రనైన నివ్వవలె ననిరి. ఈచేయవలసిన విధానము మూలమువలన తెలియవలయునని తాత్పర్యము.

### నవశ్రాద్ధవిధానము.

౭౮—తా. అనంతరము ఆహితాగ్ని కానివానికి మరణించినది మొదలు జేసి దివసములయందు నవశ్రాద్ధములను జేయవలయును. 1-8-5-7

9-11 ఈ బేసిసంఖ్యగల దినములయందు నవశ్రాద్ధమును జేయవలయును. ఆశ్వలాయనశాఖవారు 5 నవశ్రాద్ధము లనియు ఆపస్తంబశాఖీయులు 6 నవశ్రాద్ధములనియు నితరశాఖీయులు 5 గాని 6 గాని చేయతగుననియు చెప్పిరి. కొందరు అయిదే నవశ్రాద్ధములుగాని ఆరులేవనియు తొమ్మిదవ దినమునందు జేయవలసినది తత్కాలమందు జేయుటకు వీలుగాని పక్షము నందు పదునొకండవదినమునందు జేయవలయుననిరి. మొదటినుండియు క్రమముగా జేయుచుండెడి వానికి శుక్రవారాది నిషేధనము లేదు. నగ్న ప్రచ్ఛాదనము నవశ్రాద్ధములు పదిదినములు లోపుగా జేయవలసినవిగాన మంత్రవర్జితముగా క్రియలతోనే జరిగించవలయు ననియు పదిదినములు దాటినపిమ్మట జేయఁబడు శ్రాద్ధములు సమంత్రకముగానే చేయవచ్చు ననిరి. ఇందులో మఱియొక విశేషము కలదు. దహనకృత్యము అయిదవ దినమునందుగాని యేడవదినమునందు గాని జరిగినయెడల నంతకుముందు నుండియు, చేయవలసిన నవశ్రాద్ధములన్నియు నాదినమునందే చేయవల యును. అన్నియు నొక్కదినమునందు జేయుటకు శక్తిలేనియెడల మిగి లినవి బేసిదినములయందు జేయవలయును గాని సరిదినములలో జేయఁ గూడదు. నవశ్రాద్ధములను పూర్తిజేయక దశాహకృత్యమును పూర్తి చేసినయెడల, తిరిగి దహనాదివిధులను జేయవలయునని త్రికాండిచెప్పెను. నవశ్రాద్ధములన్నియు ప్రేతకు తృప్తినిజేయును. ఆద్యశ్రాద్ధము మొదలు షోడశశ్రాద్ధములు ప్రేతస్వరూపమును విడిపించును. సపిండీకరణశ్రాద్ధము పితృదేవతా స్వరూపమును కలుగజేయును. కాఁబట్టి కుమారుఁడు శాస్త్ర ప్రకారముగా నవశ్రాద్ధములు మొదలగు నన్నిశ్రాద్ధములను జేయ వలయునని మునీశ్వరులు చెప్పిరని తాత్పర్యము.

నవశ్రాద్ధప్రయోగము.

౭౯—తా. సంకల్పముజేసి ప్రేతస్వరూపుఁడగు తండ్రియొక్క-గోత్రనామములనుజెప్పి ప్రేతతృప్తి నిమిత్తము ప్రథమాహ్నిక నవశ్రాద్ధ ము మొదలాఋ నవశ్రాద్ధముల నాయాదినములయం దాచరింపవలయును. ఆమద్రవ్యముతో నేకోద్దిష్టవిధానముగా జేయవలయునుగాన నగ్నప్రచ్ఛా దన శ్రాద్ధమువలెనే బ్రాహ్మణ నిమంత్రణము మొదలగు సమస్తక్రియలను మంత్రరహితముగానే జేయవలయును. పిండమును జలములో నుంచు పర్యంతము పూర్వమునవలెనే చేయవలెను. అగ్న్యుత్పత్తివిధాన మెట్లనగా, అగ్నిహోత్రముల నాత్మారోపణముజేసి మృతినొందినయెడల కుమారుఁడు

ప్రేతస్వరూపుఁడగు తండ్రియొక్క కుడిహస్తమును లౌకికాగ్నిసమీపము నందుంచి "ఉపావరోహ జాతవేద" అనుమంత్రమును జెప్పవలయును; ఇట్లు చేసినయెడల నగ్ని యుద్భవించిన దగును. అగ్నుల నాత్మారోపణము జేయక మృతినొందిన వానితోనే సమస్తము నాచరింపవలయును. అగ్నులు అనుగతములైనప్పుడు ప్రేతాధాన విధాన మెట్లనగా, అగ్నినిస్థాపించి ఆజ్యసంస్కారము జేసి పండ్రెండుపర్యాయములు మంత్రరహితముగానే హోమము జేయవలయును. ఆపస్తంబమునియు నాప్రకారమే చెప్పెను. తండ్రి అగ్నిహోత్రములను దీసికొని దూరదేశము వెళ్లియుండగా నింటి యందు తల్లి మృతినొందినను లేక నింటియందు నగ్నిహోత్రములు తల్లి యునుండగా తండ్రి మఱియొకప్రదేశమునకు వెళ్లి యచ్చట తండ్రి మృతి నొందినను కుమారుఁడు అవి వచ్చుపర్యంతము వారికి నౌర్ధ్వదైహిక కృత్యములను జేయఁగూడదు. భార్య అగ్నిరహితురాలై దూరమందుం డగా తండ్రియు నగ్నిరహితుడై మఱియొక ప్రదేశమునందు మృతినొందిన యెడల నౌరసపుత్రుఁడు దగ్గిరనుండెనేని పూర్వమందు జెప్పఁబడిన ప్రకా రము ప్రేతాధానము జేసి దహించవలయును. కుమారుఁడు సమీపమందు లేనప్పు డనంతరము జేయవలయును. తల్లివిషయమందు నాప్రకారమే జేయవలయును. తండ్రి యగ్నిహోత్రములను తీసికొనివెళ్లి దూరదేశమం దుండగా గృహములో నగ్నిరహితురాలై తల్లి మృతినొంది నప్పుడు కుమారుఁడు సమీపమందుండెనేని ప్రేతాధానము జేసి దహించవల యును. భార్యయు పెనిమిటియు నొక్క ప్రదేశమునందే యుండగా కుమారుఁడు సమీపమునందు లేనప్పుడు పెనిమిటి మృతినొందిన భార్య యు భార్యమృతినొందిన పెనిమిటియు ప్రేతాధానము జేసి దహించవల యును. మఱియు కుమారుఁడు దగ్గిర లేనప్పుడు తల్లిదండ్రుల మరణముల యందు లౌకికాగ్నిచేతనే చేయవలయునని మఱికొందరు మునీశ్వరులు చెప్పిరి. వెనుకను మృతినొందిన వానికి నుత్తపనాగ్నిచే జేయవలయునని కొందరనిరి. వెనుక మృతినొందిన భార్యలకును పెనిమిటికి వలెనే జేయ వలయును. యతీశ్వరునిభార్య పెనిమిటికంటె ముందుగానే మృతినొంది నప్పుడు పుత్రుఁడు ఔపాసనాగ్నిచే యథాప్రకారముగా దహనాదులను జేయవలయును. విధవను వానికంటె ముందుగానే భార్యపోయిన వానిని పెండ్లిగాని స్త్రీని యుత్తపనాగ్నిచే దహించవలయును. ఉత్తపనాగ్ని యనఁ గా పిడకెడు దర్భలను చెప్పి దానియం దగ్నినుంచి ప్రజ్వరిల్ల జేసి తిరిగి

దానియందు పిడికెడు దర్భలనుంచి దృఢముగా జేయబడిన యగ్నియుత్తపనాగ్ని యనఁబడును. కపాలపతనమువలన బుట్టినదై పిడికెడు దర్భలను మూఁడు మడతలుపెట్టి దానియం దీయగ్నినుంచి తిరిగి పిడికెడు దర్భలనుంచి మండింపజేయఁబడిన యగ్ని యుత్తపనాగ్ని యని మఱికొందరనిరి.

కపాలాగ్ని నిర్ణయము.

౨౦—తా. బ్రహ్మచారిని కపాలాగ్నిచే దహించవలయుననిరి. కపాలాగ్ని యనఁగా నొకనూతన భాండమును భిన్నముచేసి యందులో నొక తునుకను నిప్పువలె యెఱ్ఱగా నుండునటుల కాల్చి దానిమీఁద ఊక రంపపుపొట్టు మొదలగు స్వల్పమైన వానినుంచి మండించి పిమ్మట పిడకలు మొదలగు వానినుంచి వృద్ధిచేయఁబడిన యగ్నిహోత్రమును కపాలాగ్ని యని చెప్పిరి.

ఇద్దరు భార్యలుగల వానికి నగ్నినిర్ణయము.

౨౧—తా. రెండవవివాహమునందు ఔపాసనాగ్ని పర్యంతము జేయఁబడగా నంతలో కాలవశముచే నొకభార్య మృతినొందిన యెడల నామెను సర్వౌపాసనాగ్నితో దహించి సర్వక్రియలను జేసినపిమ్మట మిగిలిన భార్యతోఁగూడ వివాహ ప్రధానహోమమును జేసి సర్వము పూర్వము వలెనే చేయవలయును. మఱియు రెండవవివాహమును లౌకికాగ్నియందు జేసి శాస్త్రప్రకారము రెండు ఔపాసనాగ్నులకు సంసర్గజేయఁబడగా వారిలో నొకభార్య మృతినొందినప్పుడు ప్రత్యౌపాసనాగ్నిని రెండుగా విభజించి రెండుభాగములయందును “అగ్నయే వివిచయేస్వాహా” అని రెండుహోమములను ప్రత్యేకముగా జేసి దక్షిణభాగమును పెద్దభార్యకు నుత్తరభాగము చిన్నభార్యకు నిశ్చయించి యుంచిన పిమ్మటనే భార్య మృతినొందినప్పు డామెకు నాభాగవహ్నితో దహించవలయును. మఱియు నొకవిశేషము కలదు. ఒకభార్య మృతినొందియుండగా పిమ్మట వెంటనే రెండవభార్యయు మృతినొందినప్పుడు పెనిమిటి తనయగ్నిని మంత్రరహితముగా నిద్దరికి నుపయోగించ వలయును. అని త్రికాండి చెప్పెను. అనేకభార్యలు కలిగియున్నప్పు డీవిధముగానే రెండుభాగములుచేసి పెద్ద భార్యకు దక్షిణభాగము నిచ్చి మిగిలిన భార్యలకు ఉత్తరభాగము నిచ్చి అప్పుడున్న భార్యలతోఁగూడ పూర్వమువలె నాచరింపవలయును. ఈవచనములు అనాహితాగ్నికి నగ్నిహోత్రోత్పత్తిని గుఱించి విశేషముగా ధర్మశాస్త్రప్రయోగ కారికయందు చెప్పఁబడినవని తాత్పర్యము.

—{ శ్మశానమునకు తీసికొనివెళ్లిన పిమ్మట తిరిగి జీవించినవాని విషయము. }—

౭౨—తా. మృతినొందినపిమ్మట శ్మశానమునకు దహనము నిమిత్తము తీసికొనివెళ్లగా తిరిగి బ్రతికి స్వస్థతనొంది యింటికి వచ్చినయెడల ఆయింటికి శ్రేయస్సు కలుగదు. అట్టిదేశము పరరాజుచే జయింపఁబడును. ఎందువల్ల ననగా, మృతినొంది యమలోకమునకు వెళ్లి యముని జూచి వచ్చెను. కాఁబట్టి దానికి శాంతికొరకు తెలిసినవారు క్షీరములతోను ఆజ్యముతోను నూఱుసమిధలతో నూఱుహోమములను జేసి యెనిమిది వేలుగాని లేక వెయ్యియెనిమిది పర్యాయములుగాని గాయత్రిని జపించి క్షీరశాంతినిజేసి విశేష దక్షిణలను కపిలగోవును తిలలును వస్త్రమును మొదలగు దానముల నిచ్చి శాంతి జేయవలయునని యమునియభిప్రాయమై యున్నదని తాత్పర్యము.

—{ దహనమగుచుండగా అగ్ని నశించినయెడల జరుపవలసిన క్రమము. }—

౭౩—తా. శవమును దహించుచుండగా వర్షము మొదలగువానిచే నాయగ్ని చల్లారినయెడల మూడు కృచ్ఛ్రప్రాయశ్చిత్తంబుల జేసి తిరిగి అగ్నిని దెచ్చి శవశేషమును పిమ్మట మంత్రవర్జితముగానే దహించవలయునని తాత్పర్యము.

శిల నశించినయెడల జరుపవలసిన క్రమము.

౭౪—తా. పదిదినములలోపుగా దైవవశమువలన పాషాణము నశించినయెడల మఱియొక శిలదెచ్చి గతించినదినములయందు జేయఁబడిన జలాంజలులను కూడ తిరిగి జేయవలయును. మఱియు శిల నశించినప్పుడు "ఆయాహి" అనుమంత్రముచేత మఱియొక శిలను దెచ్చి దర్భలను జుట్టియుంచి "యమాయసోమగ్ంసునుత" అను మంత్రముతో స్రువముచే నాజ్యహోమమును మూఁడుపర్యాయము లగ్నిహోత్రమునందు జేయవలయును. అని మనువు చెప్పెను. శిల నశించినప్పుడు మఱియొక శిల నావాహనము జేసి వెనుకవిడువఁబడిన జలాంజలులను పిండములను కూడ నివ్వవలయునని గౌతముడు చెప్పెను. ఇతరస్మృతులయందును, ప్రేతశిల నశించినను భిన్నమైనను నీవిధముగానే జేయవలయునని చెప్పఁబడెను. శిలను మఱియొక ప్రదేశమునకు తీసికొనివెళ్లినను శిల పాత్ర కర్ర ద్రవ్యము మొదలగు వానికి విపర్యాసము కలిగినయెడల మూఁడుప్రాజాపత్య కృచ్ఛ్రప్రాయ

శ్చిత్తములను జేసి తిలోదక పిండదానములను తిరిగి జేయవలయు ననిరి. పోయినశిల తిరిగి దొరికినయెడల గతించినదినములయందు నివ్వఁబడిన జలాంజలుల తిరిగినివ్వ నక్కరలేదు. "ఇమేయుగే" అనుమంత్రముతో రెండుశిలలనుంచి వానియందే మిగిలినదినములయందు జేయవలసిన విధుల నన్నియు పూర్తిచేయవలయును.

—{ మొదటిదినమునం దావాహనము జేయబడిన శిల నశించిన యెడల చేయువిధానము. }—

౭౫—తా. మఱియొక శిలను దెచ్చి "ఆయాతు దేవస్సుమనాభి" అను మంత్రముచే నావాహనము జేసి దర్భలనుజుట్టి పూర్వమువలెనే కేశ వాది పండ్రెండు నామములచే స్నానము జేయించి అగ్నిప్రతిష్ఠ జేసి చతు ష్పాత్ర ప్రయోగము ఆజ్యసంస్కారాంతము జేసి చతుర్గృహీతముగా నాజ్యమును గ్రహించి "యమాయ సోమగ్ంసునుత, యమాయఘృత వత్, యమాయమధుమంతగ్ం" అను మూడు మంత్రములతో మూడు ఆజ్యహోమములను జేసి పూర్వదినములయందు జేయఁబడిన తిలోదక పిండ దానములను తిరిగిచేయవలయును. ఈప్రకారము శిలానష్టప్రాయశ్చిత్తము.

—{ పునర్దహనమందు రాత్రియందు పైతృమేధిక కృత్య మారంభింపగూడదనే విషయము. }—

౭౬—తా. ఇతర స్మృతులయందు రాత్రియందు నైమిత్తిక కర్మ గాక పైతృకకర్మ చేయ గూడదనియు ప్రేత కార్యములను జేయవచ్చునని యు నగ్నప్రచ్ఛాదనము చేయగూడదనియు చెప్పబడెను. రాత్రియందు ప్రేతదాహాదికృత్యము ముఖ్యముగా జేయఁబడు దేహసంస్కార విష యము. ప్రేతదాహాదికృత్యము నగ్నప్రచ్ఛాదనము రాత్రియందు సంధ్యా కాలమందు జేయఁబడిన యెడల నిరర్థకమగును కాఁబట్టి చేయకూడదని చెప్పబడెను. దహనము పైతృమేధికము రాత్రియందు జేయకూడదు. పగలు ప్రారంభించిన యెడల రాత్రియైనప్పటికి పూర్తిజేయవచ్చును. రాత్రియందు జేయగూడదనే విషయము అస్థిదాహము మొదలగు గౌణ పక్షవిషయము. మఱియు పగలుగాని రాత్రిగాని మధ్యాహ్నమందుగాని నిశియందుగాని సంధ్యాకాలముల యందుగాని దహనానంతరమున నగ్న ప్రచ్ఛాదన శ్రాద్ధము చేయవచ్చునని కొందరుచెప్పిరి. ఆయభిప్రాయము దహనానంతరము తప్పక చేయవలయునని గాని రాత్రియందు జేయవల యునని యభిప్రాయము కాదు. అట్లు చెప్పినయెడల తిలోదకము పిండ

దానము నగ్నప్రచ్ఛాదనము రాత్రియందు జేయకూడదనియు చేసిన నిర ర్థకమగుననియు జెప్పిన గోబిలుని వచనమునకు విరోధమువచ్చును. సూర్యాస్తమయమునకు పూర్వము తగినకాలము సంభవించని యెడల మరునా డుదయమున దాహాదికృత్యము చేయవచ్చును. అట్లుచేసిన యెడల దోషములేదని కొందరనిరి.

శవాగ్నిప్రదేశమునందు శునకాది గ్రామ్యధర్మముల విషయము.

౨౭—తా. మూడుకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తంబులనుజేసి వ్యాహృ తులచే నాజ్యహోమమును జేయవలయును. శ్మశానప్రదేశమునందు పురు షులు శ్వానములు గార్ధభములు మొదలగునవి గ్రామ్యధర్మములను జరి గించిన యెడల కృచ్ఛ్రప్రాయశ్చిత్తము హోమమును జేయవలయునని ధర్మశాస్త్రకారికలు చెప్పుచున్నవి. ప్రాయశ్చిత్తమును గుఱించి హోమ విశేషము చెప్పబడని స్థలములయందు వ్యాహృతులచే హోమమును జేయవలయునని జయంతునిచే జెప్పఁబడెనని తాత్పర్యము.

శవాగ్ని పతనమునందు.

౨౮—తా. గ్రామశ్మశానముల మధ్య నగ్నిహోత్రము క్రింద పడినయెడల ప్రాజాపత్య కృచ్ఛ్రత్రయము నాచరించి ప్రేతాహుతి పుర స్సరముగా నగ్నిని ప్రతిష్ఠించి పూర్వమువలెనే వ్యాహృతులతో హోమ మును జేయవలయును. ఈవిధముగానే ఆపస్తంబమునియును జెప్పెనని తాత్పర్యము.

శవపతనమునందు ప్రాయశ్చిత్త విధానము.

౨౯—తా. శవమును తీసికొని పోవుచుండగా దారిలో శవము పడిన యెడల ఆయజమానునియొక్క కుటుంబనాశనము ధనధాన్యక్షయ ము కలుగును. కాఁబట్టి యజమానుఁడు “ఇమ్మారుద్రా” అను మంత్ర ముతో రెండువేల ఆజ్యహోమములను జేసిన యెడల మేలుకలుగును. వృషభమును దక్షిణగా నొసంగవలయునని నారదమునీశ్వరుఁడు వచించె నని తాత్పర్యము.

శవహసితాదికమునందు విధానము.

౩౦—తా. శవము నవ్వినను ఏడ్చినను ఆవలించినను లేచినను శరీరము కదలినను యజమానుని గృహమునందుండు వారందఱు నశింతు రు, గ్రామమునకు వెలుపల నుంచకూడదు. ఎందువల్లననగా శవము రుద్రు నితో సమానమైనది. కాఁబట్టి శవాశౌచము గడచిన పిమ్మట రావి మేడి

మొదలగు సమిధలతో యమదేవతాక మంత్రముచే ప్రత్యేకముగా శాస్త్ర ప్రకారము నూటయెనిమిది పర్యాయములు హోమములు చేయవలయు ను. అనంతరము రుద్రశాంతిని చేయవలెను. ఇట్లుచేసిన అట్టిదోషము తొలగి శాంతియగును.

—{ శూద్రాదులచేత కాష్ఠాదులు తీసికొని పోబడినప్పుడు జేయవలసిన విధానము. }—

౯౧—తా. బ్రాహ్మణుల ద్రవ్యములు బ్రాహ్మణులుండి యుండగా శూద్రద్రవ్యము లుపయోగింపఁగూడదు. ఆద్రవ్యములను శూద్రులు తీసికొని వెళ్లగూడదు. శూద్రసంపర్కము కలుగుటచే జేయఁబడిన ఆహుతులు స్వర్గఫలము నిచ్చునవికావు. మఱియు శూద్రుఁడు తృణకాష్ఠాదులను హరించిన యెడల అధర్మవంతుడగును. ప్రేతకు ప్రేతత్వము విడువఁబడదని తాత్పర్యము.

దహనదేశ నిర్ణయము.

౯౨—తా. శూద్రుఁడు మృతినొందినప్పుడు దక్షిణద్వారముగా తీసికొనివెళ్లి దక్షిణదిక్కున దహనము జేయవలయును. మఱియు బ్రాహ్మణులకు తూర్పుదిశయు, క్షత్రియులకును ఉత్తరదిశయు, వైశ్యులకును పశ్చిమదిశయు దహనమునకు తగిన ప్రదేశములుగా జెప్పఁబడెనని తా.

—{ పిండము కాకాదులచే ముట్టనప్పుడు నీచజంతువులు స్పృశించినప్పుడు తగువిధానము. }—

౯3—తా. పదిదినములలో వేయఁబడిన పిండములను కాకులు గృధ్రములు స్పృశింపనియెడల నెన్ని శ్రాద్ధముల జేసినను ప్రేతత్వము విడువఁబడదు.

—{ పిండమును కుక్కలు మొదలగునవి స్పృశించిన యెడల ప్రాయశ్చిత్తము. }—

౯౪—తా. పిండమును కాకులు స్పృశింపకయున్నను శునకచండాదులచే దూషితమైనను మూడుకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తములను జేసి తిలోదకముల నావృత్తి జేయవలయునని గోభిలుడు చెప్పెను. శ్వానములు వరాహములు నక్కలు కోళ్లు మొదలగు వానిచే ప్రమాదవశమున శవము అస్థులు భస్మపిండములు మొదలగునవి స్పృశింపబడిన యెడల క్రమముగా, అయిదు నాలుగు మూడు కృచ్ఛ్రప్రాయశ్చిత్తములను జేయవలయునని అత్రిమునీశ్వరుఁడు చెప్పెను. శ్వసూకరఖర ఉష్ట్రము మొదలగు

వానిచే శవాస్థిభస్మ పిండాదులు స్పృశింపఁబడిన యెడల నాలుగుమూడు ప్రాయశ్చిత్తములను జేయవలయునని మఱియొక స్మృతియందు జెప్పఁబడెను శ్వానము గార్ధభము చండాలుడు మొదలగు వారిచే స్పృశింపబడిన బ్రాహ్మణులవలన ననుజ్ఞతీసికొని యొకప్రాజాపత్య ప్రాయశ్చిత్తమును జేయవలయునని మఱియొకరు చెప్పిరి. అయితే ఉపనయనము కానివారు అనుపనీతుల విషయమని చెప్పిరి కాఁబట్టి కాకములను గృధ్రములను నిషేధింపఁగూడదు. శునకము చండాలురు మొదలగు వానివలన స్పర్శ కలిగిన మూడు ప్రాజాపత్య ప్రాయశ్చిత్తములను జేసి తిరిగి పిండదానములను జేయవలయును. శావమునందు సూతకమున్నంత పర్యంతము రాత్రి శేషమునందును ఆయాకాలములయందు క్రమముగా నవశ్రాద్ధముల నాచరింపవలయునని దేవల మునీశ్వరుఁడు చెప్పెను.

పదిదినములలోపల దర్శసంక్రమణాదులు సంభవించినప్పుడు.

౯౫—తా. పదిదినములలోపల దర్శ సంక్రమణాదులు వచ్చినను కుమారుఁడు తల్లిదండ్రుల గుఱించి చేయునప్పుడు క్రమముగా పదిదినముల పర్యంత ముదకపిండ దానాదులను జేయవలయును మఱియు దౌహిత్రుఁడు దత్తుడు నిట్లేచేయవలెను. వీరికంటె నితరులు చేసినయెడల అమావాస్యతో సమాప్తిజేసి పిమ్మట తిరిగి ప్రారంభించవలెను. ఈవిధముగానే కపర్దిస్వామి జెప్పెను.

అమావాస్యయందు మరణించినవాని క్రమము.

౯౬—తా. అమావాస్యయందు మృతినొందినవానికి పదిదినముల పర్యంతము ప్రతిదినము తిలోదక పిండదానములను జేయవలెను. చతుర్దశియందు మృతినొందిన పిమ్మట అమావాస్యతిథి వచ్చెనేని మరునాడమావాస్యయందే పదిదినములయందు జేయఁదగిన తిలోదక పిండదానములను జేయవలయునని గృహ్యపరిశిష్ట గ్రంథమునందు జెప్పఁబడెను.

పదిదినములలో సంక్రమణము వచ్చినప్పుడు జేయువిధానము.

౯౭—తా. దశాహమధ్యయందు సంక్రమణము వచ్చినను అమావాస్య వచ్చినప్పుడు చేయవలసిన విధానమును జెప్పినరీతిగానే ఔరస కుమారుఁడు దత్తుడు దౌహిత్రుఁడు పదిదినముల పర్యంతము క్రమముగా తిలోదక పిండదానముల చేయవలయు ననియు వీరికంటె నితరులు చేసిన యెడల సంక్రమణముతోనే సమాప్తిచేసి మిగిలిన దినములయందు స్నానము తిలాంజలులు మాత్రము జేయుచుండవలె ననియు భవిష్యత్పురాణ

స్మృతి సంగ్రహాది గ్రంథములయందును కలదు. వసిష్ఠ గౌతమ గాలవాది మునీశ్వరులును జెప్పిరి. మఱియు పదిదినములలోపల అమావాస్య వచ్చినప్పుడు మూడుదినములకంటె పైన మిగిలిన యెడల తల్లిదండ్రులకైనను అమావాస్యతోనే సమాప్తి చేయవలయు ననెడు గాలవవచనము దేశకాలోపద్రవములు కలిగినప్పుడని తెలిసికొనవలయును. ఆవిధముగా స్మృతితత్వ నిర్ణయమను గ్రంథమున జెప్పఁబడెను. రాష్ట్రోపద్రవమునందు దేశసంకటమునందు తనకుబాధ కలిగినప్పుడు మిక్కిలి దూరదేశ ప్రయాణము చేయునప్పుడు ఉత్పాతాది దుర్యోగమునందు మఱియు నితరమగు మహాభయములు కలిగినప్పుడు తల్లిదండ్రులకైన నమావాస్యతోనే సమాప్తి చేయవలయునని చెప్పెను. ఆయాకాలముల నతిక్రమించి బలిక్రియను చేయఁగూడదు. తిలోదకాదులను మాత్ర మపకర్షణము జేయవచ్చును. ఏకోద్దిష్టాది శ్రాద్ధముల నాయాకాలములయందే చేయవలయునని సంగ్రహమను గ్రంథమునందు జెప్పఁబడెనని తాత్పర్యము.

## సహగమనవిధానము.

౯౭—తా. స్నానము చేయించి శరీరశుద్ధిని జేసి ప్రేతను చితియందు బఱుండబెట్టినపిమ్మట ప్రేతభార్యనుకూడ "ఇయంనారీ" అనుమంత్రమును జెప్పి చితియందు శవమువద్ద పరుండ జేయవలయును. తిరిగి లేచుట లేదు కాఁబట్టి "ఉదీర్ష్వనారీ" అనుమంత్రమును జెప్ప నక్కర లేదు. హస్తసంమార్జము మొదలు ఇద్దరకును తంత్రముగా జేయవలెను. పూర్వతంత్రము లేదు. దహనోపస్థాన హోమమంత్రములయందు ద్వివచనముగానే చెప్పవలెను. అగ్నియు చరువు ఉపస్థానము హోమములను ఒక్కసారిగా చేయవలయుననియు తిలోదక పిండదానముల వేరుగా జేయవలయు ననియు మిగిలిన విధి సమానమైనదనియు జెప్పఁబడెను. చితియందు దహనము మొద లస్థిసంచయనాంతము నొకవిధముగానే యనియు నగ్నప్రచ్ఛాదనము మొదలు వేరుగా శ్రాద్ధముల జేయవలయునని చెప్పిరి. పంచమంత్రములకు నావృత్తికలదనియు నితరమంత్రములకు నావృత్తిలేదనియు జెప్పిరి దంపతులిద్దఱుగాని అనేకమందిగాని యేకకాలమునందు మృతినొందినప్పుడు ఔపాసనాగ్నిచే తంత్రముగా దహనముచేసి తిలోదక పిండదానములను నగ్నప్రచ్ఛాదనము నవశ్రాద్ధములు వృషోత్సర్జనము మాసికములు సపిండీకరణము మొదలగు శ్రాద్ధములు ఆయాదినముల యందు నుభయులకు వేరువేరుగా జేయవలయును. భిన్నకాలమునందు

మృతినొందిన నవశ్రాద్ధాదులు వలెనే అస్థిసంస్కారము కూడ వేరుగా జేయవలయునని చెప్పిరిగాని అది ముఖ్యముగాదని కల్పకారిక చెప్పెను. పూర్వదినమునందు పెనిమిటి మృతినొందియుండగా మరునాడు భార్య మరణము నొందినప్పుడామెను ఆచితియందే దహించి పెనిమిటియొక్క యాశౌచదినములలో జేయు క్రియలతోపాటు భార్యకును ఆదినములయందే ఆయాశ్రాద్ధములను వేరువేరుగా జేయవలయును. సహగమనమునందు ముందు పెనిమిటి సపిండీకరణముజేసి పిమ్మట పెనిమిటియొక్క తండ్రి తాతలతో గలిపి భార్యకును, సపిండీకరణము జేయవలయునని కొందరనిరి. పెనిమిటియొక్క తల్లి మొదలగు వర్గముతోనే భార్యకును సపిండీకరణము జేయవలయునని మఱికొందరనిరి. భర్తృసాపిండ్యముతోనే భార్యాసాపిండ్యమని మఱికొందరనిరి. ఇది సంతానములేని స్త్రీవిషయమని నిర్ధారణచేసిరిగాని యది యుక్తమైనదికాదు. భర్తృవర్గముతో సాపిండ్యము చేసినను ఆబ్దికమునందు అత్తలయొక్క వర్గముతోనే శ్రాద్ధమాచరింపవలయును. త్రికాండియు ప్రత్యాబ్దికమునందు తండ్రిశ్రాద్ధమును తండ్రివర్గముతోను తల్లిశ్రాద్ధమును పితామహ్యాదివర్గముతో నాచరింపవలయునని జెప్పెను. వ్యభిచారి, గర్భిణి, సంకరస్త్రీ, మొదలగువారు పెనిమిటితో సహా యగ్నిప్రవేశము జేసినయెడల దంపతులిరువురు పతితులే యగుదురు గాన సహగమనము చేయకూడదు. ఇతర వర్ణస్త్రీలకు వేరుగా చితినేర్పరచవచ్చునని యున్నదిగాని బ్రాహ్మణులకు లేదు. పెనిమిటి మృతినొందినపిమ్మట దాహాత్పూర్వము భార్య మృతినొందినను భార్య మృతినొందినపిమ్మట పెనిమిటి మృతినొందినను తంత్రముగా దహనముజేసి మంత్రములను ద్వివచనముగా జెప్పవలయును. పూర్వదినమునందు పెనిమిటి మృతినొందియుండగా నప్పుడు సహగమనము జేయుటకు నిష్టపడక మరునాడు చేయవలయునని బుద్ధిజనించినయెడల నంతపర్యంతము శవము దహనముజేయక నుంచిరేని యాశవము పర్యుషితమగును కాబట్టి చాంద్రాయణ ప్రాయశ్చిత్తమును జేసినయెడల యాదోషము నివృత్తించునని తాత్పర్యము.

ఒక్కసారిగ మృతినొందినవారికి జేయవలసిన క్రమము.

FF—తా. ఒక్కసారిగ మృతినొందినప్పుడు వారికి కర్మను జేయువాడొక్కడే యయ్యెనేని ముందుగ మృతినొందినవారికి ముందుగను పిమ్మట మృతినొందినవారికి ననంతరమునందును పోయిన క్రమానుసార

ముగ జేయవలయునని సంగ్రహకారుఁడు చెప్పిన విషయము సపిండులను గురించి యని ఋష్యశృంగుడు చెప్పెను. కాఁబట్టి యనేకు లొక్కసారిగ మృతినొందినప్పుడు మరణములో పూర్వోత్తరకాలములను దెలిసిన యెడల వరుసప్రకారము కృత్యమాచరింప వలయును. కాలక్రమమును దెలియనప్పుడు సంబంథావశ్యకత్వమును బట్టి జేయవలయును. ఇతరులకు సోదరునకు జేయవలసియున్నప్పుడు ముందు సోదరునకు జేసి పిమ్మట ఇతరులకు జేయవలయును. తల్లిదండ్రులు సోదరులలో తల్లిదండ్రులకు ముందుగ నాచరింపవలయును. తండ్రికి ప్రేతకృత్య మాచరించుచున్నను తల్లి మరణించినప్పుడు దహనాది కృత్యములను జేయవలయును. కాఁబట్టి తల్లిదండ్రులకు జేయునప్పుడు ఇతరులకు జేయవలసి వచ్చిన యెడల పిమ్మట జేయవలయును. ఇతరులకు జేయుచుండినను తల్లిదండ్రులకు జేయవలసి వచ్చినప్పు డితరుల ప్రేతకృత్యములను నిలిపి తల్లిదండ్రులకు సమాప్తి నొందించిన పిమ్మట నితరులకు తిఱిగి ప్రారంభించి చేయవలయును. తల్లిదండ్రులలో తండ్రి శ్రాద్ధమాచరించిన పిమ్మట తల్లికి జేయవలయును. తల్లికి ముందు ప్రారంభించి చేయుచున్నను తండ్రిశ్రాద్ధము పూర్తియైన పిమ్మట తల్లికి జేయవలసిన మిగిలిన ప్రేతకృత్యములను పక్షిణిలోగాని త్రిపక్షములోగాని చేయవలయునని సంగ్రహకారుఁడు జెప్పెను.

## —{ భార్య మొదలగువారి యుగపన్మరణ విషయము గురించిన విధానము. }—

౧౭౦—తా భార్య, కుమారుఁడు, సోదరుఁడు, వానితనయుడు, కోడలు, అత్తమామలు, తల్లిదండ్రులు, వీరియొక్క సంఘాతమరణము నందు ముందుగ తల్లిదండ్రుల సాపిండ్యము పిమ్మట సంవత్సరము లోపుగ వారివారికి సాపిండ్యములను జేయవలయును. ఒక్కదినమున ననేకులు గాని యిద్దరుగాని మృతినొందుట సంఘాతమరణమని జెప్పఁబడును. తల్లిదండ్రులు మృతినొందిన పిమ్మట సంవత్సరపర్యంతము కుమారునకు నశౌచిత్వము కాఁబట్టి యితరులకు జేయఁగూడదను విషయము భార్యకంటె మిగిలిన వారి విషయము. అందువలన లోకాక్షివచన మేమని యున్నదనగా, మహాగురువులగు దల్లిదండ్రులు మృతినొందినప్పుడు సంవత్సరము లోపుగా నితరులకు జేయవలసి వచ్చెనేని దహనాద్యాద్య శ్రాద్ధపర్యంతముజేసి మిగిలిన శ్రాద్ధములను తల్లిదండ్రుల సంవత్సర దీక్షానంతరమున జేయవలయును. శుద్ధి లేకపోయినను పదునొకండవ దినమునందు జేయ

వలసిన ఆద్యశ్రాద్ధమును జేయుటకు కర్తకు తాత్కాలిక శుద్ధియున్నది. కాఁబట్టి దహనాది కృత్యములును ఏకాదశ దినకర్తవ్య ఆద్యశ్రాద్ధము పర్యంతము చేయవలయును. తల్లిదండ్రుల సంఘాతమరణంబునందు దేవలుఁడు చెప్పిన విశేషమేమనగా, సంఘాతమరణంబునందు దండ్రికి తల్లికి వేరుగా శ్రాద్ధములను జేయవలయు ననియు నితరులకు సంఘాతమరణమునందు వేరుగా జేయనక్కరలేదు. మరియు నితరులయొక్కయు తల్లిదండ్రులయొక్కయు సంఘాతమరణంబునందు లోకాక్షి వచనమెట్లనిన, భార్య, కుమారుఁడు, కోడలు, సోదరుఁడు, వారిపుత్రులు, పుత్రికలు, తల్లిదండ్రులు, ఈమొదలగు వారిలో నొక్కదినంబున కొందరికి సంఘాతమరణంబు కలిగినయెడల ఆద్యశ్రాద్ధము నేకాదశదినమునందు జేసి త్రిపక్షములో సపిండీకరణము జేయవలయుననెను. పెనిమిటితో భార్య సహగమనముచేసి నప్పు డేకచితియందే నిద్దరిని దహించినయెడల నిద్దరకు తిలోదకపిండదానముల వేరువేరుగా జేయుచు నొకశిలయందే యిద్దరకు తిలోదకముల విడుచుచు శ్రాద్ధములనుకూడ కాలప్రకారము చేయవలయును. చితిభేదముచే దహనముచేసి నప్పుడు వేరువేరుగా శిలలనుంచి వారివారికి తిలోదకములను పిండముల నివ్వవలయును సమస్తవిధులను వేరుగానే చేయవలెను.

పదిదినములలోపల నస్థ్యాది సంస్కారము జేయువిధానము.

౧౦౧—తా. పదిదినములలోపల అస్థ్యాదిసంస్కారము జేసినప్పుడు పుత్రులకును జ్ఞాతులకును పదిదినములతోనే శుద్ధియగును. పదిదినములలోపల జేయనియెడల మూఁడుదినములతో శుద్ధియగును. మొదట కుమారుఁ డాశౌచము పట్టకుండనియెడల అస్థి సంస్కారము మొదలు పదిదినములు పూర్ణాశౌచము జ్ఞాతులకు మొదటి పదిదినములతోనే నివృత్తి యగును.

పది దినములు గడచినపిమ్మట త్రిరాత్రాశౌచపక్షము.

౧౦౨—తా. మొదటిదినమునందు రెండవదినమునందు ఇరువైయొక్కటి యిరువైయొక్కటియు మూఁడవదినమునందు ముప్పదిమూఁడు తిలోదకములును మొదటిదినము నొకపిండమును రెండవదినంబున నాల్గు పిండములను మూఁడవదినంబు నైదుపిండములను. ఇవ్వవలయును. అస్థిసంచయనమును జేయవలెను. సంవత్సరములోపల తిరిగి సంస్కారము జేయవలసినప్పుడు గురు శుక్రుల మౌఢ్యదోషములేదు తిథివారనక్షత్ర

ముల విచారణయు జేయ నక్కరలేదు. స్త్రీలకును ఈప్రకారమే పైతృమే ధికమును జేయవలయును.

పునర్దహన కాల విధానము.

౧౦౩—తా. స్మృతితత్వనిర్ణయగ్రంథమునందు జెప్పఁబడిన దేమనగా, శుక్రుఁడు గురువు బాలత్వము వృద్ధత్వము బొంది యుండగాను వీరల అస్తమానమునందును నూతన తీర్థయాత్రయు ప్రేతకర్మయు విసర్జించవలయును. ఇతరస్మృతులయం దిట్లు జెప్పఁబడెను. అధికమాసమునందును ఆషాఢశు ౧౫ మీా మొదలు కార్తిక శుద్ధ పౌర్ణమి పర్యంతము గురు శుక్రుల మూఢమియందును కాలాతిక్రమణముగల శ్రాద్ధముల విషయమై తిరిగిజేయవలసి వచ్చినప్పుడు దోషము లేదని జెప్పఁబడెను. మూడు పక్షములు లోపుగా పునర్దహన విషయములో కాలనియమము గురు శుక్రుల మూఢదోషము లేదనియు సపిండీకరణమునకు జెప్పఁబడిన కాల పరిమితిలోపుగా ప్రేతకర్మ జేయవలసి వచ్చినప్పుడు గురు శుక్ర మూఢ దోషము లేదనియు జెప్పిరి. మఱియు నారదుఁ డిట్లు చెప్పెను. చతుర్దశి, నందతిథులు, భద్రతిథులు శుక్ర మంగళవారములు గురుశుక్రుల మూఢమి ద్విపాద త్రిపాదనక్షత్రములు శుక్లపక్షమును విడిచి మిగిలిన తిథివార నక్షత్రాదులయందు పునర్దహనము జేయవచ్చుననిరి. మఱియు ధనిష్ఠానక్షత్రము మొదలు రేవతీనక్షత్ర పర్యంతము ధనిష్ఠాపంచకదోషము గనుకను త్రిపాదసంజ్ఞగల కృత్తిక పునర్వసు ఉత్తరఫల్గుని విశాఖ ఉత్తరాషాఢ అనునట్టి త్రిపాదసంజ్ఞగల అయిదునక్షత్రములయందును రేవతి రోహిణీనక్షత్రములయందును పునర్దహనము చేసినయెడల కులనాశనమగునని జెప్పఁబడెను. దినోత్తర కాలమునందు తారాచంద్రబలము కలిగియున్నప్పుడు పాపగ్రహబలము కలిగియుండగాను శుక్రుఁడు లగ్నమును అంశను విడిచి యుండగాను పునర్దహనము జేయుటకు నుచితమగు కాలమని చెప్పిరి.

శ్రాద్ధాది కాలనిర్ణయము.

౧౦౪—తా. సంవత్సరములోగాని ఆఱు మాసములలోగాని మూఁడుమాసములలోగాని మూఁడుపక్షములలోగాని మాసములోపుగాగాని పంద్రెండవ దినమునందుగాని సపిండీకరణము జేయవచ్చును. ఈకాలములయందే యేకోద్దిష్ట షోడశశ్రాద్ధములను గూడ జేయవచ్చును. కృత్తికానక్షత్రమునందు, నందతిథియందు శుక్రవారమునందు త్రిజన్మనక్షత్రములయందు పిండదానము చేసినయెడల కులనాశనమగునియు త్రిజన్మ

నక్షత్ర త్రిపాదనక్షత్ర నందతిథి భృగువార రోహిణి రేవతీనక్షత్రముల యందు శ్రాద్ధములను జేసిన కులనాశనమనియు జెప్పఁబడెను. సకృన్మహాలయమందును కామ్య శ్రాద్ధములయందును న్యూనశ్రాద్ధంబులందును కాలాతిక్రమణము కలిగినవాని విషయమందును ఈచెప్పఁబడిన విషయముల నాలోచించ వలయును.

అతీత సంస్కార క్రమము.

౧౦౫౭—తా. హస్త చిత్ర భరణి స్వాతి శ్రవణము అశ్విని మఖ అనూరాధ పుష్యమి పూర్వాషాఢ మృగశీర్ష యీనక్షత్రములయందు పునర్దహన విషయమై యుక్తమనిచెప్పిరి. ఇది పదిదినములు గడచిన పిమ్మట జరిగే విషయమనిరి. ఉత్తరాయణము కృష్ణపక్షము శ్రేష్ఠము నందతిథులు త్రయోదశి భూతాది నక్షత్రములయందు శనిశుక్రవారములయందు జేయఁగూడదు. భరణి కృత్తిక ఆర్ద్ర ఆశ్లేష మూల ధనిష్ఠ మొదలైదు నక్షత్రములయందు త్రిజన్మసంజ్ఞగల నక్షత్రములయందు త్రిపుష్కర నక్షత్రములయందు అభ్యంతర సంజ్ఞగల నక్షత్రములయందును రోహిణి పునర్వసు ఉత్తర పూర్వఫల్గునీ నక్షత్రములయందును చిత్ర విశాఖ అనూరాధ పూర్వాషాఢ ద్విపుష్కర సంజ్ఞగల నక్షత్రములయందును జేయగూడదని మరికొందరనిరి. వ్యతీపాత వైధృతి విష్కంభ యోగముల యోగములయందును జేయఁగూడదు. కర్తయొక్క నాలుగు యెనిమిది పండ్రెండవ రాసులయందును కాకాదులచే నస్థులు స్పృశింపఁబడినప్పుడును జేయఁగూడదు. ఒకవేళ కాకాదులచే నస్థులు స్పృశింపఁబడినప్పుడు ఆయస్థులను పవిత్రమును జేయునట్టి పావమాని ఋక్కులను జదువుచు గోక్షీరములతో నూటయెనిమిది పర్యాయములుగాని పండ్రెండు పర్యాయములుగాని ప్రక్షాళనజేసి శుద్ధిపరచవలెను. అస్థులు లేని పక్షమునందు పలాశవృంతములతో ప్రతినిధిగా జేయవలయునని జెప్పఁబడినదిగాన (360) మూఁడువందల అరువది పలాశవృంతములను దెచ్చి పూర్వము చెప్పఁబడిన విధానముగా మనుష్యునియొక్క అన్ని యవయవము లుండునట్లుగా మనుష్య ప్రతికృతిని జేయవలెను. పాలాశదహన విధానమునందు స్వర్గపాథేయ మివ్వనక్కరలేదు. అస్థులు నష్టమైనప్పుడు తిలోదక పిండదానముల జేయనక్కరలేదు. స్వర్గపాథేయములేదు. మిగిలిన కర్మలన్నియు జేయవలయునని స్మృతిసంగ్రహమునందు జెప్పఁబడెను.

అతీత తిలోదక పిండదాన విధానము.

౧౦౬—తా. ఉక్తదశరాత్రులు గడచినప్పుడు త్రిరాత్రాశౌచము కాఁబట్టి మొదటిదినమునం దిరువదియు, రెండవదినమునం దిరువదియైదును, మూడవదినమునందు ముప్పదియు, తిలోదకములను విడువవలయును, మొదటి దినమునందు మూడు పిండములను, రెండవ దినమునందు నాలుగు పిండములను, మూడవదినము మూడుపిండములను, వేయవలయును. మఱియు పారస్కరు డిట్లు చెప్పెను. మొదటిదినమున మూడు పిండములును, రెండవ దినంబున నాలుగు పిండములును, అస్థిసంచయనమునందు, మూడవ దినమున మూడు పిండములనిచ్చి, నాల్గవ దినంబున శ్రాద్ధమును జేయవలయునని చెప్పెను. మఱియు దేవలుఁడు దీనికి వికల్పముగా మొదటి దినంబునను రెండవ దినంబున నిరువదొక్కటి చొప్పనను మూడవ దినమునందు ముప్పదిమూడు తిలోదకముల నివ్వవలయునని చెప్పెను, మొదటిదినంబున నొక్కపిండమును రెండవదినమునందు నాలుగుపిండములును, మూడవదినమునం దైదుపిండములను వేయవలయునని విష్ణువు చెప్పెను. త్రిరాత్రాశౌచ పక్షమునందు మొదటిదినమునందు నవశ్రాద్ధముల నైదింటినిజేసి మిగిలినది నాల్గవదినంబున నేకోద్దిష్టమునకు పూర్వము జేయవలయునని స్మృతిసంగ్రహమునందు జెప్పఁబడెను. మఱియు మొదటిదినంబున మూడును మూడవదినంబున రెండును నాల్గవదినంబున నొక్కటియును నవశ్రాద్ధములను జేయవలయుననియు మఱికొందరు స్మృతివేత్తలు వచించిరని తాత్పర్యము.

భోగశరీరోత్పత్తి విషయము.

౧౦౭—తా. ఇట్లు పిండముల నిచ్చుటచే ప్రేతకు భోగశరీరము కలుగుచున్నది. ఆప్రకారముగానే ధర్మశాస్త్రమునందును పిండములను వేయ నియెడల భోగశరీరోత్పత్తి కలుగదనియు వేసినందువల్లనే పరలోకప్రాప్తి కలుగుననియు జెప్పఁబడెను. కాఁబట్టి మొదటిదినమునందు వేయఁబడిన పిండముచే శిరస్సు, రెండవదినపిండముచే నేత్రములు చెవులు ముక్కు, మూడవదినపిండముచే భుజములు వక్షస్థలము స్తనములు కంఠము, నాల్గవదినపిండముచే నాభిస్థానము గుదము శిశ్నము, అయిదవదిన పిండముచే తొడలును, ఆఱవదినపిండముచే చర్మము, ఏడవదినపిండముచే నాడులు ప్రేగులును, ఎనిమిదవదిన పిండముచే సర్వావయవములందు రోమములును, తొమ్మిదవదినపిండముచే వీర్యసంపత్తియు, పదియవదినపిండ

ముచే ఆకలి లేకుండుటయు, కలుగునని చెప్పఁబడెను. కాఁబట్టి పదిదినముల యందున వేయఁబడిన పిండములను కాకములు భక్షింపనియెడల వానికి ప్రేతత్వము విడువబడదు. ఎన్ని శ్రాద్ధముల జేసిన నేమి ప్రయోజనము లేదని తాత్పర్యము.

### నష్టమైశవాగ్నినిగుఱించిన ప్రాయశ్చిత్తము.

౧౦౮—తా. శ్మశానాగ్ని నశించినను మధించి పుట్టింపబడినయగ్ని క్షీణించిపోయినను ఆభస్మను అరణులయందుంచి యొకవ్యాహృతి హోమమును జేయవలయును. స్మార్తాగ్ని నశించినప్పుడును తిరిగి పూర్వము వలెనే అగ్నిని పుట్టించవలెను. బోధాయనాచార్యులును శ్మశానాగ్నిని గూర్చి వేరొక కారణము కలదనిరి విశేషమగు గాలి మొదలగు వానిచే శ్మశానాగ్ని నశించినయెడల భస్మమును పోగుచేసి ప్రోక్షించి "అయంతే యోనిః" అనుమంత్రమును జెప్పి లౌకికాగ్నియందు ఒకసమిధనుంచి "ఆజుహ్వానః" అనుమంత్రములచేత రెండు హోమములను జేయవలయును. "అయాశ్చ" "పంచహోతలు" "బ్రాహ్మణఏకహోతా" అనునది మొదలు దశహోతలు "మన్వస్వతీ మిందా" వ్యాహృతులు మొదలగు మంత్రములతో నేతిచే హోమమును జేయవలయును. ఉపనాగ్ని నశించినప్పుడు మూడుదినములును సూతకాగ్ని నశించినప్పుడు పదిదినముల పర్యంతమును వివాహాగ్ని నశించినప్పుడు నాలుగుదినముల పర్యంతము నిట్లు చేయవలయును

### అగ్నినష్ట ప్రాయశ్చిత్త విధానము.

౧౦౯—తా. "అపహీతా అసురా, శంనోదేవీః" అనుమంత్రములతో భస్మను ప్రోక్షించి "అయంతేయోనిః" అను మంత్రముతో యజ్ఞసంబంధమగు సమిధను భస్మయందుంచి "యత్రక్వచాగ్నేః" అను మంత్రముతో లౌకికాగ్నిని ప్రతిష్ఠించి ప్రజ్వరిల్లజేసి "ఆజుహ్వానః" "ఉద్బుధ్యస్వాగ్నే" అను మంత్రములతో పూర్వము భస్మయందుంచిన సమిధను దెచ్చి ఈలౌకికాగ్నియందుంచి అగ్న్యుపసమాధానాది పరిషేచనాంతము వరకు జేసి "అయాశ్చ" మొదలు పూర్వము జెప్పఁబడిన మంత్రములతో హోమములను జేయవలయును. ఆమంత్రక్రమము మూలములోను యాజుషా పరప్రయోగాను క్రమణికయందును గలదు అచ్చట జూడవలయును. లేక మరియొక మతానుసారముగా "అపేతవీత" అనుమంత్రముచే భస్మను ప్రోక్షించి "అయంతేయోనిః" అనుమంత్రముతో సమి

ధను భస్మయందుంచి "ఆజుహ్వానః" ఉద్బుధ్యస్వాగ్నే" అనుమంత్రము లతో భస్మయందుంచబడిన సమిధను దెచ్చి లౌకికాగ్నియందుంచి ఆజ్య సంస్కారాంతము జేసి "అయాశ్చ" అనుమంత్రముతో హోమమును జేసి "అనాజ్ఞాతం" అను మూడు మంత్రములతోను సర్వప్రాయశ్చిత్త హోమ మును జేసి మిగిలిన విధానము యాజుష అపరప్రయోగాను సారముగా జరుపవలయును.

—{ అస్థులకు చండాలాది స్పర్శకలిగినప్పుడు చేయవలసిన ప్రాయశ్చిత్త క్రమము. }—

౧౧౦.—తా. సంచయనమునకు పూర్వము శునకములు చండా లురు నక్కలు మొదలగు వానివలన భస్మఅస్థులు మొదలగువానికి స్పర్శ దోషము సంభవించినప్పుడు పంచగవ్యములతో వానిని ప్రోక్షించి మూడు తప్తకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తములనుజేసి పిమ్మట నస్థి సంచయనము జేయవల యునని ధర్మశాస్త్రమునందుఁ జెప్పఁబడెను.

అనేకపుత్త్రులుండు నప్పుడు కర్తనిర్ణయము.

౧౧౧.—తా. బహుమంది కుమారులుండు నప్పుడు జ్యేష్ఠుడు చేయ వలయును. అతడు సమీపమున లేనప్పుడు వానితర్వాత వాడును అత డును లేనప్పుడు వానితర్వాత వాడును. అనుపనీతుడైనను జేయవచ్చు ను. ఇట్లు పుత్త్రులలో నెవరును సమీపమున లేనప్పుడు సపిండులలో దగ్గిర సంబంధము గలవాడును అతడును లేనప్పుడు ఏజ్ఞాతియైనను జేయవచ్చు ను. ఇట్లు చెప్పఁబడియున్నది కాఁబట్టి అనేకపుత్త్రులుండు నప్పుడు వారు విభక్తులైనప్పటికిని అందరంగీకరించి పెద్దవానిచేతనే చేయించవలయును. అట్లుచేసిన నందరుజేసినవారే యగుదురు ప్రేతకు నౌరసుడు కర్మను జేయవలయునని యున్నది. కాఁబట్టి బహుపుత్త్రులలో గుణవంతుడును అందరును గుణవంతులైనప్పుడు జ్యేష్ఠుడును జేయవలయును. అందువలన జ్యేష్ఠుడే దహన పిండ దానోదకాది క్రియలను జేయవలయును. మఱియు జ్యేష్ఠుడు చేయుటకు శక్తిలేనప్పుడు తాను దహనముజేసి మిగిలిన క్రియ లను తమ్మునిచే జేయించవలయును. జ్యేష్ఠుడు సమీపమందు లేనప్పుడు రోగాది పీడితుడైనప్పుడును నిర్బంధమైన కార్యాంతరములో నుండి నప్పుడు రెండవకుమారుడు చేయవచ్చును. పదిదినములలో తల్లిదండ్రుల మరణములు సంభవించినప్పుడు ఇద్దరకును జ్యేష్ఠుడే చేయవలయును ఇట్లు చేసిన అందరును కుమాళ్లుచేసిన వారే యగుదురు. కాఁబట్టి కుమారుడు

సోదరుడు దౌహిత్రుడు జ్ఞాతి అల్లుడు సగోత్రుడు అసగోత్రుడు ఎవ్వరైనను మొదటిదినంబున దహనముజేసి తిలోదక పిండదానంబుల నిచ్చియున్నాడో వాడే పదిదినముల పర్యంతము జేయవలయును. స్త్రీచే జేయబడినను అదియే పదిదినములను జేయవలెను.

—{ అస్థిసంచయనముగాక పూర్వముగాని పిమ్మటగాని పుత్త్రుడు వచ్చినయెడల జరుపవలసిన క్రమము. }—

౧౧౨—తా. తండ్రి మృతినొందినప్పుడు జ్యేష్ఠుఁడు దగ్గిర లేని సమయంబున మఱియొక సుతుఁడు దహనము జేసి సంచయనము జేయక నుండు సమయంబున పెద్దకుమారుఁడు వచ్చెనేని చిన్నవానిని తొలగించి పెద్దవాడే అస్థిసంచయనాది క్రియలను జేయవలయును అస్థిసంచయనము జేసి తిలోదక పిండదానాదుల నిచ్చుట ప్రారంభించిన పిమ్మట పెద్దకుమారుడు వచ్చెనేని మొదట ప్రారంభించినవాడే పదిదినముల పర్యంతము జేయవలయును.

అనాహితాగ్ని దగ్ధవిషయము.

౧౧౩—తా. ఔపాసనాగ్నిచేగాక లౌకికాగ్నిచే దహించినను స్వశాఖ సూత్రప్రకారముగాక నితర శాఖాసూత్ర ప్రకారముగాను దహించినయెడల ఆప్రేతను గుఱించి దహనాది సంస్కారములను తిరిగి జేయవలయును.

అస్థుల నన్యగోత్రులు స్పృశించిన తగు ప్రాయశ్చిత్తము.

౧౧౪—తా. తండ్రివంశము వారియొక్కయు తల్లివంశము వారియొక్కయు నస్థులనుగాక మిగిలినవారి యస్థులను స్పృశించిన హీనుడు చాంద్రాయణ ప్రాయశ్చిత్తమును జేయవలయును. మఱియు నితరవర్ణములయొక్క అస్థులను తీసికొనివెళ్లి గంగలో విడిచిన బ్రాహ్మణుడు వారి జాతితో సమానుడై మృతినొందినపిమ్మట చండాలుడై జన్మించును. అస్థిసంచయనముగాక పూర్వము రోదనము చేసిన యెడల స్నానము జేయవలయును. సంచయన మైనపిమ్మట రోదనము జేసిన ఆచమనము చేసినపిమ్మట పరిశుద్ధుడగును.

—{ ప్రేతకృత్యము జరుగుచుండగా కర్తభార్యగాని ప్రేతభార్యగాని రజస్వల బైటనుండినయెడల చేయవలసినవిధి. }—

౧౧౫—తా. ప్రేతకృత్యము ప్రారంభించి జరుపఁబడుచుండగా దైవవశము ప్రేతభార్య రజస్వలైనను ప్రసవించినను సూతకాంతము

పర్యంతము ఆయా కాలములయందు నాయా క్రియలను జేయుచు సపిండీకరణము కూడ జేయవలయును. స్నానము జేసినపిమ్మట ప్రేతపత్ని సూత్ర విసర్జనము జేసికొనవలయును. ప్రేతభార్య గాని కర్తభార్య గాని రజస్వలైనప్పుడు సపిండీకరణము జేయగూడదని చెప్పినవారి యభిప్రాయ మేమనగా, కర్తభార్య రజస్వలై యేకాదశ దినమునకు నాటంకము సంభవించిన యెడల నేకాదశదినమునందాద్య శ్రాద్ధమును జేసి మిగిలిన షోడశాదులను వదలి స్నానము జేసి శుద్ధి అయినపిమ్మట షోడశాదుల నాచరింపవలయును పరియొకరు కర్తయై యుండగా ప్రేతభార్య రజస్వలైనప్పటికి ప్రేతకర్మకు నభ్యంతరము కలుగదు భార్య ప్రసవించినను రజస్వలైనను ఖాండస్పర్శ పర్యంతము పెనిమిటికి శుద్ధిలేదని చెప్పబడినది గాన గ్రహణము వచ్చినప్పుడు మరునాడు శుద్ధియగును. ప్రసవాశౌచమునందు పదునొకండవ దినమునందును మృతాశౌచమునందు పదమూడవ దినమునందును భార్య ఋతిమతియైనప్పుడు అయిదవ దినమునందును పూర్ణమైన శుద్ధికలుగునని శాతాతపుడు చెప్పెను

## స్త్రీకర్తృక శ్రాద్ధ విషయము.

౧౧౬—తా. పెనిమిటియొక్క ప్రేతకృత్యములయందును తల్లిదండ్రులయొక్క ప్రేతకృత్యములయందును స్త్రీకర్తృకత్వము సంభవించిన సమయమునందు పదిదినములలోపల దైవవశముచే ప్రేతకృత్యమును జేయుచుండెడిస్త్రీ వెలుపలున్నయెడల నాజేయబడుచుండెడి కర్మ వ్యర్థమగును. అందువలన స్నానము జేసిన పిమ్మట నైదవ దినమునందు నగ్నశ్రాద్ధము మొదలు తిరిగి ప్రారంభించి చేయవలయును ఈవిధముగానే యాజ్ఞవల్క్యమునియు జెప్పెను. కర్తృత్వము నొందియున్నస్త్రీ రజస్వలైనయెడల స్నానమైనపిమ్మట నైదవదినంబున ప్రారభించి యథావిధిగా జేయవలయునని లోకాక్షి యనెను. ఇచ్చట యథావిధిగా యని చెప్పుట వలన మూడుదినముల పర్యంతము గాని పదిదినముల పర్యంతము గాని తిరిగి చేయవలయును ఇచ్చట దేవలు డొకవిశేష విధి చెప్పెను. పెనిమిటి మృతినొందిన దినమున భార్యయే కర్తయై వెలుపలనుండునట్టి సమయంబున శాస్త్రోక్త ప్రకారముగా స్నానముజేసి కృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేసికొని శుద్ధినిబొంది యితరునిచే దహనము జేయించవలయునని చెప్పెను. దీనియభిప్రాయ మేమనగా, ప్రేతభార్య తానేకర్తయై యుండి దహనమునకు పూర్వము వెలుపల నుండెనేని ప్రాయశ్చిత్తకాండములో జెప్పబడిన

రీతిగా మలాపకర్షణ స్నానాదులను జేసి ప్రాజాపత్యాది కృచ్ఛ్రప్రాయ శ్చిత్తములను జేసి బ్రాహ్మణులవలన ననుజ్ఞ దీసికొని పెనిమిటిని దహించు టకు నితరునకు నధికారమిచ్చి దహింపజేయవలయును ఇప్పుడు స్నానము జేసి శుద్ధినొందుట అనువిషయము ఇతరునకు నధికారమిచ్చు నిమిత్తమే గాని తాను దహనాది కృత్యము జేయు నిమిత్తముగాదు. ఈవిధముగానే వసిష్ఠుడును జెప్పెను. ఇట్లు చేయుటకు వీలులేనియెడల అమంత్రకముగా దహింపజేసి తాను స్నానము జేసిన పిమ్మట నైదవదినంబున శుద్ధినొంది యస్థులను దెచ్చి తిరిగి దహనాది కృత్యములను సమంత్రకముగా స్వశాఖ యందు జెప్పంబడినరీతిని శాస్త్రప్రకారము అస్థి సంచయనము నవశ్రాద్ధ ములు ఆద్యశ్రాద్ధము షోడశ సపిండీకరణాదుల నన్నియు యథావిధిగా జరుపవలయును.

## పెద్దకుమారుఁడు తిరిగి కర్మ జేయు విషయము.

౧౧౭౪—తా. పెద్దకుమారుఁడు వద్దలేనప్పుడు చిన్నకుమాళ్లచే యావత్తు కర్మలు చేయబడినపిమ్మట పెద్దకుమారుఁడు వచ్చెనేని దహనసంచ యములను విడిచి మిగిలినవి పెద్దకుమారుఁడు తిరిగి చేసికొనవలయును. మఱియు పది దినములలోపల కొంతకర్మ జరిగినపిమ్మట పెద్దకుమారుఁడు వచ్చినయెడల సర్వకర్మలను జేయుటకు నతనికే యధికారముగలదు కాబ ట్టి దహనసంస్కారము సంచయన సంబంధములగు మంత్రములను సంకల్ప పూర్వకముగ జదివి అక్కడనుండి చేయఁదగినవి క్రియాపూర్వకముగ జేయవలయును. పది దినములు గడచినపిమ్మట క్రియాపూర్వకముగానే దహనాది సంస్కారములను జేయవలయునని యొకరు చెప్పిరి. పెద్దకుమా రుఁడు రోగముతో నశక్తుడయ్యెనేని తాను దహనాస్థి సంస్కారములను జేసి తర్వాత కృత్యములను తమ్మునిచే జేయించవలయును. కుమారుఁడు కర్మను జేయుటకు యోగ్యతకలిగేనిమిత్తము నిర్మలమైనచిత్తముకలవాడై ముప్పదిమూడు పర్యాయములు ప్రాణాయామము జేయవలయును లేక కృచ్ఛ్రప్రాయశ్చిత్తమును జేయవలయును. ఒకమాడ బంగారమునుగాని దానిలో సగముగాని సువర్ణదాన మియ్యవలయును అని మరీచి చెప్పెను. ఆశౌచ నివృత్తిపర్యంతము తిలోదక పిండదానముల జేయవలయును. అని విష్ణువు చెప్పెను. సంవర్తుడు చెప్పిన విశేష మేమనగా, ఆశౌచము పట్టిన జ్ఞాతులందరును పదిదినముల పర్యంతము తిలోదకములను విడువ వలయు ననియు కర్మను జేయువాడు ప్రేతకు బంధువు కాబట్టి తాను తిలో

దకములను విడుచుచు పిండమును వేయుచుండవలయు ననెను. పూర్వా ష్ణామునందుగాని యపరాహ్ణామునందుగాని జేయవలయును. ఆశౌచపర్యం తమని విష్ణువచనమువల్లను పిండసమాప్తిపర్యంతమని ప్రచేతసునివాక్య మువల్లను పదిదినములవరకును అంజలివృద్ధిగా తిలోదకములను విడువ వలయును.

## —{ పదిదినములలోపల దర్శవచ్చినయెడల ఔరసుడు చేయవలసిన విధానము. }—

౧౧౮—శ్లో. తల్లిదండ్రుల మరణ విషయమై పదిదనములలో మూడుదినములకంటె నధికముగ మిగిలియుండు నప్పుడు అమావాస్య వచ్చినయెడల మిగిలియున్న తిలోదక పిండదానముల నన్నియు నప్పుడే పూర్తిచేయవలయునని చెప్పిన గాలవవచనము ఔరసుడు మొదలగు వారికంటె నితరులు చేయువారి విషయము, పదిదినములలో అమావాస్య గాని సంక్రాంతిగాని వచ్చినయెడల పుత్త్రునికంటె నితరులు చేయునప్పుడు ఆదినముతోనే తిలోదక పిండదానములను సమాప్తిచేయవలయును. అని కాలనిర్ణయమునందు జెప్పఁబడెను. ఈప్రకారము ఔరసుడు దత్తకుమా రుఁడు దౌహిత్రుఁడు కర్మలను జేయు విషయములో పదిదినములలో నమా వాస్య సంక్రాంతులు వచ్చినప్పుడు పదిదినముల పర్యంతము యథావిధిగా తిలోదక పిండదానముల నివ్వవలయు ననియు వీరికంటె నితరులు కర్మ జేయునప్పుడు అమావాస్యతోనే సమాప్తి జేయవలయు ననియు వరద రాజీయసంగ్రహము ద్రాహ్యాయణీయము మొదలగు స్మృతులయందు జెప్పఁబడెను. తల్లిదండ్రుల ప్రేతకృత్యములయందు దశాహమధ్య నమా వాస్య .వచ్చినప్పుడు అంతటితోనే సమాప్తిజేసిన కులనాశన మగునని ప్రత్యవాయము చెప్పఁబడినది కాఁబట్టి దశాహపర్యంతము తిలోదక పిండ దానాకర్షము చేయగూడదని నిర్ధారణ చేయఁబడినది. మఱియొక రీట్లు చెప్పిరి. దశాహతంత్రము జరుగుచుండగా నమావాస్య వచ్చెనేని దర్శ తోనే సమాప్తిజేసి స్నానము మాత్రము చేయుచుండవలె ననియు అమా వాస్యకు పూర్వము ఒకచంద్రదర్శనము పాడ్యమి మొదలు ఒకచంద్రదర్శ నము కాఁబట్టి ద్విచంద్రదర్శన మనిపించుకొనును దానిలో ప్రథమచంద్ర దర్శనముతోనే సమాప్తి జేయవలయును. రెండవ చంద్రదర్శనమున తిలోదక పిండదానాదులజేసిన దాతయొక్క కులనాశన మగుననియు



చేయగూడదని త్రయోదశియందు మృతినొందినను అమావాస్యను [illegible]

యు జెప్పఁబడుచుండెడి భవిష్యత్పురాణ పైఠీనసి సంగ్రహవచనములు మొదలగునవి తల్లిదండ్రులకంటె నితరుల విషయము. ఇతరుల విషయమైతే అమావాస్యతో సమాప్తిజేసినను స్నానము జేయుచు దశాహపర్యంతము సూతకమును పట్టుచుండవలెను. ఇట్లు చేసినను ఆద్యశ్రాద్ధము ఆశౌచ నివృత్తి నిమిత్తమైనది కాబట్టి అది యేకాదశదినమునందే చేయవలయు ను. మాతాపితృ దశాహమధ్యయందు దర్శవచ్చినయెడల యథావిధిగానే జరుపవలయుననియు మరియొక ప్రత్యామ్నాయముగా జేయువిధానము లేదనియు చెప్పిరి మరియు ననేకు లనేకప్రమాణములను జెప్పిరి. అవి యన్నియు పైనజెప్పిన విషయములను గుఱించియే చెప్పినవి. అందువలన విశేషముగా నిచ్చట వ్రాయఁబడ లేదు.

వపన విధి విషయము.

౧౧౯—తా. మరణాశౌచమందును జననాశౌచమందును రెండవ దినమునందుగాని పదియవదినమునందుగాని వపనమును జేయించు కొననియెడల పాపము కేశముల నాశ్రయించి యుండునని వృద్ధశాతాతపుడు చెప్పెను. ఇతర స్మృతులయందు నావిధముగానే జెప్పఁబడెను. జననమరణముల విషయమై పదియవదినంబున వపనము జేయించుకొనని యెడల నతనికి స్నానాధికారము లేదు. ఆశౌచ మెల్లప్పుడుండును. అని స్మృతిచంద్రికయందు జెప్పఁబడెను. తైలాభ్యంగనమందును వమనమందును వపనకర్మయందును మైధునకర్మయందును ఆచమనము జేయక సంభాషించువాడు మూడుదినముల పర్యంత మశుచిగానే యుండును. జననమునందు పదియవదినంబున శిశువు తల్లిదండ్రులును వపనము జేయించు కొనని యెడల స్నానదానాది కర్మలకు నధికారము లేదని చెప్పఁబడెను. ఇట్లు చెప్పుటవలన ఆయావిధుల నతిక్రమించినయెడల కర్మకు నధికారము లేదనే విషయము మరణాశౌచమునందు ప్రథమదినంబున జ్ఞాతులతో సహా వపనమును జేయించు కొనవలయుననియు జననాశౌచమునందు పదియవదినంబున తండ్రి జేయించుకొన వలయుననియు జెప్పఁబడెను గాన జననమునందు పదియవదినంబున వపనము తండ్రికే గాని యితరులకు లేదని జెప్పఁబడెను.

రోదన శవాను గమనముల విషయము.

౧౨౦—తా. అసగోత్రుడు మృతినొందినప్పుడు స్నేహము బంధుత్వము మొదలగు కారణములచే ప్రేతబంధువులతో గూడ తాను రోదన

ము జేసినను శవముతోఁగూడ వెళ్లినను ఆదినమంతయు జపహోమశ్రాద్ధాది కర్మలవిషయమై యోగ్యతసంభవించదు అతనికి ఆశౌచము లేకపోయినను కర్మలను జేసికొనుట యోగ్యత లేదు. ఈవిధముగానే పారస్కరుడును జెప్పెను. శవానుగమనము జేసినవాడు ఘృతప్రాశనజేసి యాదినమంతయు స్నానదానాది కర్మలను జేయగూడదని చెప్పెను.

దేవపూజా నిషేధము.

౧౨౧—తా. వారాహ పురాణమునందు జెప్పఁబడిన దేమనగా, శవముతో గూడ శ్మశానప్రదేశమునకు వెళ్లినను శవమును మోసికొని శ్మశానమునకు దీసికొనివెళ్లినను ఆదినమంతయు వానికి పరిశుద్ధిలేదు. అందువల్ల నెవడైనను తెలియక నాదినమునందు నన్నుపూజించిన యెడల నేడు జన్మంబులజేసిన పుణ్యము తత్‌క్షణము నశించును. మఱియునన్ను పూజించినవాడును ఆదినమున పగలు భుజించినవాడును పిచ్చికగాని బల్లిగాగాని జనియించును. అని భగవంతుఁడు చెప్పెను. కాఁబట్టి శవానుగమన శవవహనముల జేసినదినమున దేవతారాధన జేయఁగూడదని జెప్పఁబడెను.

బ్రహ్మచారికి కర్తృత్వ విషయము.

౧౨౨—తా. బ్రహ్మచారి వ్రతనియమము కలవాడై ప్రేతకృత్యములను జేయుచుండు సమయంబున ఆశౌచము గలవా డగునుగాని ప్రతి దినమునందును ప్రేతకృత్యమును జేసినపిమ్మట స్నానము జేసిన యెడల పరిశుద్ధికలవాడే యగును. ఆశౌచకములవారియొక్క యన్నపానీయములను భుజించినయెడల పదిదినములపర్యంతను అశుచికలవాడే యగును. వానికితిరిగి యుపనయనము జేయవలయును. కాఁబట్టి తల్లిదండ్రులయొక్కయు గురువుయొక్కయు ప్రేతకృత్యములను విడిచి యితర శవధర్మముల ననుసరించి ప్రవర్తించినయెడల నశుచికలవాడగునని బోధాయనుడు చెప్పెను బ్రహ్మచారి తల్లిదండ్రులకు పిండదానాది క్రియలను జేసినంతపర్యంతమశుచివంతుడై స్నానముజేసినపిమ్మట శుచిత్వమును బొందునని ప్రజాపతి చెప్పెను బ్రహ్మచారి యితరుల గృహమునందు నగ్నిహోత్రములను జేయుచుండు సమయంబున ఆగృహమునందు ప్రేతవిషయము సంభవించి నప్పుడు స్నానముజేసినందువల్లను శుచియగును. అని పరాశరుఁడు చెప్పెను. బ్రహ్మచారి నియమము కలవాడైనను గురువునకు ప్రేతకృత్యమును జేయవచ్చును. ఆశౌచాన్నమును భుజించినయెడల దశరాత్రముల శుచి

కలవాడగునని మనువు చెప్పెను. ఆచార్యుని ఉపాధ్యాయుని తండ్రిని తల్లిని గురువుని గురించి దహనాది కృత్యములను జేసిన బ్రహ్మచారికి వ్రతలోపము లేదనియు జెప్పఁబడెను. సంతానములేని మాతామహునకు మేనమామకు వీరిభార్యలకు సంస్కారము జేసినను బ్రహ్మచారికి వ్రతలోపము లేదని భృగువు చెప్పెను. ఆచార్యుడు ప్రభువు ఉపాధ్యాయుడు వీరికి ప్రేతకృత్యములను బ్రహ్మచారి చేసినను వారియాశౌచాన్నమును భుజింపఁగూడదు ఆశౌచము కలవారితో సంపర్కము కలుగగూడదు అని యాజ్ఞవల్క్యముని చెప్పెను తల్లి దండ్రి గురువు ఆచార్యుడు ఉపాధ్యాయుడు మాతామహుడు మేనమామ మొదలగువారిని తాను స్వయముగా దహించినను వారియాశౌచాన్నమును భుజింపగూడదు. వారి సహవాసము జేయఁగూడదనియు బ్రాహ్మపురాణమునందు జెప్పఁబడియెను. ఇట్లు ప్రేతకృత్యములను జేసిన నియమముగల బ్రహ్మచారి యాదినమునందు అశుచియై మరునాడు స్నానము జేసి శుద్ధికలవాడగును. ఇట్లు చేయనియెడల వ్రతభ్రష్టుడై తిరిగి యుపనయనమును జేయదగినవాడగును. అందువలన రెండవదినము మొదలు ప్రేతకృత్యమును జేసిన వెంటనే స్నానముజేసి శుద్ధినొందవలయును. వ్రతస్థుడు అని చెప్పుటవలన గర్భిణీపతివిషయమునుకూడ గ్రహించుకొనదగును. తల్లిదండ్రులు సంతానములేని జ్యేష్ఠభ్రాత సంతానములేని మేనమామ వీరి శవదహన వహనాదికృత్యములను గర్భిణీపతి చేసినను దోషము లేదు వీరికంటె నితర ప్రేతకృత్యములను చేయగూడదనియు మనువు చెప్పెను. కాఁబట్టి బ్రహ్మచారి వ్రతనిష్ఠుడైనను తల్లిదండ్రులు మాతామహుడు మాతులుడు గురువు జ్యేష్ఠభ్రాత మొదలగువారి ప్రేతకృత్యములను జేయవచ్చును. వీరికంటె నితర ప్రేతకృత్యములను జేసినయెడల తిరిగి సంస్కారమును జేయవలయునని సమస్త స్మృతులయందును నిర్ధారణచేయబడినదని తాత్పర్యము.

శవానుగమన ప్రాయశ్చిత్తము.

౧౨౩—తా. బ్రాహ్మణులు బ్రాహ్మణశవములతో శ్మశానమువరకు గూడ వెళ్లినయెడల స్నానముజేసి పిమ్మట నగ్నినిజూచుట ఘృతమును భక్షించుట తిరిగి స్నానముజేసి ప్రాణాయామము జేయుట మొదలగునవి చేసినందువలన పరిశుద్ధులగుదురు. స్నేహము బంధుత్వము మొదలగు కారణములచే జ్ఞాతులశవముతోగాని అసగోత్రశవముతోగాని శ్మశానపర్యంతము వెళ్లినవారు ఆబట్టలతోనే స్నానముజేయుట ఘృతప్రాశన

ము జేయుటవలనను పరిశుద్ధికలవాడగునని యాజ్ఞవల్క్యుడు ఉశనుడు హారీతుడు మొదలగు మునీశ్వరులు చెప్పిరి. శవానుగమనమునందును క్షౌరమందును ముందు స్నానముజేసి యతడివస్త్రములను విడిచి శుభ్రమైన పొడివస్త్రములను ధరించి క్షౌరమైన పిమ్మట తిరిగి స్నానము జేయవలయునని హారీతుడు చెప్పెను.

శవానుగమనమునందు మఱికొన్ని నియమములు.

౧౨౪—తా శవముతోగూడ వెళ్లునప్పుడు శవమునకు ముందుగాగాని ప్రక్కలనుగాని నడువగూడదు. శవమునకు ముందుగా నడిచినప్పుడు ప్రతియడుగునకు నాయువు నశించుననియు ఆదోషమునకు ప్రాయశ్చిత్తము లేదనియు జెప్పఁబడెను. కాఁబట్టి శవమునకు వెనుకనే నడిచి వెళ్లవలయును. అప్పుడు సంభవించిన శవానుగమనదోషము ప్రాయశ్చిత్తముజేసికొనిన నివృత్తియగును సంస్కారము ప్రారంభించక పూర్వము స్నానముజేసినయెడల శుద్ధికలవాడగును సంస్కారము ప్రారంభించిన పిమ్మట సంస్కారము సమాప్తియగు పర్యంతముండి స్నానము జేయవలయును. ఇది యితరుల విషయమని చెప్పిరి. సగోత్రులవిషయమై సంస్కారము ప్రారంభించక పూర్వము స్నానము జేయవలయును. సంస్కారము సమాప్తియైన పిమ్మటను స్నానముజేయవలెను.

స్నానకాలము.

౧౨౫—తా. సగోత్రులకు దహనాత్పరమందు స్నానమని మనువును, శవముతోగూడ వెళ్లినవాడు శవమును దహించుట మొదలిడి ధూమదర్శనమైన పిమ్మట స్నానము జేయవలయుననియు సోమయాజి విషయమై కపాలము దహనమైన పిమ్మట స్నానమనియును స్మృతులును చెప్పియున్నవి. ధూమదర్శనమైన పిమ్మట స్నానము జేయవచ్చునను విషయము అసగోత్రులు శవముతోగూడ వెళ్లినయెడల శవమునకు నగ్నిసంయోగముజేసిన పిమ్మట స్నానముజేయవచ్చునని యితరులను గుఱించి జెప్పఁబడినది. దీనిని గుఱించి శాతాతపుడు ప్రచేతసుడు చెప్పిన విషయమేమనగా, శవమును చితియందుంచి యగ్నిస్పర్శజేసిన పిమ్మట యాదిక్కును జూడనివారై నది తటాకము మొదలగు జలముగల ప్రదేశములకు వచ్చి వస్త్రశోధనము జేసికొని సచేలస్నానము జేయవలయును. అనంతరము నియతమైన మనస్సుగలవారై యొకశిలను దెచ్చి దానిమీద బ్రాహ్మణుడు పదియంజలులును, క్షత్రియుడు పండ్రెండును, వైశ్యుడు పదియైదు

ను, శూద్రుడు ముప్పదియును, జలాంజలులను విడిచి యింటిలో ప్రవేశించి దీపమునుజూచి తిరిగి స్నానముజేసి గృహమును పరిశుద్ధి జేసికొనవలయును. సగోత్రులుగాని యసగోత్రులుగాని యని చెప్పుటవలన స్నానానంతరము అగ్నిదర్శన ఘృతప్రాశన మొదలగునవి సగోత్రులు కూడ చేయవలయునని తెలియఁబడుచున్నది. ఇట్లు స్మృతియందు చెప్పఁబడినది. శవమును మోసినవారుగాని కూడ వెళ్లినవారు స్త్రీలుగాని పురుషులుగాని యెవ్వరైనను దహనమైన పిమ్మట దాహకునితోగూడ స్నానముజేసి గ్రామములోనికి రావలయును. అట్లు జేయక అజ్ఞానముచే గ్రామములోనికి వచ్చినయెడల మూడుదినముల పర్యంత మశుచికలవాడే యగును లేక యేదైన నొకయాపత్తుచే స్నానముజేయక శ్మశానమునుండి గ్రామములోనికి వచ్చినయెడల నొకదినమువరకైనను అశుచివంతుడే యగునని ధర్మశాస్త్రములు జెప్పుచున్నవి.

బాలురు మొదలగువారి విషయము.

౧౨౬—శా. బాలుడుగాని వృద్ధుడుగాని దిక్కులేని బ్రాహ్మణుడుగాని మృతినొందినప్పుడు ఆశవముతో గూడ బ్రాహ్మణుడు శ్మశానమువరకు వెళ్లినప్పటికిని స్నానముజేసిన శుద్ధికలవాడే యగును. అగ్నిహోత్రస్పర్శనము ఘృతప్రాశనము జేయ నక్కరలేదు. మఱియు అఖండాదర్శనము మొదలగు స్మృతులయందును సమస్త విద్యాసంపన్నుడుగాని యజ్ఞములనుజేసిన వాడుగాని యుపనయనముగాని బాలుడుగాని వివాహముగాని చిన్నదిగాని దిక్కులేని వాడుగాని శిష్యుడుగాని మృతినొందినప్పుడు ఆశవముతోగూడ పరేత భూమికి వెళ్లినను స్నానముతోనే శుద్ధి కలుగును. ఘృతప్రాశనాదు లక్కరలేదని యున్నది. ఇట్లు చెప్పుటచే మానవలయునని నియామకము లేదు. ఘృతప్రాశనాదులను జేసినచో దోషములేదు చేయకుండినచో దోషములేదు. అని గ్రంథములయందు జెప్పబడినది. అగ్నిహోత్రము ఘృతము దొరకనిపక్షమునందు స్నానము జేసిన పిమ్మట వ్యాహృతులతోగూడ పదివర్యాయములు గాయత్రిమంత్రమును జపించి దోసిలిలో సగము పరిమితిగల జలమును పానముజేసిన యెడల పరిశుద్ధి కలవాడే యగును.

—{ పది దినములలోపల అమావాస్య వచ్చినయెడల చేయవలసిన విధానము. }—

౧౨౭—శా. దశాహమధ్యమందు దర్శసంక్రమణములు సంభ

వించినప్పుడు చేయవలసిన విధానము (118) సంఖ్యగలదానిలో ఔరస పుత్త్రుని గురించి చెప్పఁబడిన విషయములోనే సిద్ధాంతము చేయబడినది. అయినను తిరిగి నిచ్చట మూలములో విశేష ప్రమాణములు కనుపరచినందున వానియభిప్రాయము లన్నియు నొకవిధముగానే యుండుటవలన సంక్షేపముగ వ్రాయఁబడును. తల్లిదండ్రులయొక్క కర్మను ప్రారంభించి చేయుచుండగా పది దినములలోపల సంక్రాంతిగాని యమావాస్యగాని వచ్చినయెడల మిగిలిన దినముల సంబంధమైన తిలోదక పిండదానముల నపకృష్యముజేసి యమావాస్యతో సమాప్తి జేయఁగూడదు. పదిదినముల పర్యంతము యథావిధిగా నిత్యము తల్లిదండ్రుల విషయమై జేయుచునే యుండవలయును. అమావాస్యతో సమాప్తిజేసిన కులక్షయమగునని జెప్పఁబడెను. ఔరసపుత్రుడు తల్లిదండ్రులకు జేసిన విధముగానే మాతామహుడు మాతామహి, గురువు వీరికి కర్మను జేయు పక్షమునందు జెప్పఁబడినది. వీరికంటె నితరులకు కర్మను జేయు సమయమునందు పదిదినములలో నమావాస్య సంక్రమణములు వచ్చినయెడల అమావాస్యతోనే మిగిలియున్న దినములసంబంధమైన తిలోదక పిండదానముల నపకృష్యముజేసి సమాప్తి జేయవలయును. అట్లు చేయనియెడల కులనాశనమగునని జెప్పఁబడెను. అమావాస్యతోనే సమాప్తి జేయవలయునని చెప్పుట యందువల్ల ననగా, అమావాస్యకు పూర్వము ఒకచంద్రదర్శనము. అమావాస్య వెళ్లిన పాడ్యమి మొదలు ఒక చంద్రదర్శనము. అందువలన ద్విచంద్రదర్శనము సంభవించినది. ద్విచంద్ర దర్శనమునందును పిండతిలోదక దానముల చేసిన యెడల కర్తయొక్క కులక్షయమగునని శాస్త్రములయందు జెప్పి యుండుట వలన అమావాస్యతోనే సమాప్తి చేయవలయునని చెప్పిరి. ఈవిషయము తల్లిదండ్రులకంటె నితరులకు జేయు ప్రేతకృత్యముల విషయమని సిద్ధాంతము చేసిరి కాఁబట్టి అన్నిజాతులయందును స్త్రీలుగాని పురుషులుగాని కృష్ణపక్ష త్రయోదశియందైనను చతుర్దశియందైనను మృతినొందినప్పటికిని ఇతరుల కర్మను జేయు పక్షములో అమావాస్యతోనే తిలోదక పిండదానములను సమాప్తిజేసి పదిదినముల పర్యంతము స్నానముజేయుచు పదియవదినమునందు దశాహకృత్యమును జరిపి పిమ్మట ఏకోద్దిష్టవిధానముగా జేయఁబడు ఆద్యాదిశ్రాద్ధషోడశ సపిండీకరణాదులనన్నియు నాయా కాలములయందే జేయవలయును. ఇట్లు బ్రహ్మాండపురాణ కాలనిర్ణయాది గ్రంథములయందు జెప్పఁబడినది. వసిష్ఠుడు గౌతముడు అంగిరసుడు

ఋష్యశృంగుడు గాలవుడు మొదలగు స్మృతికర్తలును చెప్పిరి. ఏసంక్ర
మణములో మృతినొందునో ఆసంక్రమణముతోనే తిలోదక పిండదానా
దులను సమాప్తి జేయవలయునని సంక్రమణమును గురించి వ్యాఘ్ర
పాదుడు చెప్పెనుగాని అదియును తల్లిదండ్రులకంటె నితరవిషయము.
దేశకాలోపద్రవములు కలిగినప్పుడు మహాభయరాష్ట్రబాధాదులు కలిగి
నప్పుడు తల్లిదండ్రుల విషయమునందును తిలోదక పిండదానముల నమా
వాస్యతో సమాప్తిజేసి ఆద్యాదిశ్రాద్ధముల నాయాకాలములయందు
జేయవలయునని చెప్పబడెను.

## బ్రహ్మచారి కర్తృత్వ విషయము.

౧౭౭—తా. బ్రహ్మచారి తల్లిదండ్రులకును మాతామహుడు
మాతులుడు సంతానములేనియెడల వారిభార్యలకును సంస్కారము జేసిన
యెడల వ్రతమునకు లోపములేదు మఱియు జ్యేష్ఠభ్రాత తండ్రిసోదరులు
మొదలగువారి విషయము పూర్వము జెప్పంబడిన గ్రంథములయందు
స్పష్టముగ జెప్పకపోయినను విద్యను మంత్రము నుపదేశకర్తలగు ఉపా
ధ్యాయుడు ఆచార్యుడును చెప్పంబడెను గాన జ్యేష్ఠభ్రాత, పెదతండ్రి,
పినతండ్రి, మొదలగువారును ఆగణనలోనే చేరియుండిరి. అందువలన
వారికి ప్రేతకృత్యములను జేసినను బ్రహ్మచారికి బ్రహ్మచర్యాశ్రమమునకు
లోపములేదనిరి. మఱియు జ్యేష్ఠుడు తమ్మునియందు పుత్రభావమును
తమ్ముడు జ్యేష్ఠునియందు పితృభావము నుంచవలయునని మనువు, జ్యేష్ఠ
కనిష్ఠులకు పితృపుత్రభావములు కనపరచినందున మంత్రోపదేశాదిధర్మ
ములు లేకపోయినను జ్యేష్ఠునకు ప్రేతకృత్యము జేసి నందువల్ల బ్రహ్మ
చారికి వ్రతలోపములేదనియితరులుచెప్పిరి. అని భృగువు చెప్పెను గానపున
రుపనయనాది సంస్కారములుచేయ నక్కరలేదని చెప్పిరని తాత్పర్యము.

## ఆశ్వలాయన బ్రహ్మమేధ నిషేధము.

౧౭౮—తా. కాతకాగ్ని చిత్తుకుగాని మహాగ్నిచిత్తుకుగాని లోష్ట
చయనము జేయవలయునని భాష్యకారునిచే జెప్పంబడెను. అధ్వర్యుని
కృత్యము చయనాంతము కలిగియుండుటవలన బహ్వృచ శాఖవారుగాని
ఛందోగులుగాని మాయొక్క మతము నాశ్రయించి యగ్నైథానాదిక
మును జేసినవారు లోష్టచయనాంతము జేయవలయుననెను. ఆభాష్య
కారుడే బ్రహ్మవేత్తలకు బ్రహ్మమేధ విధానముగా జేయవలయుననెను.
ఆశ్వలాయన శాఖీయులకును అధ్వర్యుకాండమునందు జెప్పంబడిన లోష్ట

చితివలెనే బ్రహ్మమేధవిధానము ఆవశ్యకమైయుండగా అధ్వర్యు కాండము నందు జెప్పఁబడిన లోష్టచయనమువలెనే ముఖ్యముగా జేయవలయునని చెప్పునట్టి వచనములు లేక పోవుటవలన బ్రహ్మమేధము లేదనిరి. ఒకశాఖ యందు జెప్పబడక పోయినప్పటికిని విరుద్ధము కాదనియు అపేక్షితమైన ధర్మము మరియొక సూత్రములో జెప్పఁబడినయెడల దానిని గ్రహింపఁ దగుననెడి న్యాయమువలన ప్రకృతివలెనే వికృతికూడ చేయవలయునని చెప్పుటచే ప్రధానకర్మయందు లేకపోయినను అంగభూతములగు కర్మల యందు ప్రవర్తించుచున్నది. ఆసూత్రమునందు ప్రధానకర్మను జెప్పుట వలనను అవయవభూతములు జెప్పఁబడక పోవుటవలనను కర్మలకు విరోధమువలనను వారికి బ్రహ్మమేధము నిషేధింపఁబడినది. కర్మలకు విరోధ మెందువల్ల ననగా, హోతృపితృమేధములు రెండును కలిపి చెప్పఁబడినవి గాని వేరువేరుగా జెప్పఁబడలేదు ఉత్తరపితృమేధము సంక్షేపముగ హోతృపితృమేధములతో సంసృష్టముజేసి చెప్పఁబడినదిగాన ముందు చెప్పబోవురీతిగా జేయవలయును. పూర్వము ప్రకృతివిషయమై చెప్ప బడిన విధముగా ప్రకృతిని గుఱించిచేసి యనంతరము హోతృవిధాన మును జేయవలయునుగాని వ్యత్యాసముగ జేయఁగూడదు ఎందువల్ల ననగా. ఆశాఖయందు పితృమేధ మంత్రములు బ్రహ్మమేధ మంత్రములు లేక పోవుటవల్లను ప్రతికర్మయందును పితృమేధ మంత్రములను బ్రహ్మ మేధ మంత్రములు లేక పోవుట వల్లను ప్రతికర్మయందును పితృమేధ మంత్రములను బ్రహ్మమేధ మంత్రములను సమష్టిగా వినియోగపరుచుట వలనను వారి గృహ్యసూత్రమునందు అట్టి కర్మలనుగాని మంత్రములను గాని చెప్పక పోవుట వల్లను బ్రహ్మమేధము లేదనిరి. తమ తమ శాఖల యందు జెప్పఁబడిన ధర్మములకు విరుద్ధముగా నుండెడి యన్యధర్మముల నాచరింపఁ గూడదనియు తమశాఖాధర్మములకు విరోధముగా లేనట్టి యన్యశాఖాధర్మములనైన నాచరింపవచ్చునని యాశ్వలాయనుడు చెప్పె ను. ఏయేధర్మములు సులభములై విశేషఫలము కలుగునట్లు ఇతర శాఖ లయందు జెప్పబడినవై ఆధర్మములు తమ శాఖోక్తధర్మములకు విరుద్ధ ముగ నుండక న్యాయవిధిగా నుండి పరమార్థ సహితములగునేని యాధ ర్మములు ఇతర సూత్ర సంబంధములైనను విద్వాంసులైనవారు యాచ రింతురు. అది యేవిధముగా ననగా, "యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి" అను శ్రుతివలన జీవించియుండు పర్యంతమగ్నిహోత్రమును జేసి

కొనవలయునను ధర్మముసార్థకమైన దగుటవలన అగ్నిహోత్రాది ధర్మము తనసూత్రమునందు జెప్పఁబడక పోయినను స్వసూత్రోక్త ధర్మములకు విరోధము లేక పోవుటవలన నితరసూత్రములయందు జెప్పఁబడినను జేయవచ్చునని బోధాయనుడు వచించెను. ఆప్రకారము బ్రహ్మమేధ విషయము గ్రహింపకూడదు ఎందువల్లననగా. ఆశ్వలాయన గృహ్యసూత్రమునందు పితృమేధము విశేషముగా జెప్పఁబడకపోవుట వలనను, సామాన్యముగా జెప్పఁబడిన పితృమేధముతోనే శరీరసంస్కారసిద్ధి కలుగుచుండగా తిరిగి బ్రహ్మమేధ సంస్కార మావశ్యకత లేకుండుటచే గ్రహింపఁగూడదు. ఆపస్తంబులకు పితృమేధము లేకుండా బ్రహ్మమేధసంస్కారము లేదు. కాఁబట్టి బ్రహ్మమేధము గ్రహింపఁబడును. ఆశ్వలాయనులకైతే స్వపితృమేధవిధిగా జేయబడిన సంస్కారముతోనే బ్రహ్మమేధము సిద్ధించిన దగును. యొకవిధిని మొదలిడి మఱియొక విధానముచే చేయఁబడెనేని కర్మవిరోధము సంభవించును. మొదట ప్రారంభించిన కర్మను పూర్తిచేసి తిరిగి యావిధానముగా జేయుదమనుకొనిన ప్రారంభించదగిన కర్మయే లేదు కాఁబట్టి యాశ్వలాయనులకు బ్రహ్మమేధ విధానము నిషేధింపఁబడినది. అసగోత్రుడుగాని సగోత్రుడుగాని ప్రేతసంస్కారము జేయవచ్చునని జెప్పఁబడియున్నది కాఁబట్టి యెవడు దహనాది సంస్కారముల జేసినను ప్రేతయొక్క శాఖా సూత్ర విధానముగానే దహనాది విధులన్నియు జేయవలయునని విధిగా జెప్పఁబడెను.

## ఇతరశాఖీయులు సంస్కారము జేసినయెడల తిరిగి సంస్కారము జేయు విధానము.

౧౩౦—తా. వివాహమునందు మధుపర్కమునిచ్చే విషయములో వరునియొక్క శాఖాసంబంధమైన గృహ్యసూత్ర ప్రకారముగానే జెప్పవలయునుగాని యన్యశాఖీయుడై యున్నట్టి దాతయొక్క సూత్రప్రకారముగా జెప్పగూడదనియు మఱియొక విధముగా జేసినయెడల తిరిగి వరుని సూత్ర ప్రకారమే జరిగించవలయు ననియు జెప్పఁబడెను. ఇందును గుఱించి కాత్యాయనుడు చెప్పిన దేమనగా, కార్యమును జేయకపోవుట, మఱియొకవిధముగా జేయుట, ఇతరులు చెప్పినట్లు చేయుట, అని మూడు విధములుగా అక్రియ చెప్పఁబడునని కార్యజ్ఞులు చెప్పిరనెను. స్వశాఖా విధానమును వదలి యన్యశాఖావిధిగా జేసినవానికి జేయబడిన కర్మఫలము నివ్వక వ్యర్థమగును. తనచే జేయఁబడిన కర్మ మరియొక విధముగా

జేయబడినదని కొంతవరకు జరిగినపిమ్మట దెలిసినయెడల తిరిగి మొదట నుండియు జేయవలయును. అంతయు పూర్తియైనను తిరిగి చేయవలయును అంగభూతములగు కర్మలను జేసి ప్రధానకర్మ జేయబడని సమయమునందు యావత్తుకర్మలను తిరిగి చేయవలెను ప్రధానమగు కర్మ జేయఁబడి అంగభూతములైన కర్మలు చేయబడక యుండగా దెలిసినయెడల ప్రాయశ్చిత్తమును జేసికొని మిగిలినవానిని తిరిగి చేయవలయును గాని యావత్తు తిరిగి చేయనక్కరలేదు పరశాఖా సూత్రప్రకారము జరిగించుటవలన నన్యథా విధి సంభవించును కాఁబట్టి సాంగముగా తిరిగి చేయవలయును. అందువలన ఇతర సూత్రోక్తమైన యౌపాసన విధిచే దహింపఁబడినను తిరిగి స్వసూత్రౌపాసన విధానముగా దహనవిధి జరుపవలయును. తమ సూత్రమునందు జెప్పబడని తంత్రముల విషయమై పరశాఖాసూత్రవిధిగా నాచరింపఁదగునని కాత్యాయనుఁడు చెప్పెను. అది యెటుల ననగా, "కూశ్మాండై ర్జుహుయాద్యో పూత ఇవ మన్యేత" అనునది మొదలు "కర్మాదిత్వైతైర్జుహుయా త్పూతోదేవలోకాంత్సమశ్నుతే" అను పర్యంతము చెప్పిన మంత్రమువలన కర్మలను జేయుటకు ప్రారంభమందు పరిశుద్ధికొఱకు కూశ్మాండగణ హోమాదులను జేయవలయునని యగ్నిహోత్రమును వలెనే విధిగా జెప్పెను. ఈకూశ్మాండాది హోమవిధి స్వసూత్రములో జెప్పఁబడక పోయినను విరోధముగా లేనందునను శరీరశుద్ధి నిమిత్తముచే నవశ్యము జేయవలసి యున్నది. ఆలా చేయనియెడల శరీరశుద్ధి లేకపోవుటచే కర్మాధికారము కలుగదు బ్రహ్మమేధ విషయమైతే ఆలా చేయఁగూడదు. స్వసూత్రవిధిని విడిచి శాఖాభేదముచే జేయుటవలన నన్యథాకరణము సంభవించి దానిచే ప్రత్యవాయము కలుగును. విద్వాంసు డెప్పుడును పరశాఖావిధానము నాచరింపఁగూడదనియు నాచరించిన శాఖాషండుడనియు వసిష్ఠుఁడు చెప్పెను. తనశాస్త్రమునందు జెప్పఁబడిన ధర్మమును వదలి యితర శాఖావలంబనవలన తనశాఖాశాస్త్రమును తిరస్కరించినవాఁడగుటచే భ్రూణహత్యాదోషమును బొందునని బోధాయనుఁడు చెప్పెను. ఇట్లు చేయుటచేత మఋషియందు ప్రామాణ్యము లేకపోవుటవలన నంధతమస్సు యనెడి నరకమునందు బడునని స్మృతిసంగ్రహమునందు కలదు. స్వశాస్త్రమునందుఁ జెప్పబడిన ధర్మము గుణాధిక్యము లేనిదైనను శ్రేష్ఠమనియు పరశాస్త్రోక్తధర్మముభయావహమనియు భగవద్గీతలయందును జెప్పఁబడెను. కాఁబట్టి విద్వాంసులమతమును విడిచి దాక్షణ్యాది శూన్య

ముగా తనయిష్టప్రకారముగా కర్మల నాచరించిన యెడల నవి బాలురు చేయునట్టి యాటలువలెనే ప్రయోజన రహితము లగునని యంగీరసుఁడు చెప్పెను. చతుర్వింశతి మతమునందు జెప్పిన దేమనగా, క్రియలేని జ్ఞానము జ్ఞానములేని క్రియలు చెడిపోయి యుపయోగించ వనెను. అది యేవిధము గా ననగా, గ్రుడ్డివాడు గృహము దహింపఁబడుచుండగా దారి తెలియక గృహమునుండి తప్పించుకొని రాజాలక నశించును. కాళ్లులేని కుంటివాడు దహించుట కనబడుచుండినను నడచుటకు శక్తిలేనివాడై రాలేక నశించును. కాబట్టి క్రియ జ్ఞానము రెండు నుండవలయును. మఱియు స్వశాఖావిధినివిడిచి పరశాఖావిధిని చేసినవాడు తనవంశమునకు నాశకుడై రౌరవాది నరకమును బొందునని లోకాక్షి చెప్పెను. ఏశాఖాప్రకారము ఉపనయనాది సంస్కారములు జరిగియుండెనో ఆశాఖాసంబంధమగు వేదమునే జదువవలయు ననియు నట్లు చేయనియెడల పతితు డగుననియు జెప్పఁబడెను ఇట్లు అనేక ప్రమాణములవలన బ్రహ్మమేధ సంస్కారము ఇతరశాఖాధర్మమగుటచేతను చేసినయెడల అయథాక్రియ యగుటచేతను ఆశ్వలాయనులకు నిషేధింపఁబడినది గాన స్వశాఖయందు జెప్పఁబడిన పితృమేధవిధానముగానే సంస్కారము జేయవలయును విశేషకర్మల నాచరించినయెడల విశేషఫలము కలుగునందు రేని యట్లు జెప్పఁగూడదు. విశేషమైనను స్వల్పమైనను తమశాస్త్రమునందే జెప్పఁడిన ధర్మముల ననుష్ఠింపవలయునుగాని యితరశాస్త్రముల ననుసరించి విస్తారముగా జేయగూడదని గృహ్యశాస్త్రవేత్తలు చెప్పినట్లు వృత్తికారుఁడు చెప్పెను.

తిరిగి సంస్కారము జేయుటకు కారణములు.

౧౩౧—శ్లో. స్మృతితత్వనిర్ణయమందిట్లు చెప్పఁబడెను. ఔపాసనాగ్నిచే దహింపఁబడక పోయినను ఇతర సూత్రప్రకారముగా దహనము చేసినను తిరిగి దహించవలయు ననెను. ఏకాదశాహస్సునందు నేకోద్దిష్ట శ్రాద్ధము నాచరించి మిగిలినక్రియలను జేయనియెడల తిరిగి సంస్కారము జేయవలయునని బృహస్పతి చెప్పెను అధికమాసమునందును ఆషాఢాది చాతుర్మాసములందును గురుశుక్రుల మౌఢ్యమియందును కాలాతీతమగు శ్రాద్ధమును జేసినయెడల తిరిగి చేయవలయునని ఇతర స్మృతియందు కలదు. మంత్రరహితముగ దహించిన వారలకును అంగవికలత్వాది దోషము గలవారలకును దుర రక్షాదుల కలవా... తిరిగి సంస్కారము జేయవలయునని స్మృత్యర్థసారమునందు జెప్పఁబడెను. అస్థులు కనబడకపోయినను

పలాశవిధిగా దహించిన పిమ్మట నస్థులు కనబడినను తిరిగి దహనవిధి జేయవలయునని యజ్ఞపార్శ్వుడు చెప్పెను.

అస్థిసంచయన కాలములు.

౧౩౨—తా. తిథివారనక్షత్రములు మంచివి కాక పోయినను నాల్గవ దినమునందు అస్థిసంచయనము జేయవచ్చునని గౌతముడు చెప్పెను. యోగ్యమగు తిథివారనక్షత్రములు సంభవించని యెడల బ్రాహ్మణుల ననుజ్ఞదీసికొని సంచయనము జేయవచ్చును. ఏదినమునందు జేసినను వారి వారి వర్ణములకుఁ జెప్పఁబడిన యాశౌచ దినములకు లోపుగానే సంచయనము జేయవలయునుగాని యాశౌచము గడచెనేని తిరిగి దహనము జేయవలయును. ఆశౌచమతిక్రమించి నప్పుడు దర్భలచేతనైనను మోదుగాకులచేతనైన నస్థులచేతనైనను దహనసంస్కారము జరిపి సంచయనము జేయవలెను. సంచయనముగాక పూర్వము అస్థులుపోయి కొన్నిదినములకు గనబడినయెడల తిరిగి దహనవిధి జరుపవలెను అని యీప్రకారము స్మృతిసంగ్రహమునందు కలదు. దేశక్షోభ మహాభయాది కారణములచే నస్థులు నశించెనేని దర్భలతోగాని మోదుగపత్రములతోగాని తిరిగి దహనము జరిపి త్రిరాత్రాశౌచము పట్టవలయును. బ్రాహ్మణులకు నాల్గవదినము సంచయనమునకు ప్రశస్తముగా జెప్పఁబడెను. ప్రతికృతిగా పలాశపత్రాదులచే దహనము జరిగినప్పుడు తత్కాలమందే సంచయనము జేయవలయుననియు యథావిధిగా భస్మాస్థులకు జెప్పినట్లుగానే మంత్రముల నప్పుడే చెప్పవలయునని యితర స్మృతులయందును జెప్పఁబడెను.

అస్థిసంచయనమునకు నిషేధింపబడిన దినములు.

౧౩౩—తా. పంచమి అమావాస్య నందతిథులు భద్రతిథులయందును శుక్ర గురు ఆది మంగళవారములయందును, కృత్తిక మఘ పుష్యమి హస్త ధనిష్ఠ శతభిష పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి నక్షత్రములయందును త్రిపాద నక్షత్రములయందును త్రిజన్మసంజ్ఞగల నక్షత్రములయందును త్రిపుష్కర దినములయందును అస్థిసంచయనము జేయఁగూడదు. చేసినయెడల కులక్షయమగును త్రిపుష్కరములనగా. ద్వాదశి యందు ఆదివారము మఘానక్షత్రము కూడినను, ఏకాదశియందు సోమవారము విశాఖానక్షత్రముకూడినను, దశమియందు మంగళవార మార్ద్రానక్షత్రముకూడినను, విదియయందు శుక్రవారము రేవతీనక్షత్రము కూడినను, తదియయందు బుధవారము మూలానక్షత్రము కూడినను, షష్ఠి

ముల గుఱించిగాని యెముకలను దీయునప్పుడుగాని చెప్పవలసిన మంత్రములను మూలములో జూచుకొనవలయును ఎక్కడెక్కడ నస్థులను దీయబడుచుండునో మాటిమాటికి మంత్రములను జెప్పుచు భేసిసంఖ్యగా దీయవలయును. ఇట్లు ప్రతియవయవమునందును శేషము లేకుండునట్లుగా నస్థులనన్నియు దీసినపిమ్మట భస్మనంతయు ప్రోగుజేసి శరీరాకృతినేర్పఱచి మూఁడుశిలలను దెచ్చి స్నానము జేయించి దక్షిణాగ్రములుగా నావేదికయందు ప్రేతను గుఱించి యొకశిలను దానికి నుత్తరముగ శ్మశానవాసులగు భూతములగురించి యొకశిలను దక్షిణముగ వారికి స్నేహితుల గుఱించి యొకశిలనుంచి యాశిలలను గంధపుష్పాక్షతాదులచే బూజించి కంటకాదిబాధ నివృత్తినిమిత్తము పాదుకలను వర్షము ఎండ మొదలగు బాధ నివృత్తినిమిత్తము ఛత్రమునుంచి శ్మశానప్రదేశమునం దంతటను లాజలను జల్లి అన్నము సూపము మొదలగు పదార్థములతో మూఁడు పిండములను జేసి యొకపిండమును ప్రేతను గుఱించియు, నొకటి శ్మశానవాసి భూతములకు నొకపిండమును, వారిసహచరులకును ప్రీతికొఱకు నుంచవలయును. ఇట్లు సంవర్తుడు చెప్పిన ప్రకారముగ నుంచి తిలాంజలుల నివ్వవలయును. స్నానపానాదినిమిత్త ముదకకుంభము నుంచవలయును. ఇట్లు ప్రేతను గుఱించి శ్మశానప్రదేశమునందు బలివిధి నెవరు చేయరో వారిని పశుపుత్ర కళత్ర బాంధవసహితముగా ప్రేతలు పీడించుచుందురు. అనంతర మస్థికలశను దీసికొనివెళ్లి మోదుగచెట్టు మొదటను కొంచెము గోయిత్రవ్వి జలముతో ప్రోక్షించి దక్షిణాగ్రములుగా దర్భలనుబఱచి మంత్రరహితముగా నచ్చట యెముకలముంతనుంచి పూడ్చివేసి పిమ్మట స్నానము జేయవలయును. కొందరు మృత్తికాస్నానము జేయవలయు ననిరి అదివికల్పము. ఈప్రకారము దర్శపూర్ణమాసేష్టులను ప్రారంభించునట్టి యాహితాగ్నికి జేయవలయును ఆరంభించిన దర్శపూర్ణమాసములు గల యాహితాగ్నికిని. వపనము, మాత్రము జేయవలయు ననిరి. అదియు వికల్పము, చేసినయెడల సంచయన దినమునందు జేయవలయునని ధర్మశాస్త్రజ్ఞులు చెప్పిరి; ఎచ్చట నేమంత్రము జెప్పవలయునో మూలములో ప్రయోగప్రకారము చూడవలయును.

## అస్థిని వపనము.

౧౩౫—తా. సంచయనము జేసిన దినమునందే యస్థిని వపనము జేయవలయును గావున కర్త ప్రాణాయామము జేసి ప్రాచీనావీతుడై ప్రేత

స్వరూపుఁడగు తండ్రియొక్క గోత్రనామములను జెప్పి ప్రేతకు ననంత లోకప్రాప్తికొఱకు నస్థిని వపనము జేయుచున్నానని సంకల్పము జేసి సమానముగా నుండు భూమియందు గొయ్యిత్రవ్వి మొక్కలు మొదలగు నవి లేకుండా బాగుచేసి నీళ్లుచల్లి యిసుకనుకూడ జల్లి దక్షిణాగ్రము లుగా దర్భలనుబఱచి మౌనముగలవాఁడై దక్షిణాభిముఖముగ గూర్చుండి యితర దిక్కులనుజూడక "పృథివ్యాస్త్వా" అను మంత్రమును జెప్పుచు సంబుద్ధిగా ప్రేతనామమును జెప్పి యస్థిని వపనము జేయవలయును. ఇట్లు చేసిన యనంతలోకము సిద్ధించును. కుంభము నుంచడము మొదలు స్నానము చేయువఱకు పూర్వమువలెనే చేయవలయును. "ఉత్తిష్ఠప్రేహి" అను మంత్రమును జెప్పుచు లేచి హావిర్యజ్ఞ సంబంధమగు, నివపనము జేయవలయును. ఇక్కడ నివపనము జేసి, కుంభనిధానాంతము జేయవలయునని యొకపక్షము నివపనముకంటె పూర్వమే కుంభనిధానాంతము జేయవలయునని మరియొక పక్షముకలదు. కుంభనిధానాంతమునందు నివపనము జేసేయెడల తూష్ణీగానే స్నానము జేయవలయును. ఈ రెండుపక్షములయందును విశేషమేమియు లేదని ధర్మశాస్త్రవేత్తలు చెప్పిరని తా.

పునర్దహన ప్రయోగవిధానము.

౧౩౬.—తా. పునర్దహన ప్రయోగవిధానము సోమయాజికి ముఖ్యముగా జేయవలయును. సోమయాజిగాయైన యెడల భూనిక్షిప్తమగు నస్థులను దీసి తిరిగి యస్థి దహనము జేయుదురు. అదియు వికల్పము. అట్లు చేసిన యెడల నాల్గవదినమునందు జేయవలయును. ఈపక్షములో అగ్నిహోత్రహావణిని కృష్ణాజినమును శమ్యను దృషదుపలములను పూర్వము వలెనే ముందుగా దహించగూడదు. ఆసాదనమాత్రమును జేయవలయును. ఆసాదనజేయుటయును కొంద రంగీకరించలేదు. అస్థి సంచయనమైన పిమ్మట శ్మశానప్రదేశమునుండి యగ్నిని దీసికొని దహనమువలెనే కొంత వరకు నిరీక్షించి శ్మశాన దహనప్రదేశమునకు దక్షిణభాగమున ప్రజ్వలింప జేసి మూఁడుదినముల పర్యంతము మండునట్లు చేయవలయును. ఇట్లు మూఁడుదినములు పూర్తియైన పిమ్మట నాల్గవదినము మధ్యాహ్నమందు పునర్దహనము జేయవలయును అది యెట్లనగా. కర్త ప్రాణాయామము జేసి ప్రాచీనావీతుఁడై దేశకాలములను స్మరించి ప్రేతరూపుఁడగు తండ్రి యొక్క గోత్రనామములను జెప్పి ప్రేతకు పునర్దహనము జేయుచున్నానని సంకల్పముజేసి పునర్దహనము జేయు ప్రదేశమును "అపేతవీత" అను

ముల గుఱించిగాని యెముకలను దీయునప్పుడుగాని చెప్పవలసిన మంత్ర ములను మూలములో జూచుకొనవలయును ఎక్కడెక్కడ నస్థులను దీయబడుచుండునో మాటిమాటికి మంత్రములను జెప్పుచు భేసిసంఖ్యగా దీయవలయును. ఇట్లు ప్రతియవయవమునందును శేషము లేకుండునట్లుగా నస్థులనన్నియు దీసినపిమ్మట భస్మనంతయు ప్రోగుజేసి శరీరాకృతినేర్పఱచి మూడుశిలలను దెచ్చి స్నానము జేయించి దక్షిణాగ్రములుగా నావేదిక యందు ప్రేతను గుఱించి యొకశిలను దానికి నుత్తరముగ శ్మశానవాసు లగు భూతములగురించి యొకశిలను దక్షిణముగ వారికి స్నేహితుల గుఱించి యొకశిలనుంచి యాశిలలను గంధపుష్పాక్షతాదులచే బూజించి కంటకాదిబాధ నివృత్తినిమిత్తము పాదుకలను వర్షము ఎండ మొదలగు బాధ నివృత్తినిమిత్తము ఛత్రమునుంచి శ్మశానప్రదేశమునం దంతటను లాజలను జల్లి అన్నము సూపము మొదలగు పదార్థములతో మూడు పిండములను జేసి యొకపిండమును ప్రేతను గుఱించియు, నొకటి శ్మశాన వాసి భూతములకు నొకపిండమును, వారిసహచరులకును ప్రీతికొఱకు నుంచవలయును. ఇట్లు సంవర్తుడు చెప్పినప్రకారముగ నుంచి తిలాంజలుల నివ్వవలయును. స్నానపానాదినిమిత్త ముదకకుంభము నుంచవలయును. ఇట్లు ప్రేతను గుఱించి శ్మశానప్రదేశమునందు బలివిధి నెవరు చేయరో వారిని పశుపుత్ర కళత్ర బాంధవసహితముగా ప్రేతలు పీడించుచుందురు. అనంతర మస్థికలశను దీసికొనివెళ్లి మోదుగచెట్టు మొదటను కొంచెము గొయ్యిత్రవ్వి జలముతో ప్రోక్షించి దక్షిణాగ్రములుగా దర్భలనుబఱచి మంత్రరహితముగా నచ్చట యెముకలముంతనుంచి పూడ్చివేసి పిమ్మట స్నానము జేయవలయును. కొందరు మృత్తికాస్నానము జేయవలయు ననిరి అదివికల్పము. ఈప్రకారము దర్శపూర్ణమా సేష్టులను ప్రారంభించు నట్టి యాహితాగ్నికి జేయవలయును ఆరంభించిన దర్శపూర్ణమాసములు గల యాహితాగ్నికిని. వపనము, మాత్రము జేయవలయు ననిరి. అదియు వికల్పము, చేసినయెడల సంచయన దినమునందు జేయవలయునని ధర్మ శాస్త్రజ్ఞలు చెప్పిరి; ఎచ్చట నేమంత్రము జెప్పవలయునో మూలములో ప్రయోగప్రకారము చూడవలయును.

అస్థిని వపనము.

౧౩౫—తా. సంచయనము జేసిన దినమునందే యస్థిని వపనము జేయవలయును గాన కర్త ప్రాణాయామము జేసి ప్రాచీనావీతుడై ప్రేత

స్వరూపుఁడగు తండ్రియొక్క గోత్రనామములను జెప్పి ప్రేతకు ననంత లోకప్రాప్తికొఱకు నస్థిని వపనము జేయుచున్నానని సంకల్పము జేసి సమానముగా నుండు భూమియందు గొయ్యిత్రవ్వి మొక్కలు మొదలగు నవి లేకుండా బాగుచేసి నీళ్లుచల్లి యిసుకనుకూడ జల్లి దక్షిణాగ్రము లుగా దర్భలనుబఱచి మౌనముగలవాడై దక్షిణాభిముఖముగ గూర్చుండి యితర దిక్కులనుజూడక "పృథివ్యాస్త్వా" అను మంత్రమును జెప్పుచు సంబుద్ధిగా ప్రేతనామమును జెప్పి యస్థిని వపనము జేయవలయును. ఇట్లు చేసిన యనంతలోకము సిద్ధించును. కుంభము నుంచడము మొదలు స్నానము చేయువఱకు పూర్వమువలెనే చేయవలయును. "ఉత్తిష్ఠప్రేహి" అను మంత్రమును జెప్పుచు లేచి హవిర్యజ్ఞ సంబంధమగు, నివప నము జేయవలయును. ఇక్కడ నివపనముజేసి, కుంభనిధానాంతము జేయ వలయునని యొకపక్షము నివపనముకంటె పూర్వమే కుంభనిధానాంతము జేయవలయునని మరియొక పక్షముకలదు కుంభనిధానాంతమునందు నివ పనము జేసేయెడల తూష్ణీగానే స్నానము జేయవలయును. ఈ రెండుపక్ష ములయందును విశేషమేమియు లేదని ధర్మశాస్త్రవేత్తలు చెప్పిరని తా.

పునర్దహన ప్రయోగవిధానము.

౧౩౬.—తా. పునర్దహన ప్రయోగవిధానము సోమయాజికి ముఖ్య ముగా జేయవలయును. సోమయాజిగాని యెడల భూనిక్షిప్తమగు నస్థు లను దీసి తిరిగి యస్థి దహనము జేయుదురు. అదియు వికల్పము. అట్లు చేసిన యెడల నాల్గవదినమునందు జేయవలయును. ఈపక్షములో అగ్ని హోత్రహవణిని కృష్ణాజినమును శమ్యను దృషదుపలములను పూర్వము వలెనే ముందుగా దహించగూడదు. ఆసాదనమాత్రమును జేయవలయు ను. ఆసాదనజేయుటయును కొందరంగీకరించలేదు. అస్థిసంచయనమైన పిమ్మట శ్మశానప్రదేశమునుండి యగ్నిని దీసికొని దహనమువలెనే కొంత వరకు నిరీక్షించి శ్మశాన దహనప్రదేశమునకు దక్షిణభాగమున ప్రజ్వలింప జేసి మూడుదినముల పర్యంతము మండునట్లు చేయవలయును. ఇట్లు మూడుదినములు పూర్తియైన పిమ్మట నాల్గవదినము మధ్యాహ్నమందు పునర్దహనము జేయవలయును అది యెట్లనగా. కర్త ప్రాణాయామము జేసి ప్రాచీనావీతుడై దేశకాలములను స్మరించి ప్రేతరూపుడగు తండ్రి యొక్క గోత్రనామములను జెప్పి ప్రేతకు పునర్దహనము జేయుచున్నా నని సంకల్పముజేసి పునర్దహనము జేయు ప్రదేశమును "అపేతవీత" అను

మంత్రమును జెప్పుచు మోదుగమండతో తుడిచి ముక్కలు మొదలగు నవి లేకుండా భాగుచేసి నీళ్లుచల్లి బంగారపు శకలమునుంచి దక్షిణాగ్రములుగా దర్భలను పరచి పూర్వమువలెనే కాష్ఠములతో చితినేర్పరచి దానిమీద నగ్నినుంచి యాచితికి పడమరభాగముగ దక్షిణాగ్రములుగా నుండునట్లు దర్భలనుపరచి దానిమీద కంఠభాగము దక్షిణముగాను లోమములు క్రిందుగా నుండునట్లు కృష్ణాజినమును బోర్లగిలగపరచి దానిమీద దక్షిణకుంభమును శమ్యను దృషదుపలములనుంచి పూర్వము తీసి జాగ్రతపెట్టియుంచిన యస్థులను దెచ్చి దృషమందునుంచి నెయ్యిబోసి పేషణ జేయవలయును. నెయ్యిబోయకుండను పేషణజేయవచ్చును. వీని నన్నింటిని దీసి కలిపి యాజ్యకుంభమందుంచి యగ్నిహోత్ర హవణియందుంచి "అస్మాత్త్వమధిజాతోసి" అను మంత్రమును జెప్పుచు హోమమును జేయవలయును. అవి పూర్తియగునంత పర్యంతము ఆవృత్తిగా మంత్రమును జెప్పవలయును. అనంతర మగ్నిహోత్రహవణిని కృష్ణాజినమును శమ్యను దృషదువలములను అగ్నిలో విడువవలయును. సోమయాజికి నింతవఱకు జేయవలయును. మహాగ్నిచిత్తుకాక కాగ్ని చిత్తుడైన యెడల లోష్టచయనము జేయవలయును. అతనికి పునర్దహన విషయములో లోష్టచయనని వచనములు లేవు. సంచయనము జేసి జమ్మిమండయందుగాని మోదుగమండయందుగాని యస్థికుంభమునుంచి స్నానాంతము వఱకు జేసి లోష్టచయనకాల పర్యంతము అస్థులను జాగ్రతగ జూచుచుండ వలయును. ఆవిషయము ముందు జెప్పెదము, సోమయాజియొక్క భార్యకును నివపనాంతము పునర్దహనము కలదని కొందరనిరి అగ్నిచిత్తుకు భార్యయైన యెడల లోష్టచయనము జేయవలయును.

## శ్రౌతాగ్ని నశించినప్పుడు చేయవలసిన క్రమము.

౧౩౭—తా. శ్మశానాగ్నిహోత్రమను గతమైన యెడల భస్మను ప్రోక్షించి లౌకికారణులను దెచ్చి "అయంతేయోనిర్ఋత్వియ" అను మంత్రముచే భస్మయందుంచి మథించి యగ్నిని, ఉపావరోహణము జేసి యగ్నిప్రార్థనాద్యాజ్య సంస్కారాంతము జేసి పరిషేచనము జేసి "భూర్భువస్సువస్స్వాహా" అని వ్యాహృతిహోమము జేసి, అనాజ్ఞాతత్రయ హోమము సర్వప్రాయశ్చిత్త హోమమును జేసి పిమ్మట జేయవలసిన క్రియలను జేయవలెనని తాత్పర్యము.

## కాశీ గంగయందు అస్థులుంచు విధానము.

౧౩౭—తా. పదిదినములలోపల నెవనియస్థులు గంగలో విడువబడునో వానికి గంగాతీరంబున మరణముకలిగిన విధముగానేయని పెద్దలు చెప్పిరి కావేరి తుంగభద్ర కృష్ణవేణి గోదావరి గంగానది యీయైదు నదులును పంచగంగానదులని జెప్పఁబడినవి. మఱియు వీనిలో గోదావరి కృష్ణవేణి గంగానది అనునవి మూడును గోహరి శాంభ్రిక అను రెండును కలసి యైదును పంచగంగలని మఱికొందరు చెప్పిరి. కాబట్టి పదిదినముల లోపుగాగాని దాటిన పిమ్మటగాని యస్థులను గంగాజలములో నుంచవలయును. పదిదినముల లోపుగానైతే గురుశుక్ర మూఢాది దోషములు లేవు, అస్థులను దీసికొనివెళ్లి గంగాతీరమందుంచి కర్త స్నానాచమనములను జేసి యస్థులనుకూడ గంగాజలముతో కేశవాది నామములచే పండ్రెండు పర్యాయములు స్నానముజేయించి తిరిగి యొడ్డుననుంచి బ్రాహ్మణులవలన ననుజ్ఞను పుచ్చుకొని ప్రాణాయామముజేసి ప్రాచీనావీతుండై దేశకాలములను స్మరించి తండ్రియొక్క గోత్రనామములను జెప్పి యస్థులను గంగాజలమునం దుంచుచున్నానని సంకల్పము జేయవలెను. పిమ్మట గాయత్రీమంత్రము మొదలగువానిచే శాస్త్రప్రకారముగా కలుపఁబడిన పంచగవ్యముచే నస్థులను స్నానముజేయించి పరిశుద్ధమగు ప్రదేశము నుండి కొంత మృత్తికను దెచ్చి మూకుడు ఆకారముగా నుండునట్లుచేసి దానిమీద దక్షిణాగ్రములుగ దర్భలను బఱచి నువ్వులనుజల్లి అస్థుల నుంచి వానిపైన "హిరణ్యరూపస్య" అనుమంత్రముచే హిరణ్యశకలము నుంచి "మధువాతా" అనుమంత్రముతో తేనెను "శుక్రమసి" అనుమంత్రముతో నాజ్యమును "తిలోసి" అనుమంత్రముతో తిలలను గాయత్రీ మంత్రముతో పంచదారను "దధిక్రావ్ణ్ణా" అనుదానితో పెరుగును "అప్యాయస్వ" అనుమంత్రముతో క్షీరములను "దేవస్యత్వా" అను మంత్రముతో కుశోదకమునుంచి తిరిగి మృత్తికతో శరావాకారముగా నాయస్థులపైన గప్పి యామృత్తికా సహితముగ నస్థులనన్నింటిని దీసికొని గంగాజలములోనికి వెళ్లి భూమివఱకు మునిగి "నమోస్తు ధర్మరాజాయ" అను మంత్రమును జెప్పి యస్థులను విడిచిపెట్టి యొడ్డునకు వచ్చి "పృథివీంగచ్ఛ" అనిమొదలు "ప్రతితిష్ఠాశరీరైః" అను పర్యంతము మంత్రములను జెప్పవలయును. అనంతరము శుష్కవస్త్రమును ధరించవలయును. పదిదినములలోపుగానైతే పిండనిక్షేపణము జేయవలయును.

ఈప్రకారముగానే, కపర్దిస్వామి చెప్పి పదిదినముల లోపుగానైతే హిర ణ్యశ్రాద్ధముజేసి పిండప్రదానము జేయవలయు ననియు మఱియొకప్పు డైతే పిండములను మాత్రము వేయవలయుననియు జెప్పెను.

—{ ఆహితాగ్నికిని అనాహితాగ్నికిని దశాహతంత్రము మొదలగు మిగిలిన విధులను జేయవలసిన విధానము. }—

౧౩౯—తా. ఆహితాగ్ని కానివానియొక్క పదియవదినమునం దు అమావాస్య వచ్చినయెడల నేకాదశదినమునందే సపిండీకరణమును జేసి పిండపితృ యజ్ఞమును జేయవలయును. ఆప్రకారముగానే వసిష్ఠుం డును జెప్పెను. సపిండీకరణముతో ప్రేతస్వరూపుఁడగు వానికి పితృలోక ప్రాప్తి కలుగును. అందువలన ఆహితాగ్నికి నమావాస్యయందు పితృయ జ్ఞము జరుపవలయును. కర్త ఆహితాగ్నియై ప్రేత ఆహితాగ్ని కానియెడల పండ్రెండవ దినమునందు సపిండీకరణము జేయవలయు ననియు ప్రేత ఆహి తాగ్నియై కర్త అనాహితాగ్ని యైనయెడల త్రిపక్షములో సపిండీకరణము జేయవలయు ననియు గోబిలుఁడు చెప్పెను. సుమంతుఁడు నాప్రకారము గానే చెప్పెను. ఈపక్షములో జేయవలసినవిధి యెట్లనగా, ఏకాదశదిన మునందు ఆద్యమాసిక వృషోత్సర్జన రుద్రగణ అవశిష్ట మొదలగు శ్రాద్ధ ములను జేసి ఊనమాసికమును జెప్పఁబడిన దినమునందు జేసి రెండవమాసి కముతోగూడ త్రైపక్షికము మొదలగు పదమూఁడు మాసికముల నప కృష్యము జేసిపెట్టి త్రిపక్షములో శాస్త్రోక్త దినమునందు సపిండీకరణమును జేయవలయును.

ఉపనయనము కానివాని సంస్కార విషయము.

౧౪౦—తా. రెండు సంవత్సరములకంటె తక్కువ వయస్సుగల పిల్లవాఁడు మృతినొందినయెడల ఖననము జేయవలయును. ఆవిధాన మెట్లనిన, ఈబాలుని ఖననము జేయుచున్నానని సంకల్పముచేసి శుభ్రమగు ప్రదేశమునందు గొయ్యిత్రవ్వి జలమును ప్రోక్షించి తిలలనుంచి దక్షిణా గ్రములుగా దర్భలను పరచి "యోస్యకౌష్ఠ్యజగతః" అనునది మొదలు "యమోరాజాభితిష్ఠ" అనువరకునుండు యమగాథారూపమగు మంత్ర మును పఠించి "ప్రకేతునా" అనునది మొదలు "తాగ్శ్చదేవాపిగచ్ఛతి" అనువఱకు తొమ్మిది ఋక్కులుగల యమసూక్తమును మనస్సున స్మరిం పుచు మృతినొందిన పిల్లవాని నాజ్యముతో దక్షిణ ముఖముగా స్మరింపుచు నాపిల్లవానిని గోతియందుంచి తిరిగ మట్టిచే నాగోతినిపూడ్చి మంటిగడ్డ

యందు నపేక్ష లేనిరీతిగా నాపిల్లవానిని విడిచిపెట్టి స్నానముజేసి యింటికి రావలయును. ఎప్పుడు ఖననముజేసినను పిండోదక దానక్రియలు లేవు. నారాయణబలిని జేయవలయును ఈప్రకారముగానే ధర్మశాస్త్రముల యందును జెప్పుచు నగ్నిసంస్కార పిండదానోదక దానక్రియలను జేయ నక్కరలేదని వివరించి చెప్పెరి.

—{ ఉపనయనముకాని వానియొక్క దహనసంస్కారాది విధాన క్రమము. }—

౧౪౧—తా. మూడవ సంవత్సరము మొద లుపనయనముకాక పూర్వము మృతినొందిన బాలురను దహనము జేయవలయును. "అగ్నయే వైశ్వానరాయ సువర్గాయ లోకాయ స్వాహా" అనుమంత్రమును "అస్మాత్త్వమధిజాతోసి...లోకాయ స్వాహా" అనుమంత్రమును జెప్పియు త్తపనాగ్ని చేతనుగాని లౌకికాగ్ని చేతనుగాని దహనము జేయవలయును. భూమియందు దర్భలను బఱచి వానిమీాద నుదక పిండదానోదక క్రియలను జేయవలయును. ఈప్రకారముగానే శాతాతపుడు చెప్పిన విషయమే మనగా, శ్మశానపర్యంతము జ్ఞాతులు మొదలగు వారితోగూడి యమసూక్తమును యమగాధను పఠించుచు వెళ్లి లౌకికాగ్నిచే మంత్రరహితముగానే దహించి మంత్రరహితముగానే యుదకపిండ దానక్రియలను జేయవలయు ననెను. మఱియు చూడాకర్మ జేయబడిన బాలురకు ఖననము జరిగినయెడల నుదకపిండ దానక్రియలు భూమియందు జరుపవలయు నని యు దహనము జరిగినయెడల దర్భలయందు జరుపవలయు ననెను అగ్ని సంస్కార పిండదానోదక క్రియలకు ప్రవర్తించే విషయమందుగాని నివృత్తి విషయమందుగాని పరస్పరసంబంధము కలిగియున్నవని తాత్పర్యము.

సూతక నిర్ణయము.

౧౪౨—తా. శిశువుపుట్టిన పిమ్మట బొడ్డుకోయనంత పర్యంతము సూతకము లేదు. నాభిచ్ఛేదనమైన పిమ్మట సూతకము కలదనిరి. శిశువు పుట్టిన పిమ్మట నాభిఛేదనముకంటె పూర్వము మృతినొందిన యెడల తల్లికి పదిదినముల పర్యంతమును తండ్రి సోదరులు జ్ఞాతులు మొదలగువారి కందరికిని మూడుదినముల పర్యంతము సూతకమనిరి. శిశువు గర్భములోనే మృతినొంది జనియించినను నాభిఛేదనమైన పిమ్మట మరణించినను తల్లితండ్రి జ్ఞాతులు మొదలగువారి కందఱికిని దశరాత్రములు సూతకమనిరి. గర్భములోనే మరణించిన యెడల పదిదినములు సూతకమనిరి.

శిశువుపుట్టిన పిమ్మట పదిదినముల లోపుగా మృతినొందిన యెడల శావాశౌచము స్నానముతో నివృత్తినొంది దశరాత్రములు సూత్యాశౌచమునే గ్రహింపవలయుననిరి. ఇది తండ్రిమొదలగు జ్ఞాతులకందరికిని సమానమే యనిరి. మఱియు తల్లిదండ్రి సహోదరులు భ్రాతృలవిషయమై కొంచెము విశేషముచెప్పిరి నామకరణమునకు పూర్వము మరణించిన తత్కాలమునందే శుద్ధియును ననగా స్నానముతో నివృత్తియగును. దంతములు వచ్చినపిమ్మట చూడాకర్మ పర్యంతము ఒకదినంబును పిమ్మట నుపనయనము పర్యంతము మూఁడుదినములనియు నాశౌచము జెప్పఁబడెను. చూడాకర్మకాలము గడచిన పిమ్మట మరణించినప్పుడు అగ్నిసంస్కారము పిండోదక దానక్రియలు చేయవలయునని చెప్పియున్నదిగాన ఆప్రకారము జరిగించిన నుపనయనము పర్యంతము త్రిరాత్రాశౌచమే యనిరి ఎక్కడెక్కడ తల్లిదండ్రుల గుఱించి చెప్పఁబడునో అక్కడక్కడ సోదర భ్రాతృలను గుఱించి చెప్పినట్లుగానే యెంచుకొనవలయును. ఉపనయనమునకు లోపుగా మృతినొందిన వారికి నగ్నిసంస్కారాదులను జేసిన యెడల మాతాపితృ సోదర భ్రాతృ సర్వజ్ఞాతులు మొదలగు వారికందరికిని త్రిరాత్రాశౌచమే గ్రహింపవలయునని తాత్పర్యము.

## పెండ్లికాని స్త్రీవిషయము.

౧౪౩—తా. మూఁడు సంవత్సరములు గడచిన పిమ్మటను వివాహముజేసినను జేయకపోయినను లేక యిచ్చెదనని వాగ్దానముచేసినను జేయకపోయినను తల్లిదండ్రులకు మూఁడుదినములును జ్ఞాతులు మొదలగు వారికి నేఁరికి నేతీరుగా జెప్పఁబడెనో యావిధముగా స్వీకరింపవలయును. వివాహము కానియెడల జ్ఞాతులకు నొకదినమేయని చెప్పఁబడిన విధి ననుసరించవలయును. ఉపనయనము మొదలు సపిండులకు పదిదినములనియు సమానోదకులకు త్రిరాత్రమనియు జెప్పిరి. ఏడవపురుషాంతరముతో సపిండత్వము నివృత్తియగును. జ్ఞాతులయొక్క పుట్టకపేరులు మొదలగునవి తెలియనికాలమునందు సమానోదకత్వముకూడ నివృత్తియగును. ఏయేసంబంధ బాంధవ్యములు గలవారికి నేయేవిధము నాశౌచవిషయము జెప్పఁబడెనో ఆవిధులు సన్నిధానమరణమునందే యని తెలిసికొనవలయును. అసన్నిధానమరణమునందు వేరుగా చెప్పఁబడెను. ఇతర దేశమునందు జ్ఞాతి మరణించినను తనకు [illegible]మైనను పదిదినముల లోపుగా దెలిసినయెడల పదిదినములకు మిగిలిన దినములతో నాశౌచము

నివృత్తియగును. పదిదినములు గడచినపిమ్మట మూడుమాసముల పర్యంతము మూడుదినములును ఆఱుమాసముల పర్యంతము పక్షిణియును తొమ్మిది మాసములపర్యంత మొకదినంబును పిమ్మట స్నానము ఆశౌచమును గుఱించి చెప్పఁబడెను ఇది సమీపదేశములో మృతినొందిన జ్ఞాతుల విషయమని చెప్పబడెను.

దేశాంతర మరణమునందు

౧౪౪—తా. బాలుడు మృతినొందినను దేశాంతరమున మరణించినను పిండసంయోజనము విడిపోయినవారు మరణించినను మరణవార్త వినిన వెంటనే యాకట్టువస్త్రముతోనే స్నానముచేసి శుద్ధి నొందవలయును. దేశాంతరమనగా, జీవనదులుగాని పర్వతములుగాని మధ్యప్రదేశమందున్నను లేక మాట్లాడునట్టి భాష భేదించినను అట్టిదేశమును దేశాంతరమని చెప్పిరి.

తల్లిదండ్రుల విషయము.

౧౪౫—తా. కుమారు డితరదేశమునం దుండగా తల్లిదండ్రుల మరణవృత్తాంతమును వినినయెడల విన్నదినము మొదలు పదిదినములు మృతాశౌచమును పట్టవలయును. విన్నపిమ్మట అనుసమయమునందు భాష్యములో జెప్పిన విధ మెట్లనగా, పది దినములలోపుగా వినినయెడల సపిండులకు వలెనే కుమారునకును మిగిలిన దినములతోనే శుద్ధియని చెప్పఁబడెను. మహాగురుమరణము సంభవించినపిమ్మట నొకసంవత్సరమునకుగాని యంతకుపైగాగాని యెప్పుడు విన్నను పదిదినముల నాశౌచముపట్టి యథావిధిగా పిండోదక దానాదిక్రియల నన్నియు జరుపవలయునని తా.

సవతితల్లి విషయము.

౧౪౬—తా. మాతృవర్జితమై సవతితల్లియొక్క మరణవార్త సంవత్సరానంతరము దెలిసినను త్రిరాత్రాశౌచముండును. సూతకాశౌచములో శావాశౌచము వచ్చినను మృతాశౌచములో ప్రసవాశౌచము వచ్చినను అధికమగు మృతాశౌచముచే ప్రసవాశౌచము నివృత్తియగును. శావాశౌచమును పట్టుచుండగా ప్రసవాశౌచము వచ్చెనేని మృతాశౌచమును పట్టవలయునుగాని ప్రసవాశౌచమును పట్ట నక్కరలేదు. సమానాశౌచములు సంభవించినప్పుడు మొదటపట్టుచుండిన యాశౌచముతోనే శుద్ధికలుగును. పదిదినములలోపల మరణాశౌచముగాని జననాశౌచముగాని తెలిసినయెడల మిగిలిన దినములతోనే శుద్ధియగును. పదియవ

దినమందు రాత్రి తెలిసినయెడల తిరిగి రెండుదినము లాశౌచముండును, తెల్లవారు జామున తెలిసినయెడల మూడుదినము లాశౌచము పట్టవల యును. తల్లియొక్క మృతాశౌచమును పట్టుచుండగా దండ్రి మృతినొంది న యెడల తండ్రి యాశౌచముతోనే శుద్ధికలుగును. పితృప్రేతక్రియలను జరిపినపిమ్మట పక్షిణి యాశౌచమును బట్టి తల్లియొక్క శ్రాద్ధములను జేయవలయును. ప్రేత అగ్నిరహితుడై కర్త అగ్నిసహితుడైనయెడల దహన దినము మొదలుకొనియే సంచయనము జేయుటకుగాని శుద్ధి యగు టకుగాని గణన చేసికొనవలయును. మృతదినమును మామూలుదినము గానే యెంచుకొనవలయును. కర్త యాహితాగ్ని కాని విషయములో నాహితాగ్నికానివాడు మృతినొందినప్పుడు మృతినొందిన దినమునుండియే యాశౌచము కలుగును. ఆహితాగ్ని మృతినొందినను విదేశమునందు మృతినొందినను దహనము మొదలుకొనియే యాశౌచము విదేశము నందు మృతినొందినవానికి విధిప్రకారము సంస్కారాది క్రియలు జేయబడ కుండు పర్యంతము పుత్త్రులు మొదలగువారికి నాశౌచము లేదు సంధ్యాది కర్మలను జరుపుకొనవచ్చును. ఆహితాగ్నికి యథావిధిగా దహనాంత సంస్కారము జరగనంతవరకు పుత్రాదులకు నాశౌచము లేదు. దహనము మొదలుకొనియే యాశౌచము. అందువలన నాహితాగ్ని మరణమునందు దహనము మొదలు పదిదినములనియు ననాహితాగ్ని మరణమునందు మరణము మొదలు పదిదినములనియు జెప్పబడెను. ఆశౌచమును పట్టు చుండగ తిరిగి దహనముజేయు పక్షమునందును మిగిలిన దినములతోనే యాశౌచము నివృత్తియగును. ఆశౌచము వెళ్లిన పిమ్మట పునర్దహన విష యములో పూర్వ మాశౌచమును పట్టినయెడల మూడుదినములు తిరిగి ఆశౌచమునుపట్టి తల్లిదండ్రులకు శ్రాద్ధములను జేయవలయును. ఆశౌచ మును పూర్వము పట్టకుండనియెడల తిరిగి పదిదినముల నాశౌచముపట్టి కృత్యములను జరుపవలయును. దుర్మరణము నొందిన ద్విజులకు పరిశుద్ధి యును లేదు పుత్రాదులకు నాశౌచమును లేదు కాబట్టి యట్టి ప్రేతల గురించి ప్రాయశ్చిత్తము మొదలగునవిచేసి శుద్ధిపరచి దహనముచేసి అది మొదలుకొని యాశౌచ మవలంబించి పిండోదక దానములను శ్రాద్ధాదుల నాచరింపవలయును. ఆశౌచమును పట్టుచుండగ పునర్దహనవిషయములో జ్ఞాతులకు మిగిలిన దినములతోనే శుద్ధియగును. పూర్వమాశౌచము పట్టి నట్టి జ్ఞాతులవిషయమై పదిదినములు గడిచిన పిమ్మట పునర్దహనము జరిగిన

నాశౌచము లేదు. పుత్రులకైతే పునర్దహన విషయమునందు వారివారి వర్ణానుసారముగ దశాహాద్యాశౌచము నవలంబించ వలయును. అని బృహస్పతి చెప్పెను. తల్లిదండ్రులు మరణించినప్పుడు కుమారుడు పదిదినములలోపుగా శ్రాద్ధాదులను జరుపుటకు శక్తుడు కాని పక్షమందు పిమ్మటనైనను శ్రాద్ధాదులను జేయుటకు సమర్థత కలిగినప్పుడు మూడుదినములాశౌచమునుపట్టి నాల్గవదినమునందు యథావిధిగా శ్రాద్ధములను జేయవలయును. ప్రేతకర్మను జేయువానికేగాని యితరులకు నాశౌచము లేదని తాత్పర్యము.

ఆశౌచము వెళ్లిన పిమ్మట జేయవలసిన విధి.

౧౪౭—తా. ఆశౌచము వెళ్లిన పిమ్మట గృహమునలికి శుభ్రపరచుకొని స్నానముజేసి పుణ్యాహవాచనము జేసికొని యాశీర్వచనములనొంది మిగిలిన గృహకృత్యముల నిర్వర్తించుకొనవలయును. అని దేవలుఁడు చెప్పెను. ఆశౌచమధ్య నవలంబించ దగిన నియమముల నిట్టు వ్యాసుఁడు చెప్పెను. పదిదినములలో రెండుపూటల భోజనము చేయఁగూడదు. దానము ప్రతిగ్రహము హోమము, జపము జేయఁగూడదు అర్ఘ్యప్రదానమువఱకు సమంత్రకముగ జరిపి మిగిలిన సంధ్యాంతము మనస్సున స్మరించవలయును. ఇట్లు చెప్పుటచే జననాశౌచమునందును మరణాశౌచమునందును సంధ్యావందనము జేసికొనవలయును. ప్రాణాయామమును క్రియాపూర్వకముగ జేయుచు మంత్రములను మనస్సున స్మరింపవలయును. ఆశౌచములో నర్ఘ్యప్రదానమును విడుచునప్పుడు గాయత్రీమంత్రమును జెప్పవచ్చును గాయత్రీజపమును జేసికొనునప్పుడు మానసికముగానే స్మరింపవలయును. సూర్యోపస్థానమును మానసికముగానే చేయవలయును. పదిదినముల లోపుగా తెలిసినప్పుడు జ్ఞాతిత్వ బంధుత్వము మొదలగు సంబంధమును బట్టి పదిదినములు మూడుదినములు పక్షిణి యొకదినము సద్యస్నానము మొదలగు వారివారికి నిర్ణయ ప్రకారము శుద్ధి కలుగును.

—{ అనేకాశౌచము లొక్కమారు సంభవించినప్పుడు ఆచరించవలసిన విధానము. }—

౧౪౮—తా. పూర్వమాశౌచము పట్టుచుండగ తల్లిదండ్రుల సంబంధమగు మరణాశౌచము కుమారునకు సంభవించినను కుమారుఁడు పుట్టుట వలన సూతకాశౌచము తల్లికి సంభవించినను తమయాశౌచముతోనే

శుద్ధియగును గాని పూర్వము తాము పట్టుచుండెడి యితరుల యాశౌచ ముతో పనిలేదు ఇతరుల యాశౌచమును పట్టుచుండగా తనకు కుమారుఁడు పుట్టెనేని తల్లికి సూతకావధివల్లనే శుద్ధియగును తండ్రికి పదిదినములతో శుద్ధియగును. జ్ఞాతిసంబంధమగు నాశౌచమును పట్టుచుండగ నొకరికి దహన సంస్కారాదులను జేయవలసి వచ్చినప్పుడు దహనము జేసిన వానికి అదిమొదలు పదిదినము లాశౌచముండును. ఇతరులకు పూర్వాశౌచముతోనే శుద్ధియగును. దాహకునికి పూర్వాశౌచముతో నిమిత్తము లేదు జననసంబంధమైనను మరణసంబంధమైనను పూర్వాశౌచము దానికాలముతోనే నివృత్తియగును. ఆప్రకారముగా అఖండాదర్శమను గ్రంథమునందు జెప్పఁబడెను. జననాశౌచ మరణాశౌచములు వచ్చియుండగాను లేక వానిలో నేదైన నొకటిగాని వచ్చియుండగా తనకు కుమారుడు కలిగనేని తల్లిదండ్రులకు తమసంబంధమగు పదిదినముల జననాశౌచమునే గ్రహింపవలయును. జ్ఞాతులకు వలెనే యితర పూర్వాశౌచముతో శుద్ధిలేదు. ఇట్టి విషయములో ఆశౌచములకు న్యూనాధిక విచారణచేయ వీలులేదు. ఆప్రకారముగానే బోధాయనులు చెప్పెను. తల్లిదండ్రుల మరణమందును తనకు కుమారుఁడు కలిగినప్పుడును స్వకీయాశౌచముతోనే నివృత్తియగునుగాని ఇతరాశౌచకాలముతో నిమిత్తము లేదని యితర స్మృతులయందును జెప్పఁబడెను. మృతనిమిత్తమగు దహన మరణముల యాశౌచముకలదు. అందులో జ్ఞాతులకు మరణము మొదలాశౌచమనియు దహనసంస్కర్తకు దహనము మొదలాశౌచమనియు జెప్పఁబడెను. దాహకుని గుఱించి యీవిధముగ విశేషముచెప్పఁబడె నది యెట్లనగా, తల్లిదండ్రులకంటె నితరులకు దహనసంస్కారము జేసినప్పుడు పూర్వము పట్టుచున్న యాశౌచముతోనే శుద్ధియగును. తల్లిదండ్రులకు దహనసంస్కారము జేయునప్పుడు దహనముమొదలు పదిదినము లాశౌచముండును. కాఁబట్టి మొదటచెప్పినది తల్లిదండ్రులకంటె నితరుల విషయము. మఱియు నొకజ్ఞాతికి దహనసంస్కారము చేసియుండగా తిరిగి తల్లిదండ్రులకుగాక మరియొకనికిగాని యిద్దరు ముగ్గురు మొదలగు నెంతమందికి దహనసంస్కారము జేసినను మొదటగా దహన సంస్కారము జేయఁబడినవాని యాశౌచముతోనే నివృత్తియగును. పిమ్మట దహనము జేయబడినవారి యాశౌచముతో పనిలేదు పూర్వమొకనికి దహనసంస్కారము జేసినప్పటికి పిమ్మట తల్లిదండ్రులకు జేయవలసిన యెడల తల్లిదం

ద్రుల దశాహముతో నివృత్తియగును. ఒకనికి దహనసంస్కారాది క్రియలను జేయుచుండగా పదిదినములలో మరియొకనికి దహనాది క్రియలను జేయవలసి వచ్చినప్పుడు మొదటి యాశౌచముతో నివృత్తియగుచు ననంతరమందు సంస్కారము చేయఁబడినవానికి నేకోద్దిష్టాది శ్రాద్ధములను వానియొక్క యేకాదశాది దినములయందే యాచరింపవలెను. ఆశౌచము ఉదకపిండదానములను పూర్వముండెడి యాశౌచముతో సమాప్తిచేసి నప్పటికి నేకోద్దిష్టశ్రాద్ధమును యథోక్తకాలమునందే చేయవలయునని నారదుని వాక్యమువలనను ఆద్యశ్రాద్ధ మేకాదశాహస్సునందు మధ్యాహ్నకాలమందు జేయవలనని చెప్పెడి స్మృతి ప్రమాణములవలన వారి వారి యేకాదశాహస్సులయందు నేకోద్దిష్ట శ్రాద్ధమాచరింప వలయును. మొదటి వానియొక్క దహనాది శ్రాద్ధక్రియలను జేయుచుండగా పంద్రెండుదినముల లోపల మరియొకనికి జేయవలసి వచ్చినప్పుడు మొదటివాని యాశౌచముతోనే నివృత్తియనియు తల్లిదండ్రుల విషయములో వారి దశాహముతోనే నివృత్తియనియు నంగిరస్సుడు, సంవర్తుడు, చెప్పిరి. ఇతరులకు జేయు విషయములో మొదటి యాశౌచముతో నివృత్తియైనను అనంతరము సంస్కారముజేసినవారికి వారివారి యాశౌచదినముల పర్యంతము ఉదకదానమువలెనే పిండదానములను గూడ చేయవలయును. ఆశౌచపర్యంత ముదకపిండదానముల జేయవలయునని విష్ణువుచెప్పెను. బ్రాహ్మణునకు పదిపిండములును, క్షత్రియునకు పంద్రెండు పిండములును, వైశ్యునకు పదియేను పిండములును, శూద్రునకు ముప్పదిపిండముల నివ్వవలయునని, పరాశరుఁడు చెప్పెనుగాన యితరులకు జేయువిషయములో మొదటివాని యాశౌచముతో నివృత్తియై యనంతరము సంస్కారము జేయఁబడినవారి యాశౌచము లేకపోయినను పిండోదక దానక్రియలను వారివారి యాశౌచదినముల పర్యంతము పిండోదక దానక్రియలను జేయవలయునని శాతాతపాదులు చెప్పిరని తాత్పర్యము.

అనాథశవ సంస్కార విషయమునందు.

౧౪౯—తా. అనాథుడగు బ్రాహ్మణుని స్పృశించినను వానికి సంస్కారము జేసినను బ్రాహ్మణునకు దోషము లేదు. శవమును మోసినను దహనసంస్కారము జేసినను స్నానము జేసినయెడల శుద్ధియగునని దిక్కులేనివానిగుఱించి చెప్పఁబడినది. ధనము మొదలగు వానియందు నపేక్షచే శ్రోత్రియుఁడగు బ్రాహ్మణునకుగాని మరియొకనికిగాని యసపిండుడు

వహనదహనాదులను చేసినయెడల వానికి బంధువులకు వలెనే త్రిరాత్రా శౌచముకలదు అని మనువు చెప్పెను.

### సంస్కారముజేసినవానికి నాశౌచనియమము.

౧౫౦—తా. ఎవడైన నసపిండునకు సంస్కారముజేసి యాప్రేత యొక్క యింటియందే నివసించి వారియన్నమునే తినినయెడల పదిదినము లాశౌచముండును. వారింటిలో నివసించి యితరులు తెచ్చిన యన్నమును భుజించినయెడల మూడుదినము లాశౌచముండును.

### సమానోదక నిర్ధారణమందు.

౧౫౧—తా. సమానోదకుడగు ప్రేతను దహించిన వానికి పది దినము లాశౌచమును ఇతరులకు మూడుదినము లనియు స్మృతికర్తలు చెప్పిరి.

### బ్రహ్మచారి సంస్కారముజేసినయెడల.

౧౫౨—తా. ఆచార్యుడు స్వకీయోపాధ్యాయుడు తల్లి దండ్రి గురువు మొదలగు ముఖ్యులకు దహనాదిక్రియలను జేసినను బ్రహ్మచారికి బ్రహ్మచర్యాశ్రమమునకు లోపము కలుగదు

### అనుగమనమునందు సూతకనిర్ణయము.

౧౫౩—తా. పెనిమిటి మృతినొందినపిమ్మట భార్య సహగమనము చేసినప్పుడు ఆస్త్రీకి దహనసంస్కారము కుమారుడు చేసినను ఇతరుడు చేసినను పెనిమిటి సంబంధమగు నాశౌచముతోనే నివృత్తియగునుగాని పత్నియొక్క యాశౌచముతో లెక్కలేదు. ఉభయులకును నవశ్రాద్ధ సపిండాదు లొక్కసారిగానే చేయవలయును. పూర్వదినమునందు తండ్రి మరణించి మరునాడు తల్లి మరణించినను తల్లిదండ్రులకు నవశ్రాద్ధ సపిండము లొక్కసారిగానే చేయవలయును. శావాశౌచముతో సమానమైనదిగాని తక్కువైనదిగాని మఱియొక శావాశౌచము వచ్చినయెడల పూర్వాశౌచముతోనే శుద్ధియగును. పూర్వాశౌచముకంటె నధికమగు శావాశౌచము వచ్చినప్పుడు అధికాశౌచముతోనే నివృత్తియగును పదియవ దినమునందు రాత్రిగాని తెల్లవారు జామునగాని తెలిసిన యాశౌచముల విషయమై పూర్వము చెప్పిన ప్రకార మాచరింపవలయును. శావాశౌచముగాని సూతకాశౌచముగాని పట్టుచుండగా పూర్వము పట్టుచుండెడి మృతకాశౌచముతో సమానమైనదిగాని తక్కువైనదిగాని మధ్యవచ్చినయెడల పూర్వాశౌచముతోనే యాశౌచము నివృత్తియగును. అంతకంటె

నధికమైనయెడల స్వకాలముతో నివృత్తియగును. పూర్వాశౌచముతోనే నివృత్తియనెడు విషయము ప్రసవించియుండు స్త్రీలకును అగ్నిసంస్కారము జేసిన కుమారునకుగాని యన్యునకుగాని పూర్వము దశాహమరణాశౌచము కలిగియున్నను వర్తించదు కాబట్టి అధికాశౌచ విషయములో సూతికయగుస్త్రీని పుత్రుడుగాని యితరుడుగాని యగ్నిసంస్కారము జేసినవానిని విడిచి యితరుల విషయముగా దెలిసికొనవలయునని చెప్పిరి.

చూడాకర్మ జేయబడిన వానివిషయము.

౧౫౪—తా. చూడాకర్మ యైనవాడు తల్లిదండ్రులకు దహనసంస్కారములను జేయవచ్చును ఉదక పిండదానముల నివ్వవచ్చును స్వధాశబ్దమును చెప్పవచ్చును వేదమంత్రములను మాత్రము పఠింపగూడదని చూడాకర్మ చేయబడి ఉపనము కానివాని గురించి చెప్పబడెను.

చూడాకర్మ కానివాని విషయము.

౧౫౫—తా. చూడాకర్మ చేయబడక పోయినను కుమారుడు తల్లిదండ్రులకు దహనాదులను జేయవచ్చునని యున్నది. కాలాదర్శమునందు చెప్పినదేమనగా, కుమారుడు పుట్టినందువలన తల్లిదండ్రుల ఋణముతీరునని చెప్పబడియున్నందునను ఔరసకుమారుడు తల్లిదండ్రులకు సంస్కారము జేయవలయునని చెప్పియుండుటవలనను మొదటిసంవత్సర పర్యంతము చూడాకర్మ చేయబడనివాడు సంస్కారము జేయగూడదని చెప్పబడెనుగాని సంవత్సరము దాటినపిమ్మట చూడాకర్మ చేయబడక పోయినను తల్లిదండ్రులకు సంస్కారము జేయనగును. కాబట్టి దహనసంస్కారమును అకృతచూడుడైనను కుమారునిచే చేయించి శ్రాద్ధముల నితరులచే జేయించవలయును చిన్నకుమారుడు సమస్త క్రియలను జేయవచ్చునుగాని పెద్దకుమారు డుండునప్పుడు సపిండనాధికారములేదు గాన సపిండీకరణము పెద్దవాడే చేయవలయును. దహనసంస్కారము ముఖ్యమగుటవలన పెద్దవాడైనను చిన్నవాడైనను పెద్దభార్య కుమారుడే దహనము జేయవలయు ననియు ననేకభార్యలకు ననేకులు పుత్రులుండిన వారిలో నెవడు పెద్దవాడో వానిచేతనే సపిండీకరణమును జేయించవలయు ననియు కాశ్యపుడు చెప్పెను.

పెద్దకుమారునకు కర్తృత్వమును గురించి.

౧౫౬—తా. అగ్నిసంస్కారము జేసి .తిలోదకాదుల నిచ్చుట మొదలిడినవాడే షోడశదినముల పర్యంతము చేయవలయునుగాని జీవించి

యుండగా మఱియొకడు నడుమను ప్రారంభించి చేయగూడదనియు నట్లు చేసినయెడల తిరిగి దహనసంస్కారము మొదలు చేయవలయు ననియు చెప్పఁబడెను. ఆప్రకారముగానే శివపురాణమునం దీవిధముగా జెప్పఁబడెను. దహనకర్మ నవశ్రాద్ధములు తిలోదక పిండదానములు నగ్నప్రచ్ఛాదనము ఇవి పూర్వకర్మలు కాఁబట్టి యివియన్నియు నొక్కకర్మయే యనియు వీనిలోనే కర్మనైనను మఱియొకడు కర్తృత్వమును వహించి చేసినయెడల మొదటనుండియు జేయఁబడిన దహనాదిక్రియలకు లోపము కలుగుననియు శివపురాణమునందు జెప్పఁబడెను గాన మొదట ప్రారంభించినవాడే దశాహాంతము జేసి పెద్దకుమారుఁడు సపిండీకరణమును జేయవలెను. కాలభేదముచేగాని కర్తృభేదముచేగాని జేయఁబడుచుండెడి క్రియలకు భంగము కలిగినప్పుడు తిరిగిచేయబడిన క్రియలను జేయవలయును. మొదటచేయువాడు మరణించినగాని రోగము మొదలగు వానిచే నశక్తుడైనప్పుడుగాని మరియొకడు చేయవలయును.

మొదట సంస్కారము జేసినవానికి నాపత్తుకలిగెనేని

౧౫౭—తా. ఒకనికి సంస్కారము జేయుటకు ననేకులు కర్తలుండగా మొదట దహనాది క్రియలను జేసినవానికి విపత్తికలిగినప్పుడు వాని తర్వాత పుత్త్రునకును వానికిని విపత్తి కలిగినప్పుడు వానితర్వాత వానికిని, కర్తృత్వముండునని స్మృతికర్తలు చెప్పిరి

—{ పదిదినముల లోపల తిలోదకాదులకు విఘ్నము కలిగిన యెడల నెట్లగా జేయవలయును. }—

౧౫౮—తా. దహనాది కర్మనుజేసి నిత్యకర్మను ప్రారంభించి చేయుచుండగా మధ్యనేదైన నొక గొప్పయాటంకము వలన విఘ్నము కలిగియుండగా సంవత్సరము లోపుగాగాని సంవత్సరము గడచిన పిమ్మట గాని యెప్పుడైనను దహనము విడిచిపెట్టి మిగిలిన తిలోదకాది క్రియలనన్నియు జేయవలయునని కర్మప్రదీపికయందు జెప్పఁబడెను.

గర్భిణీస్త్రీ సంస్కార విషయము.

౧౫౯—తా. గర్భిణీస్త్రీ మృతినొందినప్పుడు పెనిమిటి తమసూత్ర ప్రకారముగా కర్మనుజేయుట ప్రారంభించి శ్మశానమునకు తీసికొని వెళ్లి చితికి పడమట ప్రదేశమునం దాస్త్రీని దక్షిణశిరస్సుగానుంచి యాఱు మాసములకు పైబడిన గర్భముకలదగునేని నాభికి నెడమభాగమునందు నాలుగంగుళ ప్రమాణముగా నుదరమును గుర్తుపెట్టుకొని "హిరణ్య

గర్భ స్సమవ_ర్తతాగ్రే...హవిషావిధేమ" అను మంత్రమును జెప్పుచు పెనిమిటిగాని మరియొకరుగాని గర్భమును ఛేదించి శిశువునుదీసి కడిగి భూమియం దుంచవలయును. శిశువు జీవించి యున్నయెడల "జీవత్వాయం మమపుత్రః" అనుమంత్రమును జెప్పుచు నాశిశువు నభిమంత్రించి "క్షేత్రియై త్వానిర్ఋుత్యై త్వా" అనునది మొద లైదుమంత్రములచే శిశువును స్నానము జేయించి భూమియం దొక హిరణ్య శకలమునుంచి దానిపైన శిశువునుంచి "భూర్భువస్సువః" అని యభిమంత్రించి "య_స్తే_స్తనశ్శశయో మయోభూః...ధాతవేకః" అను మంత్రమును జెప్పి మరియొకస్త్రీచే _స్తన్యము నిప్పించి గ్రామములోనికి తీసికొని వెళ్లవలయును. గర్భమును ఛేదించిన ప్రదేశమునందు స్రువముతో నాజ్యమును గ్రహించుచు మూలములో జెప్పఁబడిన "శతాయుధాయ శతవీర్యాయ" అను మంత్రము మొద లైదుమంత్రములచే నైదుపర్యాయములు హోమముచేసి పిమ్మట "ప్రయాసాయస్వాహా" అనునది మొదలు పంద్రెండాహుతుల నాజ్యముతో జేయవలెను. వీనికి త్యాగముల నాయామంత్రముల గుఱించి చెప్పఁబడిన దేవతలను చెప్పవలయును. అనంతరము "ప్రాణాయస్వాహా" అనునది మొదలు "పూష్ణే సాకేతాయ స్వాహా" అను వరకునుండు పదునాలుగు హోమములను జేయవలయును. త్యాగముల గురించి మంత్రో_క్త దేవతలను చెప్పవలయును. ఇట్లు ప్రేతయొక్క యుదరమునం దాజ్యహోమములను జేసి "భూర్భువస్సువః" అనివ్యాహృతి హోమమును జేసి ఛేదించిన ప్రదేశమును దారముతో గట్టి యాజ్యముతో తడిపి యుదరప్రదేశమును ఛేదించినందుకు ప్రాయశ్చి_త్తము నిమి_త్తము హిరణ్యధేను తిలదానాదులను జేయవలయును. ఇట్లు గర్భిణీస్త్రీని గుఱించి పుత్త్రుఁడు మొదలగువారు చేసినయెడల "సువర్ణగ్ంహస్తాత్" అనునట్టి కర్మను జేయుచున్నారు. ఈప్రకారము గర్భిణీస్త్రీ సంస్కారవిషయము చెప్పఁబడెను.

## గర్భిణీసంస్కారమును గురించిన కారికలు.

౧౬౧—తా. గర్భిణీస్త్రీ మృతినొందినప్పుడు జేయవలసిన విధిని గురించి బోధాయనుఁడు భరద్వాజుడు శౌనకుడు మొదలగువారు కొన్ని కారికలను జేసిరి. ఆప్రకారముగానే (159) వ విషయమునందు వ్రాయఁబడినది గాన తిరిగి వ్రాయఁబడ లేదు. యవోదనభక్షణాది మిగిలిన విషయమంతయు సమానము.

## సూతికాస్త్రీ రజస్వలాస్త్రీ మరణముల విషయము.

౧౬౧.—తా. ప్రసవించినపిమ్మట పదిదినములలోపుగా స్త్రీ మరణించినయెడల సూతికాస్త్రీ మరణమును గురించి ప్రాయశ్చిత్తమును జేయుచున్నానని ముందుగా సంకల్పముచేసి పరిశుద్ధమగు జలముతో ముందు స్నానము మంత్రరహితముగా జేయించి ధౌతవస్త్రమును ధరింపజేసి తీర్థోదకమునుగాని శుభ్రమగు నితర యుదకమునుగాని తెచ్చి యొక కలశములోగాని నాలుగు కలశములలోగాని యుంచి యాకలశములలో నైదువిధములగు వృక్షముల చర్మలను చిగుళ్లను మృత్తికను పంచామృతములను పంచగవ్యములను పంచరత్నములను వానివానికి జెప్పఁబడిన మంత్రములతో నుంచి వేదాధ్యయన సంపన్నులగు నలుగురు బ్రాహ్మణులచే వరుణపూజను జేయించి "హిరణ్యవర్ణాః" అనునది మొదలు నాలుగు మంత్రములచేతను "పవమానసువర్జనః" అను వాకముచేతను "యదంతియచ్చదూరకః" అనునది మొదలైదుబుక్కులచేతను పూర్వము వరుణపూజ చేయఁబడిన కలశోదకములతో బ్రాహ్మణులచే స్నానము చేయించి, తిరిగి ధౌతవస్త్రమును గప్పి యాబుత్విక్కులకు దక్షిణలనిచ్చి ప్రాయశ్చిత్తము నిమిత్తము కృచ్ఛ్రత్రయములను జేసినపిమ్మట పైతృమేధిక కర్మను జేయవలయును. ఈప్రకారముగానే రజస్వలైన స్త్రీలకును జేయవలెను. సూతికయగుస్త్రీ మరణించినప్పుడు యాజ్ఞికులేతీరుగా జేయింతురని ప్రశ్నకలుగగా వాజసనేయు లిట్లుచెప్పిరి. కలశములో జలమును పంచగవ్యాదులనుంచి పుణ్యప్రదములగు మంత్రములతోను రుద్రము, రుద్రసూక్తము, పవమానసూక్తము, పురుషసూక్తము, భవిష్య పురాణోక్తమంత్రములు మొదలగువానిచేతను, వరుణసూక్తముచేతను, నూఱు కలశముల నుదకమునుంచి యామంత్రములను మూఁడుపర్యాయములు చెప్పవలయును పిమ్మట దర్భలు ఔదుంబరము పద్మములు పలాశపత్రములు రావిచిగుళ్లు అను అయిదువిధములగు పత్రములనుంచి తిరిగి నూఱు కడవలజలముపోసి శుద్ధిబఱచి పాదములను కడిగి నూతనవస్త్రమును జుట్టి గంధపుష్పాదులచే నలంకరింపజేసి బ్రాహ్మణుల ననుజ్ఞనుపొంది పిమ్మట శవధర్మప్రకారముగ దహించవలయు ననిరి. వఱియు రజస్వలైన స్త్రీగాని ప్రసవించిన స్త్రీగాని మరణించినయెడల పూర్వము ధరించియున్న వస్త్రమును దీసివేసి తిరిగి నూతనవస్త్రమును ధరింపజేసి [illegible] చేతను స్నానము జేయించి దహించవలయును. అనంతరము చేయఁదగిన క్రియలకు నిర్ణరు

లతో సమానమేయని యొకపక్షము. సూతికయగుస్త్రీ మరణించినను రజస్వలయగుస్త్రీ మరణించినను పావమానాద్యాది ఋక్కులను జెప్పుచు పంచగవ్యములచే స్నానముచేయించి పిమ్మట శవధర్మానుసారముగ దహనము జేయవలయునని మఱియొకపక్షమునందు కలదు. ప్రసవించినస్త్రీగాని రజస్వలయగుస్త్రీగాని మరణించినపక్షమున, దుర్గామిందాహుతులను వ్యాహృతి హోమములను జేసి యథాశక్తి దానాదికమైన పిమ్మట సంస్కారము జేయవలెను. అని మరియొక పక్షముకలదు. ఇట్లు అనేకపక్షములు కలవు.

దశాహ ప్రయోగము.

౧౬౨—తా. ప్రసవించి నప్పుడును మరణించి నప్పుడును పదిదినములు గడిచిన పిమ్మట శుద్ధిని జేసికొనవలయును గాన యాప్రదేశమును గోమయముతో సంమార్జన జేయుటవల్లను గోవులు బ్రాహ్మణులు సంచరించుటవల్లను బ్రాహ్మణులను భుజింపజేయుటవల్లను శుద్ధికలుగునని జెప్పఁబడియున్నది. కాఁబట్టి పదియవదినమున ప్రాతఃకాలమందు పూర్వముంచబడిన దీపాదులను తీసివేసి గోమయముతో గృహసంమార్జనముచేసి లోహితచర్మము అనడుహము రాయిదర్భలు వేతసశాఖ ఉశీరికపప్పు జలఘటము ఓషధిస్తంభము తిలలు స్రుక్స్రువాది సమస్తవస్తువులును తీసికొని జ్ఞాతులతోఁకూడ తటాకాది - జలప్రదేశములకు వెళ్లి స్నానాచమనములను జేసి బ్రాహ్మణులకు ప్రదక్షిణముచేసి తనశక్తి ననుసరించి దక్షిణను సమర్పించి ప్రేతప్వదూపుఁడగు తండ్రియొక్క గోత్రనామములను జెప్పి ప్రేతకు దహనమువలన కలిగిన దాహము తృష్ణనశించు నిమిత్తము బంధువులు మిత్రులు మొదలగువారిచే ధర్మోదకము నిప్పించుచున్నానని ప్రార్థించవలయును. అప్పుడు వారును ధర్మోదకము నిచ్చెదమని చెప్పి స్నానము చేసి ప్రేతయొక్క గోత్రనామములను జెప్పి యొక్కొక్కరు ప్రత్యేకముగా తిలసహితమైనట్టి జలాంజులలను మూఁడు విడువవలయును. ఇతరులు తిలోదకములను విడిచే విషయములో శిలయందనే నియామకము లేదు. అనంతరము కర్తయు జ్ఞాతులును వపనము జేయించుకొనవలయును. పదియవదినమునందు గ్రామమునకు వెలుపలగా నదీతీరమునకు గాని తటాకాది ప్రదేశమునకుగాని మహావృక్షము వద్దనుగాని జ్ఞాతులతోఁగూడ వెళ్లి జ్ఞాతులలో సప్తపురుషాంతరములకు లోపుగా నుండెడి జ్ఞాతులును వారిలో ప్రేతకంటె చిన్నవయస్సుగలవారును కర్తతోఁగూడ కేశశ్మశ్రునఖ సహితముగా వపనమును [illegible] పూర్వవస్త్రములను

విడువవలయునని కల్పకారిక మొదలగు వానియందు జెప్పఁబడెను. సూతక మందుగాని మృతమునందుగాని మాసము తిథి వారము నక్షత్రము మొద లగువానిని విచారింపకయే పదియవదినమునందు క్షౌరమును జేయించు కొనవలయుననియు తమకంటె పెద్దవారు మృతినొందినప్పుడు పదియవ దినమునందు మధ్యాహ్న కాలమందు క్షౌరమును జేయించుకొని సచేల స్నానము జేయవలయు ననియు పదిదినముల పర్యంతము సపిండులతో గూడ భుజించవలయుననియు ఆశౌచాంతమునందు గృహసంమార్జనాది క్రియలను జేయవలయుననియు నితర స్మృతులయందు జెప్పఁబడెను. ఈప్రకారముగా దేవలుడును చెప్పెను. ఇట్లు క్షౌరాది క్రియలనుజేసిన పిమ్మట స్నానముజేసి కర్త యాచమనముజేసి నిత్యము జేయదగిన శిలా స్నాన మృదాస్నాన వాసోదక తిలోదక పిండప్రదానాదులనుజేసి యజ్ఞో పవీతుడై గ్రామశ్మశాన మధ్యప్రదేశమునందు ప్రాఙ్ముఖముగా గూర్చుండి ప్రాణాయామ సంకల్పాదులనుజేసి యాశౌచ నివృత్తికొరకు అఘాపనుత్తి హోమమును జేయుచున్నానని సంకల్పము చేయవలయును. నిత్యము చేయుచుండెడి శిలాస్నాన మృదాస్నాన వాసోదక తిలోదక పిండప్రదా నములను క్షౌరమునకు పూర్వమే చేయుట యాచారముకలదు. ఈగ్రం థమునందు క్షౌరానంతరమున చెప్పఁబడెను. "యత్రక్వచాగ్నిం" అని లౌకికాగ్నిని ప్రతిష్ఠించి దర్భాస్తరణాది స్రుక్స్రువ సంమార్జనాంతముజేసి తూర్పుగా ముఖప్రదేశము లోమములు పైగా నుండునట్లుగాను వృషభ చర్మమును అగ్నిహోత్రమునకు పడమర భాగమున పరచి "ఆరోహతా యుర్జర సంగృణానా" అనుమంత్రమును చెప్పుచు కర్తయు జ్ఞాతులు ఆచర్మము నధిష్ఠించవలయును. "యథాహాన్యను పూర్వంభవంతి" అను మంత్రము ప్రకారముగ పురుషులలో పెద్దవారు దక్షిణ ప్రక్కనువారి ప్రక్కను స్త్రీలలో పెద్దవారును పురుషులలో చిన్నవారు ఉత్తరదిక్కు నను వారిప్రక్కను స్త్రీలలో చిన్నవారును గూర్చుండవలయును అనంత రము మంత్రరహితముగ నగ్నికి పరిషేచనముజేసి చివరలను మణిచి స్రు క్స్రువములతో మొదట రెండుపర్యాయములు ఆజ్యముతో హోమ మునుజేసి పిమ్మట యథాప్రకారముగ స్రువముతో దశాహుతులను జేయ వలయును. ఇట్లు హోమమును జేయునప్పుడు ప్రతిపర్యాయమున్ను స్రువ ముతో సంపాతపాత్రను తగిలించవలయును. అనంతర ముత్తరపరిషేచ నముజేసి స్రుక్స్రువ... లను నగ్నిహోత్రమునం దుంచి యగ్నిహోత్ర

మున కుత్తరదిక్కున లోహితవర్ణముగల వృషభమును ప్రాఙ్ముఖముగ నుంచవలయును. అది సంభవించనిపక్షమున దర్భనైనాయుంచి దానిని జ్ఞాతులు వృద్ధపూర్వకముగా దాటి వెళ్లవలయును. చివరకు కర్తవెళ్లి జ్ఞాతులకు దక్షిణభాగమున నొకగొయ్యిత్రవ్వి దానిలో నొకరాయినుంచి యాశిలను త్రొక్కవలయును. సువాసినీస్త్రీలకు దోసిలియందు సంపాత పాత్రయం దుంచబడిన యాజ్య ముంచవలయును. ఆస్త్రీలు ముఖమునకు రాచుకొనవలయును. అనంతరము గర్తమునందుండెడి శిలనుదీసి యాగర్త మును మంటితోబూడ్చి దానిపైన వేదికనేర్పరచి దానిపైన ప్రేతశిలనుంచి దానికి నిరుప్రక్కలను రెండు శిలలనుంచి ప్రేతస్వరూపుడగు తండ్రి యొక్క పదియవదినమునందు ప్రేతశిలను బూజించుచున్నానని సంకల్పము జేసి యుత్తరదిక్కుననుండు శిలయందు రుద్రుని దక్షిణదిక్కుననుండు శిలయందు యముని నావాహనముజేసి స్నానముజేయించి రుద్రయమ సహితముగా ప్రేతశిలకు నావాహనా సనార్ఘ్యపాద్యాది విధులచేతను గంధపుష్పాక్షతాలంకరణాదులచేతను ఛత్రపాదుకాదులచేతను పూజించి పిమ్మట అన్నము సూపము మొదలగు వానిచే మూడుపిండములను జేసి ప్రేతకు నొకపిండమును రుద్రునకు నొకపిండమును యమునకు నొకపిండ మునుంచి సమస్తభూతములకు బలిప్రదానముజేసి యుదకకుంభమునుంచి చుట్టునోషధుల నుంచవలయును. పిమ్మట జీవించియుండువారు స్థిరజీవులై శుభము నెప్పుడును బొందుచుండవలయునని తలచుచు బ్రాహ్మణులవలన ననుజ్ఞబొంది ప్రేతశిలాసహితమగు నామూడుశిలలను దీసికొని "పృథివీం గచ్ఛప్రతిష్ఠాశరీరైః" అను, వరకునుండు మంత్రమును జెప్పి జలములో విడిచిపెట్టవలయును. అనంతరము ధర్మోదకము నిచ్చిన వారందరును బంధు సహితముగ కర్తను ఆలింగనాదులచే మనస్సునకు శాంతిని కలుగజేసి తిలసహితమగు ఉసిరికపిండితోగాని యావపిండితోగాని దేహమునరాచు కొని జ్ఞాతులు బంధువులు మొదలగువారితోగూడి కర్త స్నానముజేసి ధౌతములైన తెల్లనివస్త్రములను ధరించి పుణ్యాహవాచన ఆనందహోమా దులను గావించి బ్రాహ్మణాశీర్వాదములనొంది వారికి గంధాక్షత దక్షిణ తాంబూలాదులనిచ్చి చిగుళ్లతోగూడిన జలకలశమును దీసికొని సువాసినీ స్త్రీలు ముందు నడుచుచుండగ తాము వెనుకనడచుచు గ్రామములోనికి వెళ్లవలయును.

## ఆనంద హోమము.

౧౬౩—తా. గృహమునకు నీశాన్యప్రదేశమునందు గూర్చుండి కర్త ప్రాణాయామముజేసి యాశౌచనివృత్తికొఱకు ఆనందహోమమును జేయుచున్నానని సంకల్పముజేసి యగ్నిప్రతిష్ఠాది పరిషేచనాంతము హోమమును జేసి యుత్తరపరిషేచనముజేసి స్రుక్స్రువాజ్యస్థాలుల నగ్నిహోత్రములోనుంచి యవోదనప్రాశన జేయవలయును అజపాకము కలియుగములో నిషేధింపఁబడినది. ఈపదిదినములకు లోపుగా శుభకార్యములను జేసికొనగూడదు బ్రాహ్మణులు మొదలగువారందరును పదిదినములలోపుగా జ్ఞాతులును సంవత్సరమునకులోపుగా పుత్రులును శుభకార్యములను జేసికొనగూడదని జెప్పఁబడెను. జ్ఞాతులకు పదియవదినమునందు నూర్ధ్వాధోభాగములయందును పరదినమునందు నూర్ధ్వభాగమునందును వపనము విధించబడెను.

## కంఠసూత్ర విసర్జనము.

౧౬౪—తా. మృతదినమునందుగాని పదియవదినమునందుగాని ప్రేతపత్ని మంగళసూత్రమును కర్ణపత్రములను తీసివేయవలెను. సంగ్రహకారుఁడు చెప్పినదేమనగా, పెనిమిటి మృతినొందినప్పుడు ఆప్రేతయొక్క సన్నిధానమందే భార్య కంఠసూత్ర కర్ణపత్రములను తీసివేసి స్నానము జేయవలయునని చెప్పెను. ఇతర స్మృతియందు జెప్పఁబడిన దేమనగా, పెనిమిటి మృతినొందినప్పుడు భార్య తత్కాలమందే స్నానమునకు పూర్వమందుగాని స్నానముజేసిన పిమ్మటగాని లేక, పదియవదినమునందుగాని కంఠసూత్రమును విసర్జించవలయునని చెప్పెను. పదియవదినమునకు వెలుపలనుండుటవలన నాటంకముకలిగెనేని యాదినమునందు మాని స్నానము జేసినపిమ్మట కంఠసూత్రమును విసర్జించవలయు ననియు శ్రాద్ధములను యథోక్తకాలమునందే యాచరింపదగుననియు జెప్పఁబడెను. పదిదినముల పర్యంతము కర్త తనశక్తికొలదియు జ్ఞాతులను జేసిదినములయందు నితరులను భుజింపజేసినయెడల ప్రేతకు విశేషపుణ్యము కలుగునని జెప్పఁబడియున్నది గాన పదియవదినమునందు కర్త జ్ఞాతులతోగూడ స్నానముజేసి యావస్త్రములను విడిచి ధౌతవస్త్రములను ధరించి వారితోగూడ భుజించవలయును. జ్ఞాతులు తృప్తినొందినయెడల ప్రేతకు తృప్తికలుగునని చెప్పఁబడెను గాన జ్ఞాతులతోగూడ పదిదినములపర్యంతము సంభాషణ స్నాన

భోజనవిహారణాదులను సలుపవలయును అందువలన ప్రేతకు శీఘ్రముగా తృప్తికలుగును ఈవిధముగ దశాహవిధి చెప్పఁబడెను.

ఏకాదశాహకృత్యము.

౧౬౫—తా. ఏకాదశదినమున ప్రాతఃకాలమందు స్నానముజేసి బ్రాహ్మణునిగాని జలమునుగాని స్పృశించినను శుద్ధియగుననియు క్షత్రియులు మొదలగువారు వాహనాదులను స్పృశించిన శుద్ధియగుననియు చెప్పబడెను. సంగ్రహమునందు జెప్పినదేమనగా, ఆశౌచానంతరముజేసి పుణ్యాహవాచన స్వస్తివాచనాదికములను జరిపి బ్రాహ్మణులను భుజింపచేసిన ప్రేతకు తృప్తియు ముక్తియు కలుగునని యున్నదని తాత్పర్యము.

కర్తృభార్య రజస్వలైనయెడల జేయువిధానము.

౧౬౬—తా. పదునొకండవదినము సమీపించి యుండగ కర్త యొక్కభార్య వెలుపలనుండెనేని యాదినమునం దాద్యశ్రాద్ధమును జరిగించి మిగిలిన యూనాదిశ్రాద్ధముల నాఁ వలయును. కర్తభార్య రజస్వలై పదునొకండవదినమునకు నభ్యంతరము కలిగెనేని సపిండీకరణమునువిడిచి మిగిలిన శ్రాద్ధములను జేయవలయునని మఱియొకరు చెప్పిరి శ్రాద్ధశేషమని చెప్పుటవలన పదునొకండవ దినమునందు విధాయకమగు ఆద్యశ్రాద్ధము రుద్రగణాఖ్యశ్రాద్ధము వృషోత్సర్జనాంగ శ్రాద్ధమును జేయవలయుననియు సపిండీకరణనిమిత్తముగ నపకృష్యము జేయబడు పదియేను యేకోద్దిష్టశ్రాద్ధములను విడువవలయు ననియు జెప్పఁబడెను పన్రెండవదినమునందు స్నానమాయెనేని యాదినమునందే తిరిగి స్నానము చేసినయెడల శుద్ధికలుగుననే వచనప్రమాణమువలన రెండవ స్నానముజేయించి శుద్ధిబఱచి యాదినమున మధ్యాహ్నకాలమం దాద్యాదిషోడశ ఏకోద్దిష్టశ్రాద్ధములనుజేసి అప్పుడే సపిండీకరణమును జేయవలయును. అప్రకారముగానే గోభిలుడును చెప్పెను. పదమూడవ దినమునందు స్నానమయ్యెనేని యాదినమునందు తిరిగి స్నానముజేయించి శుద్ధిపరచి పన్రెండవదినమున ఆద్యాది షోడశశ్రాద్ధములను పదమూడవ దినమందు సపిండీకరణమును జేయవలయును. ఏకాదశదినమునకు నాటంకము సంభవించినయెడల పన్రెండవ దినమునందుగాని పదమూడవ దినమునందుగాని చేయవచ్చునని యున్నది గాన భార్య స్నానమైనపిమ్మట ప్రాతఃకాలమునందు స్నానముజేసి యింటికివచ్చి గృహశుద్ధిగొఱకు పుణ్యాహవాచనాదులను జేసి వృషోత్సర్జనమును జేయవలయును.

## వృషోత్సర్జనము.

౧౬౭—తా. ఏకాదశాహస్సునందు ప్రేతనుగురించి వృషోత్సర్జనముచేసినయెడల పిశాచత్వము నొందక స్వర్గలోకము నొందునని శంఖుడు చెప్పెను. మరియు నేకాదశదినమునందు ప్రేతనుగురించి వృషోత్సర్జనము జేయక నెన్నిశ్రాద్ధముల జేసినను పిశాచస్వరూపము విడువదనియును చెప్పెను. పుత్రసంతానము కలదిరై పెనిమిటి జీవించి యుండగా భార్య మృతినొందినయెడల నామెను గురించి కుమారుఁడు తండ్రి జీవించియుండు పర్యంతము వృషోత్సర్జనము జేయ నక్కరలేదనియు పాతివ్రత్యముచే జెందునట్టి పుణ్యలోకము వృషోత్సర్జనము జేయకపోయినను భర్తయు కుమారుఁడు సజీవులై యుండగా మరణించినస్త్రీకి సంభవించుననియు చెప్పఁబడెను. తండ్రివిషయమై కుమారుఁడు వృషోత్సర్జనము చేసినయెడల యేడు జన్మములయందును బాల్యవార్ధక్యాది వయస్సులలో జేయబడిన పాపమంతయు తత్‌క్షణమే నశించును. పతివ్రతయు బంధువులు కలదియు పుత్రసంతానము కలదియు సువాసినియునగుస్త్రీ మృతినొందినయెడల ఒక్కవృషభముతోనే జేయక ఆవుతోగూడ వృషోత్సర్జనము చేయవలయునని వ్యాసుఁడు చెప్పెను. నీలవర్ణముగల వృషభముతో రుద్రుని గురించి విడువవలయును. సంతానము లేనిదగుచు స్త్రీ మృతినొందినప్పుడు తానే కర్తయైనను భార్యను గురించి పెనిమిటి వృషోత్సర్జనము చేయ గూడదు. పెనిమిటి జీవించియుండగా మృతినొందిన స్త్రీవిషయమై తత్కాలమునందు వృషోత్సర్జనముజేయక తండ్రి మృతినొందినపిమ్మట తండ్రిసంబంధమగు నౌర్ధ్వదైహిక కృత్యములనన్నియు జేసినపిమ్మట కుమారుఁడు తల్లినిగూర్చి వృషోత్సర్జనము చేయవలయును. తండ్రితోకూడ సపిండీకరణమును జేయగూడదు. పెనిమిటి పుత్రులు లేనియాఁడుది మృతినొందినప్పుడు మరియొకడు కర్తయైనయెడల ఆమెనుగురించి వృషోత్సర్జనముజేసి శ్రాద్ధమును చేయవలయును. భర్తయు పుత్త్రులు జీవించియుండగా మృతినొందిన స్త్రీవిషయమై వృషోత్సర్జనముజేయ నక్కరలేదనియు బ్రాహ్మణునకు గోదానముచేసిన చాలుననియు చెప్పఁబడెను. పదునొకండవదినమునందు వృషోత్సర్జనముజేయుట సంభవించనియెడల గోష్ఠప్రదేశమునుండి వృషభము నింటికిదీసికొనివచ్చి సూపము కలిపిన యన్నమును తినిపించవలయును. అనంతరము మూడవపక్షములోగాని యాఱుమాసములలోగాని మృతదినమునందు వృషోత్సర్జనము చేసినయెడల ప్రేతశ్రాద్ధమును

చేసినంత ఫలము కలుగునని చెప్పఁబడెనని తాత్పర్యము.

వృషోత్సర్జన కాలము.

౧౭౮—తా. జాబాలిచే వృషోత్సర్గమును గురించి కాలపరిమితి యీవిధముగ జెప్పఁబడెను. ఏకాదశాహస్సునందుగాని ఆఱవ మాసమునందుగాని మూఁడవ పక్షమునందుగాని వృషోత్సర్గమును జేసినయెడల ముందునుపకారము కలదియగును. ప్రేతకార్యసంబంధమగు వృషోత్సర్గము పదునొకండవ దినమునందు జేసినయెడల గురుశుక్ర మౌఢ్యదోషము లేదనియు నేకాదశదినముకంటె మరియొకప్పుడు వృషోత్సర్గమును చేసినయెడల మౌఢ్యదోషము కలదనియు చెప్పఁబడెను. కార్తికమాసమునందు, చైత్రమాసమునందు, రేవతీనక్షత్రమందును బ్రాహ్మణాది త్రివర్ణముల వారును వృషోత్సర్గమును జేయవచ్చును. ఆశ్వయుజ పౌర్ణమియందును, వైశాఖ పౌర్ణమియందును కార్తికమాసములో కృత్తికానక్షత్రముతో గూడిన దినమునందును సూర్య చంద్రగ్రహణములయందును మేష కర్కటక తులా మకరరాసుల సంక్రమణ దినములందును, ఆషాఢమాసములో మాతాపితరుల మృతదినములయందును పితృలనుగుఱించి వృషోత్సర్జనము జేయవలయును. ప్రేతోద్దిశ్యముగ జేయఁబడు వృషోత్సర్గమునందు వృద్ధిశ్రాద్ధముచేయ నక్కరలేదు. వృషభముయొక్క వెనుకప్రక్కను పార్శ్వములయందు చక్రము శూలము మొదలగు వానిచే గుర్తులను వేయవలయును. బ్రాహ్మణునకు తామ్రవర్ణము కపిలవర్ణము కలదియు, క్షత్రియునకు శ్వేతవర్ణము రక్తవర్ణము కృష్ణవర్ణము గౌరవర్ణము పాటలవర్ణము స్నిగ్ధవర్ణము కలదియు, వైశ్యునకు క్షీర నీలవర్ణము కలదియు, శూద్రునకు కృష్ణవర్ణము కలదియు నగు వృషభము చెప్పఁబడినది. నాలుగుసంవత్సరములు వయస్సుకలవి శ్రేష్ఠమైనవి. అవి సంభవించనియెడల రెండుసంవత్సర పరిమితి వయస్సుగల వృషభములైనా యుపయోగపడును. ఒకటి రెండుమూఁడు నాలుగుసంవత్సరములలో నెంతవయస్సు కలదియైనను సర్వావయవములును శుభలక్షణములు కలదిగా నుండునట్లుచూచి వృషోత్సర్జనము చేసిన యెడల కర్తకు స్వర్గప్రదమైనదగును. ఆవృషభముయొక్క లోమము లెన్నియుండునో అన్ని వేలసంవత్సరములు స్వర్గలోకములో నివాసముకలుగును. శరీరమంతయు తెల్లగానుండి ముఖమునందు తోకయందు పాండువర్ణముకలిగి డెక్కల కొమ్ముల సమీపమునందు తెల్లనివర్ణముకలది నీలవృషభమని చెప్పఁబడును. తనకుమారుఁడుగాని

సోదరుని కుమారుడుగాని ప్రేతయొక్క పదునొకండవ దినమునందు వారివారివర్ణములకు జెప్పఁబడిన వర్ణముగలదిగాని లేక నీలవృషభమును గాని యుత్సర్జనమును చేసినయెడల ప్రేతస్వరూపము నశించును. వృషోత్సర్జనము జేయునప్పుడు హోమమునుకూడ చేయవలయును. బ్రాహ్మణులకు భోజనమును పెట్టవలయును. వృషభమునకు చక్రాంకణము చేయునప్పుడు శరీరము లోమములు కాలుచుండును. ఆదోషము నివృత్తికొఱకు నేకోద్దిష్టవిధానముగ నెనమండ్రుగురు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. ప్రేతనిమిత్తమగు వృషోత్సర్గమునందు నేకోద్దిష్టవిధానముగాను కామ్యవృషోత్సర్గమునందు నాందీముఖ శ్రాద్ధవిధానముగాను బ్రాహ్మణులను భుజింప జేయవలయును. అనేకపుత్త్రులు కలుగవలయుననియు వారిలో నొకడైనను గయకువెల్లి పిండము వేయుననియు లేక నీలవృషభోత్సర్జనము నైన చేయుననియు పితృదేవతులు కోరుచుందురు. ప్రత్యక్ష వృషోత్సర్జనము జేయుటకు శక్తుడుకానియెడల హోమమును జేసి సువర్ణముతోగాని యామ్రద్రవ్యముతోగాని యుత్సర్జనము చేయవలయును. ప్రత్యక్షముగా వృషోత్సర్జనము జేయుటకు శక్తిలేని పక్షమునందు పదునొకండవదినమునందు రుద్ర ప్రీతికరముగ రుద్రసూక్తాదిపారాయణము పదునొకండుగురు బ్రాహ్మణులచే జేయించి వారికి భోజనము పెట్టి దక్షిణ తాంబూలాదుల నివ్వవలయును. తేనె క్షీరము ఆజ్యము మొదలగువానితోడ షడ్రసోపేతముగ భుజింప జేయవలయును ఇవియన్నియు వృషభము సంభవించని పక్షములో జెప్పఁబడినవి. సపిండీకరణమునకు లోపుగ వృషోత్సర్గము రుద్రగణ వసుగణ శ్రాద్ధములను జేయక అజ్ఞానముచే సపిండీకరణము చేసినయెడల కులక్షయమగునని చెప్పఁబడెను. కాఁబట్టి పదునొకండవ దినమునందు పుణ్యాహవాచనము జేసి ప్రేతస్వరూపమువదల స్వర్గలోక ప్రాప్తి నిమిత్తము వృషోత్సర్జనముచేసి యేకోద్దిష్టవిధానముగ షోడశ శ్రాద్ధములను జేసి బ్రాహ్మణులను భుజింపజేయవలయునని స్మృతితత్వ నిర్ణయమందు జెప్పఁబడినట్లుగా వ్యాసుఁడు చెప్పెనని తాత్పర్యము.

### వృషోత్సర్గమును జేయువిధానము.

౧౬౬—తా. కర్త సచేలస్నానముచేసి సంధ్యావందనాది నిత్యకర్మలను దీర్చికొని పుణ్యాహవాచనమును జేసికొని సమంత్రకముగ నవశ్రాద్ధమును జేయవలయునని యున్నది. కాఁబట్టి కర్త స్నానము జేసిన పిమ్మట ప్రాణాయామము దేశకాల సంకీర్తనము జేసి తండ్రియొక్క గోత్ర

నామములనుజెప్పి తండ్రి యాహితాగ్నియైన యెడల దహన దినము మొదలుకొని యనియు ననాహితాగ్నియైనయెడల మరణదినము మొదలు కొని యనియుజెప్పి ప్రేత తృప్తికొఱకు నేకాదశదినమునందు ఆమద్రవ్య ముతో నేకోద్దిష్టవిధానముగ నవశ్రాద్ధమును జేయుచున్నానని సంకల్పము జేసి బ్రాహ్మణునిబిలచి క్షణమునిచ్చి పాదప్రక్షాళనాది పదార్థము నిచ్చుట విసర్జనాంతము జేయవలయును. సమంత్రకమైన ప్రయోగము అగ్నావా ద్యేకోద్దిష్టామశ్రాద్ధమునందు వివరముగ చెప్పఁబడును. అంతరము ఒక సంవత్సరము రెండు సంవత్సరములు మొదలగు పరిమితి వయస్సుగల నీలవృషభమునుగాని లేక సంభవమైన వర్ణముగల వృషభమునుగాని తీసికొనివచ్చి యజ్ఞోపవీతిగా ప్రాణాయామము దేశకాల స్మరణముజేసి తండ్రియొక్క గోత్రనామములనుజెప్పి ప్రేతయొక్క మరణదినము మొద లేకాదశదినమునందు ప్రేతస్వరూపము వీడిపోయి పైశాచికాది బాధలు పోవుటకొఱకు రుద్రునిగురించి వృషోత్సర్జనము జేయుచున్నానని సంకల్ప ముచేసి అగ్నిప్రతిష్ఠ ప్రార్థన దర్భాస్తరణ పరిషేచన చరుశ్రవణాభిఘరణ పరిషేచనాంతము హోమాదులను జేయవలయును. ఇట్లు చేయువిధానము మూలములో జూచుకొనవలయును. ప్రత్యక్ష వృషోత్సర్జనము లేనిసమయ మందు అగ్నిప్రతిష్ఠకు ముందుగ మంటపము నేర్పరచి దానిపైన రెండు కూర్చలనుంచి వానియందు గోవృషభ మిథునద్వయము నావాహనము చేసి షోడశోపచార పూజాంతమును జేయవలయును. ఇక్కడ నగ్ని హోత్రవిధానము షట్పాత్రయుక్తమైనది కాఁబట్టి చరుసహితముగ నాజ్య హోమములు స్విష్టకృత్తుజయాది హోమములనుజేసి పరిషేచనాంతము చేసి పూర్ణపాత్రయందుండు జలముచే గోమిథునమునందు ప్రోక్షణ జేయ వలయును. అనంతరము గోవృషభమిథునమును వస్త్రాదులచే నలంకరించి హుతావశిష్టమగునాజ్యముతో లింగాకారముగగాని చక్రాకారముగగాని వృషభమును లాంచనముజేసి ప్రేతస్వరూపము పోవుటకొఱకు ఈవృష భమును విడుచుచున్నానని వృషభమునకు తప్తమగు చక్రాదిలాంఛ నముజేసి ప్రాఙ్ముఖముగ వృషభమును విడువవలయును. అప్పు డిట్లు చెప్పవలయును. ఓ వృషభరాజోత్తమా! తూర్పుదేశమునకు వెళ్లి యక్కడనుండు పర్వతములందు కసవునుమేయుచు తూర్పుసముద్రము నందు నుదకమును [illegible] గోవులకు నధిపతివిరై దేవ బ్రాహ్మణ భూములనువిడిచి యితరప్రదేశములయందు స్వేచ్ఛగా విహ

రింపుమని చెప్పవలయును. ఇట్లు నాలుగుదిక్కులను గుఱించియు జెప్ప వలెను. ఇట్లు వృషభమును ప్రార్థించి తూర్పుదిశగా విడిచి యనంతరము హోమము జేయగా మిగిలినయన్నముతో నెనిమిదిపిండములను జేసి యగ్ని హోత్రమునకు నెనిమిది దిక్కులయందు దర్భాస్తరణ తిలోదకాదులను విడిచి యాయెనిమిదిపిండముల నెనిమిది దిక్కులయందు నుంచి తిరిగి తిలోదక విసర్జనాంతముజేసి యగ్న్యుపస్థానము బ్రహ్మకు దక్షిణాప్రదా నాంతమును జేయవలయును ఈప్రకారముగ కల్పకారికాది స్మృతుల యందును జెప్పియున్నది. ఎవరేమతము నవలంబించినవారో వారివారి మతానుసారముగ చక్రముతోగాని శూలముతోగాని వృషభమునకు తోకకుపైగా కటిప్రదేశమునందు లాంఛనము వేయవలయును. ఇట్లు వ్యాసులు చెప్పెను.

సభర్తృక విషయము.

౧౭౦—తా. పెనిమిటియు కుమారుఁడు సజీవులై యుండునప్పుడు స్త్రీ మృతినొందెనేని యామెనుగూర్చి కుమారుఁడు తండ్రి జీవించియుండు పర్యంతము వృషోత్సర్జనము చేయగూడదని చెప్పిరిగాని యది యోగ్యమై నదికాదని మఱికొందరనిరి. అదియేపిధముగా ననగా, పెనిమిటియు కుమా రుఁడు సజీవులైయుండగా వారియెదుట మృతినొందినప్పటికిని స్త్రీకి వృషో త్సర్జనము యథావిధిగ జేయవలయునని మఱియొకరు చెప్పిరి. కాఁబట్టి యథావిధిగ వృషోత్సర్జనము జేయవలయును. మఱియొకవిశేషము కలదు. ఏస్త్రీ కుమారులు లేనిదగుచు పెనిమిటి జీవించియుండగా మృతినొందునో ఆమెనుగూర్చి యొకగోదానము చేసిన చాలునని మఱియొకడు చెప్పెను. కాఁబట్టి యీప్రకారము బహువిధములుగ ధర్మశాస్త్రవేత్తలు చెప్పి నందున శక్తికలిగి యున్నయెడల వృషోత్సర్గమును జేయవచ్చును శక్తి లేనియెడల మానినను ప్రత్యవాయము లేదు. ఈప్రకారము వృషోత్సర్గ విధానము చెప్పఁబడెనని ప్రయోగక్రమము మూలమునందును లేక యాజ్ఞికపాత్రక్రమముగల యాజుష అపరప్రయోగాను క్రమణికయందును జూడదగునని తాత్పర్యము.

షోడశశ్రాద్ధలు ఏకోద్దిష్టము.

౧౭౧—తా. నవము నవమిశ్రము పురాణము అని యేకోద్దిష్టము మూఁడువిధములు. పదిదినములు లోపుగా జేయబడు శ్రాద్ధములు నవ శ్రాద్ధములని చెప్పఁబడెను. పదునొకండవదినమునందు జేయదగిన ఆద్య

శ్రాద్ధము మొదలు సపిండీకకరణ పర్యంతము జేయబడు శ్రాద్ధములు నవ మిశ్రములని చెప్పబడును. సపిండీకరణమైన పిమ్మట మాసిక ప్రత్యాబ్ధికాది శ్రాద్ధములు పురాణములనియు చెప్పబడునని మూడువిధములుగా చెప్పిరి.

స్వతంత్ర ఏకోద్దిష్టనిర్ణయము.

౧౭౨.—శ్లో. ఆశౌచానంతరమందు ఏకోద్దిష్టశ్రాద్ధమును చేయ వలయునని యున్నది. ప్రతిమాసమునందును సంవత్సరమందును ప్రతిసం వత్సరమునందును గలిగియుండెడి మృతదినములయందును పదునొకండవ దినమునందును జేయుబడు శ్రాద్ధమాద్యశ్రాద్ధమని చెప్పబడునని యాజ్ఞ వల్క్యుడు చెప్పెను. కాబట్టి పదునొకండవ దినమునందు జేయదగిన ఏకోద్దిష్టశ్రాద్ధము మృతదినమునందు జేయదగిన ఆద్యైకోద్దిష్ట శ్రాద్ధము ఈ రెండును పదునొకండవ దినమునందు జేయవలయును. ఆప్రకారము గానే వ్యాసుడును చెప్పినదేమనగా, సూతకము సంభవించినను పతితత్వ ముకలిగినను స్వతంత్రశ్రాద్ధమును విడువగూడదని చెప్పబడెనుగాన సూత కానంతరమందు రెండు యేకోద్దిష్ట శ్రాద్ధములను జేయవలయుననెను. అనగా, పదునొకండవ దినమునందు జేయదగినది స్వతంత్రైకోద్దిష్ట శ్రాద్ధ మనియు మృతదినమునందు జేయదగినది మాసికమనియు జెప్పబడును. స్వతంత్ర నవశ్రాద్ధము మిశ్రనవశ్రాద్ధముకంటె వేరైయున్నది. కాబట్టి నవశ్రాద్ధములు మూడువిధములుగా నున్నవి. ఆప్రకారముగానే ప్రజా పతియు నీవిధముగా జెప్పెను నవశ్రాద్ధము స్వతంత్ర నవశ్రాద్ధము నవ మిశ్రశ్రాద్ధము అనునట్టి మూడుశ్రాద్ధముల నాశౌచానంతరమున జేయ వలయును పూర్వాహ్ణకాలంబున నవశ్రాద్ధమును మధ్యాహ్నకాలంబున స్వతంత్ర నవశ్రాద్ధమును అపరాహ్ణకాలమందు నవమిశ్రశ్రాద్ధమును జేయ వలయు ననియు చెప్పెను. ఈవిషయమునులో నారు నవశ్రాద్ధములను జేయవలయునని కొందరి మతమై యున్నది. ఆపక్షములో నవశ్రాద్ధము షోడశ నవశ్రాద్ధములో నాద్యశ్రాద్ధము అను మూడుశ్రాద్ధములును పదునొకండవ దినమునందు జేయవలయును. అయిదు నవశ్రాద్ధములని చెప్పెడివారి మతమును కలదు. అప్పుడు పదునొకండవ దినమునందు స్వతంత్ర యేకోద్దిష్ట నవశ్రాద్ధము షోడశాంతర్గతమగు ఆద్యశ్రాద్ధమును జేయవలయును. ఎందువల్లననగా, సూతకము పతితత్వము సంభవించినప్ప టికి పదునొకండవ దినమునందు స్వతంత్ర నవశ్రాద్ధమును జేయవలయు నని యున్నది కాబట్టి [illegible] తండ్రి

మృతినొందినప్పటికిని తల్లియొక్క పదునొకండవదినమునందు తల్లిసంబంధమగు నేకోద్దిష్ట శ్రాద్ధమును జరిగించవలయును. మఱియు తల్లిదండ్రుల కృత్యముల నేకకాలమునందు జేయునప్పుడు తండ్రికృత్యమును ముందుగా జేయవలయునని చెప్పియున్నది యని ప్రశ్న చేసినయెడల అది స్వతంత్రైకోద్దిష్ట శ్రాద్ధముకంటె నితరములగు నవమిశ్రాది శ్రాద్ధముల విషయమని తెలిసికొనవలయును అందువలన స్వతంత్రైకోద్దిష్ట నవశ్రాద్ధము నాశౌచములో నైనను జేయవలయును. అందును గురించి యీప్రకారముగా శంఖుడు చెప్పెను. పదునొకండవ దినమునందు స్వతంత్రైకోద్దిష్ట శ్రాద్ధమును జేయుటకు కర్తకు తాత్కాలిక శుద్ధికలుగును. కాబట్టి అట్టి స్వతంత్రశ్రాద్ధము నాచరించిన పిమ్మట కర్త తిరిగి యాశౌచము కలవాడగును అందువలన బ్రాహ్మణులు మొదలగు నాలుగు జాతులయందును జ్ఞాతులు మొదలగువారియొక్క మరణ జనన నిమిత్తమగు ఆశౌముచే శుద్ధి లేక పోయినప్పటికిని స్వతంత్ర నవశ్రాద్ధమును గురించి పదునొకండవ దినమునందు కర్తకు తాత్కాలిక శుద్ధివలన స్వతంత్ర నవశ్రాద్ధము నాచరింపవలయును. పదునొకండవ దినమునందు స్వతంత్రమగు నేకోద్దిష్ట శ్రాద్ధమును జేయనియెడల తిరిగి సంస్కారమును జేయవలయునని దోషమును కూడ బృహస్పతి చెప్పెను. షోడశ మాసికములలో మొదటి మాసికమునకు నాశౌచము మొదలగు విఘ్నములు సంభవించినప్పుడు మరియొక కాలము చెప్పబడియున్నది. కాబట్టి పదునొకండవ దినమునందు జేయ నక్కరలేదనిరి. దానినిగురించి బృహస్పతి చెప్పిన దేమనగా పదునొకండవ దినమునకు విఘ్నమువచ్చినప్పుడు పండ్రెండవ దినమునందుగాని యిరువైమూడవ దినమునందుగాని చేయవచ్చుననెను. అపరార్కుడును మరియొకమాసములో మృతదినంబున జేయవచ్చుననెను. త్రిపక్షములో నైనను జేయవచ్చునని యితర స్మృతులయందును కలదు. రెండు యేకోద్దిష్ట శ్రాద్ధములను జేయుటలో గౌతముడు చెప్పిన విశేష మేమనగా, ఆద్యైకోద్దిష్ట శ్రాద్ధమునందు బ్రాహ్మణుడు భుజించేయెడల వానికి శ్రాద్ధ విధిపూర్వకముగా భోజనము పెట్టవలయును లేనియెడల నగ్నిహోత్రములోనైన హోమము జేసి తిరిగి బ్రాహ్మణునకు భోజనము పెట్టవలయును. అందువలన ద్విరావృత్తియగుననెను. దీనిని గురించి స్మృతిసంగ్రహములో విమర్శగా జెప్పినదేమనగా, ఏకోద్దిష్ట శ్రాద్ధములో బ్రాహ్మణుడు భుజింపని పక్షమునందు ఉదీరతాం అను మంత్రములను జెప్పుచు ఘృతములోగాని

పాయసముతోగాని యన్నముతోగాని తమతమ శాఖాసంబంధమైన సూత్రప్రకారముగా నగ్నిహోత్రములో హోమముజేసి ఆదినమునందే తిరిగి యేకోద్దిష్టమును గురించి యొకబ్రాహ్మణుని భుజింప జేయవలయునని చెప్పబడెను. అందువలన ద్విరావృత్తి కలుగును. ఇట్లు వృత్తిగాజేయుట స్వతంత్రైకోద్దిష్టశ్రాద్ధమున కేదియని కొందరనిరి. ఆద్యమాసికమునకే ద్విరావృత్తియని మరికొందరనిరి. ఆద్యమాసికమునకు ఆవృత్తిగాగాని లేక అనావృత్తిగాగాని చేయుపక్షములోనైనను ముందుగా స్వతంత్ర ఏకోద్దిష్టశ్రాద్ధమును బ్రాహ్మణభోజనరూపముగా గాని యగ్నిహోత్రములో హోమముజేయుట రూపముగా గాని చేయవలయును. స్వతంత్రైకోద్దిష్టములో బ్రాహ్మణులు సంభవించేయెడల పదునొకండుగురు బ్రాహ్మణులకుగాని లేక శక్తిలేనిపక్షములో నొక బ్రాహ్మణునకుగాని భోజనముపెట్టి తనశక్తిననుసరించి దక్షిణల నివ్వవలయును. అనగా ప్రేత జీవితకాలములో ననుభవింప బడినవిగాని యపేక్ష కలిగియున్నవిగాని బంగారము వెండి భూమి గోవు వస్త్రములు శయ్యపాదుకలు పాత్రలు ఛత్రము మొదలగు వస్తువులు ఉత్క్రాంతి సమయములో ననుభవింప బడినవన్నియు నివ్వవలయునని విష్ణువుచెప్పెను గాన నూతకాంతమునందు నొకబ్రాహ్మణుని ప్రేతను గురించి యావాహనముజేసి పూర్వము చెప్ప బడిన వస్తువులలో తనశక్తి ననుసరించియిచ్చి యాబ్రాహ్మణుని భుజింపజేసి వానిని తిరిగి చూడనివాడై పంపించి తాను స్నానముజేసి సపిండీకరణాది శ్రాద్ధములను జేయవలయును. శాతాతపుడు నీవిధముగానే చెప్పుచు కుండమునందుగాని మండలమునందుగాని పాదప్రక్షాళన జేయవలయు ననియు బ్రాహ్మణుని హస్తమునందుగాని యగ్నిహోత్రములోగాని యొక ప్రేతాహుతిని జేయవలయు ననియు స్వధాశబ్దము నమశ్శబ్దము మంత్రము మొదలగునవిచెప్ప నక్కరలేదనియు సమస్తమును ప్రేతశబ్దముతోనే చేయవలయు ననియు జెప్పెను. అనంతరము స్నానముజేసి యపరాహ్ణ కాలంబున ఆద్యమాసికమును పెట్టవలయు ననియు ఈప్రకారముగానే ద్వితీయాది మాసికమును మృతదినమునందు జేయవలయు ననియు పండ్రెండవ దినమునందుగాని సంవత్సరములోగాని సపిండీకరణమును జేయవలయు ననెను. ఆద్యమాసికములో నొక్కబ్రాహ్మణుని భుజింప జేసినయెడల బ్రాహ్మణధర్మమునకు లోపముకలుగును గాన ఆద్యమాసిక యేకోద్దిష్టశ్రాద్ధమునందును పదునొకండుగురు బ్రాహ్మణులకు పెట్టవలయు

ననియు తనశక్తిననుసరించి హిరణ్యాది దక్షిణల నివ్వవలయు ననియు యథావిధిగా పిండప్రదానము జేయవలయు ననియు సత్యవ్రతుడు స్మృతి సంగ్రహాది గ్రంథములు చెప్పినవి. పదునొకండవ దినమునందు ప్రేత నావాహనము జేసి పదునొకండుగురు బ్రాహ్మణులకు భుజింపజేయవలయు నని కొందరును ఆద్యశ్రాద్ధము నిమిత్తము నొక్కరిని యావాహనము జేసి వానికే సమస్త దక్షిణలనిచ్చి మిగిలిన పదిబ్రాహ్మణులకు ప్రేత తృప్తి కొఱకు భోజనము పెట్టవలయు ననిరి. ఆప్రకారముగానే మరీచి మొదలగు వారును చెప్పిరి. రుద్రగణ శ్రాద్ధమును షోడశ మానసిక శ్రాద్ధమునకు ముందుగాగాని పిమ్మటనుగాని జేయవలయును. ఆప్రకారముగానే యాప స్తంబుడు చెప్పినదేమనగా, ప్రాచీనావీతము జేసికొని తిలలనుగ్రహించి ప్రేతయొక్క గోత్రనామములను జెప్పి రుద్రగణ సంఖ్యాకు లనగా పదునొ కండుగురు బ్రాహ్మణుల నావాహనము జేసి పాదప్రక్షాళనాదికము జేసి పిమ్మట షోడశాది శ్రాద్ధములను జేయవలయును. ఏకాదశాహస్సునందు ప్రేత ప్రీతికొఱకు ప్రేతనుద్దేశించి పదునొకండుగురు బ్రాహ్మణులను రుద్రప్రీతి కొఱకు రుద్రునుద్దేశించి పదునొకండుగురు బ్రాహ్మణులను భుజింపజేయ వలయునని కాశ్యపుడు చెప్పెను. కాబట్టి దేశాచారము ననుసరించి చేయవలయును. రుద్రునిగురించి చేయునప్పుడు తిలలతోగాని యేకోద్దిష్ట విధానముగాని చేయగూడదు. అక్షతలను గ్రహించి యేకాదశరుద్రుల నావాహనము జేసి పదునొకండుగురు బ్రాహ్మణులను భుజింప జేయవలయు ననియు ఆదినమునందే యథాశక్తిగా బ్రాహ్మణభోజనము పెట్టవలయు ననియు నితరస్మృతులయందును కలదు గాన దేశాచారప్రకారముగా షోడశమునకు ముందుగాగాని తర్వాతగాని చేయవలయును. వసుగణ శ్రాద్ధమును ప్రేతనుద్దేశించిగాని యష్టవస్తువుల నుద్దేశించిగాని చేయవల యును. అష్టవసువుల నుద్దేశించి చేయునపుడు తిలలతోను ఏకోద్దిష్ట విధానముగాను చేయగూడదు. ఉపవీతిగానే యక్షతలతో నష్టవస్తువుల నుద్దేశించి యెనమండుగురు బ్రాహ్మణులను భుజింప జేయవలయును శక్తి లేనియెడల యథాశక్తిగా జేయవలయును వృషోత్సర్జనాంగమైన బ్రాహ్మ ణభోజనము ప్రేతోద్దిశ్యముగా నేకోద్దిష్టవిధానముచే తనశక్తిననుసరించి పెట్టవలయును. అట్లుచేయనిపక్షమునందు వ్యాసుడు ప్రత్యవాయము సంభవించునని చెప్పె నదియెట్లనగా, వృషోత్సర్జనము రుద్రవసుగణ శ్రాద్ధ ములను విడిచి సపిండీకరణము జేసినయెడల కులక్షయమగునని చెప్పెను.

ఆదినమునందే తనశక్తి ననుసరించియు వశిష్ట బ్రాహ్మణభోజనమును జేయించవలయునని యితర స్మృతియందును కలదు. ఈప్రకారము స్మృతులయందు జెప్పియున్నది. కాబట్టి పూర్వమందుజెప్పబడిన శ్రాద్ధములను జేసి స్నానము జేసి యింటికివచ్చి పుణ్యాహవాచనము జేసికొని శ్రాద్ధశేషమును బంధువులతోగూడ భుజింపవలయును. విజ్ఞానేశ్వరుడు చెప్పినదేమనగా, ఏకోద్దిష్టములో భోక్తలు భుజింపగా, మిగిలినపదార్థము సూర్యచంద్రగ్రహణములు సంభవించినపుడు మిగిలియున్నపదార్థమును విడిచిపెట్టవలయునని నిషేధమును చెప్పెను. ఈనిషేధము షణ్ణవశ్రాద్ధైకోద్దిష్ట శ్రాద్ధములో మిగిలినపదార్థభోజనవిషయమని తెలిసికొనవలెను. ఎందువల్లననగా, నవశ్రాద్ధశేషము గ్రహణము సంభవించినపుడు మిగిలినపదార్థము దంపతులు భుజింపగా మిగిలినపదార్థముపర్యుషితము గాన యెప్పుడును భుజింపగూడదని యావిజ్ఞానేశ్వరుడే నవశ్రాద్ధవిషయముగా జెప్పెను. యజ్ఞోపవీతిగానే ప్రదక్షిణ నమస్కారములను జేసి వారినిలేవదీసి ప్రయాణము జేసి పంపించవలయును. ఆసమయంబున శ్రాద్ధశేషమును ఏమిచేయవలయునని కర్తయడుగగా మీబంధువులు ఇష్టులు మొదలగువారితో గూడి భుజింపవలయునని యనుజ్ఞను భోక్తలిత్తురు. ఇట్లు వారివలన ననుజ్ఞపొంది పిమ్మట ప్రాచీనావీతముగా పిండప్రదానము పాత్రచాలనాదికము జేసి పిమ్మట శ్రాద్ధశేషమును భుజింపవలయునని బోధాయనసూత్రము గోపాలకారిక రత్నకారిక త్రైవిద్యవృద్ధులు మొదలగు వానివలన తెలియబడుచున్నది గాన ఆద్యాది షోడశ శ్రాద్ధసంబంధమైన యన్నమును భుజించువిషయములో నిషేధము లేదనియు ఏకోద్దిష్టశ్రాద్ధ శేషభోజనమును గురించి చెప్పబడునట్టి నిషేధవచనములు నవశ్రాద్ధ శేషభోజనవిషయములుగా జెప్పబడినట్లు తెలిసికొనవలయునని స్మృతికర్తలందరును నిర్ణయించి చెప్పిరి.

## ఏకోద్దిష్టభోజనమునందు ప్రాయశ్చిత్తము.

౧౭౩—తా. నవశ్రాద్ధములో భుజించిన ప్రాజాపత్యము ప్రాయశ్చిత్తముగా జెప్పబడెను. ఆద్యమాసికములో భుజించినదానిలో మూడువంతులును త్రైపక్షికములో భుజించినదానిలో సగమును ద్వితీయమాసికములో భుజించినదానిలో నాల్గవవంతును ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని చెప్పబడెను. ఇదియొకపద్ధతియును.

ఆపత్తులేని సమయమందు.

౧౭౪—తా. నవశ్రాద్ధమునందు భుజించినయెడల చాంద్రాయణము మిశ్రశ్రాద్ధమునందు ప్రాజాపత్యము పురాణశ్రాద్ధమునందు నొకదినోపవాస ప్రాయశ్చిత్తమనియు హారీతుడు చెప్పినరీతిగా ప్రాయశ్చిత్తమును జేసికొనవలయునని విజ్ఞానేశ్వరుడు చెప్పెను. మిశ్రనవశ్రాద్ధమునందు ప్రాజాపత్య ప్రాయశ్చిత్తమనునది ఆద్యమాసిక విషయముగా దెలిసికొనవలయును. నవశ్రాద్ధమునందు ప్రాజాపత్యము మాసికమునందు దానిలో మూడువంతులును త్రైపక్షికమునందు సగమును రెండవమాసికమునందు నాల్గవవంతును షాణ్మాసికాబ్ది కాదులయందు పాదము తక్కువగాగల కృచ్ఛము ఇతరమాసములయందు త్రిరాత్రోపవాసము ప్రాయశ్చిత్తములుగా శంఖవచన ప్రమాణముచే జెప్పబడెను. కాబట్టి ఊనమాసికాదులయందు పాదోనప్రాజాపత్యాది ప్రాయశ్చిత్తములను జేయవలయును. నవశ్రాద్ధమునందు చాంద్రాయణము మాసికమునందు పరాకము త్రైపక్షికమునందు అతికృచ్ఛము షాణ్మాసికమునందు కృచ్ఛము ప్రథమాబ్దికమునందు పాదకృచ్ఛము రెండవఆబ్దికమునందు నొకదినమును ప్రాయశ్చిత్తములనుగాను మూడవయాబ్దికమునుండి దోషము లేదనియు జెప్పబడు శంఖునివచనము సర్వాదులచే మృతినొందిన వారి విషయము. బ్రహ్మోదనమందు సోమమునందు సీమంతమునందు జనన నిమిత్తమగు శ్రాద్ధమునందు నవశ్రాద్ధమునందు భుజించినయెడల చాంద్రాయణ ప్రాయశ్చిత్తము జేయవలయునని చెప్పబడెను. ఆమశ్రాద్ధమునం దెప్పుడును అర్ధప్రాజాపత్య ప్రాయశ్చిత్తమును జేయవలయునని షట్త్రింశన్మతమునందు కలదు. దహనానంతరమునందు వస్త్రము తండులసహితమగు మృత్పాత్ర దీపసహితమగు కంచుపాత్ర యీ మొదలగు వస్తువులతోగూడ నగ్నప్రచ్ఛాదనము నివ్వవలయును. అని వ్యాసుడుచెప్పెను. సంచయనాంగమైన యేకోద్దిష్టశ్రాద్ధము మూడవదినమునందు దహనప్రదేశమగు శ్మశానమందుగాని పిండోదకస్థానమైన మృతలస్థమందుగాని చేయవలయును. అని స్మృతియందు జెప్పబడెను. ఎక్కడను మృతినొందెనో అక్కడనే యేకోద్దిష్ట విధానము జేయవలయునని యితర స్మృతులయందును కలదు. ఇతరములగు నవశ్రాద్ధములు గృహమునందుగాని పిండోదకస్థానమునందుగాని చేయవలయును. దర్శయందుగాని సూర్యచంద్ర గ్రహణములయందుగాని తల్లిదండ్రుల ప్రత్యాబ్దికములు వచ్చినేని యన్నశ్రాద్ధమును

జేయుటకు వీలు లేనియెడల హిరణ్యశ్రాద్ధమునుగాని యామశ్రాద్ధమును గాని చేయవలయును.

ఆమశ్రాద్ధ విధానము.

౧౭౫—తా. బ్రాహ్మణుడు అన్నశ్రాద్ధమును జేయుటకు వీలులేని సమయమునందు శ్రద్ధకలవాడై యథావిధిగా ఆమశ్రాద్ధమునుజేసి యామ ద్రవ్యముతోనే అగ్నౌకరణము పిండప్రదానము జేయవలయునని శాతాతపుడు చెప్పెను. ప్రత్యాబ్దికమునందు అన్నశ్రాద్ధము జేయుటకు సంభవము కానియెడల ఆమశ్రాద్ధమును కాని హిరణ్యశ్రాద్ధమునుగాని, చేయవలెను. తల్లిదండ్రులకు వ్యుత్క్రమమరణములయందు శాస్త్రోక్తకాలము కాకపోయినను ఆమద్రవ్యముతోనైనను హిరణ్యముతోనైనను శ్రాద్ధమాచరింపవలయునని స్మృతిసంగ్రహమునందు జెప్పబడెను గాన అత్యంతాపద్విషయములో సపిండీకరణముకూడ హిరణ్యముతోగాని ఆమద్రవ్యముతోగాని చేయవచ్చునని యముడు చెప్పెను. ఆమశ్రాద్ధమును జేయునపుడు బ్రాహ్మణుడు భుజించుపదార్థమునకు నాలుగురెట్లుగా పదార్థము నివ్వవలయును. తల్లిదండ్రులకు పినతండ్రి పెత్తండ్రులకు సోదరులకు మరియు నితరులకు సపిండీకరణము జేయవలసివచ్చినప్పుడు దేశోపద్రవాది బాధ సంభవించినయెడల ఆమద్రవ్యముతోగాని హిరణ్యముతోగాని శ్రాద్ధముచేసి కొఱ్ఱలు యవలు గోధుమలు బియ్యము మొదలగువాని పిండితో పిండములనుజేసి ప్రేతను వారిపితృపితామహుడు మొదలగువారితో సంయోజనజేయవలయునని చెప్పబడువచనము అత్యంతాపద్విషయముగా దెలిసికొనవలయును.

షోడశశ్రాద్ధముల విషయము.

౧౭౬—తా. శవశ్రాద్ధ విధానమును జెప్పి ప్రయోగము చెప్పబడును. షోడశశ్రాద్ధములలో నాద్యశ్రాద్ధము పదునొకండవ దినమునందును ప్రతిమాసమునందును ప్రతిసంవత్సరమునందును జేయవలయును. రెండవమాసికము పండ్రెండవ దినమునందుగాని మాసమునకు తక్కువగాగాని పెట్టవలయును. రెండవమాసమున మొదటియందు మూడవమాసికము త్రిపక్షములో నాల్గవ మాసికము అయిదు ఆరు యేడు యెనిమిది మాసికములు మూడు నాలుగు అయిదు ఆరుమాస సంబధములగు మృతదినములయందును ఆరవమాసము పూర్తికాక పూర్వము తొమ్మిదవమాసికము పదునొకండు పండ్రెండు పదమూడు పదునాలుగు పదునైదు మాసి

కములు ఏడు యెనిమిది తొమ్మిది పది పదకొండు పంౘ్రెండు మాసముల మృతదినములయందును పంౘ్రెండవమాసము పూర్తికాక పూర్వము పది యారవమాసికమును జేయవలయును. వాటినామములయొక్క వ్యుత్పత్తి ప్రసిద్ధమైనది. పదునొకండవ దినమునందు పెట్టబడు ఆద్యమాసికము మొదటిమాసము ఆరవమాసము పంౘ్రెండవమాసముపూర్తికాక పూర్వము పెట్టబడు ఊనమాసికములును రెండవమాసము మొదలు పంౘ్రెండవ మాసము పర్యంతముగల మృతదినములయందును జేయబడు మాసికములును మూడవపక్షములో త్రైపక్షిక మాసికముకలసి మొత్తను పది యారు శ్రాద్ధము లయ్యెను. ఏకాదశాహస్సునందు ఆద్యమాసికము మాసములో ఒకటి రెండు మూడు దినములచేతగాని లేక మాసములో మూడవవంతుచేగాని తక్కువగా నుండునప్పుడు చేయబడునవి యూన మాసికములుగాన మొదటిమాసము ఆరవమాసము పంౘ్రెండవమాసము పూర్తికాక పూర్వము ఊనత్రయశ్రాద్ధములను జేయవలయును మూడవ పక్షములో తేసిదినమునందు త్రైపక్షికము నాచరింపవలయును. ఈవిధ ముగా చెప్పబడెను గాన ఏకాదశదినమునందు ఆద్యమాసికమును పంౘ్రెం డవ దినమునందు సపిండీకరణమును పెట్టి పిమ్మట ఆద్యమాసికముకంటె మిగిలిన యూనాదిమాసికములను వాటివాటికిజెప్పబడిన కాలములయందు నాచరింపవలయును. ఇట్లు చేయుట మొదటిపక్షము. ఈపక్షమునందు సాంవత్సరీకశ్రాద్ధమును పార్వణవిధిగాగాని యేకోద్దిష్టవిధిగాగాని ఎవడు యేప్రకారముగా చేయునో వాడు ఆప్రకారముగానే షోడశశ్రాద్ధములను కూడ జేయవలయును. సంవత్సరాంతమునందు సపిండీకరణము చేయుపక్ష ములో షోడశశ్రాద్ధముల నేకోద్దిష్టవిధానముగానే వాటివాటికిజెప్పబడిన కాలములయందు జేయవలయును. షోడశశ్రాద్ధముల నొకపర్యాయమే చేయుపక్షమునందు నేకోద్దిష్టవిధిగాచేసి సంవత్సరమునకు లోపుగా నెప్పు డైనను సపిండీకరణము జేయవచ్చును. తంౘ్రిడినిగురించి కుమారుడు తిరిగి చేయునప్పుడు నీవిధముగానే చేయవలయునని కొందరనిరి. లేనియెడల దర్శశ్రాద్ధము సంభవించదనిరి ఏకాదశదినమునందు స్నానముచేసి పుణ్యా హవాచనము జేసికొని వృషోత్సర్జనముజేసి షోడశశ్రాద్ధములను జేయ వలయునని స్మృతితత్వ నిర్ణయమందు జెప్పబడెను. త్రైపక్షికము ఊన మాసికములు మాసికములు మొదలగు షోడశశ్రాద్ధములను జేయని యెడల ప్రేతకు పిశాచస్వరూపము వలదనియు నెన్నిశ్రాద్ధములజేసిన

వ్యర్థమనియు శంఖలిఖితాదులు చెప్పిరి. పండ్రెండవదినమునందు త్రిపక్షము నందు షాణ్మాసమునందు ఆబ్దికమునందు ప్రతిమాసమునందు షోడశ శ్రాద్ధములను జేయవలయునని వ్యాసుడు చెప్పెను. షోడశశ్రాద్ధముల నేకోద్దిష్టవిధానముగా సపిండీకరణమునకు పూర్వము జేయవలయునని పైఠీనసుడు చెప్పెను. ప్రేతశ్రాద్ధములను పక్వాన్నముతోనే జేయవలయు ననియు తానుగాని గోత్రుడుగాని పాకముజేయవలయు ననియు ప్రచేతసుడు చెప్పెను ప్రాచీనావీతముజేసికొని తిలలతోనే ప్రేతయొక్క గోత్ర నామములనుజెప్పి ముందుగా రుద్రగణసంఖ్యగల బ్రాహ్మణుల నావాహనము పాదప్రక్షాళనముజేసి పిమ్మట షోడశాది శ్రాద్ధములను జేయవలయు నని స్మృతియందు నుండునట్లుగా ఆపస్తంబుడు వచించెను

చేయనియెడల దోషము.

౧౭౭—తా. ఆద్యమాసికములో నొక్కబ్రాహ్మణునే భుజింప జేసినయెడల బ్రాహ్మణత్వమునకు లోపముకలుగును. అందువలన పదునొకండవదినమునందు పదకొండుగురు బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును ఏకాదశాహస్సునందు రుద్రునిగురించి పదకొండుగురు బ్రాహ్మణులను భుజింపజేసినయెడల ప్రేతకు తృప్తియగునని హారీతుడు చెప్పెను. ప్రేతనుద్దేశించి చేయవలయు ననియు నున్నది. కాబట్టి దేశాచారము ననుసరించి చేయవలయును. తానుజేయుచుండెడి కర్మమధ్యయందు మరియొకసూతకము సంభవించినను లేక పతిత్వము సంభవించినను మొదట నవలంబించియున్న సూతకాంతమందు రెండు యేకోద్దిష్టశ్రాద్ధములను జేయవలయునని వ్యాసుడు చెప్పెను. ఎందువల్ల ననగా స్వతంత్రశ్రాద్ధమును విడువగూడదు స్వతంత్రముగా నవశ్రాద్ధముకంటె నితరమైనది. ఆద్యశ్రాద్ధమునందు బ్రాహ్మణునైనా భుజింపవలయును లేక అగ్నిహోత్రములోనైనా హోమము జేయవలయును పిమ్మట బ్రాహ్మణునకు భోజనము పెట్టవలయునని యున్నది. కాబట్టి ఆద్యశ్రాద్ధమునకు ద్విరావృత్తికలుగు నని గౌతముడు చెప్పెను.

—{ స్వతంత్రైకోద్దిష్టశ్రాద్ధము నాశౌచమధ్యయందైనను జేయవలయును. }—

౧౭౮—తా. పదునొకండవ దినమునందు స్వతంత్రైకోద్దిష్టశ్రాద్ధమును జేయనియెడల నీవిధముగా బృహస్పతి దోషమును చెప్పెను. పదునొకండవదినమునందు నేకోద్దిష్టశ్రాద్ధమును జేయవలయును. జేయని

యెడల తిరిగి సంస్కారము చేయవలయు ననియు పదునొకండవదినము నందు శుద్ధిలేకపోయిన నాద్యశ్రాద్ధమును జేయవచ్చును. ఎందువల్లననగా కర్తకు తాత్కాలిక శుద్ధికలుగుటచే శ్రాద్ధము చేసినపిమ్మట తిరిగి సూతకము కలవాడే యగుననియు చెప్పెను. ఏకాదశదినమునకు సూతకాదుల వలన విఘ్నముకలిగెనేని మరియొకమాసములో మృతదినమునందు శ్రాద్ధమును జేయవచ్చునని యున్నది. పదునొకండవ దినమునకు కర్తయొక్క భార్య రజస్వలగుటచే నాటంకముకలిగెనేని ఆద్యశ్రాద్ధమును జేసి యూనాది మాసికములను విడువవలయును. ఏకాదశదినమునం దాద్యశ్రాద్ధమును జేయుటకు విఘ్నము సంభవించినప్పుడు పంద్రెండవ దినమునం దైనను ఇరువైమూడవదినమునం దైనను జేయవచ్చును. పదునొకండవదినము గడచిన యెడల మూడవ పక్షములోగాని మొదటి మాసములోగాని మూడవమాసములోగాని ఆరవమాసములోగాని సంవత్సరములోగాని రెండవసంవత్సరములోగాని చేయవచ్చునని అపరార్కములో జెప్పబడెను.

—{ అగ్నిహోత్రములో నేకోద్దిష్టమును జేయవచ్చునని విధించెడు కారికలు. }—

౧౭౯—శ్లో. ఏకోద్దిష్టములో బ్రాహ్మణులు భుజించుట సంభవించనియెడల నేమిచేయవలయు ననగా, నూతనములగు భాండములలో నన్నము సూపము మొదలగు పదార్థములనువండి యొకచోట గొయ్యి త్రవ్వి యథావిధిగా ప్రాణాయామముజేసి ప్రేతయొక్క గోత్రనామములను జెప్పి ప్రేతత్వ పిశాచత్వాది స్వరూపములు నశించుకొరకు ఆద్యశ్రాద్ధమును జేయుచున్నానని సంకల్పముచేసి లౌకికాగ్నిని తెచ్చి దానిని కుండసమీపమందుంచి పూర్వమువలెనే ప్రతిష్ఠాది తంత్రము నంతయు జేసి యొకదర్భను తీసికొని "అపేత" అను మంత్రమును జెప్పుచు కుండములో ప్రోక్షణాంతము సంమార్జనమును జేయవలయును. పిమ్మట పూర్వము ప్రతిష్ఠించిన వహ్నిని కుండమునందుంచి ఆద్యైకోద్దిష్ట శ్రాద్ధమునందు నీకుక్షణము నిచ్చుచున్నానని క్షణమునిచ్చి దానిసమీపమునందే పాద్యమునుంచి కుండములో విష్టరమునుంచి పిమ్మట నాయగ్నిహోత్రమును కుండములో నుంచి యాసనాదులను పూర్వమువలెనే యివ్వవలయును. "అగ్నేరిదం" అనుమంత్రముచే నర్ఘ్యమును అగ్నిహోత్రసమీపమునందు విడిచి మిగిలిన క్రియలను నెటులనుచితమో యాతీరుగా పూర్వమువలెనే లౌకికాగ్నియందు అర్చనాంతము జేయవలయును. పిమ్మట నొకవిస్తరిని

శుభ్రముగా కడిగి అగ్నిసమీపమునందు పరచి యభిఘరించి పూర్వము వండినయన్నములో కొంతపిండముల నిమిత్తముంచి కొంతయన్నమును విస్తరియందుంచి యభిఘరించి అల్లము బెల్లము నెయ్యి సూపము మొదలగునవి యుంచి కలిపి యగ్నిహోత్రముచుట్టు దర్భలనుపరచి పరిషేచనము చేసి "యత్తేకృష్ణః" అను మంత్రమును ముప్పదిరెండు పర్యాయములు చెప్పుచు ముప్పదిరెండు కబళములను హస్తముతోనే హోమమును జేయవలయును. ఆకుయందుంచి చేయనక్కరలేదు. కొందరు చతుర్గృహీతముగా హోమమును జేయవలయు ననిరిగాని యది సరియైనది కాదు అనంతరము తమయాచార ప్రకారముగా జేయవలసిన క్రియలను జేసికొనవచ్చును గాని రోదనము చేయగూడదు. అనంతరము పిండప్రదానాదికమును జేయవలయును. ప్రేతనుగురించి వృషోత్సర్జనము జేయబడినది. కాబట్టి యాగోవృషభములకే యన్నమును పెట్టవలయునని కొందరనిరి "సోమాయత్వా" అని మంత్రమును జెప్పి కొందరు హోమమును జేయుదురు అక్కడ ప్రేతనిమిత్తముగా నుంచబడిన వస్త్రాభరణాలంకరణాదుల నన్నియు బ్రాహ్మణున కిచ్చి స్నానము జేయవలయును.

### అగ్నిహోత్రము మొదలగువానియందు ఏకోద్దిష్ట శ్రాద్ధమును జేయువిధానము

౧౮౦—తా. మధ్యాహ్నకాలమునందు కర్త స్నానముజేసి భోజనమునకు సరిపోవునట్టి బియ్యములో కొంచెము పెసరపప్పునుంచి నూతన భాండములో వండి యుంచి ప్రాణాయామ దేశకాల స్మరణాదులను జేసి ప్రాచీనావీతము జేసికొని ప్రేతయొక్క గోత్రనామములను జెప్పి ప్రేతత్వము విడువగలందులకు నేకోద్దిష్టవిధానముగా బ్రాహ్మణాభావమునందు నగ్నిహోత్రములో హోమమును జేయుచున్నానని సంకల్పము జేయవలయును. దేవాలయమునందుగాని నదీతీరమునందుగాని రావిచెట్టు మొదటగాని గొయ్యిత్రవ్వి పలాశశాఖతో ప్రోక్షణాదికము జేసి కుండసమీపమునందు లౌకికాగ్నినుంచి తృణాది పాదప్రక్షాళనాది విధులను జేసి పిమ్మట కుండములో విష్టరమునుంచి యగ్నిహోత్రమునుంచి పిమ్మట జేయవలసిన ఆవాహనార్ఘ్య పూజాది విధులనన్నియు జేయవలయును. అన్నపరిషేచనాది ప్రాణాహుత్యంతము చేయవలయును. చేయుక్రమమంతయు మూలములో చూచుకొనవలయును కొందరు దిగువవ్రాయునట్లు చెప్పిరి. అన్నమును నాలుగుభాగములు చేసి యొకభాగములో నెయ్యి యొకదానిలో బెల్లము

ఒకదానిలో తేనె యొకదానిలో పెరుగు నుంచి యొక్కొక్క భాగము నెనిమిదేసి కబళములను కుక్కుటాండ ప్రమాణముగా ముప్పది రెండు జేసి హోమమును జేయవలయు ననిరి. ఇది దేశాచారాను సారముగ జేయవలయును. ప్రేతనుద్దేశించి యన్నాదికమునంతయు వృషభమునకు పెట్టవలయునని కొందరనిరి. అనంతర ముత్తర పరిషేచనాంతము పిండప్రదానాంతము బ్రాహ్మణ విసర్జనాంతముగల విధులనన్నియు జేసి స్నానము జేసి పుణ్యాహవాచనము జేసికొని యింటికివచ్చి షోడశాది శ్రాద్ధములను జేయవలయును. ఈప్రకారముగా అగ్నిహోత్రము మొదలగు వాటియందు జేయవలసిన యేకోద్దిష్టవిధానము చెప్పబడినది. ఆద్యైకోద్దిష్టశ్రాద్ధమునందు బ్రాహ్మణుని భుజింప జేయవలయును. బ్రాహ్మణాభావమునందు హోమము జేయవలయును.

## బ్రాహ్మణభోజన విషయమునందు.

౧౮౧—తా. ఏకోద్దిష్ట శ్రాద్ధమునందు ఒక అర్ఘ్యపాత్ర ఒకపవిత్రము దైవరహితముగాను చెప్పబడినది. ప్రేతజీవించియుండు కాలములో నుపయోగపడుచున్న వస్త్రాభరణాలంకరణాదుల నన్నియు బ్రాహ్మణున కిచ్చి స్నానము జేసి పుణ్యాహవాచనము జేసికొని షోడశశ్రాద్ధములను జేయవలయును. ఆద్యశ్రాద్ధమునందు బ్రాహ్మణునైనా భుజింప జేయవలయును. లేక యగ్నిలోనైనా హోమము జేయవలయును. అనంతరము తిరిగి బ్రాహ్మణుని భుజింపజేయవలయును గాన ఆద్యమునకు ద్విరావృత్తి కలుగుచున్నది. ఆశౌచమునందు జేయబడు ఆద్యశ్రాద్ధమునందు పార్వణమువచ్చి యుశిరికాయ ప్రమాణముగాను ఏకోద్దిష్టమునందు మారేడుకాయ ప్రమాణముగాను పిండములను జేయవలయునని స్మృతిరహస్యములో జెప్పబడెను. పిల్లి యెలుక మొదలగువానిచే పిండములు స్పృశింపబడినను లేక పిండములు విడిపోయినను తిరిగి శ్రాద్ధమును ఆపాకముతోనే జేయవలయునని అత్రి చెప్పెను. పునశ్శ్రాద్ధమనగా, ఆపాకసంబంధమగు నన్నముతోనే తిరిగి పిండప్రదానము జేయవలయును. ఇట్లు శ్రాద్ధమాచరించిన పిమ్మట భోక్తలకు ప్రదక్షిణము జేసి పంపించి పితృశేషమును భుజింపవలయును. నవశ్రాద్ధములయందు మిగిలిన యన్నసూపాది పదార్థము గృహమునందు మిగిలినయన్నము దంపతులు భుజింపగా మిగిలిన యన్నమును భుజింపగూడదని విజ్ఞానేశ్వరుడు చెప్పెను. ఇట్లు చెప్పుటచే



షణ్ణవశ్రాద్ధ శేషమగు నన్నమునే భుజించుటకు నిషేధముకాని పితృశేష

మును భుజింపవలయుననే శాస్త్రమువలన ఆద్యాదిషోడశైకోద్దిష్ట శ్రాద్ధములయందు మిగిలిన యన్నమును భుజించినందువలన దోషము లేదని స్మృతికర్తలందరును నిర్ణయించి చెప్పిరి.

షోడశశ్రాద్ధ సంకల్పము.

౧౮-౨—తా. దీనికి తాత్పర్యము సమగ్రముగా వ్రాయ నవసరము లేదు. ఇదియంతయు కర్మను చేయు ప్రయోగ విధానమై యున్నది. అందువలన ధర్మశాస్త్రసంబంధమగు విశేషముల నుదహరించిన స్థలముల ననుసరించి వ్రాయబడును. కర్త స్నానము జేసి ప్రాణాయామము జేసి దేశకాలములను కీర్తించి ప్రాచీనావీతుడై తండ్రియొక్క గోత్రనామములను జెప్పి దేశకాల వైపరీత్యముచే దేహధర్మమునందు సమ్మకము లేనందున రేపు సపిండీకరణమును జేయునిమిత్తము యీదినమునందు షోడశశ్రాద్ధముల నపకృష్యము చేసి చేయుచున్నానని సంకల్పము చేసి క్షణమునిచ్చుట మొదలగు విధులను ప్రారంభించి శ్రాద్ధవిధాన ప్రకారముగా బ్రాహ్మణ భోజన విసర్జనాంతము పిండప్రదానము మొదలగునవియు జేయవలయు అర్ఘ్య పాత్రలను పదునెనిమిదియుంచి వానిలో పితృతీర్థప్రకారముగా మంత్రావృత్తిచే నుదకము నుంచవలయును. ఒక్కపాత్రయందే పదునెనిమిది పర్యాయములు మంత్రావృత్తిగా నుదకము నుంచవలయునని కొందరనిరి. లౌకికాగ్నియందు ప్రేతాహుతి నుంచవలయును. అగ్నిహోత్రమునకు తూష్ణీగానే పరిషేచన జేసి పదునెనిమిది పర్యాయములు హోమము జేసి శేషము భోజనపాత్రలయందు కొంచెము కొంచెముగ పదునెనిమిది పర్యాయములుంచి మిగిలినది పిండములనిమిత్తముపయోగపరచవలయును. ఇది క్రమముగా నేకోద్దిష్టముల నాయాకాలములయందు జేయునట్టి విషయసంబంధమైనది. ఒక్కపర్యాయ మపకృష్యము జేసి యేకోద్దిష్టప్రకారము జేయునప్పుడు పిండపాత్రయు నర్ఘ్యపాత్రయు నొక్కొక్కదానినే యుంచి పదునెనిమిది పర్యాయములు అర్ఘ్యము నుంచవలయు ననియు పదునెనిమిదిపిండముల నుంచవలయు ననియు. నొక్కపర్యాయమే ప్రేతాహుతిని జేయవలయు ననియు గార్గ్యుడు చెప్పెను. ప్రేతాహుతినిమిత్తము గ్రహింపబడిన యన్నమునంతయు హోమమును జేయవలయునుగాని దానిలో మిగిల్చి భోజనపాత్రలయం దుంచినయెడల పతితుడగును. కాబట్టి హోమమునకు తీసికొనబడినదిగాక పాత్రయందుంచబడిన యన్నమును తీసికొనియే భోజనపాత్రలయందు కొంచెము కొంచెముగా నుంచవల

యును. గంధము పుష్పములు అక్షతలు ధూపము దీపము మొదలగు నుపచారములనుజేసి బ్రాహ్మణులను భుజింప జేయవలయును. ఏకోద్దిష్టములో నావాహనాదులు నిషేధింపబడినను స్వధాశబ్ద నమశ్శబ్దములను ప్రయోగించుటయు ధూపదీపముల నిచ్చుటయు నిషేధములేదనిరి. ఆవాహనము స్వధాశబ్దము ధూపదీపములు నమశ్శబ్దము సపిండనములో లేదనియు "ఉపతిష్ఠతు" అను పదమును మాత్రమే చెప్పవలయు ననియు కొందరనిరి. శ్రాద్ధమునందు మిగిలియున్న పదార్థము నేమిచేయవలయునని కర్త యడుగగా మీయిష్టులు బంధువులు మొదలగు వారితోగూడి భుజింపవలయునని భోక్తలు చెప్పవలయును. అనంతరము పిండములను జలములో గలిపి స్నానముజేసి యింటికివచ్చి పుణ్యాహవాచనమును జేసికొనవలయును.

ఏకోద్దిష్టమునందు నిషేధింపబడినవి.

౧౪౩—టా. ఏకోద్దిష్టనందు విశ్వేదేవస్థానము లేదు. ఒక్కటియే పవిత్రము. అర్ఘ్యపాత్రయు నొక్కటియే యుంచవలయును. ఆవాహనము అగ్నౌకరణము లేదు. మిగిలిన విధులనన్నియు నపసవ్యముగా జేయవలయును. దీనినిగురించి పూర్ణాశ్రముడు చెప్పినదేమనగా, ఏకోద్దిష్టమునందు నవశ్రాద్ధమునందు అగ్నౌకరణము, ఆవాహనము, పుష్పము, ధూపము, దీపము, అభిశ్రవణము, సవ్యముగాజేయుట, విశ్వేదేవస్థానము, ఓంకారము, నమస్కారము, స్వధాశబ్దము, ఈపదునొకటియు సపిండీకరణమునకు పూర్వము జేయునప్పుడు ఏకోద్దిష్టములో నిషేధముకాని సపిండీకరణమైనపిమ్మట జేయవచ్చునని చెప్పెను. అనగా సపిండీకరణానంతరముజేయు నేకోద్దిష్టవిధానములో పూర్వము నిషేధింపబడిన వన్నియు జేయవచ్చు ననెను.

—{ సపిండీకరణవిషయము. దానిలో విభక్తులు విభాగము కానివారు చేయవలసిన విధానము }—

౧౪౪—టా. విభక్తుడైనవాడు సపిండీకరణ నవశ్రాద్ధాదులు మరియొకసోదరునిచే జేయబడి నప్పటికిని తాను తిరిగి సపిండీకరణమును చేసికొనవలయును. ధనమును విభజించుకొనినను సపిండీకరణ మొక్కడే చేయవలయును. ఒక్కపాకములో భుజించువారివిషయమై పితృదేవతార్చనాదు లొక్కరుచేసిన చాలును వేరువేరు గృహముల పాకమును జేసికొని భుజించువారు పితృదేవపూజలు వేరువేరుగా చేయవలయును. ధనమును

విభజించుకొనినను తమ్ములందరు ననుజ్ఞయిచ్చి నవశ్రాద్ధములు షోడశము సపిండీకరణము పెద్దవానిచేతనే చేయించవలయును. అట్లుచేయించిన సోదరులందరును చేసినవారే యగుదురు. ఏకపిండులగు దాయాదులు ధనమును విభజించుకొనినయెడల నందరును సపిండనము జేయవలయును. భార్యయు కుమార్తెయు జేయవలయును. కోడలుచేయ నక్కరలేదు. తల్లిదండ్రులు మృతినొందుసమయమునకు పుత్రులు విభక్తులు కానియెడల షోడశశ్రాద్ధము లుదకుంభదానము మొదలగునవి జ్యేష్ఠుడే చేయవలయును. సపిండనము యథావిధిగా నొక్కరిచే జేయబడినను ఆబ్దికమును వేరువేరుగా పెట్టవలయు ననిరి. అందరును కలసి సపిండీకరణమును జేసిన యెడల పృథగ్భావము సంభవించదు. సపిండీకరణము జేయనియెడల పితృకార్యము గ్రహణశ్రాద్ధము దేవతాపూజ పంచయజ్ఞములు పార్వణ శ్రాద్ధము మొదలగునవి చేయుటకు సంభవముకాదు. అందువలన విభక్తులైనయెడల ప్రతికుమారుడును సపిండీకరణమును వేరువేరుగా జేయవలయునని వ్యాసుడు చెప్పెను. తల్లిదండ్రులయొక్క సపిండీకరణమును పితృయజ్ఞవిధానముగ పుత్రులందరును వేరువేరుగా చేయవలయును. లేక పెద్దకుమారుడు చేసినను చాలునని బృహస్పతి చెప్పెను. విభక్తులు కానియెడల నవశ్రాద్ధములను షోడశమును జ్యేష్ఠుడుగాని కనిష్ఠుడుగాని చేయవచ్చును. సపిండీకరణమును చిన్నవారందరు ననుజ్ఞనిచ్చి పెద్దవాని చేతనే చేయించవలయును ఇక్కడ కొంచెము విశేషముకలదు జ్యేష్ఠుడు తండ్రితో సమానుడు కాబట్టి యతడు సుగుణములచే నధికుడగునేని వానిచేతనే సపిండీకరణమును జేయించవలయును. జ్యేష్ఠుడు సుగుణవంతుడు కాకపోయినను లేక జ్యేష్ఠుడు చేయుటకు నితరసోదలకు నిష్టము లేకపోయినను ఒక్కదినమునం దేకకాలములోనే పుత్రులందరును వేరువేరుగా సపిండీకరణమును జేయవచ్చునని చెప్పిరి. సోదరులు విభక్తులు కాకపోయినను వేరువేరుగ్రామములయందు నివసించి స్వార్జితముగ జీవించుచున్నయెడల పుత్రులందరును జేయవచ్చును భార్యయు కూతురు చేయవచ్చును కోడలు చేయగూడదు. ఈప్రకారము విభక్తులగురించియు నవిభక్తులగురించియు సపిండీకరణ విధానము చెప్పబడెను.

### నూరు యేకోద్దిష్టములు.

౧౭౫—తా. నగ్నప్రచ్ఛాదనములు డెబ్బదిరైదు. నవశ్రాద్ధములు ఆరు, షోడశశ్రాద్ధములు పదునారు. ఆబ్దికములు రెండు. సపిండీకరణ

మొక్కటి మొత్తము లేకోద్దిష్టములు నూరని సంగ్రహకారుడు చెప్పెను.

సపిండీకరణకాలములు.

౧౮౬—తా. పదకొండవదినము పండ్రెండవదినము పదమూడవ దినము మూడవపక్షము మూడవమాసము ఆరవమాసము పదకొండవ మాసము సంవత్సరాంతము అనియు లేక యిరువది మూడవదినమునందైనను జేయవచ్చుననియు వృద్ధిపూర్వకముగాగల దినమునందైనను జేయ వచ్చును. కాబట్టి సపిండీకరణమునకు పదికాలములు చెప్పబడినవి. సంవత్స రాంతమునందు సాపిండ్యమును జేయవలయును. మృతమాసములో మృత దినమునందు జేయునట్టి శ్రాద్ధము ప్రథమాబ్దికమని చెప్పబడును. కలి యుగములో పండ్రెండవదినమునందు సపిండీకరణము జేయుట ముఖ్య మనిరి. పండ్రెండవదినమునకు నాటంకము కలిగేయెడల పదకొండవదినము నందే సపిండీకరణము జేయవచ్చునని కల్పకారికచెప్పెను. మరియు నేకా దశదినమునందు జేయుపక్షములో పూర్వాహ్ణమందు షోడశాదులను జేసి యపరాహ్ణకాలమందు సపిండీకరణమును జేయవలయునని శాండిలుడు చెప్పినట్లుగా త్రికాండిచెప్పెను. పదకొండు పండ్రెండు పదమూడు దిన ములయందును సంవత్సరాంతమందును సపిండీకరణమును జేయునప్పుడు తిథివారనక్షత్రాది దోషములను గ్రహతారాబలాదులను విచారింపనక్క రలేదు. ఇరువైమూడవ దినమునందును విచారింపనక్కరలేదు. పదకొండవ దినము పండ్రెండవదినము పదమూడవదినము మూడవపక్షము మూడవ మాసము ఆరవమాసము పదకొండవమాసము సంవత్సరాంతము శుభ కార్యమునకు పూర్వదినము అని తొమ్మిదికాలములు సపిండీకరణమును జేయుటకు ముఖ్యకాలములుగా జెప్పబడెను.

సపిండీకరణమునందు వారాది నియమములు.

౧౮౭—తా. సపిండీకరణము జేయుదినమునందు శుక్రవారమయ్యె నేని తల్లిదండ్రులకు తప్ప యితరులకు సపిండీకరణమును జేయగూడదు. ఇతరులగురించి సపిండీకరణము జేయుపక్షములో పండ్రెండవ దినమునందు శుక్రవారమయ్యెనేని పదమూడవదినమునందు చేయవలయును. పదకొం డుదినము మొదలగు పూర్వముచెప్పబడిన కాలములు తల్లిదండ్రులకు సపిండీకరణము జేయు విషయమై యెనిమిదికాలములు చెప్పబడినవి. కర్త యుప్రేతయు ఆహితాగ్నులు కానియెడల పదకొండవ దినమునందుగాక మిగిలిన యెనిమిది కాలములయందు సపిండీకరణమును జేయవలయును.

కర్త ఆహితాగ్నియగునేని పదకొండవదినముగాక మిగిలిన యెనిమిది కాలములయందు జేయవలయును. కర్తయు ప్రేతయు నాహితాగ్నులు కలవారయ్యేనేని పదకొండు పండ్రెండుదినములయందే చేయవలయును. కర్త ఆహితాగ్ని కానివాడై ప్రేత యాహితాగ్నియగునేని మూడవపక్షములో జేయవలయును. మరియొక పక్షముకలదు. కర్త ఆహితాగ్ని కానివాడై ప్రేత యాహితాగ్నియగునేని పండ్రెండవదినమునందు సపిండీకరణము జేయవలయుననిరి. మహాభారతమునందు జెప్పినదేమనగా, కులధర్మములు అమితముగా నుండుటవలనను మనుష్యుల కాయుర్దాయము క్షీణించుటవలనను శరీరములు స్థిరమైనవి కానందునను పండ్రెండవదినము శ్రేష్ఠమనిరి. మరియు పదకొండవదినమునందు పండ్రెండవదినమునందు పదమూడవదినమునందు పదియేనవ దినమునందు మూడవ పక్షమునందు మూడవమాసమునందు శుభకాలము సంభవించినప్పుడు ఆరవమాసమునందు పదకొండవమాసమునందు సంవత్సరమునందు జేయవచ్చును మరియు సన్యసించుటకు నిశ్చయించుకొనినప్పుడు దీర్ఘకాలము ప్రయాణము చేయునప్పుడు గయాదిపుణ్యక్షేత్ర యాత్రను జేయునప్పుడు సపిండీకరణమును జేయవచ్చునని చెప్పియుండుటవలన సపిండీకరణమునకు పదునాలుగు కాలములు చెప్పబడినవి. మరియు పదకొండవదినము మొదలు పదియారవదిన పర్యంతముగాని లేక పదియేడవదినమునందు కూడ సపిండీకరణము జేయవచ్చుననియు లేక మాసమునకు ఒకటి రెండు మూడుదినములు తక్కువగా నున్నప్పుడును జేయవచ్చును లేక సంవత్సరము పూర్తియగునప్పుడును జేయవచ్చుననియును స్మృతిసంగ్రహమునందు జెప్పబడెను. చెప్పబడిన కాలములయందు సంభవము కానియెడల మఱియొక కాలమును జెప్పుచున్నారు. ఉక్తకాలములయందు జేయుటకు సంభవముకానియెడల అనూరాధ ఆర్ద్ర హస్తా రోహిణినక్షత్రములయందు చేయవచ్చుననిరి. మృతదినమునం దైనను జేయవచ్చునని ధవళుడు చెప్పెను. పండ్రెండవదినము మొదలు పూర్వకాలములయందు సపిండీకరణము జేయుటకు సంభవము కానియెడల ఒకదాని తర్వాత నొకటిగా జెప్పబడుకాలములయందు జేయవచ్చుననియు అవియును సంభవము కాని యెడల అనూరాధ రోహిణి ఆర్ద్ర హస్త నక్షత్రములయందు జేయవచ్చునని యితరస్మృతులయందును చెప్పబడియున్నది. కాబట్టి సపిండీకరణమును ముఖ్యముగా జేయవలయును.

—{ ఉక్తకాలమునందు జేయనియెడల నక్షత్రకాలములను చెప్పుచున్నాడు. }—

౧౮౮—తా. చెప్పబడిన కాలములయందు సపిండీకరణము జేయుటకు నాటంకము కలిగెనేని హస్త అనూరాధ ఆర్ద్రి నక్షత్రములయందును ప్రేతమృతి నొందినవారమందును రోహిణియందును జేయవలయునని దేవలుడు చెప్పెను.

సపిండీకరణము జేయుటకు కర్తలు.

౧౮౯—తా. తల్లిదండ్రులకు సపిండీకరణము కుమారుడు చేయవలయును. అతడు లేనియెడల సోదరుడుగాని సోదరపుత్రుడుగాని సపిండుడుగాని శిష్యుడుగాని సపిండీకరణమును జేయవలయును. లేక యెవరును లేనప్పుడు మంత్రరహితముగా భార్యయైనను జేయవచ్చును. పుత్రులుండినయెడల సపిండీకరణమును తనయులే చేయవలయునుగాని యితరులు చేయగూడదు. మృతినొందిన కాలమునకు పుత్రులు దగ్గిర లేనియెడల దహనము మొదలు దశాహాంతము గౌణపుత్రుడైనను జేయవచ్చును. పుత్రులు లేనియెడల శుభకార్యములు సంభవించినప్పుడు వృద్ధిశ్రాద్ధమును జేయవలయును గాన అన్న, దమ్ముడు, సపిండుడు, సమానోదకుడు, శిష్యుడు, ధనమును తీసికొనినవాడు, కుమార్తె, మొదలగువారిలో నెవరైనను సపిండీకరణమును జేసి వృద్ధిశ్రాద్ధమును జేయవలయును. అని గౌతముడు చెప్పెను. తండ్రియొక్క సపిండీకరణము బంధువులచే జేయబడినను ప్రేతత్వ నివృత్తినిమిత్తము కుమారుడు తిరిగి చేసికొనవలయుననియును పెద్దకుమారుడుండగా చిన్నకుమారుడు సపిండీకరణమును జేసినయెడల ప్రేతత్వము నశించదు కాబట్టి పెద్దకుమారుడు తిరిగి చేయవలయు ననియు నాపస్తంబుడు చెప్పెను. సంస్కారము జేసినవానికి ఏకోద్దిష్టాంతమందు శుద్ధికలిగినను పిండోదక ప్రదానములచేతను పుణ్యాహవాచనముచేతను పూర్ణమైన శుద్ధికలుగును. కుమారునకు తండ్రియు తమ్మునకు నన్నయు సంస్కారమును జేయగూడదు లేక స్నేహముచే జేయవలసివచ్చిన యెడల సపిండీకరణమును వదలి షోడశాంతము జేయవలయును ఎవరును చేయదగినవారు లేనియెడల వారును సపిండీకరణము గూడ చేయవచ్చునని చెప్పబడియున్నది. ఆవిధముగానే స్మృతియు చెప్పినదేమనగా, ముఖ్యకర్త లేనప్పుడు కుమారునకు తండ్రియు తమ్మునకు నన్నయు సపిండీకరణమును జేయవచ్చును. ఈప్రకారముగానే అభావ

మునందు చిన్నవానికి పెద్దవాడు కర్తయగుటచే జ్యేష్ఠుడుగాని కనిష్ఠుడుగాని సపిండుడుగాని సమానోదకుడుగాని యెవరైనను మృతినొందినప్పుడు సమీపమునందుండునో వాడే సపిండీకరణమును జేయవచ్చును. ఇట్లు యితరులు చేసినను ప్రేతత్వ విముక్తికొరకును శ్రాద్ధాధికారము కలుగుటకును లేపభాజనము కొరకును కుమారుడు తండ్రికి సపిండీకరణమును తిరిగి జేయవలయును.

సపిండీకరణమునం దగ్నినిర్ణయము.

౧౫౦—తా. బ్రాహ్మణుడు దేశాంతరము వెళ్లి యుండగాను ప్రమాదముచే నగ్నినశించినను భార్యసమీపమునందు లేకపోయినను తిరిగి అగ్నిని సంధానము చేయనలయును. తల్లిదండ్రుల మృతదినములు సంభవించినను తనకు మరణసంశయము కలిగినను భార్య సమీపమునందు లేకపోయినను నశించిన యగ్నిహోత్రమును తిరిగి సంధానము జేయవలయును. తల్లిదండ్రులకు మరణసంశయము దోచినప్పుడు వారిసపిండీకరణము సంభవించినప్పుడు భార్యవద్దలేకున్నాను అగ్నిసంధానము జేయవలయును. ఆశ్వలాయన శాఖీయులకు లాజహోమమే ప్రధానము కాబట్టి భార్యతోగూడ నగ్నిసంధానము వారికేగాని యితరులకు లేదనిరి. లౌకికాగ్నియందు జేయబడిన కర్మనంతయు నౌపాసనాగ్నియందు యథావిధిగా తిరిగి చేయవలయునని గౌతముడు చెప్పెను. తల్లిదండ్రులకు సపిండీకరణమును జేయునప్పుడు ఔపాసనాగ్నియందు నితరులకు జేయునప్పుడు లౌకికాగ్నియందును హోమమును జేయవలయు ననిరి. అన్న నగ్నిహోత్రములు లేనివాడై తమ్ము డగ్నిహోత్రము కలవాడగునేని తమ్ముడే సపిండీకరణమును జేయవలయును. అందువలన కుమారులలో నగ్నిసహితుడైనవాడే సపిండీకరణము జేయవలయునని యున్నది. ఏకోద్దిష్టము తప్ప యితరక్రియలు లౌకికాగ్నియందు జేయగూడదు జ్యేష్ఠుడు అపత్నీకుడై కనిష్ఠుడు సపత్నీకుడైనప్పుడు అగ్నిహోత్రము కలవాడు కాబట్టి కనిష్ఠుడే చేయవలయునని విశ్వాదర్శమునందు చెప్పబడినది. ఆప్రకారముగానే పైఠీనసియు చెప్పెను. ఇతర స్మృతులయందును కలదు. మరియు పుత్రులందరును అగ్నిరహితులుగాని బ్రహ్మచారులుగాని యైనయెడల పెద్దకుమారుడే లౌకికాగ్నియందు హోమము జేయవలయును. స్మార్తాగ్ని లేనప్పుడు లౌకికాగ్నియందే చేయవలయునని యున్నది. తల్లిదండ్రుల సపిండీకరణమును పితృయజ్ఞవిధానముగా పుత్రులందరును వేరు వేరుగా

గాని లేక పెద్ద కుమారుడుగాని చేయవలయునని బృహస్పతి చెప్పెను. "ఏకాదశే ద్వాదశేవా" అను శ్లోకము మొదలు చివరకునుండు గ్రంథములో విషయములగురించి 187-వ విషయములో వ్రాయబడినది కాబట్టి యిక్కడ తిరిగి వ్రాయ నవసరము లేదు.

పదకొండవదినమునందు సపిండీకరణమును జేయుటకు ప్రయోజనము.

౧౮౧—తా. మృతదినము మొదలు పదియవదినమునందు అమావాస్యయగునేని యాదినమునందే సాగ్నికుడైన కుమారుడు సపిండీకరణమును జేయవలయునని హారీతుడు చెప్పెను. ఇక్కడ మృతదినము గడచిన పిమ్మట రెండవదినము మొదలు పదియవ దినమునందనగా పదకొండవదిన మగును. ఆదినమునం దమావాస్యా తిథియగునేని యగ్నిహోత్రియగు కుమారుడు సపిండీకరణమును జేయవచ్చునని కార్ష్ణాజని సత్యవ్రతుడు దేవలుడు శాండిలుడు భృగువు మొదలగు వారు చెప్పిరి. పదకొండవ దినమునందు జేయుపక్షమందు పూర్వాహ్ణకాలమున సపిండీకరణమునకు పూర్వము జేయదగిన నవశ్రాద్ధము షోడశమాసిక శ్రాద్ధములను జేసి పిమ్మట మధ్యాహ్నకాలమందు సపిండీకరణమును జేసి యపరాహ్ణకాలమందు పితృయజ్ఞమును జేయవలయును. సపిండీకరణమును జేయక పిండపితృయజ్ఞమును జేసినయెడల పార్వణశ్రాద్ధము వృద్ధిశ్రాద్ధములను జేయుట సంభవించదు. చేసినను ఫలము లేదు. సపిండీకరణమును జేయుటవలననే ప్రేతకు పితృదేవతా స్వరూపము కలుగుచున్నది. అందువలన నాహితాగ్ని యమావాస్యయందు పిండపితృయజ్ఞమును జేయుటకు సంభవమగును. తండ్రిదీక్షితుడగునేని పండ్రెండవదినమునం దమావాస్య వచ్చినయెడల పదకొండవ దినమునందు సపిండీకరణమును జేసి యమావాస్యయగు పండ్రెండవదినమునందు పిండపితృ యజ్ఞమును చేయవలయును. ద్వాదశాహాదికాలములయందు సపిండీకరణము జేయు విషయములో నగ్నికలవాడనియు నగ్నిలేనివాడనియు విమర్శనకర్తను గురించి యేనియామకమైనదనియు పండ్రెండవదినమునం దమావాస్యయగునేని పదకొండవదినమునందు సపిండీకరణము జేసి పండ్రెండవదినమందు నపరాహ్ణకాలమునందు పిండపితృయజ్ఞమును జేయవలయుననియు జాబాలి చెప్పెను. పదకొండవదినమునందుగాని పండ్రెండవ దినమునందుగాని యమావాస్యకానిపక్షములో అగ్నిహోత్రుడైనను లేనివాడైనను పండ్రెండవదినము

మొదలు చెప్పబడిన యేడు కాలములలో నెప్పుడైనను జేయవచ్చును. పదకొండవదినమునందు సపిండీకరణము నగ్నిహోత్రము కలవాడు చేయవలయు ననియు నగ్నిహోత్రము కలవాడుగాని యగ్నిహోత్రములు లేనివాడుగాని పండ్రెండవదినము మొదలగు శాస్త్రోక్తకాలములయందు సపిండీకరణమును జేయవలయు ననియు పిమ్మట దర్శశ్రాద్ధమును జేయవలయు ననియు బృహస్పతి చెప్పెను. పండ్రెండవదినము మొదలగు కాలములయందు సపిండీకరణమును జేయనియెడల ప్రశస్తమగు నక్షత్రముల నాలోచించి చేయవలయు ననిరి. రోహిణి ఆర్ద్ర సౌమ్య దేవతాకమగు నక్షత్రములయందు జేయవలయును త్రిపాదనక్షత్రములు ఆది మంగళ శనివారములయందు జేయగూడదు. మరియు మాసికమైన మరుదినమునందు అన్నశ్రాద్ధప్రకారముగా సపిండీకరణమును జేసి పితృపిండమును అతని పితృపితామహప్రపితామహ పిండములతో సంయోజన చేయవలయు ననియు స్మృతికర్తలు చెప్పిరి.

## సపిండీకరణ ప్రయోగము.

౧౯౨—తా. ప్రేతత్వము నొందియున్న తనతండ్రికి వానితండ్రి తాతముత్తాతలతో సాపిండ్యము సమానోదక భావము సిద్ధించుటకొరకు పితామహాదులకు పార్వణ శ్రాద్ధప్రకారముగాను ప్రేతస్వరూపుడగు తన తండ్రికి నేకోద్దిష్టముగాను రెండువిధములుగా సపిండీకరణశ్రాద్ధమును జేయవలయును. సపిండీకరణశ్రాద్ధ మాచరించుటకు సంకల్పము జేయు నప్పుడు ప్రేతనుగురించి షష్ఠీవిభక్తియు పితామహాదులకు తృతీయవిభక్తియు జెప్పవలయును. పిమ్మట ప్రేతకు పితామహాదులకు షష్ఠీవిభక్తి చెప్పవలయును. ప్రేతయొక్కయు పితామహాదులయొక్కయు పిండ సంయోజననిమిత్త మనుజ్ఞను పుచ్చుకొనుసమయమందు ప్రేతకు పితామహాదులకు షష్ఠీవిభక్తి చెప్పవలయును. పిండసంయోజనము చేయు నప్పుడు ప్రేతకు సంబుద్ధియు పితామహాదులకు తృతీయావిభక్తియు చెప్పవలయునని విభక్తులను విమర్శించి చెప్పిరి. పూర్వదినమునందు రాత్రియందు సాయంకాలౌపాసనము జేసికొని సంకల్పము జేసి ప్రాచీనావీతుడై యీవిధముగా చెప్పవలయును. ప్రేతస్వరూపుడగు తనతండ్రికి వసురుద్రాదిత్య స్వరూపులగువాని పితృపితామహప్రపితామహులతోగూడ సమానోదక సాపిండ్యము సిద్ధించుకొరకును తండ్రికి ప్రేతత్వమువదలి వస్వాది పితృలోకములను జెందుటకును ప్రేతయగు తండ్రికి నేకోద్దిష్టప్రకారముగాను

వానిపితృపితామహాదులకు పార్వణ విధానముగాను ముందుగా విశ్వే దేవతావాహనము నంతమునందు విష్ణ్వావాహనము కలుగు నట్లుగా తండ్రికి సపిండీకరణశ్రాద్ధమును రేపుచేసెదనని సంకల్పముచేసి విశ్వేదేవ స్థానమునందు ఇద్దరిని ప్రేతస్థానమునం దొక్కరిని పితామహాది స్థానముల యందు ముగ్గురుబ్రాహ్మణులను విష్ణునిమిత్త మొకబ్రాహ్మణుని నియమించి క్రమముగా క్షణాదుల నివ్వవలయును. ఇందునుగురించి స్మృతిచెప్పినదే మనగా, బహ్వృచ శాఖాసంపన్నుడుగాని వేదవేదాంగ పారంగతుడు గాని శాఖాంతరుడైనను అధ్వర్యునిగాని సంపూర్ణముగ ఛందస్సులను జదివినవాడుగాని తనశాఖీయులగు బ్రాహ్మణులనుగాని స్వశాఖీయులు సంభవము కానియెడల నన్యశాఖీయులనుగాని బ్రాహ్మణులను ప్రయత్న ముచే విచారించి శ్రాద్ధమునందు భుజింపజేయవలయును. ప్రేతయొక్క పితృపితామహ ప్రపితామహులను గురించి చెప్పునపుడు మొదట ప్రేత యొక్క నామమును జెప్పినపిమ్మట "తత్పితృపితామహ ప్రపితామహ" అను పదములను ప్రయోగించవలయునుగాని "పితామహ ప్రపితామహ వృద్ధ ప్రపితామహ" అని చెప్పకూడదు. సపిండీకరణమునందు కాలకామ" అను పేరుగల విశ్వేదేవుల నావాహనము జేయవలయును. ముందు విశ్వేదేవ తులను పిమ్మట పితృదేవతులను పిమ్మట విష్ణువును ఆవాహనము జేయవల యును. పితృదేవతులను మొదటగాగాని అనంతమునందుగాని యావాహ నము జేసినయెడల యాశ్రాద్ధమును రాక్షసులు భుజించువా రగుదురు. అని స్మృతి చెప్పియున్నది. కాబట్టి విశ్వేదేవ విష్ణుదేవతుల నావాహన మునకు నడుమను పితృదేవతావాహనము చెప్పవలయును. సపిండీకరణ ములో విష్ణువును పూజించి భోజనము చేయవలయునని శాండిలుడు చెప్పెను. గాన పితృదేవతా పూజకంటె ముందు విశ్వేదేవపూజయు అనం తరము విష్ణుపూజయు చేయవలయును. పార్వణవిధానముగ జేయబడు శ్రాద్ధముల నన్నింటియందును విష్ణుదేవతాపూజను జేయనియెడల క్షతి తునిచే జూడబడునట్టి దోషముకలుగును. అని భారతమునందు జెప్పబడెను. ఈవిధముగానే కణ్వుడును చెప్పెను. ఆబ్దికమునందు మహాలయశ్రాద్ధము నందు సపిండీకరణమునందు విష్ణుదేవతాపూజను చేయనియెడల నాశ్రాద్ధము వ్యర్థమగుననియు జెప్పబడెను. నారాయణునియందు భక్తికలవాడై పితృదేవతులను గురించి నమస్కారముజేసి భగవత్ప్రీతిగా హవిస్సును కర్మను సమర్పింపవలయునని బృహన్నారదీయమునందు జెప్పబడెను. అది

యందు విశ్వేదేవపూజయు నంతమునందు విష్ణుపూజయు లేని శ్రాద్ధమును చేయకూడదని చెప్పియున్నది. కాబట్టి శ్రాద్ధసంరక్షణనిమిత్తము దైవాద్యంతముగానే చేయవలయునని దేవలుడు చెప్పెను. రెండువర్గముల నుద్దేశించి దైవాద్యంతముగ పార్వణవిధిగా శ్రాద్ధమును జేయవలయును. అట్లు చేయనియెడల గొప్పదోషము సంభవించునని కాలాదర్శమునందు చెప్పబడెను. కాబట్టి పరిశుద్ధులగు నిద్దరుబ్రాహ్మణులను విశ్వేదేవస్థానమందును ముగ్గురు బ్రాహ్మణులను పితృస్థానమునందు నిమంత్రణ జేయవలయును. సపిండీకరణమునందుగాక యితర శ్రాద్ధములందు విశ్వేదేవస్థానమున నొక్కరిని పితృస్థానమున నొక్కరిని నావాహనము జేయవచ్చును. సపిండీకరణమునందు ఏడుగురు బ్రాహ్మణులను భుజింప జేయవలయునని యున్నది. కాబట్టి విష్ణుదేవతాపూజలేనిది సప్తకత్వము సిద్ధించదు. కాబట్టి విష్ణుస్థానమునుకూడ నుంచవలయును. ముందుగా కాలకామసంజ్ఞగల విశ్వేతలను అంతమునందు విష్ణును ఆవాహనము చేసినయెడల సప్తసంఖ్య సిద్ధించును. విష్ణుపూజయందు విష్ణునామస్మరణయందు నాస్తికగలవారికి చేయునట్టి కర్మలయందు హెచ్చుతగ్గులనే దోషము సంభవించదు. అని పండితులు చెప్పిరి. ఏకోద్దిష్టశ్రాద్ధములయందు పూర్వదినమున నిమంత్రణ లేదనియు సపిండీకరణమున పూర్వదినమునందు నిమంత్రణ జేయవలయుననియు జెప్పిరి. సంబంధము గోత్రము నామమును అంతమందు వసురుద్రాదిస్వరూపములను జెప్పవలయును. ప్రేతనుగురించి ముందుగా నావాహనముచేసి పిమ్మట వానిపితృ పితామహ ప్రపితామహుల నావాహనము చేయవలయును. సపిండీకరణశ్రాద్ధములో విశ్వేదేవపూజకంటె ముందుగా ప్రేత పూజచేయవలయునని కొందరు చెప్పిరి. ముందుగ విశ్వేదేవపూజచేసి యనంతరమున ప్రేతనుపూజించి పిమ్మట పితృదేవతులను పూజించవలయును. ముందుగ ప్రేతపూజ చేసినపిమ్మట విశ్వేదేవపూజను చేసేయెడల పార్వణశ్రాద్ధప్రక్రియలో నడుమ మరియొక ప్రక్రియ ప్రారంభించినట్లగును. శ్రాద్ధభోక్తలు నఖశ్మశ్రునికృంతనము తైలాభ్యంజన స్నానము పూర్వాహ్ణమందు చేయవలయును. శ్మశ్రునఖనికృంతనము నిషిద్ధమగు తిథికానియెడల చేయవలయును. సమస్త శ్రాద్ధకాలములయందును గోమయముచే నలికి శుభ్రము చేయవచ్చునుగాని రంగవల్లాదులచే గృహాలంకరణము చేయకూడదని శాస్త్రములు చెప్పెను.

## శ్రాద్ధారంభమునకు పూర్వకృత్యము.

౧౯౩—తా. శ్రాద్ధదినమున మధ్యాహ్నకాలమందు శీతలోదకమునందు స్నానముజేసి మాధ్యాహ్నిక సంధ్యావందనాది కృత్యముల నెరవేర్చుకొని నియమించియున్న బ్రాహ్మణులను బిలచి ప్రాతరౌపాసనమును జేసికొని తిలలను దర్భలను తనశక్తికొలది దక్షిణనుగ్రహించి శ్రాద్ధము నాచరించుటకు ప్రారంభించవలయును.

## స్నానోదక నిర్ణయము.

౧౯౪—తా. మరణమునందు జననమందు సంక్రమణమందు శ్రాద్ధమునందు పర్వకాలమందు స్పృశించని సమయమునందు స్పృశించుట ఇటువంటి సమయములందు నుష్ణోదక స్నానము జేయగూడదు. ఆపత్తులందుగాక సరియైనస్థితిలోనుండగా పైనజెప్పబడిన కారణములను గురించి తెలిసి యుష్ణోదకస్నానమును జేసినయెడల గోహత్యను జేసినంతపాపము సంభవించునని చెప్పబడెను. కాబట్టి నదులు మొదలగు పవిత్రజలములలో స్నానము జేయవలయును. లేక మంత్రములచే పవిత్రమైన జలముతో నైన స్నానము జేయవలయును.

## అనంతర మర్చనచేయు విధానము

౧౯౫—తా. బ్రాహ్మణప్రదక్షిణము జేయుటకు మొదట సంకల్పముజేసి యథాశక్తి దక్షిణనుగ్రహించి భోక్తలైన బ్రాహ్మణులకు మూడు పర్యాయములు ప్రదక్షిణముజేసి నమస్కరించి దక్షిణను సమర్పించి తండ్రి యొక్క గోత్రనామములను జెప్పి ప్రేతత్వమువదలి తండ్రికి వస్వాది పితృలోక ప్రాప్తికొరకు సపిండీకరణ శ్రాద్ధమును జేయునిమిత్తము మనుజ్ఞను తీసికొని ప్రాణాయామ సంకల్పములను జేయవలయును. ఇందును గురించి వ్యాసుడు చెప్పినదేమనగా, సంకల్పరహితముగ జేయబడిన స్నానము దానము జపము తపము శ్రాద్ధము మొదలగునవి ఫలము నివ్వవని చెప్పెను. బ్రాహ్మణులకు నగ్నిహోత్రముతో సమానవిధిగా నిత్యము త్రిపుండ్రమును ధరించవలయుననియు శ్రాద్ధసమయమునందు కర్తయు భోక్తయు త్రిపుండ్రమును ధరింపగూడదనియు శ్రాద్ధదినమున బ్రాహ్మణులను భుజింపజేసి విసర్జనజేయుటకు పూర్వమందు దానము అధ్యయనము దేవార్చన జపము హోమము మొదలగు నితరకర్మల నేవియు జేయగూడదనియు నత్రిమునీశ్వరుడు చెప్పెను. అనంతరము ప్రాణాయామ సంకల్పాదులను జేసి ప్రాచీనావీతము జేసికొని "ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్య

తే" అనునది మొదలు "సపిండీకరణాఖ్యశ్రాద్ధం అన్నేనహావిషాద్య కరిష్యే ఇతి" అనువరకును సంకల్పప్రకారము జెప్పవలయును. తల్లిదండ్రుల యొక్క సపిండీకరణ శ్రాద్ధమును పుత్రులందరు వేరువేరుగా జేయవచ్చు ను. లేక పెద్దవానిచేతనైనా చేయించవలయునని బృహస్పతి చెప్పెను. పాత్రలను నాలుగింటిని యొక్క పర్యాయమే యాసాదనజేసి ప్రేతపాత్ర యందు జేయదగిన "ఆమఆగంత" అనుమంత్రముచే జలమునుంచుట తిలలను మధువునుంచుట మొదలగునవిచేసి మూడు పర్యాయము లుప పూర్ణనముజేసి "సోమస్య" అనుమంత్రముచే జలవిలోడనముచేసి "శంనో దేవీః" అనుమంత్రముచే నవోక్షణముజేసి గంధమునుంచి యావాహన ముజేసి యగ్నికి దక్షిణభాగమున అంగుష్ఠానామికలతో భూమిని స్పృ శించి పిండములనుంచిన పిమ్మట మధువునుంచి "సంగచ్ఛధ్వం" అనుమంత్ర ముచే ప్రేతపిండమును పితృపితామహాది పిండములతో మిశ్రముజేసి వై తరణీగోదానాదులనుజేసి విష్ణుస్మరణ సంమార్జనము మొదలగునవిచేసి యనంతరము స్నానము పుణ్యాహవాచనము జేసికొనవలయునని సత్యా షాఢుడుచెప్పెను. ఉపవీతిగా కాలకాలములనే పేరుగల విశ్వేదేవుల గురించి యిద్దరు బ్రాహ్మణులను ప్రాచీనావీతిగా ప్రేతస్థానమును గురించి యొకబ్రాహ్మణుని పితృపితామహ ప్రపితామహ స్థానములయందు ముగ్గురు బ్రాహ్మణులను శ్రాద్ధసంరక్షణకొరకు సవ్యముగా విష్ణుస్థానమునం దొక బ్రాహ్మణుని నావాహనముజేసి క్షణముల నివ్వవలయును నిమంత్రణ జేయునప్పుడు దోగ్ధ్రిమంత్రమును నియోగింపబడినవాడు నిషంగిణమును జపింపవలయును. భుజించిన పిమ్మట వామదేవ్యమును చెప్పవలయును. ఈప్రకారము శ్రాద్ధభోజనమునందు చెప్పబడినది. అనంతరము తూర్పు ముఖముగా గూర్చుండి పాదప్రక్షాళన నిమిత్తము వాకిలిముందు మూడు గాని రెండుగాని అవటములనైనను (అనగా చిన్నగొయ్యి) మండలముల నైనను జేయవలయును. దేవస్థానమునకు చతురశ్రముగా నుత్తరదిక్కు నను పితృస్థానమునకు వర్తులాకారముగా దక్షిణదిక్కునందు మండలము లను జేసి గోమయముతో సలికి దేవమండలమును దర్భలు గంధము అక్ష తలు పుష్పములు మొదలగువానితోను పితృమండలము దర్భ గంధ పుష్ప తిలలతోను పూజించి మండలమునకు పశ్చిమభాగమున వారిని గూర్చుండ బెట్టి తాను మండలములకు తూర్పున పశ్చిమముఖముగా గూర్చుండి మం డలములకు పశ్చిమముగా వారిపాదములయందు స్వాగతపాద్యముల నిచ్చి

తిథౌ" అనునది మొదలు "సపిండీకరణాఖ్యశ్రాద్ధం అన్నేనహావిషాద్య కరిష్యఇతి" అనువరకును సంకల్పప్రకారము జెప్పవలయును. తల్లిదండ్రుల యొక్క సపిండీకరణ శ్రాద్ధమును పుత్రులందరు వేరువేరుగా జేయవచ్చును. లేక పెద్దవానిచేతనైనా చేయించవలయునని బృహస్పతి చెప్పెను. పాత్రలను నాలుగింటిని యొక్కపర్యాయమే యాసాదనజేసి ప్రేతపాత్ర యందు జేయదగిన "ఆమఆగంత" అనుమంత్రముచే జలమునుంచుట తిలలను మధువునుంచుట మొదలగునవిచేసి మూడు పర్యాయము లుప స్పర్శనముజేసి "సోమస్య" అనుమంత్రముచే జలవిలోడనముచేసి "శంనో దేవీః" అనుమంత్రముచే నవోక్షణముజేసి గంధమునుంచి యావాహన ముజేసి యగ్నికి దక్షిణభాగమున అంగుష్ఠానామికలతో భూమిని స్పృశించి పిండములనుంచిన పిమ్మట మధువునుంచి "సంగచ్ఛధ్వం" అనుమంత్ర ముచే ప్రేతపిండమును పితృపితామహాది పిండములతో మిశ్రముజేసి వైతరణీ గోదానాదులనుజేసి విష్ణుస్మరణ సంమార్జనము మొదలగునవిచేసి యనంతరము స్నానము పుణ్యాహవాచనము జేసికొనవలయునని సత్యాషాఢుడుచెప్పెను. ఉపవీతిగా కాలకాలములనే పేరుగల విశ్వేదేవుల గురించి యిద్దరు బ్రాహ్మణులను ప్రాచీనావీతిగా ప్రేతస్థానమును గురించి యొకబ్రాహ్మణుని పితృపితామహ ప్రపితామహ స్థానములయందు ముగ్గురు బ్రాహ్మణులను శ్రాద్ధసంరక్షణకొరకు సవ్యముగా విష్ణుస్థానమునం దొక బ్రాహ్మణుని నావాహనముజేసి క్షణముల నివ్వవలయును నిమంత్రణ జేయునప్పుడు దోగ్ధ్రీమంత్రమును నియోగింపబడినవాడు నిషంగిణమును జపింపవలయును. భుజించిన పిమ్మట వామదేవ్యమును చెప్పవలయును. ఈప్రకారము శ్రాద్ధభోజనమునందు చెప్పబడినది. అనంతరము తూర్పు ముఖముగా గూర్చుండి పాదప్రక్షాళన నిమిత్తము వాకిలిముందు మూడు గాని రెండుగాని అవటములనైనను (అనగా చిన్నగొయ్యి) మండలముల నైనను జేయవలయును. దేవస్థానమునకు చతురశ్రముగా నుత్తరదిక్కునను పితృస్థానమునకు వర్తులాకారముగా దక్షిణదిక్కునందు మండలములనుజేసి గోమయముతో నలికి దేవమండలమును దర్భలు గంధము అక్షతలు పుష్పములు మొదలగువానితోను పితృమండలము దర్భ గంధ పుష్ప తిలలతోను పూజించి మండలమునకు పశ్చిమభాగమున వారిని గూర్చుండ బెట్టి తాను మండలములకు తూర్పున పశ్చిమముఖముగా గూర్చుండి మండలములకు పశ్చిమముగా వారిపాదములయందు స్వాగతపాద్యముల నిచ్చి

ప్రక్షాళన జేయునప్పుడు పాదములను మండలమీాదనుంచి కడగవలయును. ఇందును గురించి వ్యాసుడు చెప్పిన దేమనగా, ప్రాతఃకాలము మధ్యాహ్నము సాయంకాలము సంధ్యాకాలము రాత్రి యెప్పుడైనను శ్రాద్ధసమయమందు బ్రాహ్మణులకు పాదప్రక్షాళన జేయునప్పుడు కర్త పశ్చిమముఖముగాను భోక్తలు తూర్పుముఖముగాను సుఖాసీనులై యుండవలయును. అట్లుగాదేని నరకము నొందెదరు. మండలములకు పశ్చిమభాగమున వారిపాదములకు పాద్యము స్వాగతములనిచ్చి పిమ్మట మండలోపరిభాగమునందే ప్రక్షాళన చేయవలయును. శ్రాద్ధకాలంబున పాదప్రక్షాళన జేయుట చీలమండలములవరకు శ్రేష్ఠమనియు అటుపైగా జేసిన రోమస్పర్శగల యుదకము పితృదేవతులకు నరకప్రదమనియు జెప్పబడియున్నది. అని వ్యాసుడు చెప్పెను. విశ్వేదేవ విష్ణుస్థానములయందు సవ్యముగాను పితృస్థానమునందు నపసవ్యముగాను పితృస్థానమున తిలలతోను దేవస్థానమున విష్ణుస్థానమున నక్షతలతోను సమస్త క్రియలయందును జేయవలయును. దర్భగంధపుష్పాదులందరికి నుపయోగింపవచ్చును. మరియు స్వాగతము స్వస్తివాచనము దక్షిణనిచ్చుట ప్రదక్షిణము జేయుట గోత్రమును జెప్పుట అగ్నియందు హోమము జేయుట ఈయారుక్రియలు పితృసంబంధముగా జేయునప్పుడుకూడ సవ్యముగానే చేయవలయు ననిరి. కాబట్టి పితృస్థానము నపసవ్యముగా స్వాగతమునిచ్చి పాద్యము మొదలగునవి ప్రాచీనావీతముగా జేయవలయును. అందరికిని పాదప్రక్షాళన జేయునప్పుడు 'శంనోదేవీః' అనుమంత్రమును చెప్పవలయును పాదములకు ఆజ్యమును రాచి గోమయమువూసి పాదప్రక్షాళన జేయవలయును. ఇందును గురించి రామాయణములో త్రిజటా అభ్యంగనములేని పాదప్రక్షాళనము తిలలులేనితర్పణము దక్షిణలేనిశ్రాద్ధము ఇవియన్నియు నీకు ప్రీతియగునని శ్రీరాముడు చెప్పెను. ప్రక్షాళనమునకు అవటములను పంద్రెండంగుళములుపొడవు నారంగుళములు వెడల్పు నుండునట్లుగా త్రవ్వవలయును. ఈచెప్పబడిన దానికి హెచ్చుగాగాని తక్కువగాగాని యున్నయెడల యజమానుడు నశించును. విశ్వేదేవమండలమునందే విష్ణువునుగూడ ప్రక్షాళన జేయవలయును. ఆరంభమునందు అంతమందు మధ్యయందు విష్టరము నిచ్చునప్పుడు ఉచ్ఛిష్టసమయమందు పిండప్రదానమందు ఈయారుకాలములందు నాచమనము చేయవలయునని స్మృతి చెప్పియున్నది. కాబట్టి పాదప్రక్షాళనానంతరమందు కర్తమండలములకు తూర్పుభాగమున

తానుకూడ పాదప్రక్షాళనము జేసికొని యీశాన్యభాగమందు గూర్చుండి యాచమనము జేయవలయును. విశ్వేదేవ విష్ణుస్థాన బ్రాహ్మణులు మండలములకు తూర్పున ప్రాఙ్ముఖముగా గూర్చుండి యాచమనము చేయవలయును. ప్రేతస్థానమున పితృస్థానమున నిమంత్రితులైన బ్రాహ్మణులు మండలములకు నుత్తరభాగమునందు నుత్తరముగా గూర్చుండి యాచమనము చేయవలయును. ఈప్రకారముగానే వసిష్ఠుడును చెప్పుచు పాదప్రక్షాళనానంతరము దేవస్థాన నిమంత్రితులైనవారు తూర్పున గూర్చుండి తూర్పుముఖముగాను ప్రేత పితృస్థానమున నిమంత్రితులైనవా రుత్తరమున నుత్తరముఖముగా గూర్చుండియు నాచమనము జేయవలయునుగాని పశ్చిమ దక్షిణ దిక్కులందు ప్రేత పితృస్థాన నిమంత్రిలైనవారికిగూడ పనికిరాదు. అట్లుచేసిన రక్తపానముతో సమానమగును అని చెప్పెను. కర్త ముందుగా నాచమనము జేసినపిమ్మట భోక్త లాచమనము జేయవలయును. భోక్తలు ముందుగా నాచమనముచేసిన శ్వానమూత్రముతో సమానమగునని శౌనకుడు చెప్పెను. అందరును రెండుపర్యాయములే యాచమనము చేయవలయును. అనంతరము విశ్వేదేవపూర్వకముగా నందరికిని దర్భలతో విష్టరములనిచ్చి, భూశుద్ధిజేసి యావాహనాద్యర్చనము జేయుట ప్రారంభించవలయును విశ్వేదేవస్థానమున నిద్దరు బ్రాహ్మణులను తూర్పుముఖముగాను ప్రేతస్థానమున నొక బ్రాహ్మణుని పడమరముఖముగాను పితృపితామహ ప్రపితామహ స్థానములయందు ముగ్గురు బ్రాహ్మణుల నుత్తరముఖముగాను విష్ణుస్థానమునందు నొక బ్రాహ్మణుని తూర్పుముఖముగా గా పడమరముఖముగా గాని కూర్చుండబెట్ట వలయును. ఆప్రకారముగానే స్మృతియు జెప్పెను. అనంతర మాచనముచేసి ప్రాచీనావీతముగా శ్రాద్ధకర్మనుజేసెదనని సంకల్పముజేసి "అపహతా" అనుమంత్రమును జెప్పి తిలలను నాలుగుదిక్కులందును చల్లవలయును "దేవతాభ్యఃపితృభ్యశ్చ" అనుమంత్రమును మొదట మధ్యను అంతమునందు మూడు పర్యాయములు పఠించవలయును. పితృస్థానమునందు పూర్వమువలెనే భూశుద్ధినిజేసి తిలలనుచల్లి జలముతో ప్రోక్షించి విశ్వేదేవస్థానమున తూష్ణీగా నక్షతోదకమును చల్లి భూశుద్ధినిజేసి గాయత్రీ మంత్రముతో నుదకముచే పదార్థమును ప్రోక్షించవలయును. సంకల్పమునందు ఆసనమునందు షష్ఠీవిభక్తులను ఆవాహనమునందు ద్వితీయావిభక్తియు అన్నత్యాగమునందు చతుర్థీవిభక్తియు మిగిలిన సమయముల

యందు సంబుద్ధియు జెప్పవలయునని కాత్యాయనుడు చెప్పెను. అర్ఘ్య మిచ్చుసమయమందు సంకల్పమునందు పిండప్రదానమందు అక్షయ్యోదక దానమందు గోత్రము సంబంధము నామము జెప్పవలయునని పారస్కరుడు చెప్పెను. ఇది అన్నిస్థానములయందు తెలిసికొనవలయును. గోత్రసంబంధ నామములను జెప్పుటవలన వారివారికి హవ్యకవ్యములు పొందింపబడును. కూర్చుండిన పిమ్మట శాస్త్రప్రకారముగ నర్చనచేయవలయును. ఉపవీతిగా ప్రదక్షిణ నమస్కారములను జేయవలయును విశ్వేదేవులకు నుత్తరముఖ ముగాను పితృదేవతులకు దక్షిణముఖముగాను గూర్చుండి జేయుచుండ వలయును. పార్వణశ్రాద్ధములయందు ముందుగా విశ్వేదేవ పూజచేసి పిమ్మట పితృదేవతా పూజచేయవలయును. విశ్వేదేవ పూజయందు కుడి మోకాలును పితృదేవతాపూజయందు నెడమమోకాలును భూమియందు వాల్చి పరిచర్య చేయవలయును. విశ్వేదేవ పూజయం దుత్తరముఖముగా కూర్చుండి బ్రాహ్మణహస్తమునం దుదకముంచి పీటయందు ప్రాగగ్రము లుగా దర్భలనుంచి తిరిగి శుద్ధోదకము నివ్వవలయును. ఇట్లు సర్వోప చారములయందు హస్తోదకము నిచ్చుచుండవలయును. అర్ఘ్యపాత్రనా సాదనజేసి యవలను పవిత్రమునుంచి "శంనోదేవీః" అనుమంత్రముచే నుదకము "యవోసి" అనుమంత్రముతో యవలనుంచి "యాదివ్యా" అనుమంత్రముతో హస్తమునందు నర్ఘ్యము విడువవలయును. అనంతర మాయర్ఘ్యపాత్రలను మరియొక ప్రదేశమునందుంచి పాదము మొదలు శిరస్సు పర్యంతము దేవతాపూజయు శిరస్సు మొదలు పాదపర్యంతము పితృదేవతా పూజయు చేయవలయు ననియున్నది. కాబట్టి యావిధ ముగా గంధపుష్ప ధూపదీపములను వస్త్రాలంకరణాదుల నాయామంత్ర ముల జెప్పుచునిచ్చి విశ్వేదేవపూజ సమాప్తినొందించి యనంతరము పితృ పూజ చేయవలయును. అనంతరము ప్రాచీనావీతము జేసికొని యప్రదక్షి ణముగా జేయుచు దర్భలను మణిచి పితృస్థానమున పీటలయం దుంచవల యునుగాని హస్తములయందుంచ గూడదు. ఇట్టి ఆసనములనిచ్చి పితృ దేవతులకును ప్రతిక్రియయందును హస్తమునందు శుద్ధోదకము నిచ్చు చుండవలయును. దక్షిణాగ్రములుగా దర్భలను పరచి సపవిత్రముగా నొక దొన్నెను ప్రేతస్థానమునందు మూడుదొన్నెలను పిత్రాది మూడుస్థానము లందునుంచి మూలములలో చెప్పబడిన ప్రకారము ఆయామంత్రములతో దర్భ తిల గంధపుష్ప పత్రాదులచే నర్ఘ్యపాత్రలనుపూజించి కుడిహస్తము

యొక్క ఐదు వ్రేళ్లతో పితృపాత్రలయందుండు నుదకమున ప్రదక్షిణ ముగా త్రిప్పవలయును. అనంతర మాయామంత్రములతో ప్రేతకు తత్పి తృపితామహ ప్రపితామహులకు నావాహనము జేసి పిమ్మట నగ్నిహోత్ర మును దెచ్చి బ్రాహ్మణ సమీపమునందుంచి యెడమచేతియంగుష్ఠానామిక వ్రేళ్లతో నగ్నికి దక్షిణభాగమునందు భూమిని స్పృశించి ప్రేత పాత్రయం దుండు నుదకమును వారిపిత్రాది పాత్రలయందుండు నుదకములో కొంచెము కొంచెముగా నుంచి ప్రేత పాత్రయందు మిగిలినయుదకమును ప్రేత స్థాన నిమంత్రితుడైన బ్రాహ్మణుని హస్తమునందు పిత్రాది పాత్రల యందుండు నుదకమును పిత్రాది బ్రాహ్మణ హస్తములయందును విడిచి ప్రేతర్ఘ్యపాత్రను చించివేసి పిత్రాద్యర్ఘ్యపాత్రలను మరియొకచోట నుంచవలయును. అనంతరము హస్తోదకమునిచ్చి అంగుళ్యాభరణ కుండలా భరణాదులను శక్తిననుసరించియొసగి శిరస్సు మొదలు పాదపర్యంతము తిల లు మొదలగువానితో పూజించవలయును. గంధము మాలికలు ధూపము దీపము వస్త్రము కర్పూరము చందనము ఉపవీతము మొదలగువాని నివ్వవలయును. దేవతాకర్మయందు పితృకర్మయందును గంధము నిచ్చుట ప్రశస్తమైనది. తులసీపత్రములు భృంగరాజము మరువము మల్లి మొదల గునవి పితృదేవతులకు సమర్పించిన నక్షయ ఫలమగును. తులసియొక్క వాసన తగిలినంతమాత్రముననే పితృదేవతులు సంతోషించి గరుడవాహ నము నెక్కి విష్ణులోకమునకు వెళ్లెదరు. తులసీదళమును శిరస్సున ధరించి నంతమాత్రమున కర్త భోక్త మృతినొందిన తండ్రి వైకుంఠలోకములో నివసించెదరు శ్రాద్ధకాలమందు తులసీదళములచే పిండములనుపూజించిన వానిపితృదేవతులు భూమియు సూర్యచంద్రు లున్నంత కాలము స్వర్గములో నివసించెదరనియును తులసీమాహాత్మ్యమును నారదీయములో జెప్పబడి నది. గుగ్గిలము ఘృతయుక్తమైన యిప్పచూర్ణము పొగవేయవలయును. నేతితోగాని నూనెతోగాని దీపమును వెలిగించి చూపవలయును. వస్త్రము సమస్తదేవతాస్వరూపమైనదియు సమస్తదేవతులకు నభీష్టమైనది. కాబట్టి శ్రాద్ధకాలమునందు విశేషముగా వస్త్రముల నివ్వవలయును. వస్త్రములు లేనియెడల యజ్ఞము దానము మొదలగు క్రియలు లోపించుచున్నవి. శ్రాద్ధకాలమునందు నఖండితమగు నూతనవస్త్రముల నాచ్ఛాదన నిమిత్తము ఇచ్చినయెడల ఆయుస్సు సంపత్తు కామము ఐశ్వర్యము రూపము మొద లగు సుగుణముల నొందునని యపరార్కమునందు చెప్పబడెను. వస్త్ర

ణ్ణావమునందు యజ్ఞోపవీతమునైనా యివ్వవలయును. యజ్ఞోపవీతము పవిత్రమైనది. కాబట్టి శ్రాద్ధములయందు ఇచ్చినవాడు వేదమునిచ్చినంత ఫలమునొందును. ప్రాచీనావీతముగా గంధము మాలిక ధూపము దీపము వస్త్రము మొదలగునవి యథాశక్తిగా నివ్వవలయును. ఆసనములయం దాసనము అర్చనలయం దర్చనము చేయవలయును. వ్యతిరేకముగా జేసినయెడల పితృదేవతలు నిరపేక్షులై వెళ్లెదరు. చేతిగాలితో విసర బడిన ధూపము నాఘ్రాణించిన శ్రాద్ధము వ్యర్థమగును. కాబట్టి అట్లు చేయగూడదు. ఈప్రకారము పితృస్థానములయందు పూజనంతయు జేసిన పిమ్మట విశ్వేదేవస్థానమునందు జేసినట్లుగానే విష్ణుస్థానమునందును సమస్త పూజావిధానమును జేయవలయును. విష్ణుస్థానమందు అర్ఘ్యపాత్రనొక్క టిరేయుంచవలయును. ఇట్లు అన్నిస్థానములయందు పూజావిధి సమాప్తి యైనపిమ్మట దర్భలు తిలలు భస్మ మొదలగునవిలేకుండా బాగుచేసి కర శుద్ధిచేసికొని భోజనస్థలములందు చతురశ్రములుగా మండలములను జేసి భోజనపాత్రల నుంచవలయును భస్మమర్యాదను జేయక జేసిన శ్రాద్ధమసుర సంబంధమైనదై పితృదేవతలను జెందదు భోక్తలకందరికిని హస్తోదకము నిచ్చి దేవపాత్రలకు ప్రదక్షిణముగాను పితృపాత్రలకు నప్రదక్షిణము గాను పరిషేచన జేయవలయును. భోజననిమిత్తమైనయన్నములో కొంచె మన్నమును దీసికొని నేతితో తడిపి ప్రాచీనావీతముజేసికొని ఔపాస నాగ్నికి దక్షిణభాగమున ప్రేతాహుతిని హోమముజేసి కొంచెమన్నము ప్రేతభోజనపాత్రలయందుంచి మిగిలిన యన్నమును ప్రేతపిండములో నుంచుటకు మరియొకస్థలమందు నుంచవలయును. ఆయన్నమును పితృ పితామహాది పాత్రలయం దుంచగూడదు. తిరిగి వేరేయన్నమును తీసి కొని నేతితో తడిపి ప్రాచీనావీతముజేసికొని బ్రాహ్మణానుజ్ఞనుపొంది సవ్యముచేసికొని ఔపాసనాగ్నియందు హోమము జేయవలయును. తల్లి దండ్రుల సపిండీకరణమును ఔపాసనాగ్నియందు నితరుల సపిండీకరణము లౌకికాగ్నియందును జేయవలయును. అగ్నిహోత్రము కలవాడు ఔపాస నాగ్నియందును అగ్నిరహితుడు లౌకికాగ్నియందును లేక పాణిహోమ మును జేయవలయు ననిరిగాని పాణిహోమమాపస్తంబ మతానుసారము కాదు. మరియు సపిండీకరణశ్రాద్ధాదులందు అగ్నౌకరణమును జేయువారు స్నాతకవ్రతమైనవారుగాని విధురులుగాని బ్రహ్మచారులుగాని యైనయెడల లౌకికాగ్నియందే హోమము జేయవలయును. పూర్ణాశ్రముడు నీవిధము

గానే చెప్పుచు పాణిహోమము మానసహోమము కూడదనెను. అందువలన సాగ్నికుడౌ ఔపాసనాగ్నియందే చేయవలయును. మరియు నొక విశేషము కలదు. ప్రాచీనావీతముగా ననుజ్ఞపుచ్చుకొని యుపవీతముగా హోమము జేయవలయును. ఏకర్మ లౌకికాగ్నియందు జేయబడునో ఆకర్మ సాగ్నికుడు యథావిధిగా నౌపాసనాగ్నియందు జేయవలయునని గౌతముడు చెప్పెను. తల్లిదండ్రుల సపిండీకరణము నగ్నిహోత్రముగల కుమారుడే చేయవలయు ననియు నేకోద్దిష్టాంతము వరకేగాని తర్వాత క్రియలు లౌకికాగ్నియందు కూడదనియు చెప్పియున్నందున పెద్దవాడగ్ని లేనివాడై చిన్నవాడు సాగ్నికుడగునేని చిన్నవాడే సపిండీకరణమును జేయవలయును. ఇట్లు చెప్పినప్రకార మగ్నౌకరణమును జేసి మిగిలిన యన్నములో కొంచెము కొంచెము పిత్రాదుల మూడుపాత్రలయందుంచి మిగిలిన యన్నమును పారణనిమిత్తముంచవలయును. అనంతరము భోజనపాత్రలయందు అన్నాది పదార్థములనుంచి యభిఘరించవలయును. సూపమునందు పరమాన్నమునందు ఘృతపాత్రనుంచినయెడల నాపదార్థము రాక్షసప్రీతికరమై దాతకు పరలోక సుకృతము కలుగదు. ప్రేతశ్రాద్ధమునందు సపిండీకరణమునందు అన్నసూక్తమును జెప్పకూడదు. సమస్తపదార్థమును గాయత్రీమంత్రముచే ప్రోక్షించి విశ్వేదేవస్థానమునం దుత్తరముఖముగాను ప్రేతపితృస్థానములయందు దక్షిణముఖముగాను విష్ణుస్థానమునం దుత్తరముఖముగాను గూర్చుండి యన్నత్యాగాంతముజెప్పి పాత్రలసమీపమునం దుదకము విడువవలయును. అనంతరము "సప్తవ్యాధా దశార్ణేషు" అను మొదలగు శ్లోకములను పఠించి పరిషేచనము జేయవలయును.

## చిత్రగుప్తబలి నిషేధము.

౧౫౬—తా. పితృదేవతలకు త్యాగము చేసిన యన్నమును చిత్రగుప్తాదిబలి నిమిత్తమై భూమియందుంచిన యెడల బ్రహ్మస్వము హరించినంతదోషము సర్వధనాపహరణదోషము సంభవించునని భరద్వాజుడు చెప్పెను. బ్రాహ్మణుల నిమిత్తము త్యాగమైన పిమ్మటగాని త్యాగముకాక పూర్వముగాని భూమియందు బలినుంచినయెడల ఆయన్నమునందు నిరపేక్షులై పితృదేవతలు వెళ్లెదరని యత్రియు జెప్పెను. పితృదేవతలను చెప్పుటవలన విశ్వేదేవతలను కూడ గ్రహించవలయును. అందువలన శ్రాద్ధమునందు విశ్వేదేవస్థాన పితృస్థానములయందు నియంత్రితులైన బ్రాహ్మణులెవరును చిత్రగుప్త బలినిమిత్త మన్నముంచకూడదు. "బ్రహ్మ

ర్పణం బ్రహ్మహవిః" అనిమొదలు చివరవరకు చేయవలసిన క్రియలను చేయవలయును.

సువాసినీభోజన విషయము.

౧౯౭—తా. సువాసినియగు స్త్రీమృతినొందిన యెడల బ్రాహ్మణులకు నర్చనజేసిన పిమ్మట వారితోగూడ నొకసువాసినీస్త్రీని అర్చనారహితముగానే భుజింపజేయవలయును. తల్లి మంగళసూత్ర సహితముగా మృతినొందినయెడల బ్రాహ్మణపంక్తియందు సువాసినీస్త్రీనికూడ భుజింపజేయవలయునని మరియొక మునీశ్వరుడును చెప్పెను. అనంతరము వ్యాహృతులతో గాయత్రినిజపించి మధువాతాయను మంత్రమును కూడ పఠించి విశ్వేదేవపూర్వకముగా నందరికి నాపోశనము నివ్వవలయును. ఆపోశనముగా నివ్వబడిన సర్వతీర్థము నన్నము నతిక్రమించకూడదు. అట్లు శావాంచే లంఘితమగునేని యాయన్నము భుజింపకూడదని మనువు చెప్పెను. ఇట్లు ఆపోశనమునిచ్చిన పిమ్మట గాయత్రిని మూడుపర్యాయములు పఠించవలయును మధువాతా, అనుమంత్రమును జెప్పి మధుమధుమధు, అని మూడుపర్యాయములు పలుకవలయును. భోక్తలాపోశనోదకమును లోపలికి పుచ్చుకొని యాశీర్వచనము చేయవలయునుగాని హస్తమునందేయుంచుకొని యాశీర్వచనము చేయకూడదు. అట్లుచేసిన యెడల కర్తకు నాయుఃక్షీణమగును. అనంతరము ప్రాణాహుతులను పుచ్చుకొనవలయును. ప్రేతశ్రాద్ధమునందు సపిండీకరణమునందు అన్నసూక్తమును జెప్పకూడదు. అగ్నిహోత్రము శిశువులు దేవతలు యతులు బ్రహ్మచారులు మొదలగువారికి పిండప్రదానమగు పర్యంతము శ్రాద్ధసంబంధమగు పాకములో నేమియు పెట్టకూడదు శ్రాద్ధమునకు సంపాదింపబడిన పదార్థమునే కోరి భోక్త భుజింపవలయునుగాని సంపాదింపబడని పదార్థమును కోరకూడదు. అట్లుకోరిన యెడల శ్రాద్ధఘాతకుడగును. శ్రాద్ధమునకు సంపాదింపబడిన పదార్థములోనే భోక్తకోరినప్పుడు కర్తయివ్వని యెడల అధోగతినొంది క్రూరములగు తిర్యగ్జాతులయందు బుట్టును. అని వృద్ధశాతాతపుడు చెప్పెను. మార్జన అర్చనబలికర్మ భోజనము మొదలగునవి దేవతీర్థ విధిగానే చేయవలయును. భోజనము చేయునపుడు ముఖమునందు ధ్వనికాకుండా చేయివిసరకుండా అన్ని వ్రేళ్లతోను భుజించవలయునని వసిష్ఠుడు చెప్పెను. మధ్య పాత్రమునందు ... ఉంచుకొనియే జాగ్రతగా భుజింపవలయును. పవిత్రమున్నయెడల నన్నము సంబంధించిన

దోషమేమియు స్పృశించదని యాపస్తంబుడు చెప్పెను. బ్రహ్మయజ్ఞము నందు జపమునందు బ్రహ్మగ్రంధి యుండవలయు ననియు నదిభోజనకాల మునందు వర్తులాకారముగా నుండవలయుననియు అత్రిమునీశ్వరుడు చెప్పెను. భోక్తలు భుజించిన పిమ్మట వ్యాహృతీసహితముగా గాయత్రిని మధువాతా యనుమంత్రమును పఠించి శ్రాద్ధశేషపదార్థములలో నన్నియు కొంచెము కొంచెముగా దీసికొని జలముతో దడిపి యాపదార్థమును భోక్తలయొక్క భోజనోచ్ఛిష్టపాత్రల సమీపమందు చల్లవలయును. అనంతరము కర్త యాచమనము జేయవలయును. యాచమనముజేయని యెడల మాసమువరకు పితృదేవతు లుచ్ఛిష్టమునే తినుచుందురు. భోక్త లకు నుత్తరాపోశనమునుంచి పిమ్మట పిండప్రదానమునకు సంకల్పముజేసి యన్నిపదార్థములలోను కొంచెముకొంచెము తీసికొని ప్రేతావాహితి శేషాన్నమును కూడ కలిపి ప్రేతపిండ మొకటి చేయవలయును. తిరిగి అన్ని పదార్థములలోను కొంతపదార్థమును తీసికొని అగ్నౌకరణము చేయగా మిగిలిన యన్నమును కూడ కలిపి మూడుపిండములను జేయ వలయును. అనంతర ముచ్ఛిష్టపాత్రలకు ౧౨ డెండంగుళముల దూర ముగా గోమయముతో నలికి తూర్పుగా ప్రేతపిండమును పశ్చిమముగా పితృపితామహ ప్రపితామహులు ముగ్గురకును మూడుపిండముల నుంచ వలయును. చేయుక్రమము మూలములో జూచుకొనవలయును పిత్రాది మూడుపిండముల నుంచునపు డుత్తరమున ప్రారంభించి దక్షిణసమాప్తి చేయవలయును. పిమ్మట ప్రేతపిండమునందు పితామహాది మూడుపిండ ములయందును మధువునుంచి ప్రేతపిండమును మూడుశకలములుచేసి మూడుపిండములయందును కలుపవలయును. ఇట్లు కలిపిన పిమ్మట కృష్ణ నామస్మరణచేసి యీప్రేత మిమ్ములనుపొంది పితృదేవతాత్వము నొంది నాడు కాబట్టి మిగిలినవారందరును స్థిరజీవులై యుందురుగాక యని చెప్ప వలయును.

స్త్రీసంపిండనమునందు విశేషముకలదు.

౧౫౮—తా. 'ఏషాలోను గతా ప్రేతా' అని స్త్రీనిగురించి సపిండ నము జేయునపుడు స్త్రీలింగస్వరూపమునుగానే చెప్పవలయును. పిండ సంయోజనమైనపిమ్మట ప్రేతస్వరూపమువదలి పితృదేవతాస్వరూపము కలుగును. కాబట్టి యిప్పుడు ప్రేతశబ్దము లేదు. చతుర్థపురుషుడును నివర్తించుచున్నాడు.

అందుకు కల్పకారిక ఈవిధముగా జెప్పెను.

౧౯౯—తా. పిండసంయోజన మైనపిమ్మట చతుర్థపురుషుడు నివృత్తి నొందుచున్నాడు. కాబట్టి మార్జనాది సమస్తక్రియలయందు పిండ సంయోజనమైనపిమ్మట నాల్గవపురుషునిపేరు చెప్పనక్కరలేదు. ఆసమయ మందుగాని బ్రాహ్మణ విసర్జనానంతరమందుగాని వైతరణీ గోదానము చేయవలయును. ఇందునుగురించి స్మృతిసారములో జెప్పినదేమనగా, ప్రేతలోకమునుండి పితృలోకమునకు వెళ్లుటకొరకును వైతరణీ నదిని దాటుటకొరకును పిండప్రదాన సమయమునందు బ్రాహ్మణునకు గోదానము చేయవలయునని చెప్పియున్నది.

వైతరణీ గోదాన విధానము.

౨౦౦—తా. కర్త పాదప్రక్షాళనము జేసికొని సవ్యముగా నాచమన సంకల్పములనుజేసి వసురూపము నొందియున్న తండ్రికి సుఖముగా వైతరణీ నదిని దాటుటకొరకు విష్ణుప్రీతిగా గోదానము నిచ్చెదనని సంకల్పము జేసి గోమయముచే నలికిన పరిశుద్ధప్రదేశమునందు మణుగుయెత్తు గలదిగాని లేక శక్తిననుసరించి ప్రత్తినచ్చటనుంచి దానిమీద నూతన వస్త్రమునుపరచి దానిపైనచుట్టు భవిష్యోత్తర పురాణోక్త ప్రకారముగ యవలు గోధూమలు వ్రీహిలు కొఱ్ఱలు చామలు నువ్వులు షష్టికులు (అనగా ఆరుదినములకు పండెడు ధాన్యము) అనునట్టి సప్తధాన్యముల నుంచి వానిమీద రాగిపళ్లెమునుంచి దానిలో దండపాశాది చిన్నెలతో గూడిన బంగారపు యమప్రతిమనుంచి రెండు నూతనవస్త్రములను జుట్టి షోడశోపచారపూజలనుచేసి దానికి ముందరను దుకూలముతో జుట్ట బడిన యావునుంచి షోడశోపచారపూజలగావించి యనంతరము బ్రాహ్మణునకు వస్త్రాభరణాలంకరణాదుల యథాశక్తిగా నిచ్చి యాగోవును బ్రాహ్మణునకు దానమిచ్చి పిమ్మట శక్తిననుసరించి దక్షిణనిచ్చి ధాన్య ప్రతిమా సహితముగా కార్పానము నివ్వవలయును. ఇట్లు వైతరణీ గోదానమును జేసినపిమ్మట "యన్మేమాతా" అనునది మొదలుకొని పిండప్రదాన విధానముజేసి పిమ్మట పూజావిధియును జేయవలెను.

మధ్యపిండ ప్రదాన లోపము.

౨౦౧—తా. యౌవనము రాకయున్నట్టియు వృద్ధురాలైనట్టియు గర్భిణిగలదియు రోగముగలదియు పుత్రులు కలదియునైన భార్యకు పిండమును భుజించుకొఱకు నివ్వకూడదు. మాసికములయందు సపిండీ

కరణములయందు అమావాస్యయందు మృతదినమునందు మధ్యమపిండము నివ్వగూడదు మఱియొకసమయమునం దివ్వవచ్చును. ఇట్లు పిండోద్వాసనయు జేసి అనంతరము బ్రాహ్మణులు లేచినపిమ్మట యాచమనము జేసియున్న బ్రాహ్మణులను పాదప్రక్షాళన స్థలమువద్దను గూర్చుండబెట్టి హస్తోదకమునిచ్చి పాదములమీద నక్షతలనుజల్లి గోత్రాభివృద్ధినొంది యక్షయోదర్కమునొంది యుచ్ఛిష్టపాత్రచాలనము చేయించి భోక్తలకు యథాశక్తిగా దక్షిణల నివ్వవలయును. విశ్వేదేవస్థానమునందు హిరణ్యమును పితృస్థానమందు రజితము నివ్వవలయును. అనంతరము పితృశేషాన్న భోజనమునకు వారివలన ననుజ్ఞదీసికొని ప్రదక్షిణ నమస్కారాదులను జేసి పితృదేవతాపూర్వకముగా బ్రాహ్మణవిసర్జనజేసి యాసీమంతము సాగనంపవలయును. అనంతరము పితృశేషమును భుజింపవలయును. భుజింపని యెడల నరకమునొందును. శ్రాద్ధదినమునందు శూద్రులు మొదలగు వారిని శ్రాద్ధశేషము భుజింపఁ జేయఁగూడదు. శ్రాద్ధశేషమును శూద్రాదులకు పెట్టినయెడల వానిశ్రాద్ధము వ్యర్థమగుచున్నది. శ్రాద్ధదినమునందు కర్తయు భోక్తలును బ్రహ్మచర్యవ్రతముగా నుండవలయును. శ్రాద్ధదినమున భోక్తలు భుజియించిన ఉచ్ఛిష్టపాత్రలను గోయిత్రవ్వి గోతులలోనుంచి కుక్కలు మొదలగునవి స్పృశింపకుండునట్లు తిరిగి విశేషముగా మృత్తుకచేపూడ్చి యుంచవలయును. ఈప్రకారము సపిండీకరణవిధానము చెప్పఁబడెను.

## స్వర్గపాథేయము.

౨౦౨—తా. మఱుదినమునందుగాని యాదినమునందుగాని యేకపురుషోద్దేశముగా నైనను త్రిపురుషోద్దేశముగా నైనను తండ్రినుద్దేశించి సంకల్పవిధానముగ స్వర్గపాథేయ శ్రాద్ధము నామద్రవ్యముతో జేయవలయును. సపిండీకరణానంతరము నాల్గవపురుషుఁడు విడిపోవుటవల్లను అతనిని గుఱించి తిరిగి శ్రాద్ధము లేకపోవుటవల్లను సంకల్పవిధానముగా నైనా సర్వధర్మరహితముగా నైనా నాల్గవపురుషుఁడగు వృద్ధప్రపితామహునకు నామద్రవ్యముతో పార్వణశ్రాద్ధము చేయవలయునని కొందఱనిరి. ఈవిధముగానే స్మృతియు ప్రేతకు పిండనాధికారము కలిగినపిమ్మట చతుర్థపురుషుఁడు పితృలోకమునకు బోవును కాఁబట్టి మృతాహస్సువలెనే యామద్రవ్యముతో స్వర్గపాథేయ మివ్వవలయునని చెప్పెను. మఱియు పదమూఁడవ దినమున నుదయమందు స్నానము జేసి యామద్రవ్యముతో

స్వర్గపాథేయశ్రాద్ధమును మృతాహస్సు ప్రకారముగా జేయవలయుననిరి, కాబట్టి వారివారి యాచారానుసారముగా జేయవలయును.

స్వర్గపాథేయ ప్రయోగము.

౨౦౩—తా. కర్త స్నానాచమనములు చేసి దేశ కాలములనుకీర్తించి ప్రాచీనావీతము చేసికొని నాయొక్క వృద్ధ ప్రపితామహుండు స్వర్గలోకమును జెందుటకు స్వర్గపాథేయశ్రాద్ధమును ఆమద్రవ్యముతో సర్వధర్మరహితముగా జేయుచున్నానని సంకల్పము జేసి బ్రాహ్మణునకు నావాహనాదికము నంతయుజేసి తండులవ్యంజనశాక దధ్యాజ్యాది సమస్త పదార్థమును తెచ్చి గాయత్రీమంత్రముతో ప్రోక్షించి త్యాగముచేసి యాబ్రాహ్మణునకు దక్షిణతాంబూల సహితముగా నిచ్చి పిండప్రదానమును జేసి యాపిండములను జలములోకల్పి స్నానము జేసి యింటికివచ్చి తిరిగి అభ్యంగస్నానము జేసి శుభ్రవస్త్రములను ధరించి శుభస్వీకరణ నిమిత్తము శుద్ధికొఱకును విద్వాంసులగు బ్రాహ్మణులతోగూడి స్వస్తి పుణ్యాహవాచనము చేసికొని బ్రాహ్మణాశీర్వాదముల నొంది బ్రాహ్మణులతోను బంధువులతోను ఇష్టు᳚ మిత్రులు మొదలగువారితోనుగూడి భుజియించి యాదినము మొదలు సంవత్సరపర్యంతము నిత్యము ఉదకుంభశ్రాద్ధమును జేయవలెను.

పంద్రెండవదినమునందు సపిండీకరణమును జేసినయెడల చేయువిధానము.

౨౦౪—తా. పూర్వమందు జేయఁబడిన ఊనమాసికాది శ్రాద్ధములను ఊనాబ్దికపర్యంతము వాటివాటికిఁ జెప్పఁబడిన కాలములయందుజేసి యుదకుంభశ్రాద్ధమునుచేసి సంవత్సరమునకు చివరదినమునందు సంవత్సర విమోకశ్రాద్ధమును పార్వణవిధానముగ వేఱుగాచేసి మఱుదినమందు ప్రత్యాబ్దికమును పెట్టవలయును. సంవత్సరాంతమందు సపిండీకరణము జేయుపక్షములో సంవత్సరము సంపూర్తియైన పిమ్మట మృతమాసములో మృతదినమునందు సపిండీకరణమును జేయవలయును. అదియే ప్రథమాబ్దికమని స్మృతియు చెప్పినది కాఁబట్టి తిరిగి ప్రత్యాబ్దికమప్పుడు పెట్టనక్కఱలేదని మునీశ్వరులు చెప్పిరని తాత్పర్యము.

తల్లియొక్క సపిండీకరణము.

౨౦౫—తా. తండ్రికి సపిండీకరణము చేసినట్లుగానే తల్లికిని పితామహీ మొదలగు ముగ్గురువర్గముతో జేర్చి స్త్రీలింగ శబ్దస్వరూపముగా జెప్పి చేయవలయును.

తల్లి సపిండీకరణ ప్రయోగము.

౨౦౬——తా. తండ్రికి సపిండీకరణము చేసిన విధానముగానే సమస్త క్రియలు నావిధముగానే చేయవలయును. పురుషులకు శర్మశబ్దము ప్రయోగించినందుకు స్త్రీలకు దాయీ అని చెప్పవలయును. తల్లి పేరు చెప్పిన పిమ్మట తద్భర్తృమాతృపితామహీ ప్రపితామహీ అని వర్గత్రయము జెప్పుచు పురుషులకు పుంలింగముతో జెప్పినట్లు స్త్రీలనుగుఱించి స్త్రీలింగ స్వరూపముగా జెప్పవలయును మిగిలిన విధానమంతయు సమానమని తాత్పర్యము.

అర్ఘ్యసంయోజన పిండసంయోజనము.

౨౦౭——తా. దీనిలో తల్లి సపిండీకరణమునందు అర్ఘ్యసంయోజనము పిండసంయోజనము మొదలగు విధులను సంకల్పము చేయురీతియు నంతయు స్త్రీలింగస్వరూపములతో వ్రాయఁబడినది. ఇది ప్రయోగవిధానము కాఁబట్టి వ్రాయనవరసరము లేదు.

ఉదకుంభశ్రాద్ధము.

౨౦౮——తా. అనంతరము సంవత్సరపర్యంత ముదకుంభశ్రాద్ధమును జేయవలయును. ఉదకుంభశ్రాద్ధము సపిండీకరణమునకు పూర్వ మేకోద్దిష్టవిధానముగాను జేయవలయును. స్మృతిచెప్పినదేమనగా తల్లిదండ్రులకుగాని యితరులకుగాని సపిండీకరణమును చేసినను చేయకపోయినను మరణించినవానికి నాహారము నివ్వవలయునుగాన భుజించుటకు శక్తికొలది సంపాదించిన యన్నాదిపదార్థములను త్రాగుటకు జలసహితముగా నుండు నుదకుంభము సంవత్సరపర్యంతము నివ్వవలయును. ఇట్లు సంవత్సరమందు జేయుచున్నను ప్రతిమాసమునందు మాసికమును బెట్టవలయును. సంవత్సరములోపుగా సపిండీకరణము జేయఁబడిన నుదకుంభసహితముగా నన్నమును సంవత్సరపర్యంతము పెట్టుచునే యుండవలెను. ఆవిధముగానే భీష్ములువారు చెప్పినదేమనగా ఓధర్మరాజా! మృతినొందినవారు సంవత్సరపర్యంతము ప్రేతలోకమునందు నివసింతురు. కాఁబట్టి వారికి ఆకలి దాహము శాంతినొందుటకు సంవత్సరమునకు లోపుగా సపిండీకరణము జేయఁబడినను వానిను ద్దేశించి ప్రతిదినమునందుగాని ప్రతిమాసమునందు గాని సంవత్సరము నన్నము నుదకుంభము శక్తిననుసరించి యివ్వవలయును. స్మృతులయందు చెప్పఁబడినదేమనగా, ప్రథమాబ్దికపర్యంతము నిత్యము అదైవముగాను ధర్మరహితముగాను ఉదకుంభసహితమగు పార్వణశ్రాద్ధమును సంకల్పవిధానముగా జేయవలయునని చెప్పెను.

అద్వైవమనఁగా విశ్వేదేవస్థానము లేదు. పార్వణమనగా త్రిపురుషోద్దేశ ముగా జేయవలయును. సోదకుంభమనఁగా జలయుక్తఘటముతోకూడ. అధర్మమనఁగా కర్తృభోక్తలకు నియమము లేకపోవుట. అమావాస్యయు అనుమాసికదినమును విడిచిపెట్టి యితరదినములయందు నిత్య ముదకుంభ శ్రాద్ధమును జేయవలయునని స్మృతియందున్నది కాఁబట్టి అనుమాసిక మును పెట్టునట్టిదినమునం దుదకుంభశ్రాద్ధమును జేయ నవసరము లేదని తా.

మాసోదకుంభ శ్రాద్ధపక్షము.

౨౦౯—తా. మాసమునకు నుదకుంభ శ్రాద్ధమును జేయుపక్ష ములో మృతదినమునందు అనుమాసికమును పెట్టి ఆదినమునం చే వేరుగా నుదకుంభశ్రాద్ధమును కూడ చేయవలయును. సపిండీకరణమైన పిమ్మట ప్రతిమాసములో మృతదినమునందు అనుమాసికము నుదకుంభశ్రాద్ధము వేఱువేఱుగా జేయవలయునని స్మృతితత్వనిర్ణయమందు జెప్పఁబడినది. సంకల్పవిధానముగా జేయునప్పుడు ఆవాహనము పాత్రాసాదనము, అగ్నౌకరణము, పిండప్రదానము, లేదు. సంకల్పశ్రాద్ధములయందు ఆవా హనము అర్ఘ్యము అగ్నౌకరణము స్వధావాచనము మొదలగునవి విడిచి హస్తశుద్ధిమాత్రమును జేయవలయునని యున్నది. ఈశ్రాద్ధమును విడిచి పెట్టకూడదు. విడిచిపెట్టిన తిరిగి యివ్వవలయునని యున్నది. కాఁబట్టి ప్రేతకు తృప్తికరము కాఁబట్టి సంవత్సరపర్యంత మివ్వవలయును. దర్శ శ్రాద్ధము, గయాశ్రాద్ధము, అపరపక్షశ్రాద్ధము క్షౌరము సంవత్సరము నకు లోపుగా జేయకూడదు పండ్రెండవ దినమునందు సపిండీకరణము జేయుపక్షములో నైనను అస్థినిక్షేపణ, గయాశ్రాద్ధాదులను, సంవత్సర పర్యంతము జేయకూడదు. తల్లిదండ్రులకు సపిండీకరణమైన పిమ్మట బ్రహ్మ చర్యవ్రతము సలుపనక్కరలేదు. బ్రహ్మచర్యము వ్రతమాచరించిన యెడల విశేషఫలము కలుగును. ఆచరింపకపోయినను దోషము లేదని కల్పకారిక కారుడు జెప్పెనని తాత్పర్యము.

మాసికవిషయము.

౨౧౦—తా. తల్లిదండ్రులకు జ్యేష్ఠభ్రాతలకు పినతండ్రి పెత్తం డ్రులకు సపిండీకరణానంతరము మాసికములను పార్వణవిధానముగాను భార్య సోదరులు పుత్రులు మొదలగువారికి సపిండీకరణానంతరము నేకో ద్దిష్టవిధానముగాను తిఱిగి పెట్టవలయునని దక్షుడు చెప్పెను. మఱియు పైఠీనసియు నిట్లుచెప్పెను. పుత్త్రుఁడు మొదలగువారు తల్లిదండ్రులు

మొదలగువారిని గుఱించి ప్రత్యాబ్ధికము నెట్లు పార్వణవిధానముగా జేయుదురో ఆవిధముగానే సపిండీకరణమునకు పూర్వము నేకోద్దిష్టవిధముగా జేసి పిమ్మట పార్వణ విధానముగానే షోడశశ్రాద్ధముల నాచరింపవలయుననియు భార్య పుత్త్రుడు గురువు మొదలగువారికి ప్రత్యాబ్ధికము నేకోద్దిష్టముగా జేయఁబడును. కాఁబట్టి సపిండీకరణానంతరము షోడశశ్రాద్ధముల నేకోద్దిష్టవిధానముగానే చేయవలయుననియు చెప్పెను. పులస్త్యుడు చెప్పిన దేమనగా, సోదరుఁడు తోబుట్టువు పుత్త్రుడు అధిపతి మేనమామ మిత్రుడు గురువు మొదలగువారిని గుఱించి సపిండీకరణము జేయఁబడిన పిమ్మట జేయుచుండెడి శ్రాద్ధముల నేకోద్దిష్టవిధానముగానే యనియు పార్వణవిధానముగా జేయనక్కర లేదనియును చెప్పెను. సపిండీకరణానంతర మేకోద్దిష్టవిధానముగ జేయునప్పుడు పార్వణమునకు నావృత్తిలేదు. ఒక్కపవిత్రము నొక్కయర్ఘ్యము నొక్కపిండము నుంచవలయును. అగ్నౌకరణము లేదు. జ్యేష్ఠభ్రాత ఆద్యగర్భసంభవుడు. కాఁబట్టి సపిండీకరణమును జేయకుండా పార్వణశ్రాద్ధమును చేయగూడదనిరి. సంతానములేని తండ్రియొక్క సోదరులకు అన్నకు మాతామహులకు తండ్రికిచేసిన విధానముగానే చేయవలయును. షోడశశ్రాద్ధములను జేసి సపిండీకరణమును జేయవలయునుగాని షోడశము జేయక సపిండీకరణము చేయఁగూడదు. ఆవిధముగానే దక్షుడును చెప్పెను. త్రిపక్షాదికాలముల యందు సపిండీకరణము జేయుపక్షములో అదివరకు జేయఁబడిన మాసికములను వాటివాటి కాలములో పెట్టబడినవి. కాఁబట్టి సపిండీకరణమునకు పూర్వము పెట్టబడిన మాసికములను తిరిగి పెట్టనక్కరలేదు. సపిండీకరణమైన పిమ్మట మిగిలిన మాసికములనే పెట్టవలయునని తాత్పర్యము.

మలమాసవిషయము.

౭౧౧—తా. మలమాసములో మృతినొందినవారికి పండ్రెండవ దినమునందు సపిండీకరణము జేయబడినప్పుడు ఆద్యమాసికము జరిగినను నిజమాసమునందు తిరిగి ఆద్యమాసికము పెట్టవలయును. దక్షుడు చెప్పిన దేమనగా, పండ్రెండవదినమునందు సపిండీకరణమును జేయునప్పుడు ఆద్యమాసికమును విడిచి ద్వితీయమాసికము మొదలుకొని తిరిగి పెట్టవలయుననియు మలమాసములో మృతినొందిన ఆద్యమాసికమును గూడ తిరిగి పెట్టవలయు ననియు చెప్పెను. సంవత్సరోదకుంభశ్రాద్ధము మన్వాది శ్రాద్ధములు మహాలయశ్రాద్ధము యుగాదిశ్రాద్ధములు దర్శశ్రాద్ధము నిత్య

శ్రాద్ధము ఊనమాసికము మొదలగునవి మలమాసమునం దైనను జేయ వచ్చును. ఆహితాగ్ని విషయములో రెండవమాసికము దహనదినము నందు పెట్టవలయును. ఆహితాగ్నిని గుఱించి త్రిపక్షమునకు తర్వాత జేయబడు శ్రాద్ధములు మృతదినమునందును అంతకుపూర్వము జేయబడు శ్రాద్ధములు దహనదినమునందును జేయవలయునని వసిష్ఠుఁడు చెప్పెనని తాత్పర్యము.

—{ సపిండీకరణానంతరము మాసికాపకర్షమును గుఱించి చెప్పబడిన విషయము. }—

౨౧౨—తా. ప్రేతసంస్కారసంబంధమగు షోడశాదిశ్రాద్ధములను వాటివాటికిజెప్పఁబడిన కాలములయందు చేయవలయును. అట్లు చేయని యెడల ప్రేతత్వమువలన విడువఁబడడు. ఇట్లు చెప్పఁబడినను దేశకాల వైపరీత్యముచే దేహమునకు రోగము మృత్యువుకలుగుననే సంశయముచే మాసికముల నపకృష్యముచేసి పదకొండవదినమునందుపెట్టి తిరిగి యథోక్తకాలములయందు షోడశశ్రాద్ధములను పెట్టవలయునని గౌతముఁడు చెప్పెను వృద్ధిసంభవించినప్పుడు పూర్వ మపకృష్యముచేసి పెట్టఁబడినను తిరిగి పెట్టవలయును. అనుమాసికములను ఒక్కొకప్పుడు సంఘముగా పెట్టబడినను అర్ఘ్యపాత్రలు మూడుపిండములు మూడునుండునట్లుగా జేయవలయునుగాని సపిండీకరణానంతర మేకోద్దిష్టముగా జేయఁగూడదు. అనుమాసికములను పెట్టియే తీరవలెను. సపిండీకరణముకంటె పూర్వము షోడశశ్రాద్ధము లపకృష్యముచేసి పెట్టబడినను వృద్ధిశ్రాద్ధము చేయవలసి వచ్చినప్పుడు సపిండీకరణానంతరము కూడ తిరిగి అపకృష్యముచేసి అనుమాసికములను పెట్టవలయును. వృద్ధిశ్రాద్ధానంతరము నిషేధమువలన నాందీశ్రాద్ధము నిమిత్త మపకృష్యముచేసి పెట్టినపుడు తిరిగి అనుమాసికములను పెట్టనక్కరలేదు వృద్ధిశ్రాద్ధము సంభవించినప్పుడుగాక మాసికముల నపకృష్యముచేసిపెట్టినట్టి యజమానుడు వానిపితరులతో కూడ ఘోరనరకమునందు నుండెదరు. వృద్ధిశ్రాద్ధమును జేసినపిమ్మట మాసికములను పెట్టినవాడు అయాతయామమనెడి మరణమునొందును సందేహములేదు. అందువలన సపిండీకరణముకంటె పూర్వ మపకృష్యముచేసి మాసికములు పెట్టబడినను నాందీశ్రాద్ధము జేయవలసి వచ్చినప్పుడు తిరిగి అపకృష్యముచేసి పెట్టవలయును. వృద్ధిశ్రాద్ధానంతరము మాసికములను పెట్టనక్కరలేదని సిద్ధాంత పరచబడినది. జన్మత్రయము, నందతిథులు

శుక్రవారము, ఆది మంగళవారములు, పనికిరావు; మృతదినమున తిథి వారనక్షత్రములయొక్క దోషము లేదు అందువలన మృతదినమునందు అపకృష్యము చేసియైనను మాసికములను పెట్టవచ్చునని శాతాతపుడు చెప్పెను. త్రిపుష్కరములందు నందతిథులందు అమావాస్యయందు చతుర్దశియందు శుక్రవారమునందు కృత్తికానక్షత్రమందు ఊనత్రయములను పెట్టకూడదు. షోడశశ్రాద్ధములను జేయకుండా సపిండీకరణమును జేయుటకు వీలులేదు. సపిండీకరణమును జేయనియెడల ప్రేతకు పితృదేవతా స్వరూపము కలుగదు. ప్రేతకు పితృదేవతా స్వరూపము సంభవించకుండా కుమారుడు నిత్యము నైమిత్తికము కామ్యము ఇష్టాపూర్తములు మొదలైన యేశుభములను జేసికొనుటకు నర్హతలేదు. కాఁబట్టి కుమారుఁడు సపిండీకరణమును తప్పక జేయవలయునని వ్యాసుఁడు చెప్పెను. తనతల్లిదండ్రులకు సపిండీకరణము జేయక పూర్వమితరులకుశ్రాద్ధమునైనను జేయగూడదని మునీశ్వరులు చెప్పిరని తాత్పర్యము.

ఆద్యమాసికాదులకు కాలములు.

౨౧౩—తా. తిథిదర్పణమునం దీవిధముగా జెప్పఁబడెను. ఆద్యమాసికము పదకొండవదినమునందును ఊనమాసికము పండ్రెండవదినమునందును లేక మాసములో రెండుభాగములు గడచిన పిమ్మట (అనగా యిరువది దినములు జరిగిన పిమ్మట) మూడవభాగములో జేసి దినమునందును పెట్టవలయును. మిగిలిన రెండు ఊనశ్రాద్ధములను వాటివాటికి జెప్పఁబడిన మాసములలో మూడవభాగ దినములలో పెట్టవలయును. మూడవపక్షములో జేసి దినమునందు త్రైపక్షికమును పెట్టవలయును. మఱియు మూడవపక్షములో మొదట నైదుదినములలో త్రైపక్షికము పండ్రెండవపక్షములో అయిదుదినములు గడచిన పిమ్మట పదిదినముల లోపల ఊనషాణ్మాసికము యిరువదినాల్గవ పక్షములో చివర అయిదు దినములలో ఊనాబ్దికము పెట్టవలయుననియు చెప్పిరి. ఊనత్రయములకు స్వకాలము లతిక్రమించిన యెడల తిరిగి చేయనక్కరలేదు.

షోడశశ్రాద్ధకాలములు.

౨౧౪—తా. పండ్రెండవదినమునందు సపిండీకరణమును జేయదలచినప్పుడు పదకొండవదినమునందు షోడశశ్రాద్ధముల నపకృష్యము జేసి చేయవలయును. సపిండీకరణానంతరము మాసికములను తిరిగి పెట్టవలయును. పూర్ణాశ్రముడు చెప్పిన దేమనగా. తల్లిదండ్రులకు సపిండీకరణము

జేసిన పిమ్మటను ఆయాకాలములయందు పదియేనుమాసికములను పార్వణ విధానముగా జేయవలయుననియు సోదరులు మొదలగువారికి నేకోద్దిష్ట విధానముగాను జేయవలయుననెను. పదియేను అని చెప్పుటచే సపిండీకరణానంతరము ఆద్యమాసికము పెట్టనక్కరలేదు. దానికి విధాయకమైన పదకొండవదినమునందే చేయఁబడినది. ఇతరమాసికములు వాటికి జెప్పఁబడిన కాలములయందు జేయబడలేదు. కాఁబట్టి తిరిగి చేయవలసియున్నవి

## మృతాశౌచాంతర్గత శ్రాద్ధవిషయము.

౨౧౫—శా. తల్లిమరణము నొందిన పదిదినముల లోపల తండ్రియొక్క ప్రత్యాబ్దికము వచ్చెనేని (౧౧) పదకొండవదినమునందు హోమము జేసిన పిమ్మట షోడశముకంటె ముందుగ తండ్రియొక్క ప్రత్యాబ్దికమును పెట్టి పిమ్మట షోడశము చేయవలయును. తండ్రిమరణించిన పదిదినముల లోపల తల్లియొక్క ప్రత్యాబ్దికము వచ్చునేని పదకొండవదినమునందు షోడశముజేసిన పిమ్మట తల్లియొక్క ఆబ్దికము పెట్టవలయును. ఇక్కడ షోడశమనఁగా సపిండీకరణమని తెలిసికొనవలెను.

## ఊనమాసికములకు కాలములు.

౨౧౬—శా. ఇరువైయొక్క దినమునందు శాంతియు నిరువైమూడవదినమునందు శుభము ఇరువైయైదవ దినమునందు మోక్షము ఇరువైయేడవదినమునందు సుఖము ఇరువైతొమ్మిదవ దినమునందు గయాశ్రాద్ధఫలము కలుగును అని యూనమాసికమునకు ముఖ్యకాలమును మనువుచెప్పెను. మాసమునకు ఒకటిరెండుమూడు దినములు తక్కువగానుండు సమయములో నూనమాసికమును పెట్టవలయునని కొందరును లేక పండ్రెండవ దినమునందుగాని పెట్టవలయునని మఱికొందరును చెప్పినట్లు కల్పకారికయందు కలదు. మఱియు పండ్రెండవదినము మొదలు పదునెనిమిది దినముల పర్యంత మెప్పుడైన నూనమాసికమును పెట్టుటకు తిథివారనక్షత్రాదిబలమును విచారింపనక్కరలేదని చెప్పిరి. కృత్తిక జ్యేష్ఠ ఆశ్లేష పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్రలు మూలనక్షత్రములయందూనత్రయములను పెట్టిన పెద్దకుమారుడు నశించుననియున్నది. కాఁబట్టి శ్రేష్ఠమైనవికావు. హస్త చిత్ర భరణి స్వాతి శ్రవణము అశ్విని మఖ అనూరాధ రేవతి శతభిషము మృగశిర ఈపదకొండు నక్షత్రములు శ్రాద్ధకర్మకు శ్రేష్ఠములైనవి. మఱియు ఇరువైయేడుదినములపైన మూడు

దినములలో ఊనమాసికమును, నలుబదిదినముల పైన అయిదుదినముల లోపల త్రైపక్షికము నూటడెబ్బైపైన పదిదినముల లోపల ఊనషాణ్మాసికమును మూడువందల నలభైపైన పదియేను దినముల లోపల ఊనాబ్ధికమును పెట్టి మృతదినమునందు ప్రథమాబ్దికమును పెట్టవలయుననిరి.

అపకృష్యము జేయఁబడినను తిరిగి జేయుట.

౧౧౭—తా. విశ్వాదర్శమునం దీవిధముగా జెప్పఁబడినది. మాసికముల నపకృష్యముచేసి సమాప్తినొందించకయే శుభకర్మయు జేయగూడదు. కాఁబట్టి సంవత్సరములోపుగా శుభకర్మను జేయవలసి వచ్చినప్పుడు పూర్వము అపకృష్యము చేయబడినను తల్లిదండ్రులవిషయమై తిరిగి అపకృష్యముచేసి పెట్టవలయును. మరణమునొందిన వానియొక్క తృప్తినిమిత్తమై రెండుమూడుపర్యాయములైన నావృత్తిగా జేయవచ్చును. మాసికముల విషయమై ఆవృత్తిదోషము లేదనిచెప్పిరి. శివస్వామిమతమునందు ఈవిధముగా జెప్పఁబడెను. మాసికశ్రాద్ధవిధానమునందు నాందీముఖమును జేయనక్కర లేదనియు నిదియందరకును సమానమేయనియు పూర్వము సమాప్తిచేయబడినను తల్లిదండ్రులవిషయమై మాసికములను ఉదకుంభశ్రాద్ధమును సంవత్సరపర్యంతము తిరిగి చేయుచుండవలయునని యున్నది. శుభకర్మసమీపించినపుడు పూర్వము మాసికముల నపకృష్యముచేసిపెట్టి పిమ్మట శుభకర్మను జేసికొనవలయును. ఇట్లు పూర్తిచేసినను తల్లిదండ్రులవిషయమైన మాసికములను సంవత్సరపర్యంతము తిరిగిపెట్టుచునే యుండవలయును. ఇతరుల మాసికములను పెట్టనక్కర లేదు. మాసికములను సమాప్తిని పొందింపక నాందీశ్రాద్ధమును జేయఁగూడదనియు సమాప్తిని పొందింపబడినను తల్లిదండ్రులమిగిలియున్న మాసికములను తిరిగి పెట్టవలయునని మరియొక మునిచెప్పెను. ఉపనయనము, సీమంతము, చౌళము, వివాహము, దుర్లభములగు పుణ్యకాలములు యజ్ఞము మొదలగు శుభములు సంవత్సరములోపల నెప్పుడైనను సంభవించినప్పుడు మాసికముల నపకృష్యముజేసి మృతదినమునందు పెట్టి. తల్లితండ్రుల సంబంధమగు నేని యప్పటికి మిగిలియున్న మాసికములను తిరిగి పెట్టవలయును. ప్రమాదమువలన నంతరితములగు ఊనములను తిరిగి పెట్టనక్కర లేదు. పెట్టినను ఫలమేమియు లేదు. వృద్ధిశ్రాద్ధమును జేయుటకు పూర్వదినమునందు తల్లిదండ్రులయొక్కగాని యితరునియొక్కగాని మాసికముల నపకృష్యము జేయవలయునని మరియొకరు చెప్పిరి. రాజపీడ మొదలైన

యుపద్రవములు సంభవించినప్పుడును శుభము సంభవించినప్పుడును కాలముయొక్క నియమనులేదు. కాఁబట్టి మాసికములన్నియు నొక్క మాటుగానే పెట్టవచ్చును సందేహములేదు. అని స్మృతియందు కలదు. సంఘముగా జేయఁబడినప్పుడును మూడుపిండములనే యుంచవలయును గాని బహుపిండముల నుంచగూడదు. శ్రాద్ధములు పూర్ణమైనప్పుడు నస్థి సంస్కారము జేసినప్పుడును లేదు. దశాహానంతరమునం దపకృష్యముచేసి పునర్దహనము చేయవలయును. ఏకాదశాహస్సు మొదలు పండ్రెండుమాసములపర్యంతము షోడశశ్రాద్ధములను జేయవలయును. అనంతరము కారణాంతరముచే తల్లికి తిరిగి చేయవలయునని యున్నది. ఈప్రకారము మాసికాపకర్షణము గుఱించి విమర్శించిరి.

దర్శమృతాహశ్రాద్ధముల సన్నిపాతము.

౨౧౮—తా. అమావాస్యయందు తల్లిదండ్రులలో నెవరికైన నాబ్దికము సంభవించినప్పుడు ప్రత్యాబ్దికము ముందుగాపెట్టి పిమ్మట దర్శశ్రాద్ధమును జేయవలయును. త్రిపక్షము మొదలగు కాలములయందు సపిండీకరణమును జేయునప్పుడు ప్రశస్తములగు నక్షత్రాదులను విచారించి చేయవలయును. అమావాస్యయందును మృతాహస్సునందును మహాలయ పక్షమునందును సపిండీకరణమును జేయునప్పుడు తిథివారనక్షత్రాదులను విచారింప నక్కరలేదు.

సువాసినీపూజ.

౨౧౯—తా. సువాసినియగు స్త్రీమృతినొందినయెడల భోక్తలతోగూడ సువాసినియగుస్త్రీని మంత్రోక్తవిధానము లేకుండానే భుజింప జేయవలయును. తల్లి మంగళసూత్ర సహితముగా మృతినొందిన యెడల మృతదినమునందు తల్లినుద్దేశించిన సువాసినీస్త్రీని బ్రాహ్మణపంక్తియందు గూర్చుండబెట్టి భుజింపజేయవలయును. లేక మఱియొకపాకము జేసి మఱియొకపంక్తియందు భుజింపజేయవలయునని కొందరి యాచారముకలదు. భోక్తలు భుజించినపిమ్మట మఱియొకపాకమునందు సువాసినీస్త్రీ భుజింప జేసి యనంతరము కర్త మొదలగువారు భుజింపవలయునని ద్రావిడులలో కొందరి యాచారమై యున్నది. ఎందువల్లననగా భోక్తలు స్త్రీలతోగూడ సహపంక్తిని గూర్చుండకూడదు. శ్రాద్ధకర్మయందు సువాసినీస్త్రీనిగుఱించి పూజను జేయునప్పుడు స్త్రీసహపంక్తిదోషము లేదని కొందరి యాచారము. మఱియు పెనిమిటి జీవించి యున్నంతవరకు సువాసినీపూజను జేయ

వలయునుగాని పెనిమిటిస్మృతినొందినపిమ్మట సువాసినీపూజ యక్కఱలేదని మాధ్వులుచెప్పిరి కాఁబట్టి వారివారి యాచారప్రకారముగా సువాసినీ పూజను జేయవలయును.

లోష్టచయనము చేయుటకు నిర్ణయము.

౨౨౦—శా. అగ్నిచిత్తు మృతినొందినయెడల చయనాంతము నిత్యముగా చేయవలయునని యున్నది. కాఁబట్టి నియమముగా లోష్టచయనము జేయవలయును. చతురశ్రము మొదలగు మహాగ్నులను చయనము చేసినవాడు అగ్నిచిత్తుయని చెప్పిరి. కాఠము సావిత్రము మొదలగు యగ్నులను చయనముచేసినవాడని కొందఱనిరి. ఎందువల్లననగా. అగ్నిని చితించి సౌత్రామణిచే యజనము చేయవలయునని చెప్పుటచేత నుభయ పక్షములయందు నుపసంహారము సమానమైనదని చెప్పిరి. లేక కాఠకాగ్నులయందు సౌత్రామణి మైత్రావరుణులు వికల్పముగా చెప్పుటవలన చయనమునం దుపచరించుచున్నది. మహాగ్నిస్థానమునం దుండుటవలన పశుబంధమునందు చయనము జేసినవానికి వికల్పముగాను సోమమునందు నిత్యముగాను జెప్పఁబడెను. సోమమునందు వేఱుగా చయనము జేసినవానికి లోష్టచయనము వికల్పమనియు సమిష్టిగా చయనము జేసినవానికి నిత్యమనియు కొందరు చెప్పిరి. అగ్నిచిత్తుకు అని సామాన్యముగా భేదము లేకుండా చెప్పుటచే నందరికిని లోష్టచయనము జేయవలయునని మఱి కొందరు చెప్పిరి. అయితే "నచాతఊర్ధ్వం శ్మశానం కర్తు మాద్రియేత" అను సూత్రప్రకారముగా పునర్దహనము జేయఁబడినప్పుడు లోష్టచయనము అగ్నిచిత్తుకును నిషేధింపఁబడియుండగా అగ్నిచిత్తుకు లోష్టచయనము ముఖ్యముగా జేయవలయునని చెప్పుట నెందువల్లనని ప్రశ్న చేసిన యెడల ఆసూత్రమునందు వికల్పాభిప్రాయముతో జెప్పఁబడినందున నట్లు చెప్పగూడదనిరి. అది యేవిధముగా ననగా. "అథయది పునర్ధత్యంతస్సుశ్రీః" అను సూత్రప్రకారముగా కపర్దిభాష్యములో పూర్వము చెప్పిన సూత్రమునకు వికల్పాభిప్రాయముగా వ్యాఖ్యానము చేయఁబడినది. "తథాహి" అనునది మొదలు "అస్థిహోమపక్ష మాశ్రిత్య క్రియమాణ ఇత్యర్థః" అనువరకునుండు గ్రంథముయొక్క సారాంశమువలన అస్థిహోమమును జేయుపక్షములో అగ్నిచిత్తునకు లోష్టచయనము జేయవలయు ననియు అది లేనిపక్షమందు లోష్టచయనము ముఖ్యముగా జేయవలయు ననియు చెప్పిరి. అగ్నిచిత్తుకు చయనాంతము జేయవలయునని చెప్పఁబడుటచే

జేయవలయును. "తథాసోయమేవం" అనునది మొదలు "చయనాంత మగ్ని చితః" అనువఱకునుండు గ్రంథసందర్భముచే పాత్రచయనముతో గూడ లోష్టచయనము నిషేధింపఁబడినను అగ్నిచిత్తుకు చయనాంతము జేయవలయునని యుండుటచే అగ్నిచిత్తు మృతుండగునేని లోష్టచయనము నిత్యముగా జేయవలయునని దీపికాకారుడును చెప్పెను. "అథైకేషాం శాఖినాం" అను శాస్త్రమునవలన అనాహితాగ్నికి స్త్రీలకు హవిర్యజ్ఞమును ప్రారంభించనట్టిఆహితాగ్నియగు సోమయాజికిని అస్థికుంభనిధానాంతము శ్మశానమునందు జేయవలయునని భాష్యమునందు జెప్పఁబడినది. ఇట్లు పునర్దహనపక్షమందును లోష్టచయనము చెప్పఁబడినది. కాఁబట్టి బహ్వృచశాఖీయులుగాని ఛందోశాఖీయులుగాని యెవరైనను మాపక్షము నాశ్రయించినవారు అగ్న్యర్థానాదికమును చేసిరో ఇదియంతయు వారందఱును చేయవలయును. చయనాంతము వఱకునుండు క్రియలు అధ్వర్యుని సంబంధమైన వగుటవలన స్వసూత్రమునందు జెప్పఁబడియుండ లేదని మానగూడదు. "అనుశ్రాద్ధే నవశ్రాద్ధం" అనుదానివలన ఆశ్వలాయనులకు అస్థిహోమ స్వరూపమైన పునర్దహనము నిషేధింపఁబడి గంగోదకమునందు అస్థులనుంచవలయునని మరియొకవిధానము చెప్పఁబడియుండగా దీని యంతమువరకు జేయవలయునని చెప్పుట యేలాగునని ప్రశ్న కలుగగా, పూర్వము చెప్పఁబడిన వచనమాశ్వలాయనుల సంబంధమైన దగుటచేతను గంగోదకమునం దస్థులనుంచుట అగ్నిచిత్తుకు సంబంధించిన దగుటచేతను వారికంటే నితరులగు బహ్వృచశాఖీయులకు పునర్దహన పక్షములో విరోధములేక పోవుటవల్లను అట్లు ప్రశ్నచేయ గూడదనిరి. "ఆశ్వలాయనస్యాప్యుక్తవచనేన" అనునది మొదలు "తస్యాపి లోష్టచయనం కర్తమేవ" అనువరకునుండు గ్రంథమువలన ఆశ్వలాయనులకును పూర్వవచనములచే జెప్పఁబడియుండుటచేతను పునర్దహనపక్షములో వికల్పముగా జెప్పఁబడుటచేతను లేక కామ్యముగాని వచనము జెప్పబడక పోయినను లోష్టచయనము జేయుటలో విరోధములేక పోవుటచేతను చయనము చేసినందునను అస్థులవిషయమై మఱియొక విధానముండుట చేతను అగ్నిచిత్తుకు చయనాంతము జేయవలయునని సాధారణముగా జెప్పియుండుటచేతను అగ్నిచిత్తునకు లోష్టచయనము జేయవలయును. ఇక నేమనగా, పునర్దహనమునందు వికల్పముగా చెప్పఁబడినది. "కృతిని వచన వికల్పే" అనునది మొదలు "స్పర్శనానిభవంతి" అనువరకునుండు గ్రంథ

ముచే పైతృమేధిక చయనమునందు కృతిని వపనము జేయవలయునని చెప్పి "సవైవాడిత్యస్య సకాశాత్" అనునది మొదలు "ఏవంవిదాంచకార" అనువరకునుండు గ్రంథముచే ఆదిత్యలోకము వాయులోకము ద్యులోకము మొదలగు లోకములయందు నాయాస్వరూపములతో నివసించునని నివపనము గుఱించి కౌషీతకీశ్రుతియు స్తుతించినది. ఈవిధానము నంతయు కౌషీతకిమునియును తెలిసికొని తనపుత్త్రులకు శిష్యులకు దెలుపగా వారును దెలిసికొని యావిధముగానే యాచరించిరని చెప్పఁబడినది. "గావోవా ఏతత్సత్రమాసత" అనునది మొదలు "జ్ఞాత్వాకుర్వంతీతి విజ్ఞాయతే అనువరకునుండు గ్రంథముచే అనేకవేల దివ్యసంవత్సరములు సుకృతలోకములందు నివసించుననియు నితర జన్మములయందు శ్రేయస్సు జ్ఞానము కలుగుననియు చెప్పఁబడియున్నందున లోష్టచయనము చేయవలయునని సిద్ధాంతము చేయబడినది.

లోష్టచయన ప్రయోగము

౨౨౧—తా. అగ్నిచిత్తు మృతుడైనయెడల లోష్టచయనము చేయవలయునని చెప్పియున్నది. కాఁబట్టి కాతకాగ్నిచిత్తుగాని మహాగ్నిచిత్తుగాని మృతుడైనయెడల పదియవదినము మొదలు బేసిదినములయందుగాని అహోరాత్రములు అర్ధమాసము మాసము ఋతువులు సంవత్సరములయందుగాని లోష్టచయనము చేయవలయును. పదియవ దినము మొదలు బేసిదినములని చెప్పుటచే పదకొండవ దినము మొదలు మూడవదినము అయిదవదినము ఏడవదినమునం దైనను లేక అర్ధమాసము మొదలగు కాలములయందైనను లోష్టచయనము జేయవలయును. దిష్టగమనమనఁగా మరణదినమనియు అది మొదలు బేసిదినములయందనియు కొందరు చెప్పిరి గాని యది సరియైనది కాదు. పదిదినములలో మఱియొక కర్మ జేయుట సంభవించవలసివచ్చినందునను పదిదినములలో దానప్రతిగ్రహములు ధర్మశాస్త్రములలో నిషేధింపబడుటవల్లను బ్రాహ్మణభోజనాదులును నిషేధింపబడినవి. అందువలన పదిదినములు గడచినపిమ్మట ఏకాదశదినమునందు బ్రాహ్మణులను భుజింపజేసి పండ్రెండవదినము తర్వాత దిష్టగమనమని కొందరు చెప్పిరి. ఆపక్షములో పదునాలుగవ దినము మొదలు మూడుగాని అయిదుగాని యేడుగాని దినములలోనైనను అర్ధమాసము మొదలగు కాలములయందైనను లోష్టచయనము చేయవలసియున్నది. దిష్టగమనము మొదలు పదియేనుదినముల తర్వాతను అర్ధమాసకాలమని

చెప్పఁబడును. ఎక్కడను మనుష్యులులేని ప్రదేశమునం దైనను దేశాంతర మందైనను మృతినొందినప్పుడు మృతదినమెప్పుడైనది తెలియఁబడదు. కాఁబట్టి వానియొక్క యిష్టానుసారముగా అర్ధమాసాది కాలములలో జేయవచ్చునని యున్నది. లేక తెలియనిపక్షములో మాఘము మొదలైన మాసములయందును జేయవచ్చునని కొందరు చెప్పుటచే మాఘాదిమాసములయొక్క అమావాస్య యొకానొకప్పుడు సంవత్సరానంతరము సంభవించుచున్నది. దిష్టగమనము పదియవదినమని చెప్పిన పక్షమునందు పదమూడవదినమునందు చయనము జేయవలయును గాన దానికి నొకదినము వ్యవధానముగాగల పదకొండవదినమునందు సంకల్పము చేయవలయును పదియేనవదినమునందు చయనము జేయునప్పుడు పదమూడవదినమునందును పదియేడవదినమునందు చయనము జేయునప్పుడు పదియేనవదినమునందును సంకల్పము చేయవలయును. పండ్రెండవదినము తర్వాత దిష్టగమనమని చెప్పెడి పక్షములో పదియాఱవదినమునందు చయనము జేయవలయును. అప్పుడు పదునాల్గవదినమునందును పదునెనిమిదవదినమునందు చయనము జేయునప్పుడు పదియాఱవ దినమునందును ఇరువదవదినమునందు చయనము జేయునప్పుడు పదునెనిమిదవ దినమునందు సంకల్పము చేయవలయును. ధూననము చేసినయెడల దానిననుసరించి దినోత్కర్ష చూచుకొనవలయును. ఇప్పుడు ధూననము చేయనిపక్షము ననుసరించి ప్రయోగము చెప్పఁబడుచున్నది. దిష్టగమనము పదియవదినమని చెప్పబడెడి పక్షములో పదమూడవదినము పదియేనవదినము పదియేడవ దినములందైనను లేక పండ్రెండవదినము తర్వాత యని చెప్పఁబబడిన పక్షములో పదునాల్గవ పదియారవ పదునెనిమిదవ దినములలో నైనను ప్రాతఃకాలంబున స్నానముజేసి పరిశుద్ధుడై యధ్వర్యుఁడు శ్మశానప్రదేశమునకువెళ్లి పాదప్రక్షాళనము జేసికొని ప్రాణాయామముజేసి దేశకాలాదులను కీర్తించి ప్రాచీనావీతము చేసికొని మృతుడైన యగ్నిచిత్తుకు లోష్టచయనము చేయుచున్నానని సంకల్పముచేసి మూలములో జెప్పఁబడిన విధానముగా ప్రయోగక్రియలను జేయవలయునని తాత్పర్యము.

ఇష్టకాచయనము.

౨౨౨—తా. దీనియొక్క ప్రయోగవిధానము మూలములో సక్రమముగ వ్రాయఁబడియున్నది. ఇట్టివిషయము విశేషించి వ్రాయుటకు నవసరములేదు. గ్రంథవిస్తరభీతిచే సంక్షేపించితిమి.

## అగ్నివిచ్ఛేద ప్రాయశ్చిత్తము.

౨౨౩—తా. ఆసక్తిలేక బ్రాహ్మణధర్మమునకు విహితమగు నగ్నిహోత్రములను రెండుమాసముల పర్యంతము జేయక విడిచిపెట్టినయెడల కృచ్ఛ్రప్రాయశ్చిత్త మాచరించవలయును. నాలుగవమాసముల పర్యంతము విడిచినయెడల అతికృచ్ఛ్రము ఆఱుమాసముల పర్యంతము పరాకము అటుపిమ్మట సంవత్సరపర్యంతము చాంద్రమాసము లేక క్షీరవ్రతము సంవత్సరము పూర్తియైనపిమ్మట ఒకమాసవ్రతము అని చెప్పబడినరీతిగా ప్రాయశ్చిత్తమును జేసికొనవలయును. ప్రమాదమువలన నగ్నిహోత్రములను జేయక విడిచినయెడల మూడుదినములకు లోపుగానైతే నూఱు పర్యాయములు ప్రాణాయామములును అటుపిమ్మట ఇరువదిదినముల పర్యంత మొకదిన ముపవాసము జేయుటయు నటుతర్వాత రెండుమాసములపర్యంత మైనయెడల మూడుదినము లుపవాసము అటుతర్వాత సంవత్సరపర్యంతము ప్రాజాపత్యము అనునట్టి ప్రాయశ్చిత్తములను జేయవలయును. సంవత్సరానంతరము అప్పుడు కాలానుసారముగా ప్రాయశ్చిత్తములను జేసికొనవలయును. ఆలస్యమువలన నగ్నిత్యాగము చేసినయెడల పండ్రెండుదినముల పర్యంతము మూడుదినము లుపవాసము పండ్రెండుదినముల పిమ్మట మాసమువఱకు పండ్రెండుదినము లుపవాసము మాసము పూర్తియైనపిమ్మట సంవత్సరపర్యంతము ఒకమాస ముపవాసము జేయుటలేక పాలుత్రాగుట సంవత్సరానంతరము రెండు సంవత్సరముల పర్యంతము చాంద్రాయణము రెండుసంవత్సరములపైన మూడుసంవత్సరములవరకు చాంద్రాయణము సోమాయనమును అటుపిమ్మట సంవత్సరము కృచ్ఛ్రము ప్రాయశ్చిత్తములనుగా జేసికొనవలయును. ధనవంతులగునేని గోదానమును కూడ చేయవలయును. ఈప్రకారము విశ్వాదర్శమునందు ప్రాయశ్చిత్తవిధి జెప్పంబడినది. ఇకను దక్షక్రతువులు చెప్పినదేమనగా, చేయుటకు శక్తిలేక అగ్నిత్యాగము జేసినయెడల రెండుమాసములపర్యంత మర్ధకృచ్ఛ్రము సంవత్సరపర్యంతము ప్రాజాపత్యము ప్రాయశ్చిత్తముగా జేసికొనవలయు ననిరి. జేయుటకు శక్తికలిగియుండి విడిచిపెట్టినయెడల మాసవ్రతము జేయవలయును. నాస్తిక్యబుద్ధిచేవిడిచినయెడల పండ్రెండు దినములపర్యంత మర్ధకృచ్ఛ్రము మాసపర్యంతము రెండు కృచ్ఛ్రములును సంవత్సరపర్యంతము మూడుకృచ్ఛ్రములును అటుపిమ్మట నొక్కొక్కసంవత్సరము పూర్తికాగానే సంవత్సరమునకు

పదునైదు కృచ్ఛ్రములచొప్పున ముప్పదియాఱు సంవత్సరముల పర్యంతము కృచ్ఛ్రప్రాయశ్చిత్తములను ఆటుపిమ్మట నెంత కాలము జీవించియున్నను ఆఱుసంవత్సరములు కృచ్ఛ్రప్రాయశ్చిత్తములను జేసికొనవలయును. అగ్ని నష్టమైనయెడల సంవత్సరపర్యంతము మూఁడుకృచ్ఛ్రములు చెప్పఁబడినవి. స్వాధ్యాయము జపమును జేయు స్వభావము గల వారలకు నొక్కకృచ్ఛ్రమే చెప్పఁబడినది. ఇది చాంద్రాయణ ప్రత్యామ్నాయముగ చెప్పఁబడినది. మఱియు నెన్నిసంవత్సరములు అగ్నిహోత్రములు లేకయుండునో అట్టిబ్రాహ్మణునకు అన్ని కృచ్ఛ్రప్రాయశ్చిత్తములను జేసికొనవలయు ననియు మొదటి సంవత్సరములో రెండుకృచ్ఛ్రములను జేసికొనవలయునని శౌనకుఁడు చెప్పెను. శ్రోత్రియుఁడగు బ్రాహ్మణునకు హోమద్రవ్యములను దానమివ్వవలయు ననెను. ఈప్రాయశ్చిత్తము విధుర విధవా విషయములో ఔపాసననిమిత్తము సంక్షేపముగా జెప్పఁబడిన విషయమని కొందరు చెప్పిరి.

—{ రజస్వలైన స్త్రీలకు సహగమనాధికారము సహగమనాధికార విషయములు. }—

౨౨౪—తా. పెనిమిటి మృతినొందినప్పుడు రజస్వలయగు భార్యకు సహగమనము జేయుటను గుఱించి స్మృతిసంగ్రహమునందు చెప్పఁబడినది యెట్లనగా. ఇద్దఱుముగ్గురు భార్యలుగలవాఁడు మృతినొందినప్పుడు వానిభార్యలుసహగమనేచ్ఛ గలవారలై యుండఁగ నొకభార్యరజస్వలయై యున్న యెడల నాశవమును తైలాదులచే సురక్షితముగానుంచి త్రిరాత్రానంతరము భార్యస్నానముజేసిన పిమ్మట దహనము చేయవలయును. పెనిమిటి మృతినొందిన దినము మొదలుకొనియే దశాహాశౌచము చెప్పఁబడినది. అస్థులతోఁడను అమంత్రకముగాను పూర్వదినమున మృతినొందిన శవముతోను బ్రాహ్మణస్త్రీకి అగ్నిప్రవేశము కూడదని మనువు చెప్పినట్లుగా యితరస్మృతులయందు జెప్పఁబడినది. కాఁబట్టి బలాత్కారముగాగాని యితరులు ప్రేరేపించుటచేతగాని మిక్కిలి కోపముచేతగాని రజస్వలయైనది గర్భిణికలదిగాని యగ్నిలో ప్రవేశించకూడదు, బ్రహ్మయొక్క ఆజ్ఞ ప్రకారముగా బ్రాహ్మణస్త్రీకి మృతుడగు పెనిమిటితో సహగమనము చేయకూడదనియు బ్రాహ్మణస్త్రీ మృతుడగు పెనిమిటితో సహగమనము చేసిన యెడల ఆత్మఘాతదోషముచే నైనను స్వర్గము నొందదు, పెనిమిటిని స్వర్గమును పొందింపదు. ఇది యితరవర్ణస్థుల స్త్రీలయొక్క ధర్మము. అనునట్టి

సహగమన నిషేధవాక్యములు భయపడిన స్త్రీలవిషయములుగా తెలిసి కొనవలయును. వేరు చితిని పలాశప్రతికృతి దహనమునందు నగ్నిప్రవేశము జేయకూడదని నిషేధవచనము లుండుటచే పతివ్రతలై నప్పటికిని స్త్రీలకు మృతుడగు పెనిమిటితో సహగమనము కూడదని కొందరనిరి. దాని ననుసరించియే వ్యావహారికులగు కొందరురాజులు సహగమనమును నివారించిరి. ఆసహగమనాచారము కులము కాలము దేశము మొదలగు వానివలన తెలిసికొనవలయును సహగమనాచారము కలిగిన ప్రదేశము నందే యాశాస్త్రము ప్రవర్తించుచున్నది. ధర్మమైన దగుటచే విరోధము లేదు. ఇహలోకమునందు సుఖాపేక్షకలిగిన స్త్రీల విషయమై సహగమన నిషేధము మంత్రములయందే చూపించబడినది. పాతివ్రత్యధర్మమును రక్షించుకొనవలయునని యపేక్షకలిగిన యెడల కాయక్లేశము ఇంద్రియ నిగ్రహము ఆహారనియమము మొదలగునవి విధవాధర్మములయందు చెప్పఁబడినవి. మరియు భర్తతోగూడ సమానధర్మము నాచరింపుచు పాతివ్రత్యధర్మముచే పతిలోకమును జెందవలయునని యపేక్షకలిగిన యెడల విశేషప్రతిబంధకము కలుగకుండెనేని సహగమనము చేయవచ్చును. లౌకికాగ్నియందు పృథక్చితియందు నగ్నిప్రవేశము జేసినను దుర్మరణము నొందినను అయిదు కృచ్ఛ్రములు ప్రాయశ్చిత్తముగా స్మృతిసంగ్రహమునందు జెప్పియుండుటచే బ్రాహ్మణధర్మము కానందున పృథక్చితి సమారోహణము క్షత్రియాది స్త్రీల విషయమని తెలిసికొనవలయును. రజస్వలైన స్త్రీ పెనిమిటితో సహగమనము జేయదలచిన యెడల శుద్ధి నిమిత్తము మూడు కృచ్ఛ్రములనుగాని చాంద్రాయణమునుగాని చేసి సహగమనము చేయవలయునని హస్తామలకుఁడు చెప్పెను. పెనిమిటి మృతినొందినప్పుడు భార్య రజస్వలై యుండగా సహగమనము జేయుటకు కోరికయున్నయెడల ఆశవమును నూనెలోగాని లవణములోగాని మూడుదినముల పర్యంతముంచి భార్యకుస్నానమైన పిమ్మట భార్యాభర్తల నిరువురను బంధువులు దహింపవలయునని యితరస్మృతులలోకలదు. ఉభయులకు చేయదగిన శ్రాద్ధము నొక్కదినమునందే చేయవలయును. దంపతులిరువురు ఏకచితి నధిష్ఠించి మృతినొందినప్పుడు ఏకోద్దిష్టము షోడశము పెనిమిటియొక్క పదకొండవ దినమునందే యాచరింపవలయునని గాలవుడు చెప్పెను. సహగమనము జేయుటకు నితర ప్రోత్సాహము లేకుండా తనకే కుతూహలము కలిగెనేని చేయవచ్చును. మఱియు శవము పూర్వదినమునందు మరణించిన

దగునేని పర్యుషిత మనుపించుకొనును. అట్టిశవముతో సహగమనము జేయుట పెద్దలయొక్క సమ్మతము కాదు. అందువలన పర్యుషితశవమునకు కృచ్ఛ్రప్రాయశ్చిత్తము చేయవలయునని యున్నది. కాబట్టి కృచ్ఛ్రము గాని చాంద్రాయణముగాని చేసినందువలన పర్యుషితదోషము నశించునుగాన పిమ్మట సహగమనము చేయవచ్చును. అను గమనము చేసినందుకు పరాశరుఁడు చెప్పిన ఫలమేమనగా. మూడుకోట్లుగాని యేబదిలక్షలుగాని మనుష్యునకు నెన్నిరోమములు కలవో అన్నిసంవత్సరముల పర్యంతము సహగమనము జేసిన స్త్రీస్వర్గలోకములో నివసించునని చెప్పెను. పెనిమిటితో సహగమనముచేసిన స్త్రీకి పెనిమిటితోనే సపిండీకరణము చేయవలయుననియు ప్రళయకాల పర్యంతము స్వర్గలోక నివాసము కలుగుననియు చెప్పఁబడెను. పుట్టలోనుండునట్టి సర్పమును పాములవాడు బలాత్కారముగా బయటికి తీసినట్లు సహగమనముచేసిన స్త్రీ సమస్తపాపములనుండి పెనిమిటిని తొలగించి పెనిమిటితోకూడ స్వర్గలోకములో సుఖించుచుండును. పెనిమిటితో సహగమనముచేసిన స్త్రీ స్వర్గలోకమందును పూర్వరూపమునే ధరించి యప్సరస్త్రీలచే కొనియాడబడుచు పదునాలుగు రింద్రులు ప్రవర్తించునంత కాలము పతిభక్తిరాలగుచు స్వర్గలోకములో పెనిమిటితో క్రీడించుచుండును. పెనిమిటి బ్రహ్మహత్యజేసినను కృతఘ్నుఁడైనను మిత్రద్రోహియైనను మృతినొందినప్పుడు భార్య సహగమనము చేసిన యెడల వాని పాపములనన్నియు దొలగించి ముక్తినొందించును. పెనిమిటితో సహగమనముచేసిన యాఁడుది పితృవంశము మాతృవంశము భర్తృవంశము ఈమూఁడువంశములను తరింపజేయునని హారీతుఁడు చెప్పెను. పెనిమిటి పీడింపఁబడుచుండగా తానుకష్టముల నొందవలయును. సంతోషము కలవాఁడుగా నుండు నప్పుడు తాను సంతోషముతో నుండవలయును. (భర్త) పరదేశము వెళ్లినప్పుడు అలంకార శూన్యముగా నుండవలెను. మృతినొందినప్పుడు సహగమనము చేయవలెను. ఇట్టిలక్షణములు కలదియే పతివ్రతయని వసిష్ఠుఁడు చెప్పెను.

అనుగమన విధానము.

౨౭౫—తా. అనుగమనము జేయునప్పుడు చేయవలసిన విధానమును నారదుఁడు చెప్పిన దేమనగా, స్నానముజేసినపిమ్మట శోభనాలంకారమును జేసికొనవలయును. నూతనవస్త్రములను కాటుకను గంధము పుష్పములు కుంకుమ పసుపు ధూపము మొదలగు వానిని ధరించుటయు

మంగళసూత్రమును పారాణిని ధరించుటయు తనశక్తిననుసరించి దానములను జేయుట సంతోషముతో కూడిన ముఖముగా నుండుట అనేక విధములైన మంగళవాద్యములు సంగీతము వినుట ఈమొదలగు సంతోషయుక్తము లైనవియు శుభకరము లైనవియు క్రియలను జేయవలయునని నారదమునీశ్వరుని వచనానుసారముగ స్నానాది కృత్యములను జేసి తాను మనోవాక్కాయములతో జేసినట్టి వ్యభిచారాది సమస్తదోషములును పోవుటకు సర్వప్రాయశ్చిత్తమును జేసికొని గ్రామమునకు వెలుపలగా నదీతీరమందుగాని తటాకాది తీరములయందుగాని దేవాలయమునందుగాని గౌరీపూజనైనను లక్ష్మీపూజనైనను చేసి గంధము పుష్పములు అక్షతలు తాంబూలము కాటుక, కుంకుమ, పసుపు, మొదలగునవియు ఫలములు హిరణ్యము శూర్పవాయనము, వస్త్రాలంకారములు, మొదలగునవియు సువాసినీ స్త్రీలకునిచ్చి, మఱియు భూదానము మొదలగు విశేషదానములు ఉత్క్రాంతి గోదానము తిలపాత్రదానము దశదానములు మొదలగునవి శక్తిననుసరించి యిచ్చి పుత్త్రులు మొదలగువారి నాశీర్వచనములచే సంతోషపెట్టి నాథ ర్తయొక్క సమస్తపాపములు నశించుటకును నరకము నొందకుండుటను అనేక స్వర్గలోకాది సౌఖ్యములనొంది మోక్షము జెందుటకును సమస్తశ్రుతులు స్మృతులు పురాణములు ఇతిహాసములు మొదలగువానియందు చెప్పఁబడిన సమస్త సంపూర్ణఫలములను జెందుటకును అనుగమనమును చేయుచున్నానని సంకల్పముజేసి చితికి మూడుపర్యాయములు ప్రదక్షిణముజేసి పెనిమిటిని విష్ణుమూర్తి స్వరూపునిగా దలచుచుండవలెను. అటుపిమ్మట పుత్త్రులు మొదలగువారు "ఇయంనారీ" అను మంత్రముతో నామెను చితియందు పెనిమిటికి నభిముఖముగా పరుండబెట్టి భార్యయొక్క కుడిచెవియందు "ఆయుషః ప్రాణగ్ంసంతను" అనుమంత్రమును చెప్పవలయును. లేక భార్యయే తనంతటనే తాను సంవేశనాదులను జేయుననెడి యొకపక్షముకలదు. తిరిగి లేచివచ్చుట లేదు. కాబట్టి "ఉదీర్ష్వనారీ" అనుమంత్రమును చెప్పనక్కరలేదు. అనంతరము వరదానము హస్తసమ్మార్జన హిరణ్యశకల నిక్షేపాది క్రియలను జేయవలయును. లేక ముందుగానే పెనిమిటి దహింపబడినయెడల "మైనమగ్నిం" అని పూర్వమువలెనే సంకల్పముజేసి పెనిమిటికి ప్రదక్షిణ నమస్కారములనుజేసి యగ్నిలో ప్రవేశించవలయును. అదృష్టఫలము కాబట్టి యీపక్షములోని పాతనోత్థాపనను లున్నవి. ఉదకదానము మొదలు దశా

హోంత క్రియలన్నియు పూర్వముువలెనే చేయవలయును. (౧౧) పదునొ కండవదినమునందు నవశ్రాద్ధాదులును, పిమ్మట షోడశశ్రాద్ధమును వేరు వేరుపాకములతో వేరువేరుగా ముందు తండ్రికిజేసి పిమ్మట తల్లికి జేయు చుండవలెను. పండ్రెండవదినమునందు సపిండీకరణమును జేయవలయును. పెనిమిటితో సహగమనముచేసినప్పుడు భర్తృవర్గముతోనే సపిండీకరణ మును జేయవలయును. ఈయర్థమునే "దహ్యమానంతు భర్తారం... మాతుస్సపిండనం" అనుగ్రంథముచే జెప్పఁబడియున్నది. అనుమరణము నందు భర్తతోగూడ సాపిండ్యనిధికృతము. సంతానములేనియెడల భర్త తోనే సాపిండ్యముతప్పక చేయవలయును. సంతానముకలిగినస్త్రీ సహ గమనము చేసినయెడల భర్తతోగాని అత్తతోగాని సాపిండ్యము జేయ వలయునని రెండుపక్షములు కలవు. పెనిమిటితోనే కలిపి సపిండీకరణ మును జేయునప్పుడు ఉభయులకు నొక్కపిండమునే యుంచి యాపిండ మును మూడుశకలములనుజేసి పితామహాది పిండములతో కలుపవల యును. కాఁబట్టి దానిననుసరించిన ప్రయోగవిధాన మూహించుకొనవల యును. ఈప్రకారముగ అనుగమనవిధానము చెప్పబడెను.

తిరిగి సపిండీకరణముచేయు విషయము.

౨౨౬—తా. తల్లిదండ్రుల సపిండీకరణమును కుమారుడే చేయ వలయును. పుత్త్రులులేని యెడల సోదరుడుగాని వాని కుమారుఁడుగాని సపిండుడుగాని శిష్యుడుగాని సపిండీకరణమును చేయవలయును. వారును లేనప్పుడు మృతినొందినవాని భార్యయైనను మంత్రరహితముగా చేయ వలయును. కాఁబట్టి సపిండీకరణ శ్రాద్ధమును పుత్రులున్నయెడల కుమా రుడే చేయవలయును. ముఖ్యపుత్త్రునకు నెందువల్లనైన యాటంకము కలి గెనేని దహనాది దశాహాంత క్రియలను మాత్రము గౌణపుత్రుడైనను చేయవచ్చును. శుభము సంభవించినప్పుడు వృద్ధిశ్రాద్ధమును అన్నగాని తమ్ముడుగాని సపిండుడుగాని సోదరుఁడుగాని శిష్యుడుగాని ధనమును తీసికొనినవాడుగాని సపిండీకరణమునుజేసి పిమ్మట వృద్ధిశ్రాద్ధమును జేయ వలయునని గౌతముఁడు చెప్పెను. శుభకార్యము సంభవించినప్పుడు కుమా రుఁడు సపిండీకరణమునుజేసి వృద్ధిశ్రాద్ధమును జేయకుండెనేని పితరులతో గూడ ఘోరనరకమునందు నివసించును. మఱియు సపిండీకరణమును జేయక వృద్ధిశ్రాద్ధమును మాత్రముజేసిన యెడల ఆయాతయామ మను మరణమునొందును. అని యీప్రకారముగా వృద్ధిశ్రాద్ధమును గురించి

విశేషముగా జెప్పఁబడినందున పూర్వము సోదరుఁడు సపిండుఁడు శిష్యుఁడు మొదలగువారిచే సపిండీకరణము జేయఁబడినను కుమారుఁడు తిరిగిచేసి కొనవలయును. తనతండ్రియొక్క సపిండీకరణము బంధువులచేత జేయబడి ప్రేతత్వమువలన విముక్తి కలిగినను కుమారుఁడు తిరిగి చేయవలయుననియు సాపిండ్యము వ్యుత్క్రమముగా జేయబడినను (అనగా ముఖ్య కర్తచేచేయఁబడక పోయినను) మఱియొకరిని తానే నియమించి చేయించినను అదిక్రమ సాపిండ్యమనబడదు. కాఁబట్టి క్రమప్రాప్తికొఱకు కుమారుఁడు తిరిగి రెండవపర్యాయము సపిండీకరణమును స్వయముగా జేయవలయుననియు ఆపస్తంబుడు చెప్పెను. కుమారుఁడు దేశాంతరమందుండగా నింటివద్ద తండ్రిమృతినొందిన వార్తతెలిసిన యెడల ఆదినమునందే వపనమును జేయించుకొని పదిదినముల పర్యంతము తిలోదకాదులను విడుచుచు విన్నదినమునందు భోజన మైథునాదులను విసర్జించి పదునొకండవదినమునందు సపిండీకరణమును జేయవలయునని యముఁడు చెప్పెను. గాని యిది పెద్దకుమారుని విషయము. దేశాంతరమందు పెద్దకుమారుడుండగా చిన్నకుమారునిచే సపిండీకరణము పర్యంతను జేయఁబడినను సపిండీకరణ శ్రాద్ధమును పూర్వమువలెనే పెద్దకుమారుఁడు తిరిగి చేయవలయునని గౌతముడు చెప్పెను. చిన్నకుమారునిచే శ్రాద్ధక్రియలు సమస్తము చేయఁబడినను సపిండీకరణ శ్రాద్ధమును మాత్రము పెద్దకుమారుఁడు తిరిగి చేయవలయును. అప్పుడు ప్రేతశబ్దమును చెప్పకూడదు. పెద్దకుమారుడుండగా సమస్తక్రియలు చిన్నకుమారునిచే జేయఁబడినను ప్రేతస్వరూపము నశించదు పితృలోక నివాసము కలుగదు. ఏకోద్దిష్టాంతముచేసి పిండోదక ప్రదానములను నిర్వర్తించి పుణ్యాహవాచనాదులను జేసికొని పూర్వము సంస్కారము జేసినవాడు శుద్ధినొందవలయునని వృద్ధవసిష్ఠుఁడు చెప్పెను. నగ్నప్రచ్ఛాదనము నవశ్రాద్ధము పిండప్రదానము వృషోత్సర్గము ఇవి యితరులచే జేయఁబడినప్పుడు పెద్దకుమారుఁడు తిరిగి చేయనక్కరలేదని శాతాతపుడు చెప్పెను. ఈవచనములు షోడశశ్రాద్ధ సహితముగా సపిండీకరణమును పెద్దకుమారుఁడు తిరిగి చేసికొనవలయునని చెప్పునట్టి వచనములు, పెద్దకుమారుఁడుగాని కనిష్ఠులుగాని సపిండీకరణము నందరు చేయవచ్చును. పెద్దకుమారుఁడుగాని చిన్నకుమారుఁడుగాని తల్లిదండ్రుల మరణవార్తను వినినతోడనే వపనము జేయించుకొని సచేలస్నానముచేసి పదిదినముల పర్యంతము తిలోదకాదులను విడుచుచుండ వల

యుననియు తాను బ్రహ్మచారియైనను సపిండీకరణము పూర్వమితరుల చేతను జేయఁబడినయెడల తాను స్వయముగా జేయవలయుననియు వృద్ధ శాతాతపుడు చెప్పెను, తల్లిదండ్రుల సపిండీకరణము చిన్నకుమారునిచే జేయబడినను పెద్దకుమారుఁడు ముఖ్యకర్తయగుటచే తిరిగి చేయవలయు నని హారీతుడు చెప్పెను. చిన్నకుమారునిచే సపిండీకరణ శ్రాద్ధముచేయ బడి పిండసంయోజనము చేయబడినను పెద్దకుమారునిచే జేయబడనందున తిరిగి చేయవలయును. పెద్దకుమారునిచే జేయబడినశ్రాద్ధక్రియలు కనిష్ఠులు తిరిగి చేయనక్కరలేదని దక్షుడుచెప్పెను. విభక్తుడైనను విభక్తుఁడు కాకుం డినను చిన్నకుమారుడైనను సపిండీకరణమును జేయవచ్చును. అది పెద్ద కుమారుఁడు తిరిగి చేయవలయును. పుత్త్రులు దేశాంతరమందుండగా జ్ఞాతులచేగాని బంధువులచేగాని సపిండీకరణాంతము జేయఁబడిన పిమ్మట తల్లిదండ్రుల మరణవార్త తెలిసినప్పుడు వపనము జేయించుకొని సచేల స్నానముజేసి పదిదినముల పర్యంతము తిలోదకాదులను విడుచుచు నుప వాసము జితేంద్రియులై (౧౧) పదకొండవ దినమునందు సపిండీకరణము జేయవలయును. పండ్రెండవదినమునందు జేయవలయునని శాతాతపుడు చెప్పెను. కాఁబట్టి పదకొండవ దినమునందుగాని పండ్రెండవదినమునందు గాని చేయవచ్చునని పక్షాంతరముకలదు. చిన్నకుమారు డితరదేశమం దుండగా పదిదినములు గడచినపిమ్మట మరణవార్త తెలిసినప్పుడు పార్వణ శ్రాద్ధమును జేయవలయునని విద్యారణ్య కృతపిత్ర్యమను గ్రంథమునం దున్నది. ఇట్లు చెప్పుటచే తిలోదకాదులను కూడ గ్రహించవలయును. సపిండీకరణము జేయక పూర్వము పెద్దకుమారుఁడు రానియెడల పదిదిన ముల పర్యంతము తిలోదకాదులను పెద్దవాడు తిరిగి విడువవలయునని స్మృతిసంగ్రహమునందు కలదు. ఇతరులచే శ్రాద్ధాదిక్రియలు చేయఁబడి నను కుమాళ్లు తిరిగి దశాహాశౌచముపట్టి తిలోదకాదులను విడుచుచు సపిండీకరణమును తిరిగి చేసికొనవలయునని యున్నది. కుమాళ్లు దేశాం తరమందుండగా తల్లిదండ్రులు గతించినప్పుడు యావత్క్రియ లితరులచే జేయఁబడియుండగా మరణవార్తను విన్నపిమ్మట దహనమును విడిచి మిగి లిన సమస్తక్రియలను పెద్దకుమారుడు చేసికొనవలయును చిన్నకుమాళ్లు సపిండీకరణము మాత్రము జేసికొనవలయును. పూర్వము సపిండీకరణము జేయఁబడి తిరిగి చేయునప్పుడు పార్వణశ్రాద్ధ విధానముగా చేయవలయు ను. అప్పుడు సపిండీకరణ శ్రాద్ధమును చేయుచున్నానని సంకల్పముచేసి

"ఉపతిష్టతు" అని చెప్పవలసిన సమయమునందు స్వధాశబ్దమును జెప్పవలయును. పార్వణశ్రాద్ధ విధానముగా జేయునప్పుడు తండ్రిని గుఱించి యేకదేవతా వాహానము జేసి అర్ఘ్యసంయోజనము పిండసంయోజనము చేయవలయును. ప్రేతత్వమువలన విడువబడినందున తిరిగి ప్రేతశబ్దమును జెప్పకూడదు. ప్రేతశబ్దమును విడిచిపెట్టి సమస్తము జేయవలయును. అని గౌతముడు చెప్పెను. ఇక్కడ కొంచెము విశేషముకలదు. కనిష్ఠునిచేత సపిండీకరణము జేయబడిన పిమ్మట పెద్దవాడు చేయునప్పుడు ప్రేతశబ్దమును విడిచిపెట్టి సపిండీకరణమును జేయవలయును. మఱియు సపిండీకరణము జేయఁబడిన వానిని గురించి తిరిగి ప్రేతశబ్దముజెప్పి చేసిన విధానము శాస్త్రవిరుద్ధమగును పితృహత్యచేసిన వాడగును. కాఁబట్టి ప్రేతశబ్దమును విడిచిపెట్టి పునస్సపిండీకరణమును చేయవలయును. కర్మప్రదీపికలో కాత్యాయనుడు చెప్పిన విశేషమే మనగా, సపిండీకరణము జేయఁబడిన పిమ్మట తల్లిదండ్రుల మరణవార్తనువిన్న కుమారుఁడు పదిదినముల పర్యంతము మృతినొందినవాని నామముతో తిలోదకముల విడుచుచుండవలయును. అప్పుడు శ్రాద్ధాదులను జేయుటకు సంభవము కానియెడల మరియొకప్పుడైనను యథావిధిగా చేసికొనవలయును. అప్పుడు త్రిరాత్రాశౌచముఃట్టి పెద్దవాడు సపిండీకరణమును జేయవలయును. కనిష్ఠులు విభక్తులైన యెడల దరిద్రులై నప్పటికి చేయవలయును. సంవత్సరానంతరమందైన యెడల ఒక్కదిన మాశౌచముపట్టి చేయవలయును. దేశాంతరమందున్న కుమారుడు తల్లిదండ్రులకు దాహాదిసమస్తక్రియలు జేయబడిన పిమ్మట తెలిసిన పిమ్మట కుమారుఁడు సపిండీకరణమును మాత్రము జేయవలయుననియు షోడశము చేయనక్కర లేదనియును మఱికొందరి యభిప్రాయమై యున్నదని తాత్పర్యము.

ఆసురాదివివాహామువలన బుట్టినవాని కర్తృత్వవిషయము.

౨౨౭—తా. ఆసురాదివివాహామువలన బుట్టినవాడును కుమార్తెయొక్క కుమారుడును సపిండీకరణమును జేయునప్పుడు మాతామహానితో గలిపి చేయవలయును. బ్రాహ్మ్యము మొదలగు వివాహామువలన పుట్టినవాడు తండ్రితోగాని మాతామహానితోగాని కలిపి జేయవలయును. పితామహి మొదలగువారితో నైనను కలిపి చేయవచ్చునని వికల్పముకలదు. ఇట్టివిషయములో వారివారి కులాచారప్రకారనుగా సపిండీకరణమును చేయవలయును. తమయొక్కయాచారము నిర్ధారణగా

లేనప్పుడు తనమనస్సునకు నిష్టమైనరీతిని చేయవలయును. వ్యుత్క్రమ మరణమునందు సపిండీకరణమును జేయవచ్చునని కొందరును చేయనక్కర లేదని కొందరును చెప్పిరి. తల్లియొక్క సపిండీకరణమును పితామహీ మొదలగువారితో జేసి తిరిగి తండ్రితో గలిపి చేయవలయునని కొందరనిరి. పునస్సపిండీకరణమునందు స్త్రీలవిషయమై విశేషముకలదు. తల్లి యొక్క సపిండీకరణమును కుమాళ్లు చేయవలయును. సంతానముగలస్త్రీ యొక్క సపిండీకరణమును పితామహీ మొదలగువారితో గలిపి చేయవల యును. సంతానములేని స్త్రీయొక్కపిండమును యామెభర్తతో గలిపి చేయవలయు ననియు వ్యాసుడు చెప్పెను. మఱియు పెనిమిటి మరణించిన భార్య మరణించినయెడల నామె యొక్కపిండమును పెనిమిటియొక్క పిండముతోనే కలిపి చేయవలయు ననియు పెనిమిటి జీవించియుండగా భార్య మృతినొందినప్పుడు అత్తలు మొదలగువారితోగలిపి చేయవలయు ననియు నితర స్మృతులయందుకలదు. పెనిమిటి జీవించియుండగా స్త్రీల యొక్క పిండములను స్త్రీలతోనేకలిపి చేయవలయు ననియు పెనిమిటి మృతినొందినపిమ్మట భార్యయొక్కపిండమును పెనిమిటియొక్క పిండము తోకలిపిచేయవలయు ననెడునిర్ణయమువలన స్త్రీలపిండములను స్త్రీలతోనే కలిపి చేయవలయునని యంతటను విహితమై యున్నది. ఆలాగైనప్పటికి సంతానము లేనిస్త్రీ పెనిమిటికంటే ముందుగా మరణించినప్పుడు పెనిమిటిచే జేయబడును. కాబట్టి తనతల్లి మొదలగువారితో గలిపి చేయవలయు ననియు అట్టిసంతానరహితురాలైనస్త్రీ పెనిమిటి మరణించిన పిమ్మట మృతి నొందినయెడల ఆమెభర్తతో గలిపి చేయవలయు ననియు చెప్పబడినది. ఈప్రకారముగానే పైఠీనసియు యముడును చెప్పుచు సంతానము లేనిస్త్రీ మృతినొందినను మంత్రములు ఆహుతులు వ్రతములు మొదలగువానిచే పెనిమిటితోనే యైక్యమునొందునని చెప్పిరి. బ్రాహ్మణాదిహతులకు పతితు లకు ప్రాయశ్చిత్తమును జేసినయెడల జేయవచ్చుననియు బ్రహ్మచారులకు సంతానములేనివారలకు సపిండీకరణము లేదనియు చెప్పిరి. బ్రాహ్మణాది హతులైనను పతితులు సర్వసంగపరిత్యాగులుమృతినొందినను "వ్యుత్క్రమ మరణము నొందినను పూర్వము ఎవరికి నివ్వబడుచున్నదో వారికే నివ్వ వలయునని కాత్యాయనుడు చెప్పెను." కాబట్టి వ్యుత్క్రమ మరణము నొందినవారినివిడిచి వారికి వ్యవహితులతో గలిపి సపిండీకరణమును జేయ వలయును. ఎందువల్లననగా, వ్యుత్క్రమమరణము గలవారలకు సపిండీకర

ణము ఏకోద్దిష్టమును లేదని చెప్పఁబడినది.

## యతీశ్వరుల విషయము.

౨౨౮—తా. యతీశ్వరులకు త్రిదండగ్రహణము కలిగియున్నందున వారికి ప్రేతత్వము లేదని చెప్పియుండుటచే పుత్త్రులు మొదలగువారు యతీశ్వరులకు సపిండీకరణము చేయనక్కరలేదు. యతీశ్వరులకెప్పుడు నేకోద్దిష్టము చేయఁగూడదనియు నేకాదశదినమునందు పార్వణవిధానమునే చేయవలయునని యున్నది. కాఁబట్టి ప్రేతత్వము లేనందున సపిండీకరణము లేదని మరియొకరు చెప్పిరి. ఇట్లు బహుమందిచే చెప్పఁబడుటచేతను దీనికి వ్యతిరేకప్రమాణములు లేకపోవుటచేతను అందరు యతీశ్వరులకు సపిండీకరణమును జేయనక్కరలేదని మఱికొందరనిరి. తండ్రి కుమారునకు జ్యేష్ఠుఁడు కనిష్ఠునకు సపిండీకరణమును జేయవచ్చును. అయితే తండ్రి కుమారునకు తమ్మునకు నన్నయు శ్రాద్ధమును చేయకూడదు లేక స్నేహముచే చేసినయెడల సపిండీకరణమును విడిచి చేయవలెనని నిషేధశాస్త్రము కలిగియుండగా నెట్లు చేయనగునని శంకకలిగెనేని శాస్త్రమునందు చెప్పఁబడినట్టి కర్తృత్వముకలవారెవరును లేనప్పుడు తండ్రిగాని యన్నగాని సపిండీకరణము చేయవచ్చునని యున్నది. ఈప్రకారముగానే చిన్నవానిని గుఱించి పెద్దవాఁడు కర్తయగునని నిశ్చయించుకొని చేయవలయును. నవశ్రాద్ధము షోడశశ్రాద్ధము సపిండీకరణము తల్లిదండ్రులకు జేయునప్పుడు పుత్త్రులనేకులుండి విభాగము కలవారైనను ఒక్కపెద్దకుమారుని చేతనే చేయించవలయునని విజ్ఞానేశ్వరుని వచనప్రమాణముకలదు. కాఁబట్టి ప్రేతశ్రాద్ధసహితముగ సాపిండ్యమును విభక్తులైనను పెద్దకుమారుఁడొక్కఁడే చేయవలయునని కొందరనిరి. ఈవచనము ధనములేనివారివిషయమని మరికొందరనిరి.

## కర్తృనిరూపణము.

౨౨౯—తా. దహనాదికర్మలయందు కర్తను నిరూపించుచున్నాఁడు. తల్లిదండ్రులకు ఔరసపుత్త్రుఁడు దహనాదికర్మలను శాస్త్రప్రకారము యథావిధిగా జరుపవలయును. పుత్రుఁడు లేనప్పుడు పౌత్రుఁడు, ప్రపౌత్రుఁడు, కుమార్తెయొక్క కుమారుఁడు, దౌహిత్రుఁడు, ధనమును తీసికొనినవాఁడు, సోదరుఁడు, వానికుమారుఁడు, తండ్రి, తల్లి, కోడలు, తోబుట్టువ, మేనల్లుఁడు, సపిండుఁడు, మేనమామ, సమానోదకుఁడు, స్త్రీ, శిష్యుఁడు, ఋత్విక్కు, ఆచార్యుఁడు, అల్లుఁడు, కుమార్తె, వీరెవరును బంధువులు లేనప్పుడు ప్రభువు

ఎవరిచేతనైనను జేయించవలయునని యున్నది. కాఁబట్టి ముందుముందుగా జెప్పఁబడిన వారులేనప్పుడు తర్వాత చెప్పబడినవారు కర్తలగుదురు. మరి యొకప్రకారముకలదు. కుమారుడు, పౌత్త్రుడు, వానికుమారుడు, దత్తుడు, క్షేత్రజుడు మొదలగుపుత్రులు, భార్య, సోదరుడు, సోదరునికుమారుడు, సవతిసోదరుడు, తండ్రి, తండ్రిసహోదరుడు, వానికుమారుడు, తండ్రికి భిన్నసహోదరుడు, పితామహుఁడు, సోదరులగు అక్కగాని చెలియలుగాని, వారిసుతులుగాని, ఈచెప్పఁబడినవారు సపిండీకరణకర్తలు. ఈవిధముగ పూర్వాభావమునందు తర్వాతవాడు కర్తయగుటవలన సగోత్రుడుగాని అసగోత్రుడుగాని ప్రేతకర్మను జేయవలయునని యున్నది. కాఁబట్టి దహనాది సమస్తక్రియల నెవరైనను చేయవచ్చును.

## విశ్వేదేవతలు.

౨౩౦—తా. విశ్వేదేవులను గురించి భారతమునందు జెప్పఁబడిన దేమనగా, ఇంద్రునకు మిక్కిలి తపస్సంపన్నురాలైన విశ్వయను పెద్ద కూతురు కలదు. ఆమెకు మహానుభావులగు పదముగ్గురు పుత్రులుకలరు. వారు విశ్వేదేవులని చెప్పఁబడుదురు. వారిలో కాలకాములను పేరు గలవారు సపిండీకరణమునందును నైమిత్తికశ్రాద్ధమునందు కామ్యశ్రాద్ధము నందు ధూర్విలోచనులును, అష్టకాన్వష్టకాది శ్రాద్ధములయందు దివిదేవులును, నాందీశ్రాద్ధమునందు సత్యవసువులను వారును, పార్వణశ్రాద్ధము నందు పురూరవమార్ద్రి వసువులనువారును, యజ్ఞమునందు దక్షక్రతువులనువారును, సదస్యమునందు సంజ్ఞకుడును అనుపేరుగల పదముగ్గురును, ఆయాశ్రాద్ధములందు పూజింపఁబడుదురు. తండ్రి మరణాశౌచము సంవత్సరమనియు తల్లియొక్క ఆశౌచ మూరుమాసములనియు భార్యయొక్క ఆశౌచము రెండుమాసములనియు సోదరునియొక్కయు కుమారునియొక్క ఆశౌచము ఒక్కమాసమనియు చెప్పఁబడినది. కాఁబట్టి అంతపర్యంతము శుద్ధికలుగదు.

## వ్యుత్క్రమమరణమునందు సపిండీకరణము జేయుక్రమము.

౨౩౧—తా. వ్యుత్క్రమ మరణము నొందినవారికి సపిండీకరణమును జేయవలయును గాన వారినిగురించి తల్లిగాని తండ్రిగాని భర్తగాని చేయవలయునని స్కందపురాణమునందు కలదు. తండ్రి మరణించినప్పుడు వానికి పిండమునిచ్చి పితామహుడు తర్వాతను ఇద్దరుకు నివ్వవలయునని విష్ణువు చెప్పెను. తండ్రి మృతినొందినయెడల సందరుకు నివ్వవలయును.

బ్రాహ్మణుడు తనతండ్రియొక్క శ్రాద్ధమునందు తండ్రిని నిర్దేశించ వలయును. పితామహుడు జీవించియుండగా తండ్రి మృతినొందిన యెడల తండ్రిపేరు చెప్పినపిమ్మట ప్రపితామహునిపేరు చెప్పవలయును. అట్లుచెప్పుటచే పితామహుడును ఆశ్రాద్ధమునందు భుజించినవాడేయగునని మనువు చెప్పెను. తండ్రి మృతినొందినప్పుడు పితామహుడు జీవించియుండెనేని ప్రపితామహ పూర్వకముగా మూడుపిండముల నుంచవలయును. పితృపిండము పూర్వమువలెనే యుంచవలయునని బ్రహ్మాండపురాణమునందు కలదు. తల్లి మృతినొందినప్పుడు పితామహి జీవించియుండగా ప్రపితామహి పూర్వకముగా జేయవలయును. తండ్రి జీవించియుండగా పితామహితో గూడ తల్లియొక్క సపిండీకరణమును జేయవలయును. తండ్రి మృతినొందినను పితామహితోనే కలిపి చేయవలయును. పెనిమిటి జీవించియుండగా స్త్రీలయొక్కపిండములను స్త్రీలతో కలపవలయు ననియు పెనిమిటి మృతినొందినయెడల స్త్రీపిండమును భర్తృపిండముతో కలుపవలయు ననియు నంతట నీప్రకారము నిర్ణయింపఁబడినది. కాఁబట్టి భర్తృవర్గముతో చేర్చి చెప్పనలయును. సంతానములేని స్త్రీయొక్కపిండమును పితృపిండముతో జేర్చవలయును. పెనిమిటి జీవించియుండునప్పుడు స్త్రీపిండము నత్త మొదలగువారి పిండములతో జేర్చవలయును. సంతానములేనిస్త్రీ మృతినొందినప్పుడు పెనిమిటియే చేయవలయును. కాఁబట్టి తనతల్లి మొదలగువారితో జేర్చి చేయవలయును. సంతానములేనిస్త్రీ పిండమును పెనిమిటియులేనప్పుడు భర్తృపిండముతోనే చేర్చవలయును. సంతానముకలిగిన స్త్రీపిండమును పితామహి మొదలగువారితో చేర్చవలయును. తల్లియొక్క సపిండీకరణము తండ్రితోనే చేర్చవలయును. అసపిండత్వము నొందదు. నాల్గవ వర్గమును విడువవలయును. భార్యకు పెనిమిటితోనే సపిండీకరణము చేయవలయు ననియు ఆమె మృతినొందినను మంత్రాహుతి వ్రతము మొదలగువానిచే పెనిమిటితో నైక్యము నొందుననియు యముఁడు చెప్పెను. పెనిమిటి మృతినొందినప్పుడు అనుగమనముజేసి మృతినొందినయాడుదిప్రళయకాలపర్యంతము స్వర్గలోకనివాసమునకుతగినదనిశాతాతపుడుచెప్పెను. ఇది సహగమననియమము. పదకొండవదినమునందు షోడశశ్రాద్ధముల నపకృష్యముచేసి పెట్టి పండ్రెండవదినమునందు సపిండీకరణమును జేసినయెడల ఆద్యమాసికమును విడిచి మిగిలిన పదియేనుమాసికములను ఆయాయా కాలములయందు కుమారుఁడు తల్లిదండ్రులకు తిరిగి పార్వణవిధానముగ

చేయుచుండవలయును. సోదరులు మొదలగువారివిషయము పార్వణ విధాన మక్కరలేదు. సంవత్సరమునకు లోపుగా సపిండీకరణము జేయ బడినవాని గురించియు సంవత్సరపర్యంతము మాసికము నుదకుంభశ్రాద్ధ మును చేయుచునే యుండవలయును. ఆద్యమాసికము త్రైపక్షికము ఊనషాణ్మాసికమును విడిచి మిగిలినవన్నియు నాయాకాలములయందు యథావిధిగా జేయవలయును. ఇందునిగురించిన వచనములు మాసిక ప్రకరణమునందు పూర్వము చెప్పఁబడినవి.

తిరిగి క్రమసాపిండ్యము.

౨౩౨—తా. పూర్వము చెప్పిన ప్రకారముగ పితామహుం డుం డగా తండ్రిమృతినొందెనేని వ్యుత్క్రమముగ తండ్రికి సపిండీకరణమును జేసిన పిమ్మట పితామహుండు మరణించినయెడల వానియొక్క కర్మను జేయునప్పుడు వానికి సపిండనము జేసినపిమ్మట తనతండ్రికి పూర్వము వ్యు త్క్రమ సపిండీకరణము జేయబడియున్నది. కాబట్టి యిప్పుడు తిరిగి క్రమ సపిండీకరణమును తండ్రికి క్రమసాపిండ్యము సిద్ధించు నిమిత్తము తండ్రి యొక్క శ్రాద్ధదినమునకు పూర్వదినమునందు జేయవలయును. ప్రేతశబ్ద మును విడిచిపెట్టవలయును. ఇట్లు క్రమసాపిండ్యము సిద్ధించిన పిమ్మట పితృపితామహ ప్రపితామహ త్రయోద్దేశ్యముగ వర్గత్రయమును జెప్పి తండ్రికి ప్రత్యాబ్దికము నాచరించుచుండ వలయును. వ్యుత్క్రమముగ పూర్వము సపిండీకరణము జేయఁబడి తిరిగి క్రమముగా సపిండీకరణము జేయునప్పుడు ప్రేతశబ్దమును విడువవలయుననియు పితామహుండు జీవించి యుండగా తండ్రిమృతినొందినప్పుడు వ్యుత్క్రమముగ సపిండీకరణమును జేయవలయునని యున్నది. కాబట్టి వసురుద్రరూపములు రెండును పితా మహునికే చెందియున్నవనియు అందువలన పితామహుని మరణానంతర ము తండ్రికి క్రమసాపిండ్యమును చేసిన యెడల తండ్రికి వసురూపము పితామహునకు రుద్రరూపము ప్రపితామహునకు ఆదిత్యరూపము సిద్ధిం చుచున్నదనియు శాతాతపుడు చెప్పెను. అప్పుడు పితామహునకు చెంది యున్న వసురూపము పితృనకు సంక్రమించి రుద్రరూపమే పితామహుని యందుండును ఇదియే క్రమసాపిండ్యము.

దాని ప్రయోగము.

౨౩౩—తా. సంకల్పము జేసి తండ్రియొక్క గోత్రనామములను చెప్పి పూర్వము వ్యుత్క్రమముగ సపిండీకరణము చేయఁబడినది కాఁబట్టి

పితామహ మరణానంతరము వసురూపము నొందియున్న తనతండ్రిని గుఱించి వసురుద్రాదిత్య స్వరూపులగు తాత మొదలగు వర్గత్రయము తో గలిపి తిరిగి క్రమసాపిండ్యమును జేయవలయును. కాలకాములను విశ్వేదేవులను విష్ణువును నర్చించవలయును. అర్ఘ్యసంయోజనమును పిండ సంయోజనమును జేయవలయును. ప్రేతశబ్దమును చెప్పగూడదు. తండ్రిని గుఱించి యేకోద్దిష్టవిధానముగా జెప్పవలయును. మిగిలినదంతయు పూర్వ మువలెనే చేయవలయును. మరియు దీనివిషయమై మరికొందరు చెప్పిరది యేమనగా, తిరిగి తండ్రికి క్రమసాపిండ్యము జేయునపుడు ఏకోద్దిష్ట విధా నముగా జేయవలసియుండగా ప్రేతశబ్దమును జెప్పకుండా సిద్ధించదు. పూర్వము సపిండీకరణము జేయఁబడినందువలన ప్రేతస్వరూపము నశించు టచే ప్రేతశబ్దము లేదు. కాఁబట్టి యేకోద్దిష్టవిధియును జేయ నుచితము కాదు ఇట్లు పరస్పరవిరుద్ధముగా నున్నందున ప్రేతస్వరూపము లేనప్పటి కిని ప్రేతస్థానమందున్న తండ్రిని గుఱించి యేకోద్దిష్టవిధానమును విడిచి క్రమసాపిండ్య క్రియావిధానము లేదు. అందువలన పితామహ మరణా నంతరము క్రమసాపిండ్యమును జేసి తండ్రికి శ్రాద్ధాదులను జేసిన విధాన ముగానే క్రమసాపిండ్యమును జేయకయు శ్రాద్ధము నాచరింపఁదగునని కొందరు చెప్పిరి. కాఁబట్టి వారివారి యాచారాను సారముగా జేయవల యును. లేక మూలప్రమాణము లున్నచో వాని ననుసరించి జేయనగు ను. ప్రయోగవిధానము మూలములో జెప్పబడిన విధానముగా జూచు కొనవలెను.

—{ అనుమాసికములు మాసికముల నపకర్షము జేయుటయును వివరింపఁబడును. }—

౨౩౮—తా. ఒక్కదినమునందు నొక్కడనేకశ్రాద్ధముల్ల నాచ రింపవలసియున్నప్పుడు వైశ్వదేవ తంత్రవిధానముగా జేయవలయును. వేరువేరుగా పాకముల జేయనక్కర లేదు. హవిస్సు అగ్నిహోత్రము దైవ ము నిర్వాపణము ఉదకపాత్రము మొదలగునవి తంత్రవిధానముగ జేయ వలయునని కుండినుడు చెప్పెను. ఆవాహనము అగ్నౌకరణము స్వధా వాచనము సంకల్పశ్రాద్ధములయందు విధువవలయును. సంవత్సరపర్యం తము నిత్యము అతిపాతము చేయగూడదు. ప్రేతకు ప్రీతికరమైనవి. కాఁబట్టి అతిపాతము చేయఁబడినయెడల తిరిగి యివ్వవలయునని స్మృతి కర్తలు చెప్పిరి.

శాఖాంతరవిషయమందు.

౨౩౫—తా. సగోత్రుడుగాని యసగోత్రుడుగాని దహనాదిక్రియలను జేయవచ్చునని చెప్పఁబడియున్నది. కాఁబట్టి స్వశాఖాసూత్రప్రకారము చేయుట ముఖ్యపక్షము. అలాసంభవము కానిసమయమందు తిరిగి స్వసూత్ర ప్రకారము దహనాదిక్రియలను జేయవలయునని యున్నది. కాత్యాయనుడు చెప్పినదేమనగా, కార్యజ్ఞులగు విద్వాంసులు అక్రియయనునది మూడువిధములుగా చెప్పిరి. అది యెట్లనగా, యేమియు చేయకపోవుట. ఇతర సూత్రప్రకారము చేయుట. తనసూత్రములో చెప్పినట్లు సరిగా జేయకపోవుట. అని అక్రియ మూడువిధములు. ఎవడైనను మూఢుడు తన శాఖాసూత్రప్రకారము జేయక పరశాఖాప్రకారము జేసిన వానియొక్క క్రియఫలము నివ్వక వ్యర్థమగునని యున్నది. కాఁబట్టి తమశాఖాసంబంధమైన సూత్రములో జెప్పబడనివియు ఐహికాముష్మికములకు విరుద్ధముగా నుండక బ్రాహ్మణులకు ముఖ్యముగా జేయదగిన అగ్నిహోత్రాది ధర్మమును బోధించునట్టి క్రియలను ఇతరసూత్రములో జెప్పబడినప్పటికిని జేయవచ్చునని గృహ్యసూత్రకారులు చెప్పిరి.

—{ చేయబడినకర్మను తిరిగి చేయుట చేయకపోవుట అనువాని గురించి చెప్పబడును. }—

౨౩౬—తా. ఏకర్మయందు ద్రవ్యవిధాన మేప్రకారము చెప్పబడినదో ఆప్రకారము చేయనియెడల ఆకర్మను తిరిగి చేయవలయును. తంత్రలోపమైనప్పుడు చేయనక్కరలేదు. ప్రధానమగుకర్మ చేయబడనియెడల ఆకర్మనంతయు తిరిగి చేయవలయును. దానికి నంగభూతమగు కర్మ జేయబడక ప్రధానకర్మ జేయబడినప్పుడు అంతయు తిరిగి చేయనక్కరలేదు. అంగభూతమైన కర్మను విడిచినందుకు ప్రాయశ్చిత్తమును జేసికొనిన చాలును. అన్యకర్తృవిషయమందును ఆప్రకారమే చేయవలయును. కర్తృవిశేషమును గురించిన వచనములు శ్రాద్ధప్రకరణమునం దుదహరింపఁబడినవి. అనుగమనమును గురించిన ప్రయోగము తంత్రమును తెలుపునట్టి వచనములు ఈకలికాలమందు రాజశాసనప్రకారము అనుగమనము నివారింపబడినది. కాఁబట్టి ప్రయోజనము లేనందున వ్రాయలేదు.

సపిండీకరణనిషేధక వచనములు.

౨౩౭—సపిండీకరణమును నిషేధించునట్టి కొన్ని వచనములు కలవు. అవి వ్రాయబడును. శాతాతపుడు చెప్పినదేమనగా, [illegible] పతితులు

దుర్వృత్తిగలస్త్రీలు మొదలగు వారితో సపిండీకరణమును జేయగూడదు. ఏకోద్దిష్టమును మాత్రము చేయవలయును. నైష్ఠికులయొక్కయు యతీశ్వరులయొక్కయు శ్రాద్ధమునందు నారాయణార్పణముగా చేయవలయును. ఉపకారము చేసినవానికి సపిండీకరణమును చేయవలయు ననియు శాతాతపుడు చెప్పెను. నైష్ఠిక బ్రహ్మచారి మృతినొందిన పిమ్మట ముక్తినొందును. కాబట్టి వానికి శ్రాద్ధము సపిండీకరణము చేయనక్కర లేదని యముడు చెప్పెను. మఱియు నైష్ఠికబ్రహ్మచారులు మృతినొందినప్పుడు దహనాది షోడశాంతమువరకు స్మృత్యుక్తప్రకారముగా జేసి సపిండీకరణమును జేయనక్కర లేదనియు పండ్రెండవదినమునందు పార్వణశ్రాద్ధమును జేసి నారాయణబలినిగురించి యెనమండుగురు బ్రాహ్మణులను భుజింపజేయవలయును. లేక యేకోద్దిష్టవిధానముగా శ్రాద్ధమునైన చేయవలయు ననియు వృద్ధవసిష్ఠుడు చెప్పెను. ఈవిషయములో నైష్ఠికబ్రహ్మచారులు(ఉపకుర్వాణులు అనుష్ఠానపరులైనయెడల,)సపిండీకరణమును జేసి పిమ్మట శ్రాద్ధమును జేయవలయును.

## యతీశ్వరుల విషయమునందు.

౨౩౮—తా. యతీశ్వరుల విషయములో పులస్త్యుడు చెప్పినదేమనగా. ఏకదండ త్రిదండాది ధారణవలన యతీశ్వరులు కుటీచకుడనియు బహూదకుడనియు హంసుడనియు పరహంసుడనియు యతీశ్వరులు నాలుగు విధములుగా చెప్పబడిరి. వారికి నవశ్రాద్ధము, షోడశము, సపిండీకరణము, చేయనక్కర లేదు. అనిచెప్పెను. ఉశనుడు చెప్పినవిషయమేమనగా. కుటీచకాదియతీశ్వరులు దండదారణచేయుట వలన ప్రేతత్వము నొందరు కాబట్టి వారికి సపిండీకరణము జేయ నవసరము లేదు. అది యెట్లనగా. ప్రేతత్వ నివృత్తికొఱకు షోడశశ్రాద్ధము క్షుత్తృష్ణాది నివృత్తికొఱకు పిండోదకదానాదులు నవశ్రాద్ధములు పితృలోకమును జెందుటకు సపిండీకరణము చెప్పబడినవి. ఈమూడు అవస్థలు యతీశ్వరులకు లేవు. కాబట్టి శ్రాద్ధాధికారము నిమిత్తమై కుమారుడు పండ్రెండవ దినమునందు పార్వణవిధానముగ జేయవలయునని చెప్పెను. జ్ఞాతులుబంధువులు పుత్త్రులు మొదలగు వారెవరైనను నాలుగువిధములగు యతీశ్వరులకును పండ్రెండవ దినమునందు పార్వణశ్రాద్ధమును జేయవలయునని వసిష్ఠుడు చెప్పెను. తనతండ్రి యతీశ్వరుడై మృతినొందినప్పుడు ఏకోద్దిష్టాది శ్రాద్ధములు సపిండీకరణము జేయనక్కర లేదనియు పదకొండవ దినమునందు

పార్వణశ్రాద్ధమును జేయవలయు ననియు యముడు చెప్పెను. ఈప్రకారముగానే ప్రజాపతియు బృహస్పతియును చెప్పెను. బ్రాహ్మణులకంటె నితరుడు తానే బ్రహ్మయనెడు భావముచే సన్యాసియై మృతినొందిన యెడలవానిని గుఱించి యేకోద్దిష్టము జలపిండదానాదులు ఆశౌచగ్రహణము ప్రేతకర్మ మొదలగునవి యాచరింప నక్కఱలేదు. మఱియు పులస్త్యుడీ విధముగా చెప్పెను. బ్రహ్మవిద్యయందాసక్తికలవాడై సంసారమును వదలి యేకదండి త్రిదండి మనోదండియను ధర్మములచే నొప్పబడుచుండెడి కుటీచక బహూదక హంస పరమహంసలనెడు నాలుగువిధములుగల యతీశ్వరులని చెప్పంబడుదురు. వీరిలో పరమహంసు డధికుడు. వీరు మృతినొందినప్పుడు కుటీచకుని దహింపవలయును బహూదకుని ఖననము జేయవలయును. హంసుని జలములో విడువవలయును పరమహంసుని త్యాగము చేయవలయును. స్మృతిప్రకార మీనలుగురికిని సపిండీకరణము జేయనక్కఱలేదు. పదకొండవ దినమునందు పార్వణశ్రాద్ధమును మాత్రము జేయవలయును. అనంతరము పిండపితృ శ్రాద్ధమును మృతాహస్సుయందు దర్శశ్రాద్ధమును జేయవలయును. యతీశ్వరుని విషయములో మహాలయమునందు దర్శయందు పాతాది శ్రాద్ధములయందు మృతదినమునందు పార్వణవిధానముగాను ఇతరశ్రాద్ధములయందు నేకోద్దిష్ట విధానముగాను జేయవలయునని పులస్త్యుడు చెప్పెను. ఔరసపుత్త్రుడు క్షేత్రజుడు సోదరుడు వాని కుమారుఁడు శిష్యుఁడు శుశ్రూష జేయువాడు ప్రభువు మొదలగు వారెవరైనను పార్వణశ్రాద్ధ విధానముగానే చేయవలయును. కుటీచకునకు దర్శాది శ్రాద్ధమును జేయునపుడు పార్వణవిధానముగానే చేయవలయును. పరమహంసునకు జేసిన విధానముగానే నారాయణబలిని, విష్ణుపూజావిధానము అర్ఘ్యాంజలులు పురుషసూక్తమంత్రములతో పదియాఱు పర్యాయములు చరుహోమము కేశవాది పండ్రెండు నామములతో పండ్రెండుగురు బ్రాహ్మణుల నావాహనముజేసి వారిని భుజింపజేయుట లేక వారిను ద్దేశించి సమస్తకాలములయందును తనశక్త్యానుసారముగ బ్రాహ్మణులను భుజింపజేయుట. ఈ మొదలగు కృత్యములు కుటీచకునకును జేయవలయునని సుమంతుడు చెప్పెను. మఱియు బ్రాహ్మణుడు బ్రహ్మవిద్యయందాసక్తికలవాడై సన్యాసాశ్రమమును స్వీకరించి యేకదండిగాని త్రిదండిగాని సర్వసంగ పరిత్యాగుడుగానియై మృతినొందిన యెడల వానియొక్క పదకొండవ దినమునందుగాని పండ్రెండవ దినమునందుగాని

కుమారుఁడు పార్వణవిధానముగ శ్రాద్ధమునాచరించి అదిమొదలు ప్రత్యా బ్దికము దర్శశ్రాద్ధము తీర్థశ్రాద్ధము మహాలయము మొదలగు శ్రాద్ధము లను ఆయాశ్రాద్ధ కాలములయం దాచరింపుచు సంబంధము నామము గోత్రము మొదలగువానిని చెప్పుచుండవలయునని స్కాందపురాణము నందు కలదు. క్షత్రియుడు ప్రభువగునేని బ్రాహ్మణధర్మ ప్రకారముగా పూజింపవలయును. శూద్రుఁడు ప్రభువగునేని వైశ్యునివలెనే బ్రాహ్మణులు గౌరవించవలయును. బ్రహ్మచారి అనుపనీతునకు గౌరవింపదగినవాఁడు. బ్రహ్మచారికి నైష్ఠికబ్రహ్మచారి పూజనీయుఁడు. వారుభయులకు గృహ స్థుఁడు పూజనీయుఁడు. ఈముగ్వురకు వానప్రస్థుఁడు గౌరవనీయుఁడు. ఈనలు గురకు కుటీచకుడు మాన్యుఁడు. వీరికంటె నధికుడు బహూదకుడు. ఈప్ర కారము జీవించి యుండునపుడు పూజావిషయములో నొకరికంటె నొకర్తి నధికముగా జెప్పఁబడియున్నదిగాని నాలుగు విధములగు యతీశ్వరులును మృతినొందినప్పుడు చేయవలసిన శ్రాద్ధకృత్యములయందు తారతమ్యము లేదు. కాఁబట్టి ఔరసపుత్త్రుఁడు పదకొండవ దినమునందు తండ్రిని విష్ణు స్వరూపునిగా ధ్యానింపుచు బ్రాహ్మణులను విష్ణుస్వరూపులనుగా పూజిం చి భుజింపజేయవలయునని బ్రహ్మాండపురాణమునందు జెప్పఁబడెను ఈప్ర కారముగానే స్కాందపురాణములో నాగరఖండమునందు జెప్పఁబడి బ్రహ్మచారికి గృహస్థుడును వారికి వానప్రస్థుడును. ఈముగ్గురకు యతీశ్వ రుడును మాన్యులనియు బ్రహ్మక్షత్రియవైశ్యులను మూడువర్ణముల వారు నుపనయనాది సంస్కారముల కర్హులై బ్రహ్మచర్యాద్యాశ్రమమును స్వీకరింపదగిన వారనియు యతీశ్వరులకు ప్రేతకార్యముల విధానముగా జేసినందున నరకము నొందును. కాఁబట్టి యుదకపాత్రదానము నవశ్రాద్ధ ము, షోడశము సపిండీకరణను మొదలగునవి, చేయగూడదనియు పద కొండవదినమునందు నారాయణ స్వరూపునిగా పూజింపవలయు ననియు జెప్పబడెను. ఈప్రకారము సన్యాసులను గుఱించి శ్రాద్ధవిషయము విపుల ముగా జెప్పఁబడెను.

## నవమిశ్రైకోద్దిష్టము.

౨౩౮—తా. దైవహీనముగాను ఒక్కయర్ఘ్యపాత్రయు నొకపవి త్రము నేకోద్దిష్టమునం దుండవలయును ఆవాహనాగ్నౌకరణములు లేవు; అపసవ్యముగా జేయవలయును. అక్షయ్యస్థానమునందు "ఉపతిష్ఠతాం" అని యు విప్రవిసర్జనమునందు "అభిరమ్యతాం" అనియు చెప్పవలయును. "అభిర

మాతాస్స్మహ" అని భోక్తలు తిరిగి పలుకవలయును. ప్రకరణవశము వలన నవశ్రాద్ధనవకము మిశ్రవిషయము చెప్పబడును. ఈప్రకారము యాజ్ఞవల్క్యుడు చెప్పెను. ఇందులో సపిండీకరణైకోద్దిష్టమునందు బోధాయనునిచే విశేషము చెప్పబడినదేమనగా, ఏకోద్దిష్టమునందు ఆవాహనాదులు నిషేధింపఁబడినను సపిండీకరణమునందు జేయబడు నేకోద్దిష్టములో ఆవాహనము స్వధాశబ్దము మొదలగునవి యన్నియు చెప్పవచ్చుననెను. ఘృతతైలాదులచే వండబడిన గోధూమపిష్టము మొదలగు భక్ష్యముల నేకోద్దిష్టమునం దుపయోగించకూడదు. సపిండీకరణమునం దుపయోగింప వచ్చును. ఏకోద్దిష్టవిధానములగు శ్రాద్ధముల నన్నింటియందును పూర్వ నిమంత్రణము లేదు. సపిండీకరణశ్రాద్ధమునందు పూర్వదిన నిమంత్రణము కలదు. నవశ్రాద్ధములు మిశ్రశ్రాద్ధములు సపిండీకరణము యథావిధిగా జేసినపిమ్మట స్నానము జేయవలయును. మృతదినమునం దాబ్దికము పెట్టిన పిమ్మట స్నానము చేయగూడదని వ్యాసుఁడు చెప్పెనని విశేషమొకటి ధర్మశాస్త్రజ్ఞులు చెప్పిరి.

## నవశ్రాద్ధములు.

౨౮౦—శా. నవశ్రాద్ధములనగా, పదిదినములలోపుగా నూతనముగ జేయబడు శ్రాద్ధములు కాఁబట్టి నవశ్రాద్ధములని చెప్పబడునని యాశ్వలాయనుడు చెప్పెను. ఆశ్వలాయనశాఖ గలవారికి అయిదు నవశ్రాద్ధములనియు ఆపస్తంబశాఖీయులా లాఱు నవశ్రాద్ధములనియు ఐతరేయశాఖీయులు రెండువిధములుగాను జేయవచ్చుననియు చెప్పిరని శివస్వామి చెప్పెను. పదిదినముల పర్యంతము నవశ్రాద్ధములను పదకొండవదినము మొదలు సంవత్సరపర్యంతము మిశ్రశ్రాద్ధములను ప్రేతత్వనివృత్తికొరకు జేయవలయునని ప్రజాపతి చెప్పెను. సూతకాంతమువరకు నవశ్రాద్ధమును జేయవలయునని యున్నది. కాబట్టి దశాహాంతము జేసి యేకాదశదినమున నవశ్రాద్ధమును జేయవలయును. అనంతరము నవమిశ్రశ్రాద్ధములను జేయవలయును. ఇక్కడ షణ్ణవశ్రాద్ధములని కొందఱు చెప్పిరి. అంగిరసుఁడు చెప్పినదేమనగా, మొదటిదినమునందు, మూడవదినమునందు, ఐదవదినమునందు, ఏడవదినమునందు, తొమ్మిదవదినమునందు, పదకొండవదినమునందు, ఆఱు నవశ్రాద్ధములను జేయవలయునని చెప్పెనని శా.

## వ్యాసునిచే జెప్పఁబడిన నారాయణ బలివిధానము.



౨౮౧—శా. పూర్వకాలమందు వ్యాసునిచే జెప్పఁబడిన నారా

యణ బలివిధానము చెప్పఁబడును. చండాలురు, ఉదక్యలు, సర్పములు, మెరుపులు, పిడుగులు, అగ్నివిషము, పర్వతములు, వృక్షములు, రాళ్లు, శస్త్రములు, పశువులు, కోరలుగలవియు, గోళ్లుగలవియు నగు జంతువులు ఏనుగలు మొదలగువానిచే మృతినొందినవారలకు యతీశ్వరులకు నైష్ఠికులకు తపస్విలురకు ముఖ్యముగ వైష్ణవులకు మఱియు నితరమైన మోక్షాపేక్షగల వారలకందఱుకును పండ్రెండవ దినమునందు నారాయణ బలిని జేయవలయును. చండాలురు మొదలగువారిచే మృతుడైనవానికి సంవత్సరానంతరము జేయవలయునని మఱికొందరు చెప్పిరి. ఆపత్తు సంకటము గ్రహణము దైవవిపర్యాసము కర్తృద్రవ్యాదులకు సందేహసమయము ప్రాణసందేహసమయము మొదలగు విషయములయందు సంవత్సరమునకు లోపుగానైనను అనంతరమందైన నెప్పుడైనను జేయవచ్చును. ఉత్తరాయణము విషువత్పుణ్యకాలములయందు శ్రవణ రోహిణీ నక్షత్రముల యందు రెండుపక్షముల యేకాదశులయందును చేయవలయును. అదియే విధముగా ననగా, నారాయణబలిని జేయుటకు పూర్వదినమునందు ఆఱుగురుగాని, పండ్రెండుగురుగాని, బ్రాహ్మణులను నిమంత్రణజేసి కులశీలాది గుణములు కలవాడును సర్వావయసంపూర్ణుడును వేదశాస్త్రార్థ పారంగతుండు నగు బ్రాహ్మణు నాచార్యునిగావరించి, మృత్తికాస్నానాదులను జేసి, తెల్లని శుభ్రవస్త్రములను ధరించి యుపవాసము జేసి, జితేంద్రియుడై పాదప్రక్షాళనము జేసికొని యోగ్యమైన యాసనమునందు గూర్చుండి యాచమనము జేసి సంకల్పము జేసి గోచర్మమాత్రప్రదేశమునందు గోమయోదకముతో నలికి యెఱుపు నలుపు మొదలగు వర్ణములుగల మృత్తికతో కుండమునుగాని స్థండిలమునుగాని యేర్పరచవలయును. మిక్కిలి యధికముగాను మిక్కిలి హీనముగాను నుండకూడదు. బ్రాహ్మణుల నావాహనము చేసి స్వస్తివాచనము చేయవలయును. నానాలంకారములతో గూడినదియు మనోహరమైన నొకకలశము నావేదికయందుంచి స్వర్ణము వెండి మొదలగువానిచే జేయఁబడిన విష్ణువైవస్వత యమదేవతాకములగు ప్రతిమలనుంచి స్వర్ణకాప్యాది రూపకములగు వస్త్రములచే జుట్టి గంధపుష్పాక్షతలనుంచి పంచాంగుళన్యాసము చేసి యాత్మశుద్ధిని చేసి ద్రవ్యపాత్రల నాసాదించి స్నానార్ఘ్యాచమన గంధపుష్పధూపదీపాది విధులచే విష్ణువును పూజించవలయును. "నమోనారాయణాయ" అని విష్ణువునకును "నమో వైవస్వతాయ" అని వైవస్వతునకును "నమోయమాయ" అని యమున

కును మంత్రములను జెప్పి యావాహనము జేయవలయును. ఇట్లు సర్వోపచారములచేతను పూజించి ఋగ్యజుస్సామ వేదసంబంధములగు మంత్రములచే విష్ణుమూర్తిని స్తోత్రము జేసి నృత్తగీతవాద్య పురాణేతిహాసాదులచే కాలక్షేపణము జేసి విష్ణుసహస్రనామములచే పూజింపుచు స్తోత్రకథాదులచే రాత్రియంతయు జాగరణము జేసి త్రికాలములయందు పూజింపుచు పూర్వాదిదళములయందు కేశవాది నామములచేతను పూజింపవలయును. అనంతరము తేనె నెయ్యి నువ్వులు మొదలగునవి కలిపి యైదుపిండములను జేసి యామంటపసమీపమునందు దర్భలనుబఱచి దక్షిణాభిముఖుడై ప్రేతను మనస్సున ధ్యానింపుచు నపసవ్యముగా నవాక్పాణియై బ్రహ్మ శివుడు యముడు విష్ణువు వైవస్వతుడు అను వారికి నైదుపిండములను వేయవలయును. వారిభార్యలకు వేయనక్కరలేదు. అనంతరము స్నానము జేసి యింటికి రావలయును. పిమ్మట ఆచార్యుడు ప్రాతఃకాలంబున స్నానము జేసి సంధ్యావందనాది నిత్యకృత్యములను జేసి పూర్వాహ్ణకృత్యముల నెరవేర్చి విష్ణువు, వైవస్వతుడు, యముడు, బ్రహ్మ, శివుడు అను నైదుగురిని కేశవాదినామములచే పూజించి అనంతరము స్వగృహ్యసూత్రప్రకారముగా హోమము జేయవలయును. "విష్ణోర్నుకం పరం మృత్యోః" అను రెండుమంత్రములచేతను కేశవాది నామములచేతను హోమము జేసి పురుషసూక్తమంత్రములచే షోడశాహుతులను జేసి చరుసమిదాజ్యాదులచేతను హోమము జేయవలయును. అనంతరము బ్రాహ్మణులను బిలచి దేవతాస్థానమునందు విష్ణువు, యముడు, వైవస్వత స్థానములయందును వృద్ధినిమిత్తము రుద్రస్థానమందు ప్రేతస్థానములయందు నారుగురు బ్రాహ్మణులను నియమించి దేవకార్యముల విషయమై నియమించిన బ్రాహ్మణులను తూర్పుముఖముగాను ప్రేతస్థానమందు నియమించిన బ్రాహ్మణుని నుత్తరముఖముగాను గూర్చుండబెట్టి యావాహనాది పూజావిధానమునంతయు దేవపూర్వకముగా జేసి వస్త్రాభరణాలంకారాంగుళీయకములను శక్త్యానుసారముగా నిచ్చి "అగ్నౌకరిష్యే" అని బ్రాహ్మణులవలన ననుజ్ఞవుచ్చుకొని పితృయజ్ఞవిధానముగ జేసి బ్రాహ్మణులను భుజింపజేయవలయును. పిమ్మట వారు తృప్తినొందితిమని పలికిన పిమ్మట మధ్వాజ్యతిలమిశ్రితముగా నాలుపిండములను జేసి దర్భలయందు విష్ణు యమ వైవస్వత బ్రహ్మ శివులకు నైదుపిండములను ప్రేత నామగోత్రములను జెప్పి యొకపిండమునుంచి పూజావిధినంతయు జేసి యుద్వాసన జెప్పి యాపిండములను జలములో

గలుపవలయును. పంౘ్రడెండు పిండములను జేయుపక్ష మొకటికలదు. అది యెట్లనగా, పూర్వము జెప్పఁబడిన యారుస్థానములయందు నారుపిండము లను ప్రేతయొక్క పిత్రాది వర్గత్రయమునందు మూడుపిండములును మాతామహ వర్గత్రయమునందు మూడుపిండములును మొత్తము పండ్రెం డు పిండములని చెప్పిరి. ఈపక్షములో నాచార్యుని ప్రేతస్థానమునందు నియమించవలయును. పార్వణవిధానముగానే చేయుచు కేశవాది నామ ములచే పూజించి భుజింపజేసి పిండాంతమందు "నమోనారాయణాయ" అని దేవరూపులకును ప్రేతాది పితృస్థానములయందు వారివారి గోత్ర నామములనుజెప్పి బలిని విడువవలయును. పిమ్మట శక్తిననుసరించి వస్త్ర దక్షిణ తాంబూలాదులనిచ్చి యాచార్యునకును విశేషముగా సన్మానము చేసి, వృషభము, గోవు, సువర్ణము రజితము కాంస్యము వస్త్రములు దక్షిణలు మొదలగునవి ప్రేతస్థాన నిమంత్రితుడగు నాచార్యునకు విశేష ముగా నిచ్చి వారికి ప్రదక్షిణ నమస్కారాదులనుజేసి వారివలన నాశీర్వ చనములంది క్షమాపణ గోరవలయును. ఈప్రకారము సుతులు మొదలగు వారు పితరులను గుఱించి నారాయణబలిని జేసినయెడల నీకాలమృత్యువు మొదలగు దోషములవలన విడువఁబడుచున్నారు. సందేహము లేదని చెప్పఁబడెను. ఈప్రకారము విష్ణువునందు భక్తిగలవారై వైకుంఠమును జెందవలయునని శ్రద్ధతో కర్మ నాచరించినయెడల నిహలోకమునందు సమస్త కోరికలనొంది మృతినొందిన పిమ్మట విష్ణుసాయుజ్యము నొందుదురు. సర్ప ముచే మృతినొందినవారికి జేయవలసిన విశేషము త్వష్ట్రుపురాణములో జెప్పఁబడినదేమనగా, సువర్ణముతో సర్పమునుగాని ధేనువునుగాని ప్రతి మను జేయించి యథావిధిగా బ్రాహ్మణునకు దానమిచ్చినయెడల పితృరుణ విముక్తికలుగునని జెప్పఁబడెను. ఈప్రకారము నారాయణబలివిధానము సవిస్తరముగా జెప్పఁబడెను.

రజస్వలామరణమునందు జేయువిధానము.

౨౮౨—తా. పూర్వము సామాన్యముగా గ్రామ్యాలంకారము లతోగూడి రజస్వలై మృతినొందిన స్త్రీని తూష్ణీంభూతముగ మొదట స్నా నముజేయించి పిమ్మట యథావిధిగా మంత్రములతో పంచగవ్యములచే స్నానము జేయించి పిమ్మట నూరుగాని పండ్రెండుగాని పదిగాని కడవల జలముతో స్నానముజేయించి మలాపకర్షణము జేసి పూర్వవస్త్ర విసర్జనము చేసి తిరిగి శుభ్ర వస్త్రాలంకారాదులను జేసి దహించవలయును.

## యతిసంస్కారక్రమము.

౫౮౩—తా. యతిసంస్కారవిషయమై మనువు చెప్పినదేమనగా, సర్వసంగములను విడిచి ధ్యానయోగనిష్ఠాగరిష్ఠుడైన యతీశ్వరునకు దహనము జేయగూడదు. వానిని గుఱించి యుదకదానాదులను జేయ నక్కఱలేదు. వాని సంబంధమగు నాశౌచము లేదు, శుభ్రమగు ప్రదేశమునందు గూర్చుండబెట్టి గాయత్రీమంత్రముచే నుదకము ప్రోక్షించి పిమ్మట స్నానము జేయించి దేహమును శుభ్రపరచి పిమ్మట "హిరణ్యవర్ణాః" అను నాలుగు మంత్రములు "ఆపోహిష్ఠామ" అను మూడుమంత్రములును "పవమానస్సువర్జనః" అను యనువాకమును "శుచీవోఅగ్నిః" అనునట్టి శుచిప్రదములగు మంత్రములును "ద్రుపదా జాతవేదసా, పవిత్రంతే విచర్షణిః, చరణంపవిత్రం" అను మొదలగు మంత్రములను జెప్పుచు తేనె నెయ్యి సుగంధద్రవ్యములు మొదలగువానిని కుశాగ్రములచే ప్రోక్షించి బ్రాహ్మణానుజ్ఞనుపొంది గాయత్రీమంత్రముతో గంధపుష్పాక్షతాదులచే నలంకరించి దృఢమగు కావడిమట్టునందు గూర్చుండబెట్టి బ్రాహ్మణులు జాగ్రతగా మోసికొని వెళ్లవలయును. మోసికొని వెళ్లినవారికి సద్యశ్శుద్ధియని చెప్పఁబడెను. అనగా స్నానముతో నివృత్తియగును గ్రామమునకు వెలుపలకు తీసికొనివెళ్లి గూర్చుండబెట్టిన యెడల శిరస్సు భుజములు మొదలగునవి పూడియుండుటకు తగినంత లోతుగా గొయ్యిత్రవ్వి దానిలో గూర్చుండబెట్టి మట్టిచే పూడ్చివేయవలయును దీనినే సమాధియని పెద్దలు చెప్పుదురు.

## సన్యాసులకు ధర్మమృతులకు జేయవలసిన విధానము.

౫౮౪—తా. గ్రామమునకు తూర్పుదిక్కునకు గాని యుత్తరదిక్కునకుగాని లేక మరియొక దిక్కునకుగాని వెళ్లి మేడివృక్షము పలాశవృక్షము రావివృక్షము మొదలగు పవిత్రములగు వృక్షముల వద్దగాని లేక యజ్ఞవాటమునందుగాని నదీతీరమునందుగాని మఱియొక శుభ్రప్రదేశమునందుగాని గొయ్యిత్రవ్వి భూర్భువస్సువరాది సప్తవ్యాహృతులతోను ఏడుపర్యాయములు ప్రోక్షించి దర్భలనుబఱచి తిరిగి ప్రణవమును స్మరింపుచు ప్రోక్షించి పురుషసూక్తమును జెప్పుచు శవమును పంచామృతములతో స్నానము జేయించి గంధమాల్యాదులచే నలంకరించి పుట్టియందుంచి పూర్వోక్తమగు గొయ్యివద్దకు తీసికొనివెళ్లి తూర్పుముఖముగాగాని మరియొక [illegible] యుండునట్లు గొతిలోనుంచి "విష్ణోహ

వ్యం రక్షస్వ. ఇదంవిష్ణు ర్విచక్రమే” అను మంత్రములతో కుడిహస్తము నందు పిండమునుంచి “చిత్తస్సృక్” అనునది మొదలు దశహోతలను జెప్పుచు నా శవమును గోతిలోనుంచి స్రుగాదులతో యిసుక మొదలగు వానితో పూడ్చి సమాధిగావించి యుదక సంమార్జనమును మిక్కిలి తడి గాఁనుండునట్లుగా జేసి గంధపుష్పమాల్యాదులచే నాసమాధి ప్రదేశమును పూజించి పిమ్మట నదీతీరము మొదలగు జలప్రదేశములకు వెళ్లి స్నానము జేయవలయును. అంతటతోనే యాశౌచ నివృత్తియగును. ఉదకదానాదు లను జేయనక్కరలేదు జ్ఞాతులతోఁగూడ సచేలస్నానము జేయవలయును. స్మృతులయందు జెప్పిన సంగతి యేమనగా. పుత్త్రుఁడు సోదరుడు దౌహి త్రుడు సపిండుడు శిష్యుడు మొదలగు వారెవరైనను యతీశ్వరుని తాకి నను మోసినను తత్కాలస్నానముతోనే శుద్ధికలుగునని చెప్పఁబడెను. తల్లిదండ్రులుగాని దగ్గిరబంధువుగాని సన్యసించి మృతినొందిన యెడల దహనముచేయగూడదు. మిగిలిన చేయదగిన విధినంతయు చేయవలయు నని కొందరనిరి. ఉత్తపనాగ్నితో పితృమేధవిధానముగా దహనాది చేయ దగిన క్రియలనన్నియును అగ్నిహోత్రమును జేసి గాయత్రీమంత్రము ప్రణ వము మొదలగు వానితో ప్రోక్షణము చేయవలయు ననియు మరికొం దరు చెప్పిరి. అనంతరము జ్ఞాతులు స్నానముజేసిన యెడల శుద్ధినొందు దురు. ఈప్రకారమాయతిసంబంధికులు చేసినయెడల నశ్వమేధఫలము నొందుదురు. పదకొండవదినమునందు పార్వణశ్రాద్ధమును జేయవలయును. త్రిదండధారణవలన యతీశ్వరునకు ప్రేతత్వములేదని ఉశనియను మునీ శ్వరుడు చెప్పెను. కాఁబట్టి సపిండీకరణము జేయనక్కరలేదు. కుటీచకుని దహించవలయు ననియు బహూదకుని సమాధి జేయవలయు ననియు హంసునిజలమునందు విడువవలయు ననియు పరమహంసుని విసర్జనజేయ వలయు ననియు జెప్పబడెను. ఇట్లు చేయవలయునని యున్నది. కాఁబట్టి కర్త తాను స్నానముజేసి పరిశుద్ధుడై యతీశ్వరుని స్నానముజేయించి గంధపుష్పాదులచే నలంకరించి వుట్టియందుంచి జయజయశబ్దములతో గూడ యుపనిషత్తులను పఠింపుచు తూర్పుదిక్కునకుగాని యుత్తరదిక్కు నకుగాని తీసికొనివెళ్లి పరిశుద్ధప్రదేశమునందుంచి నదీతీరము రావి వృక్ష మూలము దేవాలయము యితరదేవతాస్థానము గోష్ఠము పలాశ వృక్ష మూలము మొదలగు ప్రదేశములయందు గొయ్యిత్రవ్వి సప్తవ్యాహృతు లతో ప్రోక్షించి దక్షిణాగ్రములుగా దర్భలను బఱచి గాయత్రీమంత్ర

ముతో మొదట శరీరమును కడిగి పురుషసూక్తమును జెప్పుచు తిరిగి స్నానము జేయించి గంధాదులచే నలంకరించి "విష్ణోహవ్యం రక్షస్వ" అను మంత్రమును జెప్పుచు యతీశ్వరుని శరీరమును "ఇదంవిష్ణు ర్విచక్రమే" అను మంత్రముతో దండమును గొయ్యియందుంచి "హంసశ్శుచిషత్" అను మంత్రమును జెప్పుచు హృదయమును స్పృశింపవలయును. భ్రూమధ్యమును స్పృశింపుచు పురుషసూక్తమును శిరస్సును స్పృశింపుచు బ్రహ్మజజ్ఞానమను మంత్రమును పఠింపవలయును. భూమి ర్భూమ్నా...అను మంత్రముతో కపాలమును భిన్నము చేయవలయును. ప్రణవముతో దేవయజనమును పూర్తిచేయవలయును. అగ్నినాగ్ని స్సమిధ్యతే, అనునది మొదలు చతుర్హోతలను జెప్పవలయును. ఈప్రకారముగా మరికొందరు చెప్పిరని తాత్పర్యము.

యతిసంస్కారవిషయమై కుమారుడు చేయవలసిన విధానము.

౨౮౫—తా. సన్యసించిన తండ్రి మృతినొందినప్పుడు కుమారుడు వద్దనుండెనేని ముందుగా తాను స్నానము జేసి జలాశయమునకు యతీశ్వరుని తీసికొని వెళ్లి స్నానము జేయించి యతీశ్వరునకు సంస్కారమును జేయుచున్నానని సంకల్పము జేసి వపనము జేయించుకొని పురుషసూక్తమును జెప్పుచు శంఖోదకముచే యతీశ్వరుని స్నానము జేయించి పుట్టియందుంచి యుపనిషత్తులను జెప్పుచు ఖననప్రదేశమునకు తీసికొనివచ్చి గొయ్యిత్రవ్వి దానియందుంచి "ప్రకేతునా" అను యనువాకమును హోతలరీతిగానే పఠించి మిగిలినదంతయు యతి సంస్కారము వలెనే చేసి తిరిగి జలాశయమునకు వచ్చి స్నానము జేసి దక్షిణాభిముఖుడై, ఓమాత్మానం తర్పయామి, అనునది మొదలు మూడుజలాంజలులను దేవతీర్థవిధిగా ప్రతిదినము పదిదినముల పర్యంతము విడిచి పదకొండవదినమునందు క్షౌరమును జేయించుకొని ప్రాతఃకాలమున స్వగృహ్యోక్త ప్రకారముగా నారాయణబలిని చేయుచున్నానని సంకల్పము చేసి యగ్నిప్రతిష్ఠాపనను జేసి అగ్నిముఖాంతము జేసి ఆజ్యముతో పాయసమును మిళితము జేసి పురుషసూక్తమునకు, 'అతోదేవా అవంతునః' అనునట్టి షడర్చలచేత నంగన్యాసము జేసి ప్రతిరుక్కుతో నవదాన ధర్మప్రకారముగ హోమము జేసి ప్రణవాదియు చతుర్థ్యంతము స్వాహాకారాంతము కలుగునట్లు (అనగా 'ఓం కేశవాయస్వాహా' అనియనుట. ఈప్రకారము పండ్రెండు నామములతోను పండ్రెండు హోమములను జేసి స్విష్టకృత్తును స్వగృహ్యోక్త ప్రకారముగా

సమాప్తినొందించి కేశవాది పండ్రెండు నామములకు పండ్రెండుగురుగాని లేక యొక్కొక్క నామమునకు నిద్దరు ముగ్గురుగాని నలుగురుగాని బ్రాహ్మణులను తనశక్తికొలది భుజింపజేసి లేక యతీశ్వరులనైనను భుజింపజేయవలయును. అనంతర మాయతీశ్వరునకు పూర్వాశ్రమ సంబంధమగు గోత్ర నామములనుజెప్పి పితృపితామహ ప్రపితామహ వర్గత్రయము నుద్దేశించి మఱియొక పాకముతో పార్వణశ్రాద్ధమును జేయవలయును. ప్రేతత్వము లేదు. కాబట్టి సపిండీకరణము లేదు. ఆబ్దికపర్యంతము మాసికముల నేమియు పెట్టనక్కర లేదు. అదిమొదలు ప్రతిసంవత్సర సిద్ధిదినమునందును ఆరాధనను జేయుచు పండ్రెండు నామములచేతను శక్తికొలది బ్రాహ్మణులను భుజింపజేయవలయును. ఈచెప్పినదానికంటె నితరమగు కృత్యములు కుమారునిచే యతీశ్వరునకు జేయవలసిన దేమియు లేవు. ఈప్రకారము యతీశ్వరునకు జేయవలసిన సంస్కారవిషయము చెప్పబడినదని తా.

గంగయందు నస్థులనుంచు విధానము.

౨౭౮—తా. ద్వారవతి, సేతువు, గోదావరి, పుష్కరము మొదలగు పుణ్యక్షేత్రములయందు నస్థులనుంచినయెడల మృతినొందిన పిమ్మట ముక్తినొందునని శాండిల్యుడు చెప్పెను గంగయందు ప్రయాగయందు కేదారమందు పురుషోత్తమ క్షేత్రమునందు నస్థులను విధిప్రకారముగా నుంచినయెడల గయలో పిండము వేసినంతఫలము కలుగును. తల్లిదండ్రులు మోక్షమునొందుదురు. అస్థులనుంచిన కుమారుడు తల్లిదండ్రుల ఋణమును దీర్చికొనినవాడగును. అని శంఖలిఖితుడు చెప్పెను. గంగయందు యమునయందు కావేరియందు స్వ్వృతందృతియందు సరస్వతియందు నస్థులనుంచినయెడల కుమారునకు విశేషసుకృతము లభించును. అని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. స్వగృహ్యసూత్రప్రకార మస్థిసంచయనము జేసి మృత్పాత్రయందు నస్థులనుంచి యాకడముంతను భూమిలోపాతిపెట్టి వాటినిస్పృశించినందుకు మిగిలిన మంత్రములను జపించుటవలన కర్మ సిద్ధించుచున్నది ఈప్రకార మస్థులను శుద్ధిపఱచి కొంతకాలము భూమియందుంచి తిరిగి నాకుంభమును తీసి తాను గంగలోనుంచుటకు వెళ్లేపర్యంతము చెట్టుయందుగాని శుభ్రమగు ప్రదేశమునందుగాని యుంచి తిరిగి యచ్చటనుంచి తీసి భూమియందుంచి యారుమాసములవరకు వాటిని చూడగూడదు. లేక మూడు మాసముల వరకుగాని మూడుపక్షముల వరకుగాని భూమినుండి తీయగూడదు. దేహమనిత్యము గనుక శీఘ్రములో జరుపవలెను. విశేషకాల

ముంచక కొద్దికాలములోనే తీసి కాలద్రవ్యముల ననుసరించి యస్థినిక్షేపణము జేయవలయును. మూడుసంవత్సరములుగాని రెండుసంవత్సరములుగాని సంవత్సరముగాని యారుమాసములుగాని యథాసంభవముగా నుంచవలయు ననిరి. తచ్ఛాంతి కృచ్ఛ్రాదుల నాచరించవలయును. ఈప్రకారము జేయనియెడల నరకము నొందుదురు. మహాతీర్థములయందు మృతి నొందినయెడల సుతుడు పదిదినములలోపల నస్థిసంచయనము జేసి శుద్ధిపఱచి గంగలో నుంచవలయును. అర్ధోదకమునందు మృతినొందినయెడల వానిని బయటకు తీసికొనివచ్చి యథావిధిగా దహనము జేసి యస్థిసంచయన సంబంధమగు మంత్రములను జపవిధానముగా పఠించి తిలలు ఆజ్యము మధువు హిరణ్యశకలములు జలములు మొదలగువానిచేతను పంచగవ్యములచేతను శాంతిపరచి గంగలో నుంచవలయును. అని కాత్యాయనుడు చెప్పెను. నాల్గవదినమందు నస్థిసంచయనము జేసి గంగలో విడువవలయునని యాపస్తంబు డనెను.

## అస్థ్యుద్ధరణ ప్రకారము.

౨౮౭—తా. కర్తృజన్మత్రయ మనగా కర్తపుట్టిన తిథివారనక్షత్రములు, భద్రతిథులు, త్రిపాదనక్షత్రములు, మంగళ శుక్ర ఆదివారములు, భద్రకరణమును, విడువవలయును. అస్థుల నుద్ధరించుటకు ఆప్రదేశమునకు బంధువులతోగూడ వెళ్లి యచ్చట నివసించు భూతములగూర్చి నమస్కారము జేసి, ఓభూదేవీ! నీయందు సమస్తము లీనమైయున్నది పూర్వము నీయందు నుంచబడి సురక్షితముగా నున్నట్టి నాతండ్రి మొదలగువారి సంబంధమగు నస్థులను నాకివ్వవలయునని భూదేవిని ప్రార్థించి 'భూమిర్భూమ్నా' అనుమంత్రమును జపించుచు నస్థులనుంచబడిన కుంభమునకు భంగము లేకుండునట్లుగా మెల్లగా పుల్లతో త్రవ్వి తీయవలయును. అనంత మాకుంభమును గంధము పుష్పములు ఫలములు మొదలగు వానిచే నిండించి యాగొయ్యిని సమముగా నుండునట్లు పూడ్చి విశేషమగు నన్నము భక్ష్యములు వ్యంజనములు మొదలగువానిచే నాప్రదేశమునందు బలినుంచి 'బలింస్థా' అనుమంత్రముతో ననుజ్ఞదీసికొని యా యస్థికుంభమును తీసికొని నదీతీరమునకు వెళ్లి యచ్చటనుంచి పంచగవ్యములు పంచామృతములు నూరుకడవలతో నుదకము మొదలగునవియుంచి శుద్ధిపరచి భూతదయాపరులగు బ్రాహ్మణులు అస్థులను స్పృశించుచు నూరుపర్యాయములు మృత్తికాస్నానములను జేయవలయును.

దైవము లేని వానివిషయమై దేవతాభక్తి కలుగునట్లుగాను దేవతాభక్తి కలవానిని మిక్కిలి యధిక భక్తికలవానినిగాను బ్రాహ్మణులు చేయుదురు గాన యాబ్రాహ్మణులకు విశేషముగా దక్షిణల నివ్వవలయును. అనంతరము కర్త తనశుద్ధికొరకు ముప్పదిగాని యిరువైయైదుగాని మృత్తికాస్నానములను జేయవలయును తనకుశక్తిలేని యెడల నితరులచేత నైనను చేయించవలయును. అనంతరము మరియొక కలశమునందు శివాదులను గుఱించి "రుద్రసూక్తము పవమానసూక్తము విష్ణుసూక్తము" మొదలగు వానిచే నభిషేకము జేసి వసువులు, రుద్రులు, ఆదిత్యులు, పితృదేవతులు, శివుడు, ఇంద్రాదులు, ఇష్టదేవతులు మొదలగువారిని గంధపుష్పాక్షతాదులచే యథావిధిగాపూజించి నమస్కరించి బ్రాహ్మణులకు దక్షిణల నిచ్చి సంతోషపెట్టవలయును, అజినము, వస్త్రము, దుకూలము, కుశలు, మొదలగువానిచే గప్పి, జలములోనికి తీసికొని, వెళ్లి విడువవలయును. ఇందునుగురించి ఆదిత్యపురాణములో జెప్పినదేమనగా, పూర్వము దేవేంద్రుడు మిత్రత్వముచే వృత్రాసురుని చంపినందువలన తద్దోషనివృత్తి నిమిత్తమై సూర్యునివద్దకువెళ్లి అస్థిని క్షేపణవిధి నడుగగా నతడిట్లు చెప్పెను. ఓయింద్రుఁడా వసువులు సనాతనుడను దేవునిగురించి చెప్పిన విధముగా జెప్పెదను. గంగానదిలో నస్థులనుంచినయెడల వారికి బ్రహ్మలోకప్రాప్తి కలుగును. తల్లిదండ్రులయొక్కగాని బంధువులయొక్కగాని యస్థులను గంగోదకములో విడిచినయెడల వారిచే జేయబడిన క్రియలన్నియు విశేషఫలము నొసగునని చెప్పఁబడియున్నది. కాఁబట్టి స్నానముజేసి పంచగవ్యముచే స్నానముజేయించి మృత్పిండమునం దుంచి తిలలు హిరణ్యశకలము మధువు ఆజ్యము మొదలగు వానినుంచి దక్షిణదిక్కును జూచుచు ధర్మరాజునకు నమస్కారమని జలములోనికి వెళ్లి ఆధర్మరాజు నాయందనుగ్రహము కలవాడగునని జలములో నస్థులను విడువవలయును. లేచి సూర్యుని వంకజూచి నమస్కరించి పిమ్మట దక్షిణలను బ్రాహ్మణుల కివ్వవలయును. ఇట్లు జేసినయెడల ప్రేతలోకమునందు నివసించి యున్న వానికి స్వర్గలోక నివాసముకలుగునని వసువులు సనాతనదేవునకు చెప్పినట్లుగా సూర్యుడు దేవేంద్రునకు జెప్పెను. మనుష్యులయొక్క అస్థు లెన్ని వేల సంవత్సరములు గంగానదియం దుండునో అన్ని వేల సంవత్సరములు స్వర్గలోకనివాసము కలుగునని మహాభారతమునందు జెప్పఁబడెను. భాద్రపద బహుళాష్టమియందు తల్లిదండ్రులు మొదలగువారి యస్థులను పంచ

గవ్యాదులచే ప్రోక్షణజేసి హిరణ్యశకలాదులనుంచి మృత్పిండమునందు నస్థులనుంచి ధర్మరాజును ధ్యానింపుచు జలములో విడిచి పితృతీర్థముగా జలమును విడిచి స్నానముజేసి సూర్యునకు నమస్కారము శక్తికొలది దక్షిణల నిచ్చినయెడల సమస్త పితరులను బ్రహ్మలోకమును పొందించు వాడగునని బ్రహ్మాండ పురాణమునందు కలదు. భాద్రపద బహుళాష్టమి యందు మధ్యాహ్న కాలంబున బ్రాహ్మణానుజ్ఞనుబొంది అస్థులను గంగలో విడిచినయెడల బ్రహ్మహత్య సురాపానము స్వర్ణస్తేయము గురుదారా గమనము మొదలగు సమస్తమహాపాతకముల జేసినవాడును పాపముల నుండి విముక్తుడగును సందేహము లేదని సంవర్తుడు చెప్పెను. అస్థుల నొకచోటనుంచి కేశవాది నామముల జెప్పుచు పంచగవ్యాదులచే స్నానముజేయించి గంధపుష్పాదులచే పూజించి బ్రాహ్మణానుజ్ఞపొంది సావధానమనస్కుడై మృతినొందిన వానియొక్క గోత్ర నామములను జెప్పి సంకల్పముజేసి ధర్మరాజునకు నమస్కారముజేసి యఘమర్షణ సూక్తమును పఠింపుచు నస్థులనన్నింటిని జలములో విడువవలయునని పద్మపురాణము నందు విశేషముగా జెప్పబడినదని తాత్పర్యము.

## సంఘాతమరణము.

౨౮౮—తా. ఒక్కదినమునందు ఇద్దరుగాని బహుమందిగాని మృతినొందినయెడల సంఘాతమరణమని చెప్పబడును. కాబట్టి భార్య, సోదరుడు, సపిండులు, మొదలగువారిలో సంఘాతమరణము కలిగినయెడల మరణక్రమముగా శ్రాద్ధముల నాచరింపవలయును. దీనిని గుఱించి ఋష్యశృంగుడు చెప్పినదేమనగా, మొదటగా మరణించినవాని శ్రాద్ధము ముందుగాను తర్వాత రెండవవానికి తర్వాత మూడవవానికి నీప్రకారము మరణక్రమముగా శ్రాద్ధములను జేయవలయు ననియు నిద్దరుగాని బహుమందిగాని యేక కాలమునందు మృతినొందుటచే క్రమము తెలియనప్పుడు సంబంధములో నావశ్యకత్వమునుబట్టి యాచరింపవలయుననియు జెప్పెను. భార్య, పుత్రుడు, వానికుమారుడు, సోదరుడు, వానికుమారుడు, కోడలు, అత్తమామలు, తల్లిదండ్రులు, వీరలయొక్క సంఘాతమరణమునందు సంవత్సరమునకు లోపుగానైతే ముందుగా తల్లిదండ్రులకు శ్రాద్ధముల నాచరించవలయును. తల్లిదండ్రులు, భార్య, పుత్రులు మరణించినప్పుడును సంవత్సరమునకులోపల ముందుగా తల్లిదండ్రులకే చేయవలయును అని యున్నది. కాబట్టి సంవత్సరమునకులోపల తల్లిదండ్రుల సాపిండ్యమునే

చేయవలయును. భార్య, కుమారుడు, కోడలు, పౌత్రుడు, సోదరుడు, వానికుమారుడు, తల్లిదండ్రులు వీరలయొక్క సంఘాతమరణమునందు వారివారి మరణములయొక్క పదకొండవ దినములయందు నాద్యశ్రాద్ధమును జేసి తల్లిదండ్రుల సాపిండ్యమును జేసినపిమ్మట త్రిపక్షాది కాలములయందు వారివారికి సాపిండ్యము నాచరింపవలయును. పత్ని మొదలగు వారికంటె నితరులయొక్కయు తల్లిదండ్రులయొక్కయు సంఘాతమరణమునం దెట్లనగా, దహనముమొద లాద్యశ్రాద్ధపర్యంత మాచరించి సంవత్సరానంతరము ముందుగా ఊనమాసికాది శ్రాద్ధముల నాచరించి పిమ్మట వారివారి సాపిండ్యములను జేయవలయును. ఈప్రకారముగానే లోకాక్షియు సంఘాతమరణము విషయమై చెప్పెను.

—{ భార్య మొదలగు వారికంటె నితరులయొక్కయు తల్లిదండ్రుల యొక్కయు సంఘాతమరణమునందు జేయవలసిన విధానము. }—

అర్థ—తా. తల్లిదండ్రులయొక్క సంఘాత మరణమునందును తండ్రి మృతినొందినపిమ్మట మరుదినమునందు తల్లి సహగమనము జేసినను వారివారి పండ్రెండవదినమునందు సపిండీకరణమును జేయవలయును. తల్లిదండ్రు లేకకాలమునందు మరణించినను అనుగమనమునందును పుత్రులు తల్లిదండ్రులకు జేయవలసిన క్రియలనన్నియు తత్కాలమునందే చేయవలయును. తల్లిదండ్రులకు నితరులకు సంఘాతమరణము కలిగినప్పు డావిధముగా జేయనక్కర లేదు. అని దేవలుడు చెప్పెను ముందుగా తల్లి మరణించియుండగా పదిదినములలోపల తండ్రి మృతినొందినయెడల తల్లియొక్క మృతాశౌచము తండ్రియొక్క ఆశౌచముతోనే నివృత్తియగును. ముందుగా తండ్రి మృతినొందియుండగా పదిదినములలోపల తల్లి మృతినొందినయెడల తండ్రియాశౌచము నివృత్తియైనపిమ్మట తల్లిసంబంధమైన మరణాశౌచము పక్షిణి పట్టవలయునని కార్ష్ణాజని చెప్పెను. ఈప్రకారముగానే స్మృతియందును కలదు. ఇందును గురించి చెప్పఁబడిన విశేషమేమనగా, పూర్వదినమందు పెనిమిటి మృతినొందియుండగా మరుదినమునందు భార్య మృతినొందినను ఏకదినమునందు మృతినొంది సహగమనముచే నేకాగ్ని ప్రవేశము కలిగినను పక్షిణ్యాశౌచములేదు. మరణదినక్రమముగా శ్రాద్ధముల నాచరింపవలయును. భార్య, పుత్రుడు, కోడలు, పౌత్రుడు, సోదరుడు, వానిపుత్రులు, తల్లిదండ్రులు, వీరలకు నేకదినమునందు మరణము విషయమై యేకాదశదినమునందు ఆద్యశ్రాద్ధమును జేసి త్రిపక్షాది కాల

ములయందు సపిండనమును జేయవలయునని లోకాక్షి చెప్పెను. ఒక్క దినమునందు తల్లిదండ్రులకు మృతికలిగినను లేక పూర్వాపరదినములలో వారిలో నెవరైనను మృతినొందినను త్రిపక్షాది కాలములయందు సపిండినము జేయవలయును. సహగమన మరణమునం దట్లులేదు. దంపతులకు ననుగమనవిషయమై సమానముగా నవశ్రాద్ధాదులనుజేసి పిండనిర్వాపణము వేరుగా జేయవలయునని దేవలుడు చెప్పెను. తండ్రి మరణము నొందినప్పుడు వానికి బహుభార్యలుండి అందరును సహగమనము జేసిన యెడల ఒక్కపాకమునందే ముందుగా తండ్రికిని పిమ్మట తల్లికిని తర్వాత సవతితల్లులలో జ్యేష్ఠాదిక్రమముగా శ్రాద్ధముల నాచరింపవలయునని చెప్పబడెను. మరియు భృగువు చెప్పిన దేమనగా, ఇద్దరుగాని యనేక మందిగాని యొక్కకాలమునందు మృతినొందినయెడల తంత్రముగా దహనాదుల నాచరించి ముందు తండ్రికి పిమ్మట తల్లులలో జ్యేష్ఠానుక్రమణముగా నేకపాకముతో వేరువేరుగా శ్రాద్ధములను జేయవలయునని చెప్పెను. ఒక్కదినమునందు రెండుమూడు నిమిత్తములు కలిగినప్పుడు వాటిలో ముఖ్యమగునవి ముందుగాను జేయవలెను.

మరణదిన నిర్ణయము.

౫౧౦—తా. మనుష్యులకు కర్మాచరణ కాలనిమిత్తము జనన మరణముల విషయమై తాత్కాలిక తిథియేయని స్కాందపురాణమునందు చెప్పబడెను. అభ్యంగనము సింధుస్నానము దంతధావనము మైథునము జననము మరణముల విషయమై తత్కాలమునందే తిథి యుండునో యది యే సంకల్పమునకు జెప్పుకొనవలయును. వివాహము మృతము జననముల విషయమై రాత్రి రెండుజాములకు లోపుగా జరిగినయెడల పూర్వదినముగాను రెండు జాములకుపైన జరిగినయెడ లపరదినముగా నెంచుకొనవలయును. స్త్రీలకు రజోదర్శనవిషయమై రెండుజాములకు లోపుగా పూర్వదినముగా నెంచుకొనవలెను. రెండుజాములు గడచిన పిమ్మట నొక ముహూర్తకాల పర్యంతము పూర్వదినముగాను తదుపరికాలముపరదినముగా నెంచుకొనవలయునని మరియొకరు చెప్పిరి. సూర్యోదయమునకు లోపుగా దహనమరణములు జరిగినప్పుడు పూర్వరాత్రిగానె యెంచుకొనవలయునని స్మృతిసంగ్రహమునందు జెప్పబడెను. ఏదినమునందు పగలు రజస్రావము మరణము జననము కలుగునో యాదినము మొదలు లెక్క పెట్టుకొనవలయును. రజోదర్శనవిషయమై యాదినము మొదలు మూడు

దినముల పర్యంతముండి నాల్గవదినమునందు శుద్ధికావలయును. అని పారస్కరుడు పరాశరుడు చెప్పెను. బ్రాహ్మణులకు జననమరణముల విషయమై పదిదినములు, క్షత్రియులకు పండ్రెండు దినములు, వైశ్యులకు పదియేను దినములు, శూద్రులకు ముప్పదిదినములు, న్యాయవర్తులగు శూద్రులకు పదియేను దినములనియు చెప్పబడెను, రాత్రిని మూడు భాగములుచేసి రెండుభాగములు పూర్వదినముగాను మూడవభాగముపరదినముగాను జననమరణ స్థాలీపాకముల విషయమై తెలిసికొనవలయునని కొందరనిరి. రజోదర్శనము జననము మరణముల విషయమై అర్ధరాత్రమునకు లోపుగానైతే పూర్వదినముగ గ్రహించవలయునని యముడు చెప్పెను. ఉదయము మొదలు తిరిగి యుదయమగువరకు పూర్వదినమని చెప్పఁబడును. కాఁబట్టి యీప్రకారముగానె గ్రహించుకొనవలయునని వేదవేత్తలు కొందరుచెప్పిరి. ఇట్లు అనేకమును లనేకవిధములుగా చెప్పినందువలన రాత్రి రెండుజాములకు లోపుగా పూర్వదినముపరమందైయితె పరదినమనియు రాత్రిని మూడుభాగములు చేసిన రెండుభాగముల పర్యంతము పూర్వదినము మూడవభాగముపరదినమనియు ఉదయము మొదలుదయపర్యంతము పూర్వదినమే యనియు మూడుపక్షములుగా నిర్ణయింపఁబడినది. కాఁబట్టి జననమరణ రజోదర్శనముల విషయమై యాయాదేశాచారానుగుణ్యముగా నాశౌచమును గ్రహించుకొనవలయును.

### శవానుగమన ప్రాయశ్చిత్తము.

౨౫౧—తా. బ్రాహ్మణుడు శూద్రశవానుగమనము చేయగూడదు. ఒకవేళ శవానుగమనము చేసినయెడల స్నానముజేసి యగ్నిహోత్రమును స్పృశించి ఘృతప్రాశన జేయవలయునని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. ఘృతప్రాశనము భోజనవిధిగా జెప్పబడలేదు. కాఁబట్టి భోజనము తిరిగి చేయవచ్చును. సవర్ణుడుగాని అధికవర్ణుడుగాని ప్రేతయగునేని స్నేహామువలన శవముతోగూడ నరుగుదెంచినయెడల స్నానముజేసి యగ్నిహోత్రమును స్పృశించి ఘృతప్రాశన జేయవలయునని బ్రహ్మాండపురాణమునందు జెప్పఁబడెను. బ్రాహ్మణుడు బంధువునిరీతిగా క్షత్రియశవానుగమనముచేసిన స్నానముజేసి యగ్నిహోత్రమును స్పృశించి ఘృతప్రాశనజేసి యాదినము నాశౌచము పట్టవలయును. వైశ్యశవానుగమనము చేసిన పక్షిణ్యాశౌచము శూద్రశవానుగమనముజేసిన మూడు



దినములాశౌచమును పట్టవలయును. మరియు బ్రాహ్మణుడు శూద్రశవాను

గమనముచేసిన మూడుదినము లాశౌచముపట్టి సముద్రములో ప్రవహించునట్టి నదిలో స్నానముజేసి నూరుపర్యాయములు ప్రాణాయామము జేసి ఘృతప్రాశనజేసిన శుద్ధికలుగుననియు క్షత్రియ వైశ్య శవానుగమనముచేసిన యొక్కదిన మాశౌచమనియు క్షత్రియుడు వైశ్య శూద్ర శవానుగమనము చేసిన పక్షిణ్యాశౌచమనియు వైశ్యుడు శూద్రశవానుగమనముచేసిన యొక్కదిన మాశౌచమనియు రోదనమందు నొక్కదినమే యనియు విష్ణువు చెప్పెను.

వమనప్రాయశ్చిత్త విధానము.

౨౫౨——తా. పితృస్థానములయందు నియమింపబడిన ముగ్గురులో పితృస్థానీయ బ్రాహ్మణుడు వమనముజేసిన యెడల (అనగా క్రక్కుట) ఆదినమునం దుపవాసముజేసి మరునాడు తిరిగి శ్రాద్ధము పెట్టవలయును. శ్రాద్ధమాచరింప బడుచుండగా ముగ్గురులో నెవరైనను వమనము జేసిన యెడల లౌకికాగ్నిని ప్రతిష్ఠించి యగ్నిహోత్రుని యర్చించి వపనముజేసికొనిన వానిస్థానమందు బ్రాహ్మణ ప్రతినిధిగా నావాహనముజేసి గోత్ర నామములను జెప్పి యాసనాద్యావాహనముజేసి యన్న త్యాగముజేసి యగ్నిహోత్రములో మొదట ప్రాణాది నైదాహుతులనుంచి పిమ్మట నేడు కబళములనుగాని యెనిమిది కబళములనుగాని హోమముజేసి మిగిలిన హోమమును సమాప్తిని బొందించి శ్రాద్ధశేషమును పూర్తిచేయవలయును. ఇట్లు పితృస్థానమునందు నావాహనము జేయబడిన ముగ్గురులో నెవరైనను విశ్వేదేవస్థానమందు విష్ణుస్థానమందు నావాహనము జేయబడిన వారిలో నెవరైనను వమనము జేసికొనినను వారివారి స్థానముల యందు బ్రాహ్మణ ప్రతినిధిగా నగ్నిహోత్రము నావాహనముజేసి పూర్వము చెప్పబడిన విధముగా శ్రాద్ధమును పూర్తిచేయవలెను. భోక్తవమనముజేసికొని నప్పుడు యగ్నిప్రతిష్ఠాపనజేసి ముప్పదిరెండు కబళముల హోమముజేసి శ్రాద్ధశేషమును పూర్తిజేసిన శ్రాద్ధదోషము లేదని మరి యొకరుచెప్పిరి. శ్రాద్ధమునందు బ్రాహ్మణులు భుజింపుచుండగా నొకరి నొకరు తాకినయెడల నన్నమును విడిచిపెట్టక నంతయు భుజించి నూట యెనిమిది పర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. బ్రాహ్మణులు భుజింపుచుండగా నొకరి యుచ్ఛిష్టము నొకరికి స్పర్శకలిగి నప్పుడు యాయన్నమును పరిత్యాగముచేసి తిరిగి మరియొక పాత్రయందు వ్యంజనసహితముగా నన్నము సమస్తపదార్థములనుంచి బ్రాహ్మణుని భుజింప

జేయవలయును. ఆ బ్రాహ్మణుడు భుజించిన పిమ్మట స్నానము జేసి నూట యెనిమిది పర్యాయములు గాయత్రీమంత్రమును జపించవలయును. ఆద్య శ్రాద్ధమునందు బ్రాహ్మణుడు భుజింపుచుండగా వమనము కలిగిన 'యత్తే కృష్ణ' అనుమంత్రముతో హోమము జేయవలయును. షోడశశ్రాద్ధము నందు భుజింపుచున్న బ్రాహ్మణునకు వమనము కలిగిన లౌకికాగ్నియందు యథావిధిగా ప్రేతాహుతిని జేయవలయును. అనుమాసికమందు భుజింపుచున్న బ్రాహ్మణుడు వమనము జేసిన యెడల కబళములను తిరిగి భుజించిన పిమ్మట తృప్తినడుగవలయును. అమావాస్యాను మాసమునందు జరుగు శ్రాద్ధమునందు కూడ వమనము జరిగినయెడల అనుమాసికమునందు వలెనే జరిపి శ్రాద్ధశేషమును పూర్తి చేయవలయును. అమావాస్యయందైన మాసికమునందు వమనము కలిగిన నీప్రకారమే చేయవలయును. మహాలయాది శ్రాద్ధములయందు పిత్రాదులకు వమనము కలిగిన పితామహాదులకు వలెనే చేయవలయును. శ్రాద్ధమునందు భుజింపుచుండగా నుచ్ఛిష్ట స్పర్శకలిగినయెడల భుజింపగా మిగిలిన యన్నము పరిత్యజించవలయును. పిమ్మట కర్త ఆస్థానమందు లౌకికాగ్నిని ప్రతిష్ఠించి యావాహనాసనాదులచే తిరిగి యర్చనాదికము జేసి మరియొక పాత్రయందు నన్నాదులనుంచి త్యాగముచేసి పురుషసూక్త మంత్రములతో ముప్పది రెండాహుతుల నాయగ్నిహోత్రమునందు హోమము జేసి మిగిలిన హోమశేషము నగ్నియందుంచి శ్రాద్ధశేషమును పూర్తిచేయవలయును. పిండముల సమీపమునందు వమనము జేసినయెడల తిరిగి పాకము జేసి పిండప్రదానము చేయవలయునని యొకరుచెప్పిరి. ఉచ్ఛిష్ట స్పర్శ తెలిసినప్పుడు భుజింపుచున్న పాత్రను విడిచి యక్కడ గోమయముచే నలికి మరియొక పాత్రనుంచి యన్నము వ్యంజనాది సమస్తపదార్థముల నుంచినపిమ్మట తిరిగి పరిషేచనము జేసి భుజించినయెడల దోషములేదని మరియొకరు చెప్పిరి. శ్రాద్ధపంక్తియందు బ్రాహ్మణులు గూర్చుండి యొకరినొకరు తాకినయెడల భుజింపుచుండెడి యన్నము నిద్దరు విడిచి పెట్టవలయును భుజించినయెడల చాంద్రాయణము చేయవలయునని యింకొకరు చెప్పిరి బ్రాహ్మణుడు భుజింపుచుండగా నుచ్ఛిష్టస్పర్శ కలిగినను లేక శ్వానము శూద్రులు మొదలగు వారియొక్క స్పర్శకలిగినను ఆయన్నమును విడిచిపెట్టి యాదిన ముపవాసము జేసి మరునాడు పంచగవ్య ప్రాశనము జేసిన శుద్ధికలుగునని మరియొకరు చెప్పిరి.

వమనమందు మంత్రవిధానము.

౫౫౩—తా. భుజింపుచుండెడి బ్రాహ్మణులకు వమనముయొక్క నిర్ధారణ కలిగినప్పుడు శ్రాద్ధమునకు విఘ్నము కలుగుచుండగా జేయవలసినవిధి యేమనగా, ఇంద్రునకు సోమసూక్తము చేతను అగ్నిహోత్రము చేతను భోజనము చేతను అని మూడువిధములుగా చెప్పఁబడియున్నది. యిక్కఁడ విమర్శన యేమనగా, పిండప్రదానమైన పిమ్మట శ్రాద్ధమునందు నిమంత్రణ జేయబడిన బ్రాహ్మణులలో నొకరుగాని బహుమందిగాని వమనము జేసినప్పుడు శ్రాద్ధమునకు విఘ్నము కలుగుచున్నది. కాఁబట్టి సూక్తశతమును పఠించినయెడల సంపూర్ణము నొందును. పిండప్రదానముకంటె పూర్వము పితృస్థానీయునికంటె నితరులగు పితామహ ప్రపితామహ విశ్వేదేవస్థానములయందు నిమంత్రిత బ్రాహ్మణులలో నెవరైన నొకరు వమనము జేసినయెడల శ్రాద్ధవిఘ్న నివృత్తికొరకు హోమమును అనేకులు వమనము జేసిన హోమము సూక్తపారాయణము జపము పితృస్థాన నిమంత్రిత బ్రాహ్మణుడు వమనము జేసిన దర్శశ్రాద్ధమును చేయవలయును. ఆదినమునందు పునఃపాకము జేసి శ్రాద్ధమునందు భుజింపజేయవలయును. మాసికాబ్దికశ్రాద్ధమగునేని యాదినమునం దుపవాసము జేసి పరదినమునందు తిరిగి శ్రాద్ధమాచరించి భుజింపజేయవలయును. సంగ్రహకారుని వచన మేప్రకారమనగా, శ్రాద్ధమునకు ప్రధానము పిండప్రదానము దానికి భోజనము అంగభూతము అనగా సహాయకారి కాఁబట్టి భోజనక్రియలకు హానికలిగినప్పుడు శ్రాద్ధమును రెండుపర్యాయములాచరింప నక్కఁరలేదనిచెప్పెను. ఈవిషయము సంకల్పశ్రాద్ధములకంటె నితరములగు పార్వణశ్రాద్ధమునందు పితృస్థాన నిమంత్రిత బ్రాహ్మణునికంటె నన్యస్థాన నిమంత్రిత బ్రాహ్మణునికి వమనముచే భోజనక్రియకు హానికలిగిన సందర్భములో తెలిసికొనవలయును. శ్రాద్ధావృత్తిని చేయగూడదనిచెప్పి నందువలన భోజనక్రియకు నిషేధము కలుగుటచే హోమము చేయవలయునని సూచింపబడినది. శ్రాద్ధపంక్తియందు భుజింపుచున్న బ్రాహ్మణులలో నొకవమనము జేసినయెడల లౌకికాగ్నిని ప్రతిష్ఠించి యర్చనాదికము జేసి హోమము చేయవలయునని ఆసంగ్రహకారునిచేతనే చెప్పబడినది. ఇట్లుచేయువిధానము చెప్పబడెను.

పితృస్థానవ్యతిరిక్త బ్రాహ్మణవిషయము.

౫౫౪—తా. స్మృత్యంతరములో జెప్పబడిన దేమనగా. విశ్వేదేవస్థాన నిమంత్రితులుగాని పితామహ ప్రపితామహస్థాన నిమంత్రితులు

గాని వమనము జేసినయెడల ప్రాణాపానాది యైదు మంత్రములతోను ముప్పదిరెండు పర్యాయములు హోమము జేసి హోమ శేషమును పూర్తి నొందించి శ్రాద్ధశేషమును సమాప్తి చేయవలయును. శ్రాద్ధమునందు భుజింపుచుండగా నొకభోక్తకు వాంతి కలిగినయెడల నగ్నిని ప్రతిష్ఠించి ఆస్థాన సంబంధమగు వాని గోత్రనామములను జెప్పి యావాహనాసనాదిక మగు నర్చనను గావించి అన్నత్యాగమును జేసి ప్రాణాపానాది యైదు మంత్రములచేతను ముప్పదిరెండు పర్యాయములు యథావిధిగా హోమ మును జేసి హోమ శేషమును సమాప్తినొందించి శ్రాద్ధశేషమును పూర్తి చేయవలయును. అది యేవిధమనగా ప్రాణాపానాది యైదు మంత్రముల వారు ఆవృత్తులగా జెప్పినయెడల ముప్పదియగును మిగిలిన రెండును ఉదా న సమానములను జెప్పిన ముప్పదిరెండగును. హోమములు పూర్తియగు నంతవరకు ఆవృత్తిగా జెప్పవలయు ననియు ఆవృత్తిజేయగా మిగిలినప్పుడు చివర మంత్రములతో హోమసంఖ్యను పూర్తి చేయవలయు ననియు సూత్రములు చెప్పినవి. కాబట్టి చివరమంత్రములతోనే సమాప్తి చేయ వలయును. ఇక్కడ ఒక్కబ్రాహ్మణుడే యని చెప్పుటచే పైన చెప్పిన విధ ముగా జేయవలయును అనేకులు వమనము చేయుటచే విఘ్నము కలిగిన యెడల హోమసూక్తములచేతను హోమసూక్త జపములచేతను విఘ్న మును తొలగించవలయును. ఈప్రకారము చేయనియెడల వెనుక యొక బ్రాహ్మణుడు అని చెప్పిన దానికి వ్యర్థత్వము కలుగుచున్నది. పిండప్రదా నము జేయక పూర్వము భోక్తకు వమనము సంభవించిన యెడల తిరిగి పాకముచేసి యథావిధిగా పిండప్రదానము చేయవలయు ననెడి యితర స్మృతివచనము పితృస్థానసంబంధమగు భోక్తవిషయముగా జెప్పబడెను ఎందువల్ల ననగా శ్రాద్ధమునకు పిండప్రధానమే ప్రధానమనియు తిరిగి శ్రాద్ధము చేయవలయు నని యున్నందున పితృస్థాన విషయముగా గ్రహిం చుకొనవలయును. మరియు పిండప్రదానము జేయక పూర్వము పితృస్థానీ యుడు వమనము జేసికొనిన యెడల తిరిగి పాకమును జేసి యథావిధిగా శ్రాద్ధము నాచరింప వలయుననియు ఆదినమునందే తిరిగి పాకము జేసి శ్రాద్ధము చేయవలయు ననెడి రెండువచనములు దర్శశ్రాద్ధ విషయముగా తెలిసికొనవలయును. మృతదినాబ్దికమునకు విఘ్నము సంభవించిన యెడల మరుదినమునం దాచరింపవలయునని యున్నది. ఆవిషయము ముందు జెప్పబడును. బ్రాహ్మణు లన్న శ్రాద్ధమును జేయుటకు నాటంకము సంభ

వించెనేని మాసికశ్రాద్ధము ప్రత్యాబ్దికముగాక మిగిలిన శ్రాద్ధములను అమావాస్యాదిని తిరిగి పాకమును జేయుటకు వీలు లేనియెడల ఆమద్రవ్యముతోనే చేయవలయునని యున్నది. మాసికాబ్దికవిషయమైు యితరస్మృతులలో చెప్పబడిన దేమనగా పితృపితామహాది ముగ్గురు స్థానములలో పితృస్థాన నిమంత్రితుడు వమనము జేసికొనిన యెడల ఆదినమునం దుపవాసముండి మరుదినమున శ్రాద్ధ మాచరింపవలయునని తిరిగి శ్రాద్ధవిధిని చెప్పుటచేతను మాసికాబ్దిక విషయముగా నిశ్చయింపబడుచున్నది ఇచ్చట సంకల్ప శ్రాద్ధమునందు తిరిగి చేయుటను గురించి సంగ్రహకారుడు చెప్పిన దేమనగా సంకల్పశ్రాద్ధమునందు భోజనక్రియయే ప్రధానమైయున్నది. కాబట్టి పితృస్థానీయులలో వమనము కలిగినయెడ తిరిగి చేయవలయునని చెప్పెను. పితృస్థానీయులలో ననగా పితృస్థానమున నిమంత్రతునకే యని తెలియవలెను. పితామహాది స్థానీయుల విషయముకాదు ఈసంకల్ప శ్రాద్ధమునందును పూర్వము చెప్పబడిన యితరస్మృతుల సంబంధమును పట్టి యాదినమునం దుపవాసముచేసి మరుదినమునందు శ్రాద్ధము నాచరింపవలయును. పితామహ ప్రపితామహ స్థానీయులు విశ్వేదేవస్థానీయుడు వమనము చేసికొని నందువలన విఘ్నము కలిగనేని పూర్వముచెప్పినట్టి వ్యవస్థను అనుసరించి తెలిసికొనవలయును.

ఉపవాస స్వరూపమును చెప్పుచున్నాడు.

౩౫౫—తా. పాపకార్యములనుండి మళ్లి మంచికార్యములయందాసక్తికలిగి నిద్రాసంభోగాదులను వర్జించి సుగుణములతో గూడియుండుట యుపవాసమని చెప్పబడును. 'ఇంద్రాయ సోమసూక్తేన' అనగా నింద్రునికొఱకు సోమసూక్తమును పఠించవలయునని సామాన్యముగా ప్రాయశ్చిత్తవిధానము చెప్పుటవలన వాంతి వెళ్లుటగాక మరియొక కారణమువల్లను విఘ్నము కలిగినప్పుడు కూడా యీప్రాయశ్చిత్తమునే చేయకూడదా యని ప్రశ్నచేసిన యెడల ఆశౌనకునిచేతనే తిరిగి శ్రాద్ధమును చేయవలయునని చెప్పబడుటవలన నట్లు చెప్పకూడదు. భోజనము ప్రారంభించుటకు పూర్వముగాని పరమందుగాని శ్రాద్ధమునకు విఘ్నముకలిగనేని తిరిగి శ్రాద్ధమును చేయవలయును జపహోమములు తృప్తికరమైనవి కావని స్మృతులయందు చెప్పబడినది. తిరిగి శ్రాద్ధము నేదినమందు చేయవలెనో చెప్పబడుచున్నది. శ్రాద్ధమునకు విఘ్నము కలిగినప్పుడును ఆబ్దిక దినము తెలి[illegible]నప్పుడును [illegible]దినమందుగాని యమావాస్యయం

దుగాని శ్రాద్ధము నాచరింపవలయునని పూర్వమే చెప్పబడియున్నది. ఉచ్ఛిష్ట లేపనము యొక్క స్పర్శ కలిగినప్పుడు మరియొక జలముచే ప్రక్షాళనము జేసికొని భోజనము చేసిన పిమ్మట తిరిగి స్నానము చేసి మూడువందల పర్యాయములు గాయత్రీమంత్రజపమును చేయవలయును. ఒకరి యుచ్ఛిష్టము మరియొకరికి సంస్పర్శ కలిగినయెడల నుచ్ఛిష్ట స్పర్శపాత్రను విడిచి మరియొక పాత్రయందు అన్నము వ్యంజనాది సమస్తపదార్థమును పూర్వమువలెనే యుంచి యాబ్రాహ్మణుని భుజింప చేయవలయును.

## విధురవిధవా లక్షణము.

౨౪౬—తా. అగ్నిహోత్రములు లేనివానికి వేదమే యగ్నిహోత్రమనియు వేదపఠన జేయనివాడు అనగ్నికుడనియు ఆప్రకారమే పుత్త్రులు లేనివాడును అనగ్నికుడనియు పుత్త్రులుకలవాడు అగ్నిహోత్రములు కలవాడే యనియు చెప్పబడెను. పుత్రులుకలవాడు అగ్నిహోత్రములు కలవాడనియు గృహస్థుడనియు మరియొకరు చెప్పిరి. భార్యాపుత్రులు లేనివాడు విధురుడని చెప్పబడును. పుత్రవంతుడగు గృహస్థుడు గ్రుడ్డివాడైనను అగ్నిహోత్రములు లేనివాడైనను యజ్ఞము దానము జపము హోమము స్వాధ్యాయము పితృకర్మ మొదలగు కర్మలను జేయుటయందు దూష్యుడు కాడు. అనగా, అర్హతకలవాడగును. భార్యాపుత్రులు లేని పురుషుడు విధురుడనియు పెనిమిటి పుత్రులు లేని యాడుది విధవయనియు పెద్దలచే చెప్పబడియున్నది.

## పాకనియమము.

౨౪౭—తా. భార్య వెలుపలనున్నప్పుడు మాసికము సపిండనము అమాశ్రాద్ధము ఆబ్దికము వీటివిషయమై పాకమన్యునిచే జేయించవలయునని ధర్మశాస్త్రమునందు కలదు. అనగా తల్లిదండ్రులకంటె నితరులగు జ్ఞాతులకు కర్తృత్వము వహించి చేయుచున్నప్పుడు భార్య వెలుపలుండిన యెడల మాసికములు షోడశశ్రాద్ధములు సపిండనము దర్శశ్రాద్ధము వీటివిషయమై పాకము తాను జేయుటకు శక్తుడు కానియెడల మరియొకరిచే పాకము చేయించవలయును. ఒక్కనియందు కర్తృత్వము కలిగి యనేక శ్రాద్ధముల నొక్కదినమందు చేయవలసినప్పుడు తంత్రవిధిగా వైశ్వదేవమును జేయవలయును. వేరుపాకము చేయనక్కరలేదు. నిత్యనైమిత్తికములగు శ్రాద్ధములు సంభవించినప్పుడు నిత్యశ్రాద్ధమును విడువకూడదు. నైమిత్తికమును ముందుగావించి పిమ్మట నిత్యమును చేయవలెను. ఒక్క

కర్తృత్వమే కలిగి యున్నప్పుడును ఏకపాకముతో తంత్రప్రకారము జరిగించవలయును. అనేక కర్తృత్వములగు శ్రాద్ధములు సంభవించినప్పుడు వేరుపాకము చేయవలయును. తల్లిదండ్రులయొక్క శ్రాద్ధము లేకదినమందు సంభవించినయెడల నొక్కపాకమునందే ముందుగా పితృక్రియలను జేసి పిమ్మట మాతృక్రియలను జేయవలయును. అగ్నౌకరణ మొకసారియే చేయవలెను. అర్ఘ్యమును వేరువేరుగా విడువవలయును. తల్లిదండ్రులకు మూడుమూడు పిండముల నుంచవలయును. అనేకతల్లుల శ్రాద్ధములయందు నొక్కబ్రాహ్మణునియందే యావాహనము జేసి యథావిధిగా పూజింపవలయును. పుత్రులు లేనివానివిషయమై దయకలిగి బహుశమైయున్నట్టి మహాలయమునందు శ్రాద్ధము నాచరింపవలయును. ఏకోద్దిష్టవిధానముగ జేయవలయునుగాని త్రిపూరుష వర్గత్రయముతో జేయకూడదు. విధవయగుస్త్రీ తనపెనిమిటి మొదలు ముగ్గురువరకును తనతండ్రి మొదలు ముగ్గురువరకును శ్రాద్ధమును అమాశ్రాద్ధమును జేయవచ్చును. తనశాఖాప్రకారముగ జేయుటకు సంభవము కానియెడల ఋక్ శాఖాప్రకారముగా శ్రాద్ధమును చేయవలయును. స్వశాఖానుసారముగా జేయుట సంభవముకానియెడల ఋక్శాఖాప్రకారను చేయవలయును. లేనియెడల కర్మహానియగును. ఇది పూర్వాచారమై యున్నదని ధర్మశాస్త్రమునందు కలదు.

పిండదానమందు నిర్దోషవచనములు.

౫౫౮—తా. భరణియందు వ్యతీపాతయందు త్రిస్పోష్టకులయందు ద్వాదశులయందు పిండప్రదానము జేయుట విషయమై వారదోషము లేదు. పక్షశ్రాద్ధము మృతాశ్రాద్ధముల విషయమై నిషేధింపబడిన దినమైనను పిండప్రదానము జేయవచ్చును దోషము లేదని గ్రంథాంతరమందు కలదు. తీర్థమునందు తీర్థశ్రాద్ధమునందు మహాలయపక్షమునందు ప్రత్యాబ్దికమునందు పిండప్రదానము జేయవచ్చును. దోషములేదని మనువు చెప్పెను.

మహాలయములు.

౫౫౯—తా. మహాలయపక్షములో ప్రతిదినమునందు జేయబడిన శ్రాద్ధము గయలో జేయబడిన దానితో సమానమగును. మహాలయపక్షములో భరణీనక్షత్ర యుక్తదినమునందు జేసిన నైదుగయలయందు జేయబడిన దానితో సమానమగును. వ్యతీపాతయందు జేసిన పదిగయలతో



సమానమనియు పక్షమధ్యయందు (అనగా నష్టమియనుట) జేయబడిన

యిరువైగయలతో సమానమనియు ద్వాదశియందు జేయబడిన నూరుగయలతో సమానమనియు అమావాస్యయందు జేసిన వెయ్యిగయలతో సమానమనియు ఆశ్వయుజ శుద్ధవిదియయందు పితృదేవతులను గురించి చేయబడిన శ్రాద్ధమక్షయమగుననియు చెప్పబడెను తండ్రి, పితామహుడు, ప్రపితామహుడు, తల్లి, పితామహి, ప్రపితామహి, మాతామహుడు, తల్లికి ప్రపితామహుడు, తల్లికి తల్లి, తల్లికి పితామహి, తల్లికి ప్రపితామహి, పినతండ్రి పెత్తండ్రులు, సవతితల్లులు, ఏకోదరులు, భిన్నోదరులు, తండ్రికి సోదరులపుత్రులు, తండ్రిసోదరులయొక్క భార్యలు, భార్య, తనకుమారుడు తండ్రికి తోబుట్టువ, మేనమామ, తల్లికి తోబుట్టువ, ఆమెకుమాళ్లు, కుమార్తె, ఆమెకుమారుడు, తనతోబుట్టువ, ఆమెకుమారుడు అల్లుడు, అత్తమామలు, మేనమామయొక్క పుత్త్రులు, భార్యయొక్క సోదరుడు, తోబుట్టువయొక్క పెనిమిటి, జ్ఞాతులతో సపిండులు, సమానోదకులు, ఉపాధ్యాయులు, తల్లిదండ్రులయొక్కయు తనయొక్క యితరమగు బంధువులు, అని యీప్రకారము శ్రాద్ధముల గురించిగాని తర్పణను గురించిగాని కారుణ్యవిధానము చెప్పబడెను. లేక మరియొకపక్షము కలదు. దైవము, తండ్రి, తల్లి, మాతామహుడు, తండ్రి సోదరుడు, తనసోదరుడు, మేనత్త, మేనమామ, భార్యయొక్కతండ్రి, తల్లితోబుట్టువ, తనభార్య, సవతితల్లి, దౌహిత్రుడు, మేనల్లుడు, కోడలు, సంబంధము కలవారు, బావమరది, గురువు, ఆచార్యుడు, ప్రభువు, స్నేహితుడు, వీనినిగురించి శ్రాద్ధాదులను జేయవలయునని మరియొకరు చెప్పిరి. స్మృతిసంగ్రహమునందు జెప్పబడినదేమనగా, భాద్రపద బహుళపాడ్యమి మొదలమావాస్యపర్యంతము శ్రాద్ధమాచరించిన ముఖ్యపక్షము. లేక పంచమిగాని అష్టమిగాని దశమిగాని ప్రారంభించి అమావాస్యపర్యంతము చేయవలయును. లేక తనశక్తిననుసరించి యొక్కదినమునందైనను జేయవలయును. ఏదినమునందాచరించిన నపరాహ్ణకాలమునందు జేయవలయును. మహాలయాది శ్రాద్ధముల నాచరించునపుడు తల్లులు యిద్దరు ముగ్గురు మొదలగు నెందరికి జేయవలసియుండిన నొక్క బ్రాహ్మణునియందే యావాహనము చేయవలయును. ప్రత్యాబ్దికమునందు వేరువేరుగా చేయవలయును. ఈవచనమే యితర స్మృతులయందు కలదు. మహాలయమునందు గయాశ్రాద్ధమునందు ప్రత్యాబ్దికమునందు అన్వష్టకలయందు వృద్ధిశ్రాద్ధమునందు తీర్థశ్రాద్ధమునందు తల్లియొక్క శ్రాద్ధమును వేరుగా జేయవలయును. భాద్రపద బహు

శపక్షములో నందతిథియందు శ్రాద్ధమాచరించి పిండప్రదానము జేయ వచ్చును. త్రయోదశియందు శుక్ర మంగళవారములయందు భాను జన్మ త్రయమునందు పుత్రమిత్రకళత్రాది వృద్ధిని కోరువాడు శ్రాద్ధమును చేయ గూడదు. పాడ్యమి మొదలు అమావాస్యపర్యంతము జేయుట ముఖ్యమనె పక్షను నాశ్రయించి పదియేను దినములయందు నిత్యము శ్రాద్ధము జేయు విషయములో నిషిద్ధదినమునందు పిండప్రదాన విధిగానైనను జేయ వచ్చును. లేక సంకల్పవిధానముగానైనను జేయవలయును. "దినేదినే గయాశ్రాద్ధం" అనునది మొదలు "పితౄణాం దత్తమక్షయం" అను పర్యంతమునందు గ్రంథమునకు తాత్పర్యము వ్రాయబడినది. సంతానము లేక మృతినొందినవారియందు దయగలవాడై అపరపక్షశ్రాద్ధము నేకోద్దిష్టవిధిగా జేయవలయును. త్రిపురుషవిధిగా జేయనక్కరలేదని ధర్మశాస్త్రమునందు కలదు. కాబట్టి తనవంశమునందు పురుషులుగాని స్త్రీలుగాని పుత్రులులేక మృతినొందిన యెడల వారికి నేకోద్దిష్టవిధిగా మహాలయ శ్రాద్ధమును జేయవలయును. త్రిపూరుష వర్గత్రయము ననుసరించి చేయ నక్కరలేదు. పుత్రులులేని వానియందు దయగలవాడై మహాలయ శ్రాద్ధమును జేయవలయును. పుత్రులు కలవానికి శ్రాద్ధమాచరించిన వానిపుత్రులకు నష్టము కలుగును. కాబట్టి చేయకూడదు. ఈవిధముగానే స్మృతిసంగ్రహమునందు చెప్పినదేమనగా, పుత్రులు కలవానిని గురించి మహాలయమునందు శ్రాద్ధ మాచరించినయెడల వ్యర్థమగును. మరియు శ్రాద్ధము జేసినవాడు పితృహత్య చేసినవాడగును. తనవంశీకులు స్త్రీలు పురుషులు ఎవరైనను మృతినొంది వారివృత్తాంతము తనకు తెలియని యెడల వారికి నేకోద్దిష్టవిధిగానే చేయవలయును. పార్వణవిధిగా చేయ నక్కర లేదు. మాతామహులను మహాలయాది శ్రాద్ధములయందు సపత్నీకులనుగా గూర్చి యావాహనమును జేయవలయును. అర్ఘ్యమును తర్పణమును విడుచునప్పుడును పిండము నిచ్చునప్పుడును భార్యలకు వేరుగా నివ్వవలయును. అనేకవిధములగు శ్రాద్ధములేక కర్తృత్వము కలిగినప్పుడు ఆయాశ్రాద్ధముల నొక్కపాకమునందే వేరుగా చేయవలయును. స్మృతి సంగ్రహములో గర్గుడు చెప్పిన దేమనగా, కృత్తిక, రోహిణి, రేవతి, మఘ, నక్షత్రములయందును దర్శశ్రాద్ధమునందును పక్షశ్రాద్ధమునందును, తల్లిదండ్రుల ప్రత్యాబ్దికము సంభవించినప్పుడు వారి యాబ్దికమును ముందుగా నాచరించి పిమ్మట దర్శాది శ్రాద్ధములను,

చేయవలయును. జ్యేష్ఠ, విశాఖ, ఆశ్రేష, మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు, త్రిజన్మనక్షత్రములు, ఆదివార, మంగళవారములు, పునర్వసు, వీట్లయందు శ్రాద్ధములను జేయగూడదు. శ్రాద్ధకర్తకు నిరువై నాల్గవనక్షత్రమునందు నిరువైయేడవ నక్షత్రమందును నందతిథులయందును, శుక్రవారమునందును, శ్రాద్ధము నెప్పుడు జేయగూడదు. కర్త యొక్క త్రిజన్మ నక్షత్రములయందును భార్యయొక్కయు పెద్దకుమారుని యొక్కయు జన్మనక్షత్రముల యందును శ్రాద్ధమును జేయగూడదు. ఆదివార మంగళవార శుక్రవారములు నందతిథులును నిషేధములు. శుక్రవారమునం దెప్పుడును చేయగూడదు. ప్రజాపతిచెప్పిన దేమనగా, వర్షఋతువులో సూర్యుఁడు, కన్యారాశియందు ప్రవేశించి యుండగా ప్రతి దినమునందును శ్రాద్ధమును జేయవచ్చును. లేక బహుళపక్షము పదియేను దినముల యందైనను లేకపంచమి అష్టమి, దశమి, మొదలుకొనిగాని లేక అమావాస్య యందైనను తనకుగల కారుణ్యమును గూర్చి శ్రాద్ధమును జేయవలయును అమావాస్యయందు శ్రాద్ధము నాచరించునప్పుడు తిథివారనక్షత్రాది దోషవిచారణ చేయనక్కరలేదు బ్రాహ్మణులకు భోజనము పెట్టుటకు ద్రవ్యములేని వాడగునేని పితృదేవతులకు పిండముల నైనను వేయవలయును. లేక సూర్యుఁడు వృశ్చికరాశిలో ప్రవేశించుటకు లోపుగా నెప్పుడైనను తనకు ద్రవ్యసమర్థత కలిగినప్పుడు అట్టి శ్రాద్ధమును జేయవచ్చును. లేక శ్రాద్ధమును జేయుటకు శక్తిలేనప్పుడు నిత్యము పితృసూక్తములను పఠనచేయవలయును. తిలోదకములను విడువవలయును. పదియేను దినములందును పితృదేవతలను గూర్చి సమిత్తులతో హోమమైనను జేయవలయును. లేక గోవులకు గడ్డినైనను వేయుచుండవలయును. ఒక్కదినముగాని రెండుదినములుగాని మూడుదినములుగాని యుపవాసము చేయవలయును. కాఁబట్టి ఇట్లు అనేకవిధములుగా చెప్పఁబడియున్నది. వీటిలో తనశక్తి ననుసరించి మహాళయశ్రాద్ధమును చేయవలయును. ఆషాఢ్యాది పంచమాపరపక్షము (అనగా భాద్రపద బహుళపక్షము) నందు శ్రాద్ధమును జేయక వ్యర్థముగా వెళ్లబుచ్చిన వానిని పితృదేవతులు హింసింతురు. కాఁబట్టి తెలిసిన విద్వాంసులు మహాళయ పక్షమునందు పితృదేవతులను గూర్చి శ్రాద్ధమును చేయవలయును. తల్లిజీవించి యుండునప్పుడు సవతితల్లులకు నేకోద్దిష్టముగాను సదైవతముగాను జేయవలయును. మఘాష్టమి అమావాస్య శ్రాద్ధములయం

ధ్యను తల్లిదండ్రుల మృతదినములయందును పిండప్రదానము జేయవచ్చును. వారనక్షత్రాది దోషములేదు, మహాలయమునందు గయాశ్రాద్ధమునందు మృతినొందిన వారియొక్క మృతదినములయందును తంత్రముగా శ్రవణముజేసి వేఱువేరుగా శ్రాద్ధమును చేయవలయును. మహాలయ పక్షములో పదిహేను దినములయందును నిత్యము శ్రాద్ధమును జేయువాడు ఆదినమునందే శ్రాద్ధాంగతర్పణ చేయవలయును. ఒక్కదినమునందే మహాలయ శ్రాద్ధమును జేయువాడు శ్రాద్ధాంగతర్పణను మరుదినమునందు చేయవలయును. పక్షమనఁగా పాడ్యమిమొదలమావాస్యపర్యంతము పదిహేను దినములయందు శ్రాద్ధమును జేయువాడు నందతిథ్యాది విచారణ చేయనక్కరలేదు ఆప్రకారముగా కార్ష్ణాజనియు చెప్పెను చతుర్దశియు విడిచిపెట్టకూడదనెను. అమావాస్యయందు మృతదినమునందు పితృపక్షమునందు శ్రాద్ధమును సపిండీకరణమును చేయవచ్చును. తిథివారాదులను చూడనక్కరలేదని స్మృతిసారసముచ్చయమునందు చెప్పఁబడినది. అమావాస్య వ్యతీపాత భరణి రెండు ద్వాదశులు వీటియందు శ్రాద్ధము నాచరించునప్పుడు తిథివార నక్షత్రాది విచారణ చేయనక్కరలేదని స్మృత్యంతరమందు చెప్పబడినది. మరియు మహాలయమునందు గయయందు తల్లిదండ్రుల శ్రాద్ధదినములయందు పితృదేవతలు పిండము నపేక్షించియుందురు. కాబట్టి అట్టిసమయములందు పితృదేవతలకు పిండప్రదానము జేయవలయును. కుమార్తెయొక్కయు పుత్రునియొక్కయు వివాహమైన యాఱుమాసములలోపల తల్లిదండ్రుల యాబ్దికములు సంభవించెనేని దర్భలను తిలల నుపయోగించకూడదు. గరికె అక్షతలతోను శ్రాద్ధమును చేయవలయును. పిండములను పెరుగు రేగుపండ్లతో మిశ్రముచేసి పూర్వము తృప్తియగునట్లు. చేసిన విధముగానే మూడుపిండములను చేయవలయును.

## నిత్యపితృతర్పణమునందు విశేషము.

౨౬౦—తా. స్మృతిసంగ్రహమునందు చెప్పినదేమనగా దేవతులకు తర్పణను జేయునప్పు డొక్కదోసిలియు సనకాదిమునులగూర్చి జేయునప్పుడు రెండుదోసిళ్లును పితృదేవతలను గురించి చేయునప్పుడు మూడుదోసిళ్లును, జలమును విడువవలయును. స్త్రీలనుగూర్చి విడుచునప్పు డొక్కదోసిలియే విడువవలయును. ముందుగా సంబంధమును జెప్పి పిమ్మట గోత్రము నామమును వస్వాదిరూపమును చెప్పి పిమ్మట స్వధాశబ్దముతో

నమశ్శబ్దమును జేర్చి తర్పణను జేయవలయును. సవర్ణులకే తర్పణ చేయవలయుగాని యితరవర్ణులకు తర్పణ జేయనక్కరలేదనియు గోత్ర నామ రూపసంబంధములను చెప్పి పితృపూర్వకముగా వరుసగాను చివరను స్వధా శబ్ద నమశ్శబ్దము లుండునట్లుగా తర్పణ చేయవలయునని వ్యాసుడు చెప్పెను.

శ్రాద్ధతర్పణయందు విశేషము.

౨౬౮——తా. వసురుద్రాదిత్య స్వరూపులగు పితృపితామహ ప్రపితామహులను నామగోత్రములను జెప్పి తిలసహితముగా తర్పణ జేయవలయును. శ్రాద్ధమును జేసినవాడు మరుదినంబున పితృలను గురించి తర్పణజేయనియెడల తనవంశనాశనమగును. బ్రహ్మహత్యను కూడపొందును. పూర్వదినమునం దెవరినిగూర్చి శ్రాద్ధమును జేసెనో ఆపితృదేవతులకు మరునాడు తర్పణచేయునప్పుడు తిథివార నక్షత్రదోష విచారణ చేయనక్కరలేదని స్మృతిసంగ్రహమునందు కలదు. (కర్త) శ్రాద్ధమాచరించి మరియొక శ్రాద్ధపాకమునం దపేక్షకలిగి భుజించినయెడల తానుపితృదేవతులు ప్రళయపర్యంతము నరకములో నుందురు. మహాలయపక్షములో ప్రతిదినమందు శ్రాద్ధమును జేయునప్పు డాదినమునందే శ్రాద్ధాంగతర్పణను వేరువేరుగా జేయవలయును. ఒక్కదినమునందే చేసినయెడల మరునాడు తర్పణను జేయవలయును. ఎప్పుడుచేసినను తిలసహితముగానే చేయవలయును. మరునాడు స్నానముచేసి యార్ద్రవస్త్రముతో తిలతర్పణగావించి పిమ్మట సంధ్యావందనము జేసికొనవలయును. దీనివిషయమై స్మృతియెట్లు చెప్పెననగా, మరునాడుదయంబున స్నానముచేసి యార్ద్రవస్త్రముతో తిలసహితముగా తర్పణచేసి తిరిగి స్నానముచేసి ప్రాతఃకాల సంధ్యావందనమును జేయవలయు ననియు శ్రాద్ధము నాచరించి మరునాడే శ్రాద్ధాంగతర్పణ తిలసహితముగా చేయవలయునుగాని శ్రాద్ధదినమునందు జేయగూడదనియు సపిండీకరణమునందు మాసికమునందు అనుమాసికమునందు ప్రథమాబ్దికమునందు శ్రాద్ధాంగ తిలతర్పణము లేదనియు చెప్పఁబడెనని తా.

అనేకపుత్రులు కలవానికి కర్తృనిర్ణయము.

౨౬౯——తా. ఒక్కనికి ననేకభార్యలుండి వారికందరికిని పుత్రులుండిరేని పెద్దభార్యయొక్క కుమారుడు పెద్దవాడైనను చిన్నవాడైనను దహనసంస్కారము చేయవలయును. ఎందువల్లననగా, దహనసంస్కారము విషయమై అగ్రత్వము పెద్దభార్య కుమారునియందే కలదు. తండ్రికి

సపిండీకరణము జేయువిషయములో భార్యలందరికి కలిగియున్నపుత్త్రులలో నెవడు జ్యేష్ఠుడో వాడే సపిండీకరణమును జేయవలయునని కాశ్యప మునీశ్వరుడు చెప్పెను.

ఉపనయనము కానివాడు కర్తయగు విషయము.

౫౬౩—తా. చూడాకర్మ చేయఁబడిన అనగా ఉపనయనము కాక పూర్వము మాతాపితరుల విషయమై ఉదకపిండదానముల జేయవచ్చును. స్వధాశబ్దమును చెప్పవచ్చును. వేదమును చెప్పకూడదు. అనుపనీతుడై నప్పటికిని తల్లిదండ్రుల శ్రాద్ధములను జేయవచ్చుననియు స్వధాకారమును ప్రయోగింపఁదగుననియు వేదోచ్చారణమాత్రము. చేయకూడదనియు స్మృతియందు జెప్పఁబడినది. కాఁబట్టి చూడాకర్మ చేయబడక పోయినను తల్లిదండ్రుల దహనసంస్కారము చేయవచ్చును. సంవత్సరమునకు లోపుగా చూడాకర్మ చేయఁబడినప్పటికిని పైతృమేధిక కర్మను చేయగూడదని చెప్పబడెను. కుమారుఁడు పుట్టినంతమాత్రముచేతనే పితృఋణమును తీర్చుకొనువాడగునని చెప్పఁబడినప్పటికిని సంవత్సరమునకు లోపుగా పైతృమేధిక కర్మను చేయకూడదని కాలాదర్శమునందు చెప్పఁబడినది. చిన్నకుమారుఁడు దహనాది సమస్తక్రియలను చేయవచ్చునుగాని సపిండీకరణము మాత్రము పెద్దకుమారుడే చేయవలయును. మఱియు కాలాదర్శనమునందు చెప్పఁబడినదేమనగా, పెద్దవాడైనను చిన్నవాడైనను పెద్దభార్యయొక్క కుమారుడే దహించవలయును. దహనకార్యము విషయమై పెద్దభార్యయొక్క కుమారునియందే అగ్రత్వము కలదు. అనేక భార్యలయొక్క పుత్రులలో నెవడు పెద్దవాడో వాడే తండ్రియొక్క సపిండీకరణమును చేయవలయునని చెప్పఁబడెను. తల్లియొక్క శ్రాద్ధము పృథక్కుగా జేయబడినప్పుడు ఆజ్యము నామెకే జేయవలయును. ఆజ్యహోమమును జేసినయెడల ఆశ్రాద్ధము వ్యర్థమగునని చెప్పబడినది. కాఁబట్టి తండ్రిశ్రాద్ధము సంభవించినప్పుడు వేరుగాగాని కూడాగాని చేయునప్పుడు యేడాహుతులను వేయవలయును. తల్లినుద్దేశించి వేయనక్కరలేదు.

మహాలయ శ్రాద్ధక్రమము.

౫౬౪—తా. ముందుగా తండ్రి, తల్లి, సవతితల్లి, మాతామహుఁడు, తల్లియొక్కతల్లి, భార్య, కుమారుఁడు సోదరుఁడు, తండ్రి సోదరుడు, వారికుమాళ్లు, వారిభార్యలు, తండ్రితోబుట్టువలు, తల్లితోబుట్టువ, భార్యయొక్కతండ్రి, మేనమామ, భార్యయొక్కతల్లి, మేనమామభార్య, కుమా

ర్తె, తోఁబుట్టువ, మేనల్లుడు, తోఁబుట్టువయొక్క భర్త, భార్యాసోదరుడు, కోడలు, అల్లుడు, సగోత్రులు, బంధువులు, స్నేహితుడు, గురువు, స్నేహితునియొక్క స్నేహితుడు, స్వామి, మంత్రోపదేశమును చేసినగురువు, విద్యాభ్యాసము చేసినవాడు, తన్నురక్షించినవాడు, పూర్వజన్మసంబంధుడు, ఈమొదలగువారి కందరికిని మహాలయమునందు శ్రాద్ధము నాచరింపవలయును. స్వశాఖీయుడును స్వకులీనుడును శ్రోత్రియుడును స్నాతకుడును తపశ్శాలియును పుత్రసంతానవంతుడునగు బ్రాహ్మణుని శ్రాద్ధము నం దర్భనచేయవలయును. శమీపత్రప్రమాణముగా పిండములను జేసి గయాశిరస్సునందు వేసినయెడల యేడుగోత్రములవారిని నూటయొక్క తరముల వారినందరిని నరకమునుండి విముక్తులను జేయగలుగునని చెప్పఁబడి యున్నది.

సప్తగోత్రముల వివరము.

౫౬౪—తా. తల్లి, తండ్రి, భార్య, తోఁబుట్టువ, కుమార్తె, మేనత్త, తల్లితోఁబుట్టువ, వీరు ఏడుగోత్రముల వంశస్థులని చెప్పఁబడుదురు. తల్లియొక్క వంశీకులు, 24 తరములు, తండ్రివంశీకులు 20 తరములు, భార్య వంశీకులు 16 తరములు, తోఁబుట్టువ అత్తవారివంశీకులు 12 తరములు, కుమార్తె అత్తవారి వంశీకులు 11 తరములు, మేనత్త అత్తవారి వంశీకులు 10 తరములు, తల్లితోఁబుట్టువుల అత్తవారి వంశీకులు 8 తరములు, మొత్తము 101 తరములవారు మహాలయ శ్రాద్ధమువలన తరింతురని చెప్పఁబడి యున్నది.

పరేహనియందు తర్పణనిషేధము.

౫౬౬—తా. స్మృతిసారసంగ్రహమునందు శ్రాద్ధాంగతర్పణ విషయమై నిషేధము చెప్పఁబడినది యెట్లనగా, తీర్థశ్రాద్ధమునందు గయాశ్రాద్ధమునందు ప్రేతశ్రాద్ధమునందు అనుమాసికమునందు సపిండీకరణమునందు తిలతర్పణ చేయకూడదనియున్నది. వృద్ధిశ్రాద్ధమునందు సపిండీకరణమునందు అనుమాసికమునందు ప్రథమాబ్దికమునందు తిలతర్పణము చేయకూడదని మరియొకరు చెప్పిరి. దర్శశ్రాద్ధమునందు పూర్వము తర్పణచేయవలయు ననియు మహాలయశ్రాద్ధమునందు శ్రాద్ధమాచరించిన పిమ్మట తర్పణచేయవలయు ననియు ప్రత్యాబ్దికవిషయములో శ్రాద్ధమునకు పూర్వమందుగాని పరమందుగాని ఆదినమునందు చేయక మరుదినంబున చేయవలయు ననియు మరుదినము నిషిద్ధ తిథివారాదులు కలిగియున్నను జేయ

వచ్చుననియు యేవర్గమునకు శ్రాద్ధము నాచరింతురో యావర్గమునకు తర్పణచేయవలయునుగాని యితరవర్గములకు చేయనక్కర లేదనియు నితర స్మృతులయందు చెప్పఁబడినది.

సప్తపౌరుష క్రమము.

౨౬౭—తా. ఒక్క వంశమునందు బుట్టినవారిలో నేడుతరముల వరకు సపిండులనియు పదునాల్గు తరములవరకు సోదకులనియు నిరువదొక తరము పర్యంతము సగోత్రులనియు చెప్పబడుదురు. జాతాశౌచ మృతాశౌచ విషయములో నేడుతరముల పర్యంతము దశరాత్రములనియు అది మొదలు పదునాల్గుతరముల పర్యంతము మూడు దినములనియు అది మొదలు ఇరువదొకతరము పర్యంత మొక్కదినమనియు అటుపిమ్మట ఆశౌచము లేదనియు చెప్పబడినది. సపిండులలో దశరాత్ర మృతాశౌచము చెప్పబడినది కాఁబట్టి బ్రాహ్మణులకు దశరాత్రములు చేతను క్షత్రియులకు పండ్రెండు దినములచేతను వైశ్యులకు పదియేను దినములచేతను శూద్రులకు ముప్పదిదినములచేతను శుద్ధికలుగునని చెప్పఁబడినది, తల్లి దండ్రులయొక్కయు గురువుయొక్కయు మరణమునందు పదిదినము లాశౌచము కాఁబట్టి ఆదినములలో సపిండసంజ్ఞగల వారందరును దానమిచ్చుట అధ్యయనము చేయుట విడువవలయునని చెప్పియున్నందున దశరాత్రాశౌచము విహితమైనది. తల్లిదండ్రులు సపిండులు కాఁబట్టి దశరాత్రములని చెప్పఁబడినది, మరియు మహాగురువులయొక్క మరణమునందు పండ్రెండుదినముల పర్యంతము దానాధ్యయనములు చేయగూడదని యున్నది. సపిండులకు పదిదినము లాశౌచమనియున్నది. ఇట్లుండగా, తల్లిదండ్రులు ఉపనయనముచేసి సంపూర్ణముగా వేదమును జెప్పినవాఁడు. ఈ ముగ్గురు మహాగురువులని చెప్పబడుదురు. కాఁబట్టి వీరి మరణవిషయమై పదిదినములనియు పండ్రెండుదినము లనియు రెండుపక్షములుగా నున్నది; ఎందువల్లననగా, మహాగురువుల మరణమునందు పండ్రెండు దినముల పర్యంతము దానాధ్యయనములను విడువవలయు ననియు సపిండుల మరణమునందు పదిదినముల పర్యంతము విడువవలయునని యున్నది. మరియు తల్లితండ్రి ఆచార్యుడు ఈముగ్గురు మహాగురువు లనియు వీరి మరణమునందు పదిదినముల పర్యంతము విడువవలయు ననియు ఆప్రకారముగానే వారిస్త్రీలు మృతినొందిన నాచరింపవలయునని మరియొకరు చెప్పిరి. రెండు పక్షములయందు మహాగురు ... యన్నము నాశౌచ నివృత్తి

పర్యంతము భుజింపగూడదు. దానమిచ్చుట పుచ్చుకొనుట హోమము స్వాధ్యాయము మొదలగు నిత్యక్రియలు నిషేధింపబడును. వైతానక్రియ మాత్రము నివారింపబడదు. మృతదినము మొదలు పదిదినముల పర్యంతము ప్రేతకార్యము చేయవలయును. మహాగురు మరణమునం దెప్పుడును పదిదినము లాశౌచము ఉపనయనాది క్రియలను జేసి వేదమును పఠింపజేసినవాడు గురువనియు జీవనము నిమిత్తమై వృత్తిని కల్పించి యిచ్చినవాడు మహాగురువనియు చెప్పబడియున్నది. ఇట్లు బహువచనములు బహువిధములుగా చెప్పియున్నందున తండ్రి కుమారునకు నుపనయనాది సంస్కారములను జేసి వేదమును పఠింపజేసి పిమ్మట జీవనార్థము వృత్తినికూడ యేర్పాటు చేయును. కాబట్టి అటువంటి తండ్రియే మహాగురువనియు అట్టి తండ్రియొక్క మరణమునందు పండ్రెండుదినము లాశౌచమనియు కొందరు నిర్ధారణచేసిరి. ఈయర్థమునే బోధించునట్టి విజ్ఞానేశ్వరీయ వచనము "యస్తుపితా పుత్రానుత్పాద్య...ఆశ్వలాయనోక్తం ద్రష్టవ్యం" యనుదానివలన తెలియబడుచున్నది. పండ్రెండుదినముల పర్యంత మాశౌచము కాబట్టి దేవతార్చనము ఇతర పితృకార్యములు దానము హోమము జపము మొదలగునవి చేయకూడదు. ఏకోద్దిష్టానంతరమే సంస్కర్తకు శుద్ధియని మరియొకరుచెప్పిరి. పండ్రెండుదినము లాశౌచము పక్షములో చేయవలసిన విధాన మెట్లనగా, శుద్ధిలేక పోయినను ఆద్యశ్రాద్ధమును పదకొండవదినమునందు చేయవలయుననియు కర్తకు తాత్కాలిక శుద్ధికలుగుననియు చెప్పబడియున్నది. కాబట్టి పదకొండవ దినమునందు అగ్నౌవాద్యైకోద్దిష్ట శ్రాద్ధమును ఆద్యైకోద్దిష్టశ్రాద్ధమును చేసి శాస్త్రమున చెప్పబడిన దినమునందు ఊనమాసికమును పెట్టి రెండవ మాస మృతదినమునందు వృషోత్సర్జనముజేసి పిమ్మట ఆదినమునందే రెండవ మాసికము మొదలు మాసికముల నన్నియు నేకోద్దిష్టవిధిగా నాచరించి మూడవ పక్షమునందు సపిండీకరణమును చేయవలయును.

దశరాత్రాశౌచ పక్షమునందు.

౨౮౧—తా. పదిదినములలోపల ప్రత్యాబ్దికము సంభవించెనేని పదకొండవదినమునం దాద్యాదిశ్రాద్ధముల నాచరించి పిమ్మట నాదినమునందే ప్రత్యాబ్దికమును పెట్టవలయును.

ఆశౌచకాలము.



౨౮౨—తా. జాతాశౌచ మృతాశౌచముల మధ్యలో ప్రత్యా

బ్దికము సంభవించినయెడల యెప్పుడు తిరిగి పెట్టవలయునో దాని కాలమును చెప్పుచున్నాడు. ఆశౌచమధ్యయందు ప్రత్యాబ్దికము వచ్చినప్పుడు ఆశౌచ వెళ్లిన మరుదినమునందు అనగా పదకొండవదినమునందు పెట్టవలయును. ఆప్రకారముగానే ఋష్యశృంగుని వచనము కలదు. ఆశౌచానంతరమందును పెట్టుటకు నభ్యంతరము కలిగినయెడల అమావాస్యయందైనా పెట్టవలయును. ఈప్రకారముగానే గోభిలుడును చెప్పెను మాసికములు ఉదకుంభశ్రాద్ధములు ప్రసవేష్టులు ప్రత్యాబ్దికము ఆశౌచములో వచ్చినప్పుడు ఆశౌచానంతరమందుగాని లేక అమావాస్యయందుగాని పెట్టవలయునని వసిష్ఠాది మునులయొక్క వచనములు గలవు. కాబట్టి సూతకాదులచే ముఖ్యకాలమునకు నాటంకము కలిగనేని ఆశౌచానంతరదినమునందు చేయుటముఖ్యము. ఆప్రకారముగానే ఋష్యశృంగుని వచనముకలదు. మరియు సూతకము మొదలగువాటిచే శ్రాద్ధదినములకు నభ్యంతరము కలిగనేని సూతకానంతరమందుగాని తిరిగి ఆతిథియందుగాని పెట్టవలయునని అత్రివచనము కలదు. అనగా సూతకము వెళ్లిన పిమ్మటగాని అనంతర మాసములో పూర్వము మృతదినముగల పక్షములోగాని లేక తిరిగి మృతదినమందుగాని పెట్టవలయునని రెండుపక్షములు చెప్పెను. తిరిగి ఆపక్షములో పెట్టవలయునని చెప్పిన దానికి విరోధమేమియును లేదు. తిరిగి ఆతిథియందు పెట్టవలయునని చెప్పిన దానివిషయము విచారించగా ప్రతిమాసములో మృతదినమునందు పెట్టబడెడి యేకోద్దిష్ట మాసికశ్రాద్ధమునకు సూతకముకంటె మరియొకకారణముచే విఘ్నముకలిగనేని తిరిగి ఆతిథియందు పెట్టవలయునని ఋష్యశృంగుని వచనమునకు విరోధము లేకుండునట్లు చెప్పబడినది. ఏకోద్దిష్టమునకు విఘ్నముకలిగినప్పుడు అనంతర మాసములో శుక్లపక్షములోగాని బహుళపక్షములోగాని మృతదినమందు పెట్టవలయునని దేవలుడును చెప్పెను. అందువలన ఆశౌచ నిమిత్తమైన విఘ్నము కలిగినప్పుడు ఋష్యశృంగుని వచనానుసారముగా మాసికశ్రాద్ధముకూడ ఆశౌచానంతరమే పెట్టవలయును. దేవస్వామికూడ నీవిధముగానే చెప్పెను. ఏకోద్దిష్టమునకు విఘ్నముకలిగినప్పుడు సూతకానంతరమునందుగాని తిరిగి ఆతిథియందుగాని చేయవలయునని ఋష్యశృంగాద్యాది వచనములున్నను అమావాస్యయందుగాని శుద్ధదినమునందు చేయవలయునని వ్యాసుని వచనానుసారముగా శ్రాద్ధమును ప్రారంభించుటకు పూర్వము మృతాశౌచాదులు వచ్చెనేని అమావాస్యయందుగాని

శుద్ధిఅయిన పిమ్మటగాని చేయవలయును. ఇది షట్త్రింశ న్మతానుసార ముగ అనుమాసికసాంవత్సరికముల విషయమనిరి. అమావాస్యయని చెప్పు టచే శుక్లకృష్ణయేకాదశులనుగూడ గ్రహించుకొనవలయును. ఎందువల్ల ననగా, శ్రాద్ధమునకు విఘ్నము కలిగినప్పుడును మృతదినము తెలియనప్పు డును ఏకాదశియందు శ్రాద్ధము నాచరింపవలయును. అందులో బహు శైకాదశిముఖ్యము. అని మరీచిచెప్పెను. మరియు ఆశౌచాదులచే ముఖ్య కాలమునకు నభ్యంతరము కలిగెనేని యేతిథియందు తనకు శుద్ధికలుగునో ఆతిథియే ముఖ్యకాలమనియెంచి శ్రాద్ధము నాచరింపవలయును. ఆశౌచా దులచే విఘ్నము కలిగినప్పుడు ముఖ్యకాలమని యెంచకూడదు ఇట్లు చెప్పుటచే కారణములేనిది మృతదినమును అతిక్రమించకూడదు. తిథి భంగము చేయకూడదనియు శ్రాద్ధము నాచరించి పితరులకు పిండముల నివ్వవలయునని ఆమునీశ్వరులే చెప్పియున్నందున యాశౌచాది కారణ ములులేక స్వేచ్ఛగా మృతదినమును విడువకూడదు. శ్లోకములో ఆప్రకా రముకూడ చెప్పియుండుటవలన ఆగ్నౌకరణముకూడ చేయవలయును. శ్రాద్ధముఅని చెప్పుటచే బ్రాహ్మణులకు భోజనము పెట్టుటయని తెలిసికొన వలయును. పిండప్రదానమును గురించి ప్రత్యేక గ్రహించెను. తిథిభంగ మును చేయకూడదని చెప్పినందున బ్రాహ్మణులకు భోజనము పెట్టుటకు శక్తిలేనియెడల పిండప్రదానమైనను చేయవలయును. ఏవిధముగానైనను పితృదేవతాపూజను విడువకూడదు. శాస్త్రమునందు చెప్పినదేమనగా, ఆహితాగ్ని విషయమై పిండములచేతనే పితృదేవతారాధన సంభవించు ను. బ్రాహ్మణులనుకూడ భుజింపజేసినను మంచిది. అని వ్యవథానముచేసి చెప్పుటచే సామర్థ్యము కలిగియున్నప్పుడు బ్రాహ్మణులకు భోజనముపెట్టి పిండప్రదానము చేయవలయును. లేనియెడల పిండప్రదానమైనను చేయ వలయును. మరియు నదియు జేయుటకు శక్తిలేని బ్రాహ్మణుడు స్నానము చేసి పితృదేవతులనుగూర్చి జలముతో తర్పణచేసినయెడల సమస్తమై పితృయజ్ఞక్రియను చేసినవాడగునని మనువుచెప్పెను. పండ్రెండుదినము లాశౌచముగల పక్షములో మృతదినమునకు విఘ్నముకలిగినప్పుడు పదు మూడవదినము మృతాశౌచవిషయమై శుద్ధియనియు వృద్ధివిషయమై పదకొండవదినము శుద్ధియనియు గ్రహణమునందు రెండవదినమనియు రజస్వలవిషయమై యైదవదినమనియు నైదవదినమునందే దేవతాసంబంధ మైనవియు పితృసంబంధమైనవియు క్రియలను చేయవచ్చుననియు చెప్పబడి

నది. పదిరాత్రములనియు పండ్రెండుదినములనియు నాశౌచవిషయములో రెండుపక్షములు కలవు. దేశాచారము ననుసరించి చూచుకొనవలయును. అదియును నిర్ధారణలేనప్పుడు కులాచారము. అదియును నియమము లేనప్పుడు తనయిష్టము ననుసరించవలెను.

శ్రాద్ధానంతరము వైశ్వదేవక్రమము.

౨౭౦—తా. భోక్తలు భుజించినపిమ్మట ప్రదక్షిణ నమస్కారములు జేసి వారినిపంపించి గృహములో బ్రవేశించి మరియొకపాకముచేతనుగాని శ్రాద్ధశేషముచేతనుగాని వైశ్వదేవమును జేయవలయును యాజుషులు సామగులు శ్రాద్ధమునకు పూర్వమందును బహ్వృచులు మధ్యయందును ఆథర్వణశాఖవారు శ్రాద్ధాంతమందును వైశ్వమును చేయుదురని చెప్పిరి. వైశ్వదేవము చేయదలచినప్పుడు శ్రాద్ధశేషముచేతనే చేయవలయును. ఆప్రకారముగానే పైఠీనసియు చెప్పినదేమనగా, యథావిధిగా శ్రాద్ధమాచరించినపిమ్మట వైశ్వదేవాదులనుజేసి భిక్షను హంతకారాదుల నివ్వవలయునని చెప్పెను. ఆదిశబ్దముచేత నిత్యశ్రాద్ధాదులు గ్రహింపబడుచున్నవి. అనంతరమందనిచెప్పుటవలన పితృపాకశేషమువలనగాని వేరుపాకమునందుగాని నిత్యశ్రాద్ధమును చేయవలయును. అందువలననే దానినుద్దేశించి యితరులు వేరుపాకముచేతనైనా చేయుదురని మార్కండేయుడు చెప్పెను. పితృదేవతులను గురించి నిత్యక్రియలుకొంద రాచరించుచున్నారు. కొందరాచరించుటలేదు. మిగిలినదంతయు పూర్వమువలెనే చేయవలయునని ఆమునీశ్వరుడే చెప్పియున్నాడు. కాబట్టి నిత్యశ్రాద్ధము నియతముగాలేదు. పితృదేవతుల నిమిత్తము చేయబడినపాకములో వైశ్వదేవము చేయవచ్చును. వైశ్వదేవనిమిత్తము చేయబడిన పాకముచే పితృదేవతులకు నుపయోగింపకూడదు. దర్శశ్రాద్ధసంబంధపాకము వైశ్వదేవమునకు నుపయోగింపకూడదని లోకాక్షి చెప్పినవచనము ఆహితాగ్ని విషయమని చెప్పిరి. కాబట్టి ఆహితాగ్ని శ్రాద్ధమునకు పూర్వమందే వైశ్వదేవము చేయవలయును. ఆప్రకారముగానే యితరస్మృతియందు చెప్పబడినదేమనగా, ఆహితాగ్ని పక్షాంతకర్మను జేసి పిమ్మట వైశ్వదేవము జేసి, యటుపిమ్మట పిండయజ్ఞమును తర్వాత అన్వాహార్యకమును జేయవలయునని చెప్పెను. పక్షాంతకర్మయనగా అన్వాధానము. అన్వాహార్యకమనగా దర్శశ్రాద్ధము. ప్రతిదినమునందు జేయబడెడి హోమము శ్రాద్ధమునకు పూర్వము చేసినయెడల ఆదివమునందు దేవతలు హవ్యమును పితృదేవ

తులు కవ్యమును గ్రహించరని యితరస్మృతులయందు చెప్పబడినది. అది పితృనిమిత్తముగా జేయబడిన పాకముచే వైశ్వదేవముచేయు విషయ ముగా తెలిసికొనవలయును. అందువల్లనే పైఠీనసి చెప్పినదేమనగా, పితృ నిమిత్తమగు పాకముచే శ్రాద్ధమునకు పూర్వము వైశ్వదేవముచేసిన యెడల ఆశ్రాద్ధము రాక్షసప్రీతికరమనియు పితృదేవతలకు చెందదనియు చెప్పెను. అగ్నౌకరణానంతరమందుగాని వికిర కరణానంతరమందుగాని వైశ్వదేవము చేయుపక్షములో కూడ వేరుపాకముచేతనే వైశ్వదేవము చేయవలయును. అప్పుడును శేషమే యనిపించుకొనును. కాబట్టి వైశ్వ దేవము శ్రాద్ధమధ్యయందు చేసినను శ్రాద్ధాంతమందు చేసినను దోషము సమానమేయగును. అయితే అగ్నౌకరణానంతరము వైశ్వదేవము చేయు టకలదా యనిన యెడల యితరస్మృతులయందు జెప్పబడినది. బ్రాహ్మ ణులు భుజించుటకంటె పూర్వము వైశ్వదేవాహుతుల నగ్నిహోత్రములో వేసి భూతయజ్ఞాదులను జేసి శ్రాద్ధశేషమును చేయవలయునని యున్నది. బ్రాహ్మణులు భుజించిన పిమ్మట ప్రదక్షిణ నమస్కారాదులను జేసి వారిని పంపించి పితృసేవిసమును భుజింపవలయునని యాజ్ఞవల్క్యుడు చెప్పియు న్నందున పితృపాక శేషముచే వైశ్వదేవము చేసినను ఇతరపాకముచే వైశ్వ దేవము చేసినను భయపక్షములయందును కర్త పితృపాక శేషమునే భుజించ వలయును. పితృపాక శేషము లేనియెడల వేరుపాకము చేయించుకొని భుజింపవలయును గాని భోజనము మానకూడదు. నిషేధింపబడినందున వైశ్వదేవపాకములోను భుజింపకూడదు. శ్రాద్ధమాచరించిన పిమ్మట కర్త భుజింపని యెడల దేవతలు హవ్యమును పితృదేవతలు కవ్యమును గ్రహింపరని దేవలుని వచనముకలదు. కాబట్టి పితృపాక శేషమును ముఖ్య ముగా భుజింపవలయును.

—{ పితృ శేషమును సేవించినవానికి యేకాద శ్యుపవాస నిషేధ విషయము చెప్పబడును. }—

౨౭౧—తా. ఏకాదశి మొదలగు నియతమైన యుపవాసదినముల యందు శ్రాద్ధము సంభవించిన యెడల భోజనప్రతినిధిగా చెప్పబడె నది యెట్లనగా, నియతమగు నుపవాసదినమునందు నైమిత్తకమైన శ్రాద్ధము సంభవించిన యెడల పితృ శేషము నాఘ్రాణించి యుపవాసము చేయవల యును. శ్రాద్ధము నాచరించిన పిమ్మట బ్రాహ్మణులవలన ననుజ్ఞతీసికొని పితృదేవతు లుపయోగింపగా మిగిలిన శేషపదార్థముల తాను తనబంధు

వులు ఇష్టులు మొదలగువారితో గూడి భుజింపవలయునని చెప్పుటవలన పితృశేషమును తప్పక శ్రాద్ధకర్త భుజింపవలయును. ఏకాదశియందు ప్రత్యాబ్దికము కృష్ణపక్ష సంబంధమగు శ్రాద్ధము సంభవించెనేని శ్రాద్ధ మాచరించి పితృశేషమును భుజింపవలయును. శ్రాద్ధము నాచరించి బ్రాహ్మణుడు పితృశేషమును భుజింపనియెడల దేవతలు హవ్యమును పితృదేవతులు కవ్యమును గ్రహింపరని కాత్యాయనుడు బ్రాహ్మణులు భుజించిన పిమ్మట వారివలనను తీసికొని పితృశేషమును భుజింపవలయునని యాజ్ఞవల్క్యుడును గృహస్థుడు బహుళపక్షములో ప్రతిదినమందును శ్రద్ధతో శ్రాద్ధమును జేయవలయును. శుక్లైకాదశియందును శ్రాద్ధము నాచరించిన పిమ్మట నుపవాసము చేయకూడదు. ఏకాదశియందాబ్దికమువచ్చినయెడల పితృశేషమును భుజింపవలయును. ఉపవాసము చేసినయెడల నరకమును పొందునని యముడును చెప్పిరి. ఇట్లు చెప్పుటవలన ఆదివారము తిథిక్షయము సంక్రాంతి బహుళైకాదశి మొదలగు తిథులయందును నాచరింపబడెడి శ్రాద్ధములందు పితృశేషమును భుజింపనియెడల దోషము చెప్పబడినది. కాబట్టి సకామగృహస్థువిషయమని చెప్పిరి. తాను జీవించియున్నంతవరకు నేకాదశులయందు నుపవాసము జేసెదనని సంకల్పించిన వానివిషయములో కాత్యాయనుడు చెప్పినదేమనగా, నియతమైన యుపవాసదినమునందు నైమిత్తిక శ్రాద్ధము సంభవించినయెడల పితృశేషము నాఘ్రాణించి యుపవాసముచేయవలెనని చెప్పెను. ఉపవాసదినమైనప్పటికిని ఆబ్దికాదులయందు భుజింపవలయును. మరియొక కారణము కలిగినయెడల నుపవాసము జేయవచ్చును. అందువలన పితృశేషము నాఘ్రాణించి భుజింపవలయునని బోధాయనుడు చెప్పెను. ఇదియును సకామగృహస్థువిషయముగా తెలిసికొనవలయును. తల్లిదండ్రుల నాబ్దిక దినములయందు నేకాదశివచ్చిన యెడల పితృదేవతులను యథావిధిగా నర్చించి పితృశేషము నాఘ్రాణించవలయునని దేవలుడు చెప్పెను. రెండుపక్షములైకాదశులయందు నుపవాసము జేయుటకు శక్తిలేనియెడల నొక్కయేకాదశియందైనను జేసిన యెడల పితృదేవతులు సంతోషించి వానికి కోరికలనిత్తురు. ఏకాదశియందు శ్రాద్ధమాచరించినను భుజింపకూడదు. నక్తవ్రతమును చేయకూడదు అని మనువు దోషముగా చెప్పియున్నందున శ్రాద్ధము నాచరించినపిమ్మట పితృశేషము నాఘ్రాణించవలయును.

{ తండ్రి దేశాంతరము వెళ్లినపిమ్మట నెన్నిసంవత్సరముల కైనను వానివృత్తాంతము తెలియనియెడల వానిని గురించి కుమారుడు చేయ విధానము. }

౨౭౨—తా. తండ్రి దేశాంతరము వెళ్లిన పిమ్మట వాని క్షేమ వృత్తాంతము తెలియనియెడల పదియేను సంవత్సరములు గడచిన పిమ్మట వానినిగురించి యౌర్ధ్వదైహిక కృత్యములను చేయవలయునని జాతుకర్ణుడు చెప్పెను. మరియు తండ్రి దేశాంతరగతుడై యుండగా వానియే విధమైన వార్తయు తెలియనప్పుడు పదియేనుసంవత్సరములు దాటినపిమ్మట వాని ప్రతిమ నొకటిచేయించి యథోక్తవిధిగా దహనాది సంస్కారములను చేసి అప్పుడే సమస్త ప్రేతకృత్యములను చేయవలయు ననియును చెప్పెను. తండ్రికంటె నితరులగురించి చెప్పినదేమనగా, తండ్రిసోదరులు తనసోదరులు వారితనయులు మొదలగువారి విషయములో పండ్రెండు సంవత్సరములు గడచినపిమ్మట కుశపలాశము మొదలగు విధానములతో వారికి దహనాది సంస్కారములను జేసి అప్పుడే పైతృమేధిక కృత్యములనన్నియు జేయవలయునని బృహస్పతి చెప్పెను. తిథివిషయములో నెట్లనగా, పూర్వమాబ్దికాదులయొక్క తిథులు తెలియనప్పుడే తిథులయందు జేయవలయునని చెప్పబడెనో అదియే గ్రహించవలయునని తిథినిగురించి చెప్పిరి.

{ దేశాంతరము వెళ్లినవాడు పదియేను సంవత్సరములకుగాని పండ్రెండు సంవత్సరములకుగాని యేవార్తయు తెలియనందున ఔర్ధ్వదైహిక }
{ క్రియలు చేసినపిమ్మట బ్రతికియున్నవాడై వచ్చినయెడల వానిని గురించి చేయవలసిన విధానము చెప్పబడును. }

౨౭౩—తా. దేశాంతరము వెళ్లినవాడు మృతినొందకపోయినను ఎంతకాలమునకు వానికుశలవార్త తెలియనందున పుత్రులు మొదలగువారు దేశాంతరగతునిగూర్చి యౌర్ధ్వదైహిక క్రియలు చేసినపిమ్మట తిరిగి యింటికివచ్చినయెడల ఘృతకుంభములో వానినుంచి జ్యోతిశ్శాస్త్రములో చెప్పబడినట్టి యోగ్యమైన తిథివారనక్షత్రములు గల శుభలగ్నమునందు వానిని బయటికితీసి దండమౌంజీవపనాదులులేకుండా తిరిగి జాతకర్మ నామకరణాన్నప్రాశన చూడాకర్మోపనయనాది కర్మలచే సంస్కారముచేసి యేదోయొకపర్వతమువద్దకు తీసికొనివెళ్లి యచ్చట పండ్రెండుదినములు గాని మూడుదినములుగాని యుపవాసముచేయించి తిరిగి యింటికితీసికొని రావలయును. వివాహమైన పత్నినే పూర్వము పరిణయముజేసి

కొనబడినస్త్రీ యుండెనేని యామెతోగాని లేక మరియొకస్త్రీని వివాహము చేసిగాని ఆయుష్మదగ్ని దేవతాకమైన చరువుతో సంస్కారము చేయవలయును. ఆహితాగ్నియైనయెడల పురుడాశమనియు అనాహితాగ్నియైన యెడల చరువనియు చెప్పబడెను. ఈవిధముగానే వృద్ధమనువు స్మృతి సంగ్రహమునందు చెప్పెను.

దేశాంగపణ్యము.

౨౭౪—తా. దేశాంతరగతుడు బహుకాలమునకు రాకపోవుటచే మరణసందేహముచే యింటివద్దను వానినిగురించి పైతృమేధిక సంస్కారము జేసినపిమ్మట నింటికివచ్చినయెడల ఘృతకుంభములో వానినుంచి శుభముహూర్తమునందు వానిని బయటికితీసికొనివచ్చి యథావిధిగా తిరిగి జాతకర్మాది సంస్కారములనుజేసి పర్వతమువద్దకు తీసికొనివెళ్లి పండ్రెండుదినములుగాని మూడుదినములుగాని యుపవాసము జేయించి తిరిగి యింటికి తీసికొనివచ్చి వివాహమైనయెడల పూర్వపుస్త్రీ సజీవురాలై యున్నచో ఆమెతోగాని లేక మరియొకస్త్రీని వివాహముచేసి ఆయుష్మదగ్నియందు చరువుతో సంస్కారము చేయవలయునని వృద్ధమనువు చెప్పెను. తిరిగి వచ్చునప్పటికి అగ్నిహోత్రము లున్నయెడల ఘృతకుంభములోనుంచి లేవదీసి యొక్కదినమునందే ఒక్కయగ్నిహోత్రమునందు జాతకర్మాది సమస్తసంస్కారముల నుపనయనము పర్యంతముచేసి దశరాత్రవ్రతము నాచరించి వేదవ్రతములను పండ్రెండుదినములతో సమాప్తి నొందించి పూర్వము తాను పరిణయముజేసికొని జీవించియుండునట్టి సవర్ణస్త్రీతోగూడ నగ్నులనాధానించి పర్వతమునకువెళ్లి యిష్టినిజేసి అనంతరము నిత్యనైమిత్తిక కామ్యక్రియలను జేయవలయునని వసిష్ఠాది మునులును చెప్పిరి. అర్ధాధానివిషయములో శాస్త్రవిధిచే నౌపాసనాగ్నిని విభజించి సంసర్గప్రాయశ్చిత్తమును చేసి జాతకర్మాది సమస్తక్రియలను చేయవలయు ననిరి. మరియొకపక్షమునందు జాతకర్మ మొద లుపనయనపర్యంతమగు సంస్కారములు వివాహప్రభృతి సంస్కారములు లౌకికాగ్నియందు ఒక్కయగ్నిహోత్రమునందే చేయవలయును. చెప్పబడినది సర్వాధాని విషయములో నగ్నిహోత్రములు నశించినయెడల జాతకర్మాది సమస్త సంస్కారములు లౌకికాగ్నియందే చేయవలయును. ఉపవాసవిషయములో మూడుదినములుగాని యొకదినముగాని చేయవచ్చుననియును మరికొందరు చెప్పిరి. జాతకర్మమొదలు ఉపనయనము పర్యంతము తిరిగి సంస్కారము

జేయునప్పుడు ఘృతకుంభమునుండి లేవదీసిన వానినిగురించి తిరిగి సంస్కారమును జేయుచున్నానని వాటివాటి కన్నింటికి సంకల్పము చెప్పవలయును. తిరిగి యుపనయన సంస్కారము జేయునప్పుడు మౌంజ్యాజినమేఖలాదండధారణ భిక్షాచార్యవ్రతములు చేయనక్కరలేదని పరాశరుడు చెప్పెను. ఉపనయనానంతరము పండ్రెండుదినములుగాని మూడుదినములు యుపవాసవ్రతముజేసి వేదవ్రతములను గోదానవ్రతము స్నాతకవ్రతమును తిరిగిచేసి పూర్వము పరిణయముజేసికొనబడిన స్త్రీతోగాని వివాహము పూర్వము కానియెడల మరియొక నూతనస్త్రీతోగాని కూడుకొని వివాహవిధానమును జేసికొనవలయును. పూర్వపరిణీతయగు స్త్రీయున్నయెడల ఘృతకుంభమునుండి లేవదీయబడిన నేను పూర్వపరిణీతయగు స్త్రీని తిరిగి వివాహము చేసికొనుచున్నానని సంకల్పము చెప్పవలయును. పునర్వివాహమునందు కన్యాదానము వరణము పరిగ్రహణము యథావిధిగా చేయనక్కరలేదు. త్రిరాత్రవ్రతమును చేయవలయునని యితర స్మృతులయందు చెప్పబడినది. ఒక్కదినమునందే శేషహోమపర్యంతము సమస్తక్రియలను జేయవలయును.

పూర్వపరిణీతయగుస్త్రీ లేనియెడల.

౨౭౫—తా. నూతనస్త్రీని వివాహము జేసికొనిన పక్షములో వివాహసంకల్పము మొదలు నాల్గవదినమునందు శేషహోమపర్యంతము సమస్తము ప్రథమవివాహమువలెనే చేయవలయును. భేదమేమియును లేదు. మొదట వివాహము జేసికొనబడినస్త్రీ యున్నయెడల ఆమెతోగూడ నగ్నులనాధానముచేసి విచ్ఛిన్నసంధానార్థమని సంకల్పము జేసి "వ్రాత్యేన పశునా" అనునది మొదలు "చరుంనిర్వపేత్" అనుపర్యంతము చెప్పబడిన గ్రంథమువలన జేయవలసిన విధిని చేయవలెను. అనంతరము నిత్యనైమిత్తిక కామ్యక్రియలను చేయవలయును, కాలాతీతమైనప్పుడు సమస్త సంస్కారములకు మాసము ప్రాజాపత్యవ్రతమును చేయవలయును. మృతినొందనివాడు మృతినొందినని తెలియగా వానినిగురించి పురుడోశముతో నష్టాకపాల నిర్వపణము చేయవలయును. మృతినొందెనని తెలిసి పుత్రులు మొదలగువారు పలాశవృంతము మొదలగువానిచే సంసృష్టాగ్నులయందు పైతృమేధిక కృత్యము చేయబడిన పిమ్మట యజమానుడు వచ్చినయెడల ఆవిష్టాగ్నులయందు తిరిగి జాతకర్మాది క్రియలను జేయవలయును. "పునస్తోమేన" అనుదానిచే తిరిగి వివాహవిధానము చేయవల

యును. ఏడుదినములపర్యంతము సంధ్యావందనము జేయకపోయినను లేక పిచ్చియెత్తుట మొదలగువానిచే సంధ్యను విడిచినను తిరిగి యుపనయనాది సంస్కారములను జేయవలయు ననిరి.

—{ రేతోవిణ్మూత్రప్రాశనమునందు ప్రాయశ్చిత్తవిధానము చెప్పబడును. }—

౨౭౬—తా. రేతస్సును మలమూత్రములను సురతో కలిసిన పదార్థమును తెలియక బ్రహ్మ క్షత్రియ వైశ్యులు ప్రాశనచేసినయెడల తిరిగి సంస్కారమును జేసికొనవలయునని పరాశరుడు చెప్పెను. ఇందునుగురించి చాంద్రాయణ ప్రాయశ్చిత్తమును జేసి తిరిగి సంస్కారమును జేసికొనవలయునని ప్రచేతసుడు చెప్పెను. ఏబ్రాహ్మణుడైనను కామమోహితుడై స్త్రీలయొక్క క్షీరములను త్రాగినయెడల తిరిగి సంస్కారమును జేసికొని ప్రాజాపత్యమును చేయవలయునని చతుర్వింశతి మతమునందు జెప్పబడియున్నది.

అన్యశాఖాధ్యయన నిషేధము.

౨౭౭—తా. బ్రాహ్మణుడేశాఖా సంబంధమైన విధానముచే నుపనయనాది సంస్కారములు చేయడెనో ఆశాఖాసంబంధమైన వేదమునే పఠించవలయును. అట్లుచేయక విడిచినయెడల పతితుడగును. ఇతరశాఖాసంబంధమైన వేదమును పఠించినను లేక స్వశాఖా వేదమును విడిచిపెట్టిన నుపనయనము చేయబడినవానికి తిరిగి ప్రాయశ్చిత్తమును జేయవలయునని శాస్త్రవేత్తలు చెప్పిరి.

పునరుపనయన క్రమము.

౨౭౮—తా. వపనమును జేసి మేధాజననము చేయవలయును. మేధాజననముండిన యెడల వ్రతచర్య కలుగును. అను ప్రవచనీయ ముండును. మేధాజననము లేనియెడల ఈరెండు నుండవు. పరిధానము చేయ తగినది కాదు. హేతువుండిన పిమ్మట రెండును చేయవలయును. అను ప్రవచనీయస్థానమునందు "తత్సవితుర్వృణీమహే" అని చెప్పవలయును. యజుర్వేదమును సామవేదమును పఠించి ఋగ్వేదమును పఠించవలయునని కోరికగలవాడై యితరశాఖా విధిచే నుపనయనము చేయబడినవాడై బ్రహ్మచారియగునేని తిరిగి యుపనయన రూపమగు ప్రాయశ్చిత్తమును చేయవలయును. ఈవిషయమునందు నెనిమిది సంవత్సరములనియు నుత్తరాయణమనియు మొదలగునవి విచారింప నక్కరలేదు. హేతువు కలిగినప్పుడే చేయవలయును. వానికి కేశవపనము చేయుటయు జేయక పోవు

టయకలదు. అలంకరణము అగ్నీంధనము మొదలాజ్య సంస్కారాంతము చేసి వస్త్రాజిన యజ్ఞోపవీతాదులను ధరించి యాచమనముజేసి దక్షిణ దిక్కున గూర్చుండి బర్హిరాస్తరణము మొదలాఘారాంతముచేసి ప్రధానాహుతులనుజేసి "ఉత్తరతోఽగ్నేః" అనునది మొదలు "దేవసవితః" అను పర్యంతముచేసి పరిధానమును చేయవలయును. "కస్యబ్రహ్మచార్యసి" అనునది మొదలు పరిసమూహన వర్జితముగా చేయవలయును. సమిదాధానము మొదలు హరస్వీభూయాసమని యుపస్థానంబు చెప్పి జాన్వాచ్యోప సంగృహ్యాదులచేసి "భోః సావిత్రీంభో అనుబ్రూహి" అని ప్రశ్న చేయగా "తత్సవితు...వృణీమహే" అని చెప్పవలయును. అనంతరము హృదయదేశముచే వామార్ధాం గుళ్యుపధానముచేసి మేఖలాదండ వర్జితముగా బ్రహ్మచర్యము నుపదేశింపవలయును. "బ్రహ్మచార్యసి" అనునది మొదలు "వేదమధీష్వ" అను పర్యంతము చెప్పవలయును. అనంతరము స్విష్టకృత్తు మొదలు మిగిలిన హోమములను పూర్తిచేయవలయును. ఉపదేశింపబడిన సావిత్రీమంత్రముచే జపము చేయవలయును. భిక్షాచరణకు పూర్వమందుగాని పరమందుగాని అగ్నికార్య ముపకరణ పర్యంతము చేయవలయును. "తత్సవితుర్వ్రణీమహే" అని బ్రహ్మయజ్ఞమును చేయవలయును. వేదస్వీకరణ పర్యంతము బ్రహ్మచర్యవ్రతమును జేయవలయును. ఈప్రకారము పునరుపనయన క్రమము చెప్పబడినది.

పునరుపనయనము విషయమై విశేషము చెప్పబడును.

౨౭౯—తా. మేఖలము వపనము దండధారణము భిక్షాచరణము మొదలగునవి పునస్సంస్కార కర్మయందులేవని పరాశరుడు చెప్పెను. "త్ర్యమ్బకం యజామహే"(?) అనునది మొదలు మేధాజనపర్యంతమేమియు చేయనక్కరలేదు. పూర్వము చేయనిపక్షములో ఉపనయన విధానమంతయు మేధాజననపర్యంతము చేయవలయును. ఈపక్షమునందు పరిధానకాలము లేదు. ఏపక్షమందైనను "తత్సవితుర్వ్రణీమహే" సావిత్రిని చెప్పవలయును. ఇతరమైన విషయమంతయు సమానము. అన్ని విషయములును మూలములలో చెప్పబడిన గ్రంథముచే తెలిసికొనవలయును.

పాలాశవిధానము చెప్పబడును.

౨౮౦—తా. తండ్రి మొదలగువారు మరణించినప్పుడు దేశకాలాది ప్రతిబంధకములచే తత్కాలమునందు ప్రేతకృత్యములు జరుపకున్న యెడల తిరిగి సంవత్సరము లోపుగా సపిండీకరణము చేయవలసికొన్నప్పుడు

గురుశుక్రాదిమూఢమి మలమాసము చాతుర్మాస్యము మొదలగు దోషములను విచారింపనక్కరలేదు. భద్రతిథులు త్రిపాదనక్షత్రములు ధనిష్ఠా పంచకము శుక్ర మంగళ గురువారములు లేనట్టి చంద్రతారాబలయుక్తమగు పరిశుద్ధమైన దినమునందు తిరిగి దహన సంస్కారాది క్రియలను ప్రారంభించి చేయవలయును. అస్థులున్నయెడల నస్థులచేతనే పునర్దహనము చేయవలయును. అస్థులులేనియెడల పలాశవృంతములచే శరీరాకారమును జేసి పునర్దహనమంత్రముతో దహించవలయును.

పాలాశ ప్రయోగవిధానము.

౨౮౧—శ్లో. 40 సమిధలచేత శిరస్సును 10 చేతమెడను 20 చేత వక్షస్థలమును 30 చేత జఠరమును 50 చేత కుడిబాహువును వీనిలోనే అయిదింటిచేత వ్రేళ్లను ఆవిధముగా నెడమబాహువును 12 చేత వృషణమును 8 చేత శిశ్నమును 50 చేత దక్షిణతొడను 20 చేత మోకాళ్లు పిక్కలు కాలివ్రేళ్లను 50 చేత యెడమతొడను 20 చేత మోకాలు పిక్కకాలి వ్రేళ్లను ఈప్రకారము 360 సమిధలచేత ఆయాయా అవయములను కల్పించి పట్టుదారములతో దృఢముగా బిగియించి పురుషాకారముగాచేసి ప్రాణప్రతిష్ఠను చేసెదనని సంకల్పముచేసి "వాక్తఆప్యాయతాం" అనునదిమొదలు "శమద్భిః" అనుపర్యంతము ప్రాణప్రతిష్ఠనుజేసి "జన్మప్రభృత్యేతత్ క్షణపర్యంతం" అనిమొదలిడి చెప్పబడునట్టి గ్రంథముచే సర్వప్రాయశ్చిత్తము సుత్క్రాంతి గోదానమునుచేసి కర్ణమంత్రము మొదలగు వానినిచెప్పి అనంతరము మరణకాలమునందు సంభవించిన ఊర్ధ్వోచ్ఛిష్టాది దోషములు పోవుటకు కృచ్ఛత్రయములనుచేసి పిమ్మట నౌపాసనముజేసి "పరేయువాగ్ంసం" అనిచెప్పి ప్రేతాహుతినిచేసి "ఇమంత్వావస్త్రం" అనునదిమొదలు మిగిలినదంతయు సమానముగా జేయవలయును. పదిదినము లాశౌచపక్షములో తిలోదక పిండప్రదానములు క్రమముగానే చేయవలయును. మూడుదినము లాశౌచపక్షములో మొదటిదినమునందు మూడుదినముల కర్మయును సంచయనము చేయవలయును. మృతదినమునందు మాసికమును పెట్టవలయును. పర్ణములతో నరాకారముగాజేసి దహించ వలయుననియు నితరులవిషయమైనయెడల మూడుదినము లాశౌచమును తల్లిదండ్రుల విషయములో పదిదినము లాశౌచమనియు మనువుచెప్పెను. కాబట్టి పదిదినములు గడచినపిమ్మట వినినను తల్లిదండ్రులగురించి పదిదినములు. సోదరులు మొదలగువారివిషయములో పునర్ద

హనమందు మూడుదినములు. ఆహితాగ్నికి యథావిధిగా దహనము జరుగుపర్యంతము వానియాశౌచము పట్టనక్కరలేదు. వానియాశౌచము దహనము మొదలని చెప్పబడెను. అనాహితాగ్ని విషయములో మరణము మొదలుకొని యాశౌచము పునర్దహనమందు మూడుదినము లాశౌచము. ఆశౌచమును గ్రహించియున్న కుమారునకు సంపూర్ణాశౌచము. తల్లిదండ్రులగురించి యేదోయొక ప్రతిబంధకముచే పైతృమేధిక క్రియలను జరుపకున్నయెడల జ్ఞాతులు పదిదినము లాశౌచముపట్టి శుద్ధినొందవచ్చును. స్మృత్యుక్తమగు నిత్యకర్మలను జేసికొనవచ్చును. జ్ఞాతులలో మరణము జరిగి పైతృమేధిక కర్మ జేయబడకున్నప్పుడు కర్మజరుపబడు పర్యంతము ముఖ్యకర్త శుభకర్మలను జేయకూడదు. జ్ఞాతులు జరుపుకొనవచ్చును. పదిదినములలోపల నస్థిదహనము చేయబడినప్పుడు మిగిలిన దినములతోనే జ్ఞాతులకు శుద్ధియగును. పదిదినములు దాటినపిమ్మట పునర్దహనము జరిగినయెడల మూడుదినములు. కుమారునివిషయములో యెప్పుడు చేసినను పదిదినము లాశౌచము. అని గౌతముడు చెప్పెను. జ్ఞాతులు పూర్వమాశౌచముపట్టినప్పుడు తిరిగి యాశౌచము లేదనియు పునర్దహనము మొదలు కర్తకుమాత్రము మూడుదినము లనియు సంవత్సరమునకులోపల నెప్పుడైనను పునస్సంస్కారమును జేయునప్పుడు కాలనియమమునుగాని గురుశుక్రుల మౌఢ్యదోషమునుగాని విచారింప నక్కరలేదనియు శంఖుడు చెప్పెను.

—{ పలాశవిధియందు పలాశములయొక్కయు దర్భలయొక్కయు సంఖ్యను చెప్పుచున్నాడు. }—

౫౮౨—తా. పలాశవృంతములు 40 శిరస్సునకు 10 కంఠమునకు రెండుబాహువులకు 100 వీటిలోనే అంగుళులకును చెప్పబడినవి. 20 వక్షస్థలమునకు 30 జఠరమునకు 12 వృషణములకు 8 శిశ్నమునకు 100 రెండుతొడలకు 20 కుడిమోకాలు పిక్కలకు 20 ఎడమమోకాలు ఎడమపిక్కలకు ఈప్రకారము 360 పలాశవృంతములను ఆయాయావయవములతో నరాకారముగా నేర్పరచి పట్టుదారముతో బిగుయునట్లుగాగట్టి ప్రాణప్రతిష్ఠను జేసి సర్వప్రాయశ్చిత్తమును జేసి గోవు భూమి నువ్వులు బంగారము నెయ్యి వస్త్రము ధాన్యము బెల్లము వెండి ఉప్పు అనునట్టి దశదానములనిచ్చి యుత్క్రాంతి గోదానముచేసి కర్ణసూక్తమంత్రమును పఠించి స్నానము జేయించి శవధర్మానుసారముగా నలంకరించి దహించవల

యును. పిమ్మట మూడుదినము లాశౌచముపట్టి నాల్గవదినమందు శ్రాద్ధమును చేయవలయును. పుత్రులు మొదలగువారు ప్రేతకు స్నానము జేయించి వస్త్రాదులచే పూజించి నగ్నదేహమును వలెనే దహించవలయును. శవసంబంధమైన దేమైననున్న యెడల దానిని పరిత్యజించవలయును. దహననిమిత్తము అగ్నిహోత్రము తృణములు కాష్ఠములు హవిస్సు మొదలగునవి శూద్రులు తీసికొనివచ్చినయెడల ప్రేతత్వము నశించదు ధర్మము కూడ చెడిపోవును. ఈప్రకార మాపస్తంబునిచే జెప్పబడెను.

అస్థినాశనమునందు ప్రాయశ్చిత్తము.

౫౭౩—తా. దశాహమునకు లోపుగా అస్థిసంచయనము చేయక పోయినను అస్థులు నష్టమైనను అపహరింపబడినను తిరిగి దహించవలయునని జాబాలిచెప్పెను. చండాలురు శ్వపచులు మొదలగువారిచే స్పృశింపబడినను అపహరింపబడినను అచ్చటనుండు భస్మను తిరిగి దహించవలయునని మరియొకరుచెప్పిరి. దేశక్షోభాది మహావిపత్తులయందు అస్థులు నశించినను లేక అస్థిసంచయనము జేయుటకంటె పదిదినములు గడచిపోయినను పర్ణములతో నరాకారమునుజేసి దహించి మూడుదినము లాశౌచము పట్టవలయును. అస్థులు నదీప్రవాహముచే కొట్టుకొని పోయినయెడల ఆప్రదేశమునందు ప్రాయశ్చిత్తమునుజేసి సంచయన మంత్రముతో నక్కడనుండు మృత్తికను తీసికొని వెళ్లవలయును. ఆప్రదేశమునందు లేక పోయినను అస్థిసంచయన మంత్రమును చెప్పవలయును. పునర్దహనము చేయ నక్కరలేదు. జలప్రవాహమునందు ఒడ్డునందు నదీతీరమునందు అస్థులు నశించినయెడల సంచయనమంత్రమును చెప్పవలయునని దేవలుడు చెప్పెను. అస్థిసంచయనము కాక పూర్వమస్థులు ప్రవాహముచే కొట్టుకొని పోయినయెడల విధిప్రకారముగా హోమముచేసి సంచయన మంత్రమును చెప్పవలయునని గోభిలుడుచెప్పెను. అస్థిసంచయనము కాక పూర్వము ప్రవాహముచే కొట్టుకొని పోయినయెడల అస్థులకు చేసిన విధముగానే రాళ్లకుగాని భస్మకుగాని సంచయనము చేయవలయునని మరీచి చెప్పెను. ఏకకాలమునందు దంపతులకు మరణము కలిగినప్పుడు వేరువేరు చితులయందుంచి ఔపాసనాగ్నిచే దహించవలయునని వసిష్ఠుడుచెప్పెను. ఏకకాలమునందు మరణము నొందిన దంపతుల నొకచితియందేయుంచి భిన్నౌపాసనాగ్నిచే దహించవలయునని మనువుచెప్పెను. దంపతులలో ముందు మృతినొందినవారిని ఔపాసనాగ్నిచేతను అనంతరము మృతినొం

దినవారిని ప్రేతాగ్నిచేతను దహించవలయునని సంవర్తుడు చెప్పెను. పెని మిటి మృతినొందిన పిమ్మట నస్థిసంచయనము కాక పూర్వము భార్య మృతి నొందిన యెడల కుమారుడు తండ్రికి చేసినట్లుగా చితాగ్నిచేతనే తల్లిని దహించవలయునని శంఖుడు చెప్పెను. ఈప్రకారముగానే దేవలుడును చెప్పెను. ప్రేతకృత్యములు జేయబడకుండి సంవత్సరముగడచిన యెడల తిరిగి దహనముచేసి షోడశ సపిండీకరణాదులను చేయవలయును. మృత దినమునం దాబ్దికమాసికాదులను జరుపవలయును. మాసికములు జరుప బడకుండ సంవత్సరము గడచినయెడల మూడు ప్రాజాపత్య ప్రాయశ్చిత్త ములను జేసి మాసికములను ఆబ్దికమును జరుపవలయును. పునర్దహనదిన ము మొదలు పండ్రెండు మాసికములను జరుపవలయును. వైవస్వతమం త్రమును పఠింపుచు వాయసములకు బలి నివ్వవలయును. ఆబలిని యగ్ని హోత్రమునందుగాని జలములోగాని యుంచి స్నానముజేసి యింటికివెళ్ల వలయును. తిలోదక పిండదానములను నవశ్రాద్ధమును రాత్రియందు సంధ్యాకాలమందు చేయకూడదు. అట్లుచేసిన యెడల వ్యర్థమగును. ఆశౌచముండునంత పర్యంతము మధ్యాహ్నకాలమునందు ప్రేతకు జల ప్రదానము చేయవలయును. పూర్వాహ్ణమందుగాని మధ్యాహ్నకాల మందుగాని సంస్కర్త జలప్రదేశమునకువెళ్లి జలప్రదానాదులను చేయ వలయు ననియు అతడే ప్రేతకు బంధువుడనియు సంవర్తుడు చెప్పెను. ఏప్రదేశము యేశిల ఏపిండప్రదాన ద్రవ్యము మొదటిదినమునందు నేర్ప రుచుకొనెనో పదిదినముల పర్యంతము వాటినే యుపయోగింపవలయును.

అంగిరసునిచే జెప్పబడిన ఆతురసన్యాస విధానము చెప్పబడును.

అం౦ర—శా. ఆతురసన్యాసమునకు విశేషమైనవిధులు క్రియ లేమి యు లేవు. ఆతురులకు ప్రేషయొనర్చుటే సన్యాసమని చెప్పబడుచున్నది. ఉదకసమీపమునకువెళ్లి స్నానముచేసి శుభ్రవస్త్రములను ధరించి రెండు పాత్రలయందు నుదకమునుంచికొని దానిలో నొకపాత్రను కుడిచేతియం దుంచుకొని "ఏవమేతి" అను రెండుమంత్రములతో రెండవపాత్రయందు హోమమును చేయవలయును. ఇట్లు రెండుహోమములను జేసినపిమ్మట మిగిలినయుదకమును "ఆశుశ్శిశానోవృషభః" అనునట్టి యనువాకముతో నభిమంత్రించి "పుత్రేషణీ" అనుమంత్రముతో నాయుదకమును పాన ముచే చేయవలయును. రెండవపాత్రయందుండు జలము నీరీతిగానే యభి మంత్రించి "ఓం భూర్భువస్సువః" అనుమంత్రముతో శేషము లేకుండు

నట్లుగా ద్రాగవలయును. పిమ్మట దోసిలితో నుదకమును తీసికొని ప్రతి దిక్కునందు చల్లవలయును. అనంతరము స్వస్థచిత్తుడై యూర్ధ్వబాహుడగుచు సూర్యునకెదురుగానిలుచుండి యోస్వామీ నేను సన్యసించితినని సూర్యునిమూడుపర్యాయములుపలికి స్తోత్రము చేయవలయును. అనంతరము బంధువులగృహములకు వెళ్లకూడదు. ఇతరులిండ్లకువెళ్లి భిక్షను గ్రహించవలయును. మృతినొందినపిమ్మట భూమియందు సమాధినైనా చేయవలయును. జలములోనైనా విడువవలయును. ఈప్రకార మాంగిరసునిచే సన్యాసవిధానము చెప్పబడెను.

ఆతురసన్యాస ప్రయోగము.

౨౮౭—తా. శుచినిమిత్తమాచమనము చేసి పాదప్రక్షాళనము జేసికొని యాచమనము చేసి నాయొక్క సమస్తపాపములు నశించి బ్రహ్మలోకమును పొందునిమిత్తము ఆతురసన్యాసమును చేసెదనని సంకల్పము చేసి యుదక ప్రదేశమునకు వెళ్లి వెనుకచెప్పిన ప్రకారముగా సూర్యప్రార్థనాంతము చేయవలయును. పుత్రవిత్త దారేషణత్రయమును విడిచితినని పలుకవలయును. వ్యాహృతులను చెప్పుచు మంద్రమధ్యమోత్తమ స్వరములు కలుగునట్లుగా బిగ్గరగా పలుకవలయును. పిమ్మట జలాధిదేవతలను బోధించునట్టి వారుణమంత్రములచేతను విష్ణుసూక్తముచేతను త్ర్యంబక మంత్రములచేతను పరిశుద్ధమగునుదకముతో స్నానము జేయించవలయును.

యతిసంస్కారము.

౨౮౮—తా. కర్త స్నానము చేసి పరిశుద్ధాత్ముడై యతిసంస్కారమును చేయవలయునని యున్నది. కాబట్టి పుత్రుడుగాని శిష్యుడుగాని లేక దగ్గిరబంధువుగాని సంస్కారమును చేయువాడై పంచామృతములతో స్నానము జేయించి పిమ్మట ప్రణవముతోను జలబోధితములగు వారుణమంత్రములు విష్ణుసూక్తములు త్ర్యంబకమంత్రములు మొదలగువానిచే పరిశుద్ధోదకముతో స్నానము చేయించి ఉట్టియందు శరీరమునుంచి గంధమాల్యాదులతో నలంకరించి బ్రాహ్మణులచే స్వస్తివాచనము జయజయ శబ్దములు భేరీదుందుభ్యాది ధ్వనులు చేయించుచు గ్రామమునకు ప్రదక్షిణముగా వెళ్లి పిమ్మట తూర్పుదిక్కునకుగాని యుత్తరదిక్కునకుగాని తీసికొని వెళ్లి నదీతీరమందుగాని రావిచెట్టు మొదటగాని దేవాలయము అరణ్యము గోష్ఠము పలాశవృక్షమూలము మొదలగు ప్రదేశములయందుగాని సమాధిచేయదలచిన యాప్రదేశమును వ్యాహృతులను చెప్పుచు జలముచే

ప్రోక్షించి దండము పొడవుండునట్లుగా గొయ్యిత్రవ్వి వ్యాహృతులతో తిరిగి ప్రోక్షించి ఉత్తరాగ్రములుగా దర్భలనుపరచి లవణమునుచల్లి గాయత్రీమంత్రముతో శరీరమును ప్రక్షాళనము జేసి గంధాదులచే నలంకరించి "విష్ణోహవ్యం రక్షస్వ" అని యతిశరీరమును గొయ్యియందుంచి "ఇదంవిష్ణుర్విచక్రమే" అనిచెప్పి కుడిహస్తమందు దండమునుంచి స్పృశించి జపించవలయును 'బ్రహ్మజిజ్ఞానం' అని శిరస్సును స్పృశించి జపించవలయును. 'భూమిర్భూమి...భిద్యతాం' అనిచెప్పి దండముచే శిరస్సును భేదించవలయును. ప్రణవముతో స్పృశించి లవణము మొదలగువానిచే గొయ్యి నిండించి "అగ్నినాగ్ని...సాధ్యాస్సంతుదేవాః" అనునట్టి నాలుగురుక్కుల చేతను "పృధివీహోతా" అనునది మొదలు "మహాహవిర్హోతా" అను వరకు నాలుగురుక్కులచేతను "అతోదేవా అవంతునో...సప్తదామభిః" అనునంతవరకు "ఇదంవిష్ణుః...విప్రాసఃపదం" అనుపర్యంతముండునట్టి మంత్రములను జెప్పి నమస్కరించవలయును. ఇంతకంటే చేయవలసిన సంస్కారమేమియు లేదు. కర్తకు ఆశౌచము లేదు. ఆశౌచమున్నదనే సందేహముచే జలాదులను స్పృశించ నక్కరలేదు. సద్యస్కాలమునందే శుద్ధికలుగును. ఇట్లు చేసినందువలన నశ్వమేధము చేసినంతఫలము కలుగును. శుద్ధినొందిన దినము మొదలు పదిదినములపర్యంతము సమాధిచేయబడిన వేదికయందు అక్షతలు పుష్పములు మొదలగు వానిచే పూజించి ధూపదీపనైవేద్యము మొదలగునవిచేసి గాయత్రీమంత్రముతో గాని ప్రణవముతోగాని యెనిమిది దిక్కులయందును బ్రహ్మార్ఘ్యములను విడువవలయును. పిమ్మట సంకల్పముచేసి సిద్ధినిపొంది పరమహంసస్వరూపుడగు నాతండ్రికి తృప్తినిమిత్తము తర్పణను చేసెదననిచెప్పి "ఆత్మానం తర్పయామి" అనునది మొదలు "జీవాత్మానం తర్పయామి" అనుపర్యంతముండు నాలుగుతర్పణలను జేసి ప్రణవముతో తూర్పు మొదలగు నెనిమిది దిక్కులయందు క్షీరములతో తర్పణజేసి యనంతరము వేదికకు ప్రదక్షిణము జేసి సభాపూజనుచేసి దక్షిణ తాంబూలాదులనిచ్చి బ్రాహ్మణులతోను బంధువులతోనుగూడి కర్తయింటికి రావలయును. యతీశ్వరుల మరణవిషయములో స్పృశించినందువలన దోషములేదు. ఆశౌచమనే సందేహముతో స్నానము చేయనక్కరలేదు. అట్లు స్నానముచేసినయెడల నరకము సంభవించును. ఉపపాతకములును కలుగును. యతీశ్వరుల మరణమునుగురించి యాశౌచము ఉదకక్రియయు లేదనియు యతీశ్వరుని మాసినవారికి అశ్వ

మేధముతో సమానమగు సంపూర్ణఫలము కలుగునని యొకరుచెప్పిరి. యతీశ్వరుల మరణమును గురించి జ్ఞాతులు పుత్రులు కళత్రము మొదలగు వారికి ఆశౌచము లేదు. స్నానము జేయనక్కరలేదు. యతీశ్వరుడు మృతి నొందినపిమ్మట వానిని జూచిన వారికి పాపములుండవనియు నాయుర్వృద్ధి కలుగుననియు చెప్పబడెను. సూతకాగ్నిసంస్కారముగాని తడివస్త్రముతో జలము మొదలగునవి యిచ్చుటగాని యేకోద్దిష్టము షోడశము సాపిండ్యము మొదలగునవి చేయనక్కరలేదు. పండ్రెండవదినమునందు నారాయణబలినొనర్చి విష్ణుబద్ధితో యతీశ్వరులను పూజింపవలయును. యతీశ్వరునకు పుత్రులున్నను లేకున్నను సిద్ధినొందినప్పుడు పదకొండవదినమందు నారాయణబలిని చేయవలయును. నేను సన్యసించెద నన్నమాత్రమున నే పూర్వపు అరువది తరములవారును పరమందు అరువదితరములవారును తరించెదరు. నిత్యపూజయు మహాపూజయు నారాయణబలి పార్వణశ్రాద్ధముచేయవలయును. ఈప్రకారము యతిసంస్కారవిధానము చెప్పబడెను.

యతిసంస్కార ప్రయోగము సమంత్రకముగా జెప్పబడును.

అ౧—తా. దగ్గిరనున్న యెడల కుమారుడుగాని మరియొకరుగాని సర్వాంగవపనము జేయించుకొని స్నానముచేసి ఆచమనము సంకల్పము జేసి సభయొక్క అనుజ్ఞతీసికొని కలశపూజచేసి పిమ్మట పురుషసూక్తముతో షోడశోపచార పూజనుచేసి ప్రదక్షిణనమస్కారములను జేసి యతికళేబరమును పుట్టియందుంచి గంధపుష్పాదులచే నలంకరించి స్వస్తివాచన హరినామస్మరణ జయజయశబ్ద భేరీ దుందుభాది ధ్వనులతో గ్రామమునకు ప్రదక్షిణముగా తిరిగి పూర్వముచెప్పబడిన విధముగా తూర్పునగాని యుత్తరమునగాని నదీతీరము మొదలగు పరిశుద్ధప్రదేశములయందు జలప్రోక్షణాదికములను జేసి ప్రాఙ్ముఖముగా యతీశ్వరునుంచి కర్త పాదప్రక్షాళ నాచమనాదులను జేసి తిరిగి యతీశ్వరునకు పురుషసూక్తముతో షోడశోపచారములచే గురుపూజను చేసి ప్రదక్షిణ నమస్కారములను జేసి పిమ్మట యతీశ్వరుని దండప్రమాణముగా గొయ్యినిత్రవ్వి జలముతో ప్రోక్షించి యుత్తరాగ్రములుగా దర్భలను పరచి కొంచెము లవణముంచి యతిశరీరమునుంచి కుడిహస్తమునందు దండముంచి యెడమ హస్తమునందు కమండలమునుంచి యతీశ్వరుని నేత్రపర్యంతము లవణముతో నిండించి కపాలభిన్నముచేసి కపాలమునందు లవణమునుంచి చిత్తిసున్నిక్

మొదలగు మంత్రములను "సర్వంచమే భూయాత్" అను పర్యంతము చెప్పి అభిమంత్రించవలయును. అనంతరము 'అతో దేవా అవంతునః' అనునది మొదలారుమంత్రములచే నమస్కారము జేసి యాగర్తమును మృత్తికచే పూడ్చి యచ్చట నొకవేదికను వేసి కర్త స్నానాచమనములను జేసి వేదికయందు లింగప్రతిష్ఠ జేసి యాదినమందే యచ్చట పురుషసూక్తముతో షోడశోపచారములచే గురుపూజను చేసి కేశవాది నామములచేతను శివాష్టోత్తర నామములచేతను పూజించి ధూపదీప నైవేద్యాదులను ప్రదక్షిణ నమస్కారాదులను జేసి పిమ్మట సంకల్పముచేసి పూజాంగక్షీర తర్పణముచేసి పిమ్మట యావేదికకు ప్రదక్షిణము సభాపూజను జేసి బ్రాహ్మణులకు దక్షిణ తాంబూలాదుల నిచ్చి బ్రాహ్మణులు బంధువులు మొదలగు వారితోగూడి కర్త యింటికి రావలయును. దీనిలో చేయువిధానము మూలములో సక్రమముగా చెప్పబడియున్నందున దానినిచూచి ప్రయోగక్రమము తెలిసికొనవలయును. ప్రతివిషయమునకు విపులముగా వ్రాయనవసరము లేదు. కాబట్టి క్లుప్తముగా వ్రాయబడినది. ఇట్లు సంస్కారము చెప్పబడెను.

## నిత్యపూజా విధానము.

౨౮౮—తా. కర్తస్నానాచమనములను జేసి సంకల్పముచేసి సన్యసించినట్టియు సిద్ధినిపొంది పరమహంస స్వరూపుడును నారాయణ స్వరూపుడునగు నాతండ్రికి ఖననదినము మొదలు రెండవదినమునందు సమాధి వేదికయందు పురుషసూక్త విధానముగా శక్త్యానుసారముగ షోడశోపచారములచే గురుపూజను చేసెదనని సంకల్పముచేసి పూర్వము చెప్పబడినట్లు పూజనుచేసి యనంతరము పూర్వప్రకారము క్షీర తర్పణము ఇంద్రుడు మొదలగు నెనమండుగురు దిక్పతులకు నెనిమిది దిక్కులయందును తర్పణము చేయవలయును. నిత్యపూజను చేయునప్పుడు నిత్యము అప్పటికి నెన్నిదినములగునో ఆదినసంఖ్య ప్రకారముగా సంకల్పముచేసి పూజ చేయుచుండవలయును.

## మహాపూజా విధానము

౨౮౯—తా. సిద్ధిని పొందినట్టియు పరమహంస స్వరూపుడును నారాయణ స్వరూపుడునగు నాతండ్రికి ఖననదినము మొదలు పదియవదిన మునందు ఈవేదికయందు గురువునుగురించి మహాపూజను చేసెదనని సభికుల యనుజ్ఞపొంది పూర్వము చెప్పబడినట్లు పూజను తర్పణను చేసి బ్రాహ్మ

ణులకు దక్షిణతాంబూలాదుల నిచ్చి యింటికి వెళ్లవలయును. ఇట్లు మహా పూజా విధానము.

పార్వణ శ్రాద్ధక్రమము.

౫౯౦.—తా. కర్త స్నానాచమనములను జేసి సభకు ప్రదక్షిణము జేసి బ్రహ్మస్వరూపుడగు నాతండ్రికి ఈపదకొండవదినమునందు పార్వణ శ్రాద్ధము నాచరించెదనని సభికులయనుజ్ఞనొంది సంకల్పముచేసి పితృపితామహ ప్రపితామహులను వారిగోత్రనామములను వసురుద్రాదిత్యములను సాధుగురుసంజ్ఞగల విశ్వేదేవులను విష్ణువును గురించి బ్రహ్మీభూతుడగు నాతండ్రియొక్క పదకొండవదినమునందు అన్నాదిద్రవ్యముతో పార్వణ విధానముగా శ్రాద్ధము నాచరించెదనని సంకల్పముచేసి చేయవలయును. విధానమంతయు ఆబ్దికమువలెనే తెలిసికొనవలెను.

నారాయణబలి ప్రయోగము.

౫౯౧.—తా. సిద్ధినిపొంది పరమహంస స్వరూపుడును నారాయణ స్వరూపుడును గురువునగు నాతండ్రికి ఖనన దినము మొదలు పండ్రెండవ దినమునందు నారాయణబలిని చేయునిమిత్తము గృహభాండ ఆత్మద్రవ్య స్థల శరీరశుద్ధికొరకు పుణ్యాహవాచనము చేసెదనని సంకల్పముచేసి పుణ్యాహవాచనముచేసి పిమ్మట నారాయణబలినిమిత్తము విశ్వంభరు పూర్వకముగా కేశవాది పండ్రెండునామములచే మొత్తము పదముగ్గురు బ్రాహ్మణుల నావాహనముచేసి పూజించవలయును. పురుషసూక్తవిధానముగా సాలగ్రామమునందు విష్ణుపూజను చేయవలయును. సాలగ్రామ సన్నిధియందు నగ్నిప్రతిష్ఠాపనజేసి యగ్నిముఖాంతము జేసి సమిత్తులు పాయసము ఆజ్యము మొదలగువానిచే పురుషసూక్తమంత్రములతో ప్రత్యేక ప్రత్యేకముగా షోడశాహుతులను జేసి పిమ్మట నాజ్యముతో కేశవాది నామములచే పండ్రెండాహుతులను జేయవలయును. బహుళపక్షమునందు సంకర్షణనామము మొదలుగా చేయవలయును. అగ్నికి తూర్పుదిక్కునందు ప్రాగగ్రములుగా దర్భలనుపరచి నారాయణబలినుంచి యవోదకమునుంచి యజ్ఞేశ్వరుని పేరుచెప్పి సర్వోపచారపూజనుచేసి క్షమాపణను చెప్పవలయును. అనంతరము బ్రాహ్మణులను భుజింపచేయవలయును. పిమ్మట విశ్వంభరస్వరూపుడగు బ్రాహ్మణసమీపమున ప్రాగగ్రములుగా దర్భలనుపరచి యవోదకమునుంచి వ్యాహృతులతో బలిప్రదానము చేయవలయును. పిమ్మట సంకల్పముచేసి బల్యంగముగా పిండప్రదానము చేయునిమిత్తము

ప్రాగగ్రములుగా దర్భలనుపరచి యవోదకమునుంచి శేషాన్నమును పంన్రెండు పిండములను జేసి కేశవాది పంన్రెండునామములతో పంన్రెండు పిండములనుంచి పిమ్మట జలమార్జనముచేసి విష్ణునిగురించి పునః పూజను చేయవలయును. గురుప్రీతికొరకు సాలగ్రామ దానమును దశదానములనుచేసి ప్రదక్షిణ నమస్కారములనుజేసి బ్రాహ్మణ విసర్జనాంతము చేయవలయును. పదమూడవదినమందు ఆరాధన చేయవలయును సంవత్సర పర్యంతము ప్రతిమాసమునందు మాసికములను పెట్టనక్కరలేదు. ఆరాధన చేసిన చాలును. ఇట్లుచేసిన అశ్వమేధఫలము నొందును. ఈప్రకారము సన్యాసాశ్రమమునొందినవారియొక్క సంస్కారవిధానము చెప్పబడెను.

పరిషద్విధాయకానువాదకప్రాయశ్చిత్తవిధానము చెప్పబడును.

౫౯౨—తా. పరిషత్ప్రాయశ్చిత్తమును గురించి పరాశరుడు చెప్పిన దేమనగా, ప్రథమమున మహానదియొద్దకువెళ్లి స్నానముజేసి మహాసంకల్పమును చెప్పవలయును. అనంతరము మృత్తికాస్నానములుచేసి సభను పూజించి ప్రాయశ్చిత్తమును నిర్ణయించి చెప్పవలయునని సభ్యులను కోరగా వారు శ్రుతిస్మృతిధర్మశాస్త్రాదులనన్నియు విచారించి శాస్త్రోక్తప్రకారము ప్రాయశ్చిత్తమును చెప్పవలయును. అప్పుడు యజమానుడు వారుచెప్పిన ప్రకారము చేసికొనవలయును. కర్తయగుటయు సభ్యులు నిర్ణయించి చెప్పుటను గురించి ముందుచెప్పబడును. అందువలన వ్రతమును స్వీకరించుట, దంతధావనాది విధానము, దశదానముల క్రమము, నాందీశ్రాద్ధవిధానము, వైష్ణవశ్రాద్ధము, ప్రాచ్యాంగగోదానము, శాలాహోమము, పంచగవ్యహోమము, పంచగవ్యప్రాశనము, కృచ్ఛప్రాయశ్చిత్తములు, ఉత్తరాంగమైన గోదానము, తిరిగి శాలాగ్నిహోమము, నాందీశ్రాద్ధము, వైష్ణవశ్రాద్ధము, తిరిగి దశదానములు, భూరిదానము, ముఖముచూడబడినట్టి యాజ్యదానము, బ్రాహ్మణాశీర్వచనము, ఘృతసూపభక్ష్యాదులతో షడ్రసోపేతముగా బ్రాహ్మణ సమారాధనము, ఈమొదలగునవి చేసినయెడల సమస్తపాపములవల్లను విడువబడునని ప్రాయశ్చిత్తవిధానము చెప్పబడెను.

సర్వప్రాయశ్చిత్తక్రమము చెప్పబడును.

౫౯౩—తా. సర్వప్రాయశ్చిత్తమును చేసికొన దలచినవాడు ప్రాయశ్చిత్తవిధానమును బాగుగా చేయించునట్టి నేర్పుగలవానిని చేయించుటకును సభనిమిత్తముగా పంన్రెండుగురు బ్రాహ్మణులను వరించవల

యున్ను, పిమ్మట సర్వప్రాయశ్చిత్తమును జేయదలచినవాడనై నాపాపము లను సభికులతో జెప్పుకొనుటకు మలాపకర్షణ స్నానమును చేసెదనని సంకల్పముచేసి సచేలస్నానముజేసి తడివస్త్రములతోనే సభికులనొద్దకు వెళ్లి మహాసంకల్పము చేయవలెను.

మహాసంకల్పము.

౨౮౮—తా. 'అథానంతవీర్యస్య' అనునది మొదలు 'పరిషదుపస్థానపురస్సరం కరిష్యే' అనుపర్యంతము మూలములో నుండు ప్రకారము మహాసంకల్పము జేసి ప్రాయశ్చిత్తమునకు నంగభూతమైన మృత్తికా స్నానమాచరించి తడివస్త్రముతోనే సభకు మూడుపర్యాయములు ప్రదక్షిణముజేసి దక్షిణను సమర్పించి సాష్టాంగనమస్కారముజేసి సభ్యులతో నిట్లు విన్నవించుకొనవలయును. ఓసభ్యులారా బాల్యమునుండి యింతపర్యంతము సర్వావస్థలయందును నేనుజేసినట్టి సమస్తపాపములను పోగొట్టునట్టి ప్రాయశ్చిత్తము నొక్కదానిని నిర్ణయించి చెప్పవలయునని తిరిగి నమస్కారముచేసి ప్రార్థించగా సభికులును యజమానుని ప్రార్థనవిని సమస్త పాపములు నశించునట్టి ప్రాయశ్చిత్తము నొక్కదానిని విధాయకులు నిర్ణయించి చెప్పెదరు. విధాయకు లేడుగురుగాని యైదుగురుగాని ముగ్గురుగాని యుండవలయును. చతుర్విధ సర్వప్రాయశ్చిత్తమునకు కృచ్ఛ్రప్రకారముగా లెక్కించినయెడల మహాపాతకముకంటె తక్కువైన తదధిష్ఠానములయందు 180 ప్రాజాపత్యములగును. వాటికంటె తక్కువయగు నుపపాతకములయందు రెండుసంవత్సరముల పరిమితమైన షష్టిసంఖ్యాకకృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమగును. ఉపపాతకముకంటె తక్కువయగు సంకీర్ణీకరణాదులైన యనేక క్షుద్రపాపములయందు అబ్దప్రాయశ్చిత్తము ప్రకీర్ణకములైన క్షుద్రపాపములయందు కృచ్ఛ్రాతి కృచ్ఛ్రచాంద్రాయణము లగును. ఇవి యన్నియు నభ్యాసవశముచే షడ్గుణితములై యుత్తమ మధ్యమ అధమాధికారి భేదముచే త్రిగుణములగును. ఇవియును కేశరక్షణయందు రెండు రెట్లగును. శవసంబంధమగు నంగమందు ఆప్రకారముగానే ద్విగుణమగును. అస్థి స్వరూపమందు త్రిగుణమగును. మృతినొందిన పిమ్మట పుత్రులు మొదలగువారు చేయునట్టి ప్రాయశ్చిత్త విషయములలో తన్నిమిత్తమైన వపనము దంతధావనము శాలాగ్నిహోమము పంచగవ్య హోమము, తత్ప్రాశనము నిరీక్షాజ్యదానము మొదలగునవి చేయనక్కరలేదు. అంగవైకల్య పరిహారముకొరకు కొంచెము దక్షిణనివ్వవలయును.

కృచ్ఛ్రమని చెప్పుటచే నీవిధముగానే ప్రాజాపత్యకృచ్ఛ్రము. అతికృచ్ఛ్ర స్థానమునందు మూడు ప్రాజాపత్య కృచ్ఛ్రములును చాంద్రాయణ స్థానమునందు నెనిమిది ప్రాజాపత్య కృచ్ఛ్రములును చెప్పబడినవి. సర్వప్రాయశ్చిత్తము సువాసినీస్త్రీలు చేసికొనేయెడల వపనమక్కరలేదు. విధవలైనయెడల వపనము చేయించుకొనవలయును. బాల్యము మొదలు పాతకముగాని యుపపాతకములుగాని యేవైనచేసినయెడల అవియన్నియు షడబ్ద ప్రాయశ్చిత్తముచే నశించును. మహాపాతకములు మాత్రమునశించవు. ఈప్రకారముగా జెప్పబడిన నాలుగువిధములైన ప్రాయశ్చిత్తములలో జేయువానియొక్క శక్తిననుసరించి యొకప్రాయశ్చిత్తమును నిర్ణయించి చెప్పవలెను.

## విధాయక వరణము.

౫౯౫—తా. నేను చేయదలచిన ప్రాయశ్చిత్తమునందు ఈసభలో నుండు వారందరును విధాయకులుగా నుండుటకు మీరంగీకరించి నన్ను రక్షింపవలెనని కోరవలెను.

## అనువాదక వరణము.

౫౯౬—తా. చేయనిశ్చయింపబడిన ఈప్రాయశ్చిత్తవిధానమందు మీరు అనువాదకులుగానుండి నన్ను రక్షింపవలయునని సభ్యులలో గొందరిని ప్రార్థించవలయును.

## సభ్యులుచెప్పునట్టి వాక్యములు.

౫౯౭—తా. అప్పుడు సభ్యులు చెప్పున దేమనగా. ఓవిధాయకులారా! ఇప్పుడీయజమానునిచే జెప్పబడిన తొమ్మిదివిధములగు సమస్త పాపములవిషయమై షడ్గుణిత షడబ్ద కృచ్ఛ్రరూపమైనయెడల 1080 సంఖ్య గల ప్రాజాపత్యకృచ్ఛ్రస్వరూపమైన ప్రాయశ్చిత్తముత్తమాధికారికిని దానిని రెండురెట్లుచేసిన 2160 మధ్యమాధికారికిని మూడురెట్లుచేసిన 3240 సంఖ్యగల ప్రాజాపత్యాత్మక కృచ్ఛ్రప్రాయశ్చిత్తము అధమాధికారికిని చెప్పబడి పాపమును పోగొట్టునవియై యున్నవి. దీనినిమిత్తమై ప్రాచ్యోదీచ్యాంగ గోదానసహితముగా ప్రాజాపత్య కృచ్ఛ్రప్రాయశ్చిత్తమును చేయుటకు శక్తిలేనివాడై యున్నయెడల దానికి ప్రతినిధిగా తత్సంఖ్య గల గోదానాదులనైనా యతనికి నిర్దేశించి చెప్పవలయునని విధాయకులతో బలుకవలయును.

విధాయకుల వాక్యము.

౫౯౮—తా. ఇట్లు సభ్యులు చెప్పగా విధాయకులు హస్తములయందు పుష్పములనుగాని దర్భలనుగాని యుంచుకొని తూర్పుముఖముగా లేచి నిలుచుండి అనువాదకునితో నిట్లు చెప్పవలయును. విద్వాంసుడవును విద్వాంసులలో శ్రేష్ఠుడవును సమస్త ప్రాయశ్చిత్తానువాదనలయందు నేర్పుగల రెూ యనువాదకుడా! ఇప్పుడీయజమానులచే విజ్ఞాపన చేసికొనబడిన పాపములను గురించి యుత్తమ మధ్యమాధమాధికారి తారతమ్యముగా ప్రాజాపత్య కృచ్ఛ్రప్రాయశ్చిత్తమును నిర్ణయించి చెప్పి దీనివలన పాపములు పోవునని సభ్యులందరియొక్కయు నభిప్రాయమై యున్నది. కాబట్టి మేమందరమును దానినే యంగీకరించినాము. అందువల్లను ఈ ప్రాయశ్చిత్తమును యజమానునితో చెప్పవలయునని నిన్ను ప్రేరేపించుచున్నాము. కాబట్టి నీవున్ను లేచి నిలుచుండి సభ్యులందరు వినునట్లుగా పెద్దధ్వనితో చేతులను పైకెత్తి సభ్యులు నిర్ణయించి చెప్పిన ప్రాయశ్చిత్తవిధానమునంతయు సవిస్తరముగా యజమానునితో జెప్పవలయునని అనువాదకునితో చెప్పుదురు. అనువాదకుడు నాప్రకారమే స్థిరచిత్తుడై లేచి నిలుచుండి యూర్ధ్వబాహుండై యుచ్చస్వరముతో సభ్యులందరు వినునట్లుగా ముమ్మారు పలుకును. దీనిప్రయోగము మూలమునందుండినవిధముగా వ్రాయబడినది. సభ్యులు ప్రాయశ్చిత్తవిధానమును నిర్ణయించి చెప్పువారు. దానినంగీకరించువారు విధాయకులు. దానిని యజమానునకు బోధపరచువాడు అనువాదకుడు. అని మూడుతరగతులుగా చెప్పబడెను.

అనువాదకుడు చెప్పుట.

౫౯౯—తా. ఓ యజమానుడా! నీవు సభ్యులతో విన్నవించుకొనబడిన పాపములవిషయమై ప్రాయశ్చిత్తవిధానము నిర్ణయించి విధాయకులతో జెప్పగా నీతోచెప్పవలసినదని విధాయకులు నన్ను నియమించిరి కాబట్టి నిర్ణయప్రకారము నీవు చేసినయెడల సమస్తపాపములనుండి విముక్తుడ వగుదువని వారుపలికెదరు. కాబట్టి యాప్రకారము చేయుమని అనువాదకుడు యజమానునితో చెప్పును.

వ్రతమును గ్రహించుట.

౬౦౦—తా. అనంతరము యజమానుడు ప్రాణాయామము జేసి నాచే జేయబడిన సమస్తపాపములు నశించుకొరకు సభ్యులు నిర్ణయించి యుత్తమ మధ్యమాధమాధికారి తారతమ్యముగా జెప్పిరి. కాబట్టి నాశక్తి

ననుసరించి ప్రాచోదీచ్యాంగ గోదానసహితముగా సర్వప్రాయశ్చిత్తమును చేసెదనని సంకల్పముచేసి వ్రతమును ధరించవలెను.

అనంతరము వపనము దానివిధానము.

౩౦౧—తా. పిక్కలు తొడలు చంకలు భుజములు వీట్లయందుండు రోమములను గడ్డమును మీసములను వపనము జేయించుకొనవలయును కుక్షియందుండు రోమములను శిఖను వపనము చేయించుకొనకూడదని చెప్పబడినది కాబట్టి శిరస్సునందు శిఖనువిడిచి మిగిలిన రోమములను గడ్డము మీసములను వపనము జేయించుకొని గోళ్లను తీయించుకొని స్నానాచమనములను జేయవలయును దంతధావనమునకు కూడ సంకల్పము చేయవలయును. ఓవృక్షమా ఆయువు బలము కీర్తి వర్చస్సు సంతానము పశువులు ధనము వేదమును ప్రజ్ఞను తెలివిని మొదలగు వానిని నాకిమ్మని ప్రార్థించి దంతకాష్ఠమును తెచ్చుకొని దంతధావనము చేసి స్నానాచమనములను జేసి ప్రాణాయామము జేసి తనయొక్క సమస్త పాపములను పోవుటకు సభవారు నిర్ణయించిచెప్పిన ప్రాయశ్చిత్తమును చేయదలచినవాడై ముందుగా నాయామంత్రములతో దశవిధ స్నానములను జేయవలయును. గోమయము, మృత్తిక, జలము, గోమూత్రము, క్షీరము, దధి, ఆజ్యము, కుశోదకము, భస్మ, మధు, అని పదివిధములగు వానితో స్నానము చేయవలయును. ఈవిధముగానే వ్యాసుడుచెప్పి బాహ్యశరీర శుద్ధికొరకు మలాపకర్షణ చేయవలయునని చెప్పెను. కాబట్టి ఉత్తమ మధ్యమాధమ భేదములచే శరీరశుద్ధి నిమిత్తము మూడు భాగములుగా వాని నన్నింటినిచేసి గరికలు తెచ్చి శాస్త్రోక్తప్రకారము తైలమును కూడ కలిపి జలముతో సహితముగా నుత్తమాధమ మధ్యమాను సారముగ శరీరశుద్ధిని చేయవలయును. వాటి సంఖ్యాప్రకారము జలప్రక్షాళనము జేయవలయును. ఒకపర్యాయము గోమయస్నానము చేయవలయును. పిమ్మట మలాపకర్షణస్నానము భస్మతో చేయవలయును. గోమయస్నానము చేసినట్లుగానే పంచగవ్యములతోను శరీరమునంతయు ప్రక్షాళనము జేసికొనవలయును. అనంతరము వస్త్రముల నుదకముతో శుభ్రపరచి రెండు పర్యాయము లాచమనముచేసి యావస్త్రములను ధరించి మృత్తికచేతను జలముచేతను తొడలను హస్తములను శుభ్రపరచి తిరిగి రెండుమారు లాచమనము జేసి స్నానము జేసిన కాటిని మృత్తికచే జలములచే శోధించి పంచగవ్యప్రాశనము, శాలాగ్నిహోమము చేయవలయును.

నిశాసమయమునందు వ్రతము నారంభముజేయుటకు సంకల్పమునకు తర్వాతనే పంచగవ్యహోమము శాలాగ్నిహోమము చేయవలయునని కొందరనిరి. గ్రామమునకు వెలుపలకువెళ్లి నిశాసమయమునందు నక్షత్రములు కనపడుచుండగా వ్రతమునకు సంకల్పము చేయవలయును. సర్వధర్మరహితముగా ప్రాచ్యాంగము నిమిత్తము నాందీశ్రాద్ధమును చేయవలయును. మాతృవర్గమును పితృవర్గమును సపత్నీకముగా మాతామహావర్గమును నాందీశ్రాద్ధదేవతులనుగా పూజించవలయును. విష్ణువునుద్దేశించి వైష్ణవశ్రాద్ధమును జేయవలయును. వీరందరికి భోజనమును సరిపోవునట్టి దక్షిణల నివ్వవలయును. పిమ్మట ప్రాచ్యాంగ గోదానమును శాలాగ్నిహోమమును జేయవలయును. కృచ్ఛ్రములను ప్రారంభించుటకు పూర్వమందును సమాప్తియైనపిమ్మటను ప్రత్యేకముగ వ్యాహృతులతో నాజ్యముచే శాలాగ్నిహోమము చేయవలయునని యున్నది. కాబట్టి ఔపాసనాగ్నియందుగాని లౌకికాగ్నియందుగాని శాలాగ్నిహోమము చేయవలయును. చతుష్పాత్రవిధానము. వ్యాహృతులతో నూటయెనిమిది సారులు హోమముచేసి యుత్తర పరిషేచనముచేసి పిమ్మట పంచగవ్యహోమము చేయవలయును. ఒకపలము యెత్తు గోమూత్రము, అంగుష్ఠములో నగము గోమయము, ఏడుపలములు క్షీరములు, మూడుపలములు పెరుగు, ఒకపలము నెయ్యి, ఒకపలము కుశోదకమనియు, పంచగవ్యహోమము నిమిత్తము చెప్పబడినది. గోమూత్రము 20 పలములును, గోమయము 16 పలములును, క్షీరములు 12 పలములును, పెరుగు 10 పలములు, గోమూత్రమువలెనే నెయ్యి 20 పలములుండ వలయునని మరియొకరు చెప్పిరి. గోమూత్రము యెఱ్ఱని ఆవు సంబంధమైనదియు, గోమయము తెల్లనియావు సంబంధమైనదియు, పాలు బంగారువర్ణముగల ధేనువుయొక్కయు, పెరుగు నీలవర్ణముగల ధేనువుయొక్కయు, నెయ్యి అన్నియావుల సంబంధమైనదియు, పనికి వచ్చుననియున్నది. పంచగవ్యముల గురించి ప్రత్యేకముగా జెప్పబడిన్న ఆవుల సంబంధమైనవి లభించని యెడల కపిలధేనువు సంబంధమైనవి గోమూత్రాదులైదును ఉపయోగింపవచ్చును. ఈయైదు గవ్యములను ప్రత్యేకముగా నైదుపాత్రలయందుంచి పంచగవ్యహోమము ప్రాశనయును చేసెదనని సంకల్పముచేసి యగ్ని ప్రతిష్ఠానాంతముజేసి యగ్నికి నుత్తర భాగమునందు ఆయా మంత్రములను చెప్పుచు నాయాగవ్య పాత్రలను ప్రాగగ్రములుగా నుం

చవలయును. పిమ్మట నగ్నికి పశ్చిమభాగమున నొకపాత్రయందు గాయ
మంత్రములను చెప్పుచు గవ్యములను దర్వితోనుంచి అవియన్నియుకలిపి
యేడుదర్భలతో నిర్మింపబడిన బ్రహ్మ కూర్చతోను దర్వితోను గ్రంథోక్త
ప్రకారమగు మంత్రములతో హోమము జేయవలయును. ఇట్లు తొమ్మిది
పర్యాయములు హోమముచేసి యుత్తరపరిషేచనము చేయవలయును.
పంచగవ్యములను పాత్రయందుంచి కూర్చితో త్రిప్పునపుడును మథించి
నపుడును గ్రహించునపుడును పానముచేయునపుడును ప్రణవమును
చెప్పవలయును. మోదుగాకుతోగాని తామరాకుతోగాని త్రాగవలయును.
మరియు మోదుగాకు తామరాకు స్వర్ణపాత్ర తామ్రపాత్ర వీటిలో దేనితో
నైనను బ్రహ్మతీర్థముగా శేషము లేకుండునట్లు పానము చేయవలయునని
మరియొకరు చెప్పిరి. నాశరీరసంబంధమగు చర్మము అస్థులు ననుసరించి
యుండు పాపమంతయు ఈపంచగవ్యప్రాశనము అగ్నికట్టెలను దహించు
నట్లు నశింపజేయుననెడియర్థమును బోధించునట్టి, యత్త్వగస్థి, అనుమంత్ర
ముతో పానము జేయవలయును. పిమ్మట నారాత్రియంతయు మౌనముగా
నుండి తనపాపములను గురించి పశ్చాత్తప్తుడై మనస్సున విష్ణువుని ధ్యా
నించుచు బ్రహ్మచర్యవ్రతముతో భూమియందే శయనించి ప్రాతఃకాలం
బునలేచి స్నానము జేసి నిత్య నైమిత్త కర్మలను జేయవలయును. ప్రత్యా
మ్నాయముగ పూర్వము జేయదలచినవి చేయవలయును. మరునాడుదయ
మున కృచ్ఛ్రములను జేయవలయునని కొందరును ప్రత్యామ్నాయముగా
జేయునప్పుడంతయు నప్పుడే చేయవలయునని మరికొందరును చెప్పిరి.
పిమ్మట సర్వప్రాయశ్చిత్తమునకు సంకల్పము జేసి గోదానముచేసి మిగిలిన
వాటిని స్నానరూపముగా బ్రాహ్మణులచే జేయించి వారికి దక్షిణలనిచ్చియు
దీచ్యాంగ గోదానముచేసి అలక్ష్మి పోవుటకు నాజ్యములో ముఖావలో
కనము జేసి దానిని దానమిచ్చి పిమ్మట భూరిదానములను చేయవలయును.
అనంతరము బ్రాహ్మణభోజనము చేయించి దీనివలన భగవంతుడు సంతో
షించుగాకయని పలుకవలయును. ఆశ్రమస్వీకారులకును ప్రాయశ్చిత్తము
లతో తారతమ్యము కలదు. గృహస్థునకు జెప్పబడిన పాపములు ఆశ్రమ
స్వీకారులకు నుండినయెడల బ్రహ్మనిష్ఠకలుగక పూర్వము శౌచమువలెనే
శోధనచేయవలయును. పదియారు సంవత్సరములు లోపుగల బ్రహ్మచారికి
ద్విగుణమనియు బాలుడగుటచే నల్పముగా విధించవలయునని యున్నది.
బ్రహ్మచారి వానప్రస్థులవిషయమై శౌచమువలెనే ప్రాయశ్చిత్తము

ద్విగుణాదిభేదముచే జెప్పబడెను. సర్వప్రాయశ్చిత్తముకంటె నితరప్రాయశ్చిత్తములు అధికారి తారతమ్యమునుబట్టి హెచ్చుతగ్గులుగా జెప్పబడినవి. సర్వప్రాయశ్చిత్తము ఒక్కటియే యైనది. బహువిధములుగా లేదు. అందువలన అధికార తారతమ్యములేకుండానే హెచ్చుతగ్గులుగా జెప్పబడెను. 80 సంవత్సరములు గలవానికిని రోగగ్రస్థునకు శూద్రునకు కారణాంతరముచే పాపము సంభవించినపుడు కృచ్ఛ్రప్రాయశ్చిత్తము చెప్పబడియున్నది. స్త్రీలవిషయములో కూడ దానిలో సగముగాగాని సగముకంటె నెక్కువగాగాని చేయవలయునని యున్నది. అందువలన అన్నివర్ణముల వారికిని అన్ని ఆశ్రమములకును అనులోమ జాతులకు బాలురకును అందరికిని అధికారి తారతమ్యములేదని విచారించ బడుచున్నది. మరియు ధనవంతుడు విద్వాంసుడు సమర్థుడు కర్మాధికారి అని అధికారి తారతమ్యము చెప్పుటచే మృతుడైన వానిగురించి అధికార తారతమ్యము చెప్పుటకు వీలులేదని కొందరనిరిగాని యదియుక్తమైనదికాదు. ఎందువల్లననగా, అందరు నరిష్టమును పోగొట్టుకొనుటయందు నభిప్రాయమొక్కటియే అందువలన అర్థిత్వమనునది మృతునియందును కలదు. మరియు తనశక్తి కొలదియు నలంకరించి యొకవరునిబిలచి తనకుమార్తె నిచ్చి వివాహము గావించిన బ్రాహ్మవివాహమనియు నాచిన్నదానికి జనియించినవాడు పితృమాతృవంశములలో నిరువైయొక్క తరములవారిని తరింపజేయుననియు, పెనిమిటి మహాపాతకుడైనను మృతినొందినప్పుడు వానిభార్య సహగమనము చేసినయెడల పాపమునుండి పెనిమిటిని యుద్ధరించుననియు, పుత్రుడు మొదలగువారు గయలో పిండప్రదానము జేసినయెడల తన పితృదేవతుల నిరువదొక్క తరములవారిని తరింపజేయుననియు, జెప్పబడియున్నందున మృతులైనవారియొక్క యరిష్టమును పోగొట్టువిషయమై పుత్రుడు భార్య మొదలగువారికి కర్తృత్వము కలదు. వారికి కర్తృత్వమేలేని యెడల ప్రమాణములకు భంగమువచ్చును. అందువలన పుత్రాది కర్తృత్వద్వారా మృతుడును అర్థియగుచున్నాడు. కాబట్టి అధికారిత్వకలదు. మహాపాతకులైనను మృతినొందిన పిమ్మట బహుకాలము గడచినప్పటికిని ప్రాయశ్చిత్తమునుజేసి పారలౌకిక క్రియలను జేయవలయునని అపరార్కాదిని బంధనకారులు చెప్పిరి. సమర్థుడగు కుమారుడు తండ్రినిగురించి సర్వప్రాయశ్చిత్తములలో నొకదానినిచేసి పరలోకసంబంధమగు క్రియలను జేయవలయునని స్మృత్యర్థసారమను

గ్రంథప్రమాణము కలదు. అందువలన మృతుడైనవానికి సర్వప్రాయశ్చిత్తము చేయవలయును. అదియును జీవించియుండగా జేయునప్పుడు వ్రతముకంటె మృతినొందినప్పుడు జేయువ్రతము రెండురెట్లనియు అస్థివిధానములో మూడు రెట్లనియు పలాశవిధానములో నాలుగు రెట్లనియు చెప్పియున్నట్టి సంగ్రహకారుని వచనప్రకారము చేయవలయును. అయితే మృతుడైనవాని యొక్క సర్వప్రాయశ్చిత్తవిషయములో సమస్త క్రియలు చేయుటకు వీలులేదు కాబట్టి అధికారియట్లగునని ప్రశ్నచేసినయెడల నేత్రేంద్రియము లేనివాడు సభను జూచుటకు శక్తిలేకపోయినను, రోగపీడితుడు వపనము జేయించుకొనుటకు వీలులేకపోయినను, కుంటివాడు సభకు ప్రదక్షిణము జేయలేకపోయినను, మూగవాడు తనపాపములను చెప్పలేకపోయినను, దంతములులేనివాడు దంతధావనక్రియకు నర్హుడు కాకపోయినను, వీరలకు సర్వప్రాయశ్చిత్తము చేయవలయునని యేవిధముగా చెప్పబడెనో ఆప్రకారముగానే మృతుడైనవానికిని యథాసంభవాంగములతో ప్రాయశ్చిత్తమును జేయుటకు నధికారముకలదని నిశ్చయింపవలయును. అందువలన సర్వప్రాయశ్చిత్తములకు నర్హతకలదు. ప్రధానప్రాయశ్చిత్తమును జేయుటచే ఫలముకలుగును. అప్పటివీలునుబట్టి యొకప్పుడు అన్నివిధములగు ప్రాయశ్చిత్తములను వీలులేనిసమయమందు కొన్నిప్రాయశ్చిత్తములనైనను జేయవచ్చును. కాబట్టి ప్రధానమైన సర్వప్రాయశ్చిత్తము చేయవలయును. ఆప్రకారముగానే ధర్మశాస్త్రమునందు చెప్పియున్న దేమనగా, సమస్తమైనవారును మహాపాతకమువదలివేసి మిగిలిన సమస్తపాపములు పోవునిమిత్తము తనశక్తిననుసరించి భక్తికలవాడై ప్రాయశ్చిత్తమును జేయవలయును. విశేష విధిలేనందున జన్మమొదలు కొని యనిచెప్పుటచే ఈజన్మయందు లేకపోయిన నితర జన్మములయందు జేయబడినవియు నశించును. ఈసర్వప్రాయశ్చిత్త మందరిచేతను జేయతగినది. ఈప్రకారము సర్వప్రాయశ్చిత్తవిధి చెప్పబడెను.

## మలమాస నిర్ణయము.

౩౦౨—తా. కారక గృహ్యాపరిశిష్టమునందు జెప్పబడిన దేమనగా, ఏమాసమునందైనను సంక్రాంతి లేకపోయినను లేక రెండుసంక్రమణము లొకమాసమునం దున్నను ఆమాసము మలమాసమనియు దానియందు నేకర్మల నాచరింప గూడదనియు చెప్పబడెను. ఎప్పు డింద్రాగ్నులను

గురించి హోమము చేయతగియున్నదో అది మాసాదియనియు దానియం
దగ్నిష్టోమములు కలవు. దాని నతిక్రమించి సూర్యుడు వెళ్లినప్పుడు
మొదటిమాసము మలమాసమనియు రెండవది నిజమాసమనియు చెప్ప
బడెను. సంవత్సరములో రెండుమాసములయందు సంక్రమణము లేనప్పుడు
మొదటిది నిజమాసమనియు రెండవది అధికమనియు చెప్పబడెను. సూర్యు
డు తులకన్యా వృశ్చికము ధనస్సు మకరము కుంభము ఈ రాసులయం
దుండు నప్పు డధికమాసము సంభవించదు. సూర్యుడు వృశ్చికము మొదలు
నాలుగు రాసులయందుండగా మలమాసము వచ్చినను తుల కన్య ధనస్సు
రాసులయందుండగా రెండు సంక్రమణములు కలిగినను అధికమాసము
లేదు. చైత్రమునకు లోపుగా నధికమాసము లేదనియు పరమందున్న
యెడల యేది పదమూడవమాసమని శాస్త్రప్రకారము చెప్పబడునో దాని
యందే సమస్తక్రియలను జేయవలయును. ఏమాసమునం దేమేమి చేయ
వలసినది. విభజనగా పైతీనసిచెప్పెను. త్రయోదశమాస మధికమాసమైన
యెడల శ్రౌతస్మార్తాది క్రియలు త్రయోదశమాసమునందు జేయగూడ
దనియు పంద్రెండవ మాసమునందు చేయవలయుననియు చెప్పెను. అధిక
మాసమునందు కామ్యకర్మను చేయకూడదనియు నజ్ఞానముచే జేసిన
యెడల నిష్ఫలమగుననియు చెప్పెను. నిత్య నైమిత్తికశ్రాద్ధములు మల
మాసమునందు జేయవచ్చుననియు తిథివారనక్షత్రములను విచారించి
చేయఁదగిన కామ్యశ్రాద్ధము చేయకూడదనియు జాబాలిచెప్పెను. శుద్ధ
మాసమునందు ప్రారంభించి చేయుకర్మను మలమాసమునందైనను జేయ
వచ్చును. వ్రతములు యజ్ఞములు మలమాసములో ప్రారంభించకూడదు.
సమాప్తియు జేయఁగూడదు. మహాలయ ఇష్టకాదిశ్రాద్ధములు ఉపాకర్మ
మొదలగు కర్మలు శుద్ధమాసమునందు ముఖ్యముగా చేయవలయు నని
యు మలమాసమునందు కూడదనియు గర్గుడు చెప్పెను. మలమాసమై
నప్పటికి సూర్యచంద్రగ్రహణము కలిగినప్పుడు స్నాన దాన జప శ్రాద్ధాదు
లును నిత్యనైమిత్తిక కర్మలును చేయవచ్చునని యముడుచెప్పెను. గర్భ
ము వడ్డీవ్యాపారము జీతము శ్రాద్ధకర్మ మాసికము సపిండీకరణము నిత్య
ముగా జేయబడు క్రియలు వీటివిషయమై అధికమాసమును విడువకూడ
దు. తీర్థశ్రాద్ధము జపము హోమము యవవ్రీహి తిలాదులచే జేయఁదగిన
కృత్యములు జాతకర్మాదికర్మలు నవశ్రాద్ధము మఘానక్షత్ర నిమిత్తమైనది
యు త్రయోదశీ నిమిత్తమగు శ్రాద్ధములు షోడశశ్రాద్ధములు నిత్య

నైమిత్తికకర్మలు మలమాసమునందైనను జేయవచ్చునని యముడు చెప్పెను. దహనము ఉదకపిండదానములు సంచయనము శ్రాద్ధము దర్శశ్రాద్ధము నిత్యహోమము మలమాసము నందైనను జేయవచ్చునని అంగీరసుడు చెప్పెను. ఇందు విషయమై బృహస్పతి చెప్పిన విశేష మేమనఁగా, ప్రేత కార్యములు ఉత్సవాదులును చేయవలసినకాలము గడచిన పిమ్మట శుద్ధ మాసములో జేయవలయునుగాని మలమాసములో జేయగూడదని చెప్పెను. భాద్రపదశుక్లపక్షములో మహాలయశ్రాద్ధమును జేయగూడదనియు నేదైననొక కారణము సంభవించినప్పుడు ప్రాయశ్చిత్తమును జేసి చేయవచ్చునని యముడుచెప్పెను. శ్రావణమాసముగాని భాద్రపదమాసముగాని యధికమాసమగు నప్పుడు పితృపక్షము ఏడవదియగునుగాని యైదవదికాదు. ఆషాఢబహుళపక్షము మొదలుకొని అయిదవదియనియు నేడవదియనియు లెక్క చూచుకొనవలయును. సూర్యుడు కన్యారాశి యందుండగా మలమాసము వచ్చినయెడల పితృపక్షనిమిత్తమగు మహాలయ శ్రాద్ధముచేయకూడదని జ్యోతియనువాడు చెప్పెను. సూర్యుడు కన్యారాశియందుండగా నధికమాసము సంభవించినప్పుడు దైవసంబంధమైనవియు పితృసంబంధమైనవియు కర్మలు భాద్రపద బహుళములో చేయకూడదు తులాసంక్రమణమునందు ప్రవేశించిన పిమ్మట జేసినయెడల కర్తకు విశేషఫలము కలుగునని పితామహుఁడు చెప్పెను గర్భము, వడ్డి, ప్రేత శ్రాద్ధకర్మ, మాసికము ఆబ్దికశ్రాద్ధము వీటివిషయమై అధికమాసము విడువగూడదని కాత్యాయనుడును, శ్రాద్ధదినము సంభవించినప్పుడు అధికమాసము వచ్చినయెడల రెండు మాసములయందును జేయవలయును. అందువలన దోషము లేదని ప్రచేతసుడును, మలమాసము వచ్చినప్పుడు అరువదిదినములుగల మాసమగును అప్పుడు ఉత్తరమాసములో దేవ కార్యములు పితృకార్యములు రెండుమాసములయందును జేయవచ్చునని వ్యాసుఁడును చెప్పిరి. గాని అధిమాసిక విషయములుగా జూచుకొనవలయును. ఈవిషయములో సత్యవ్రతుడు చెప్పినదేమనగా, బ్రాహ్మణులు తమ పితృదేవతా సంబంధమగు ప్రత్యాబ్దికము పంద్రెండవమాసములో జేయవలయును; ఒకానొకప్పుడు ప్రథమాబ్దికముగాక ప్రత్యాబ్దికము వచ్చినప్పుడు పదమూఁడవ మాసమునందైనను జేయవచ్చునని చెప్పెను. అనగా మృతినొందిన మాసము మొదలు పంద్రెండవమాసము మలమాసమైన యెడల అప్పుడే సంవత్సర సంబంధమైన పిండ[illegible] ప్రేత శ్రాద్ధ

ము సమాప్తిచేయవలయునని చెప్పెను. సంక్రమణము లేక పోయినప్పటికిని మలమాసమునందు ప్రథమాబ్దికమును మాసికమును సపిండీకరణమును జేయవచ్చునని హారీతుడును చెప్పెను. మలమాసము వచ్చినప్పుడు పండ్రెండవమాసమునందు ప్రథమాబ్దికమును ఇతరములగు అబ్దికములు పదమూడవ మాసమునందును పెట్టవలయునని వ్యాసుఁడు చెప్పెను. అయితే ప్రత్యాబ్దికము పండ్రెండవ మాసములో చేయవలయునని యున్నట్టి వచనము గుఱించి యెట్లనగా పండ్రెండవ మాసము పూర్తియైన పిమ్మట పదమూడవమాసములో పెట్టవలయునని చెప్పినట్లు గ్రహించుకొనవలయును. ప్రథమాబ్దికము మలమాసమైనను పండ్రెండవమాసమునందు పెట్టవలయును. ప్రత్యాబ్దికము పదమూడవ మాసమునందు పెట్టవలయునని యముఁడును చెప్పెను. సంవత్సరాంతమునందు సపిండీకరణము జేయబడిన పిమ్మట నూతనప్రత్యాబ్దికము మలమాసమైనప్పటికిని పండ్రెండవమాసమునందే చేయవలయునని జాబాలియు స్పష్టముగా జెప్పెను. శుద్ధమాసములో మృతినొందినవారి విషయమును గుఱించి మృతమాసమధికమగునేని యితరమైనవి యుత్తరమాసమునందును ప్రథమాబ్దికముమాత్ర మధికమాసములోను పెట్టవలయును. సంవత్సరమునకు లోపుగా నధికమాసము వచ్చినప్పుడు రెండుమాసములయందును మృతదినములయందును మాసికములను పెట్టవలయును. మలమాసములోమృతినొందినవారియొక్క ప్రతిసంవత్సరమునందు వచ్చుచుండెడి ప్రత్యాబ్దికమైనను తిరిగి యెప్పుడైన మలమాసము సంభవించినప్పుడామాసములోనే పెట్టవలయునని శాతాతపుడు చెప్పెను. శుద్ధమాసములో మృతుడైనవారికి ప్రథమాబ్దికము మలమాసములోను రెండవయాబ్దికము మొదలగునవి శుద్ధమాసములోను చేయవలయునని చెప్పునట్టివాక్యము మాసిక ఉదకుంభశ్రాద్ధ దర్శశ్రాద్ధవిషయమని పూర్వము చెప్పఁబడినది. తల్లిదండ్రులయొక్క ప్రతిసంవత్సరమునందు వచ్చుచుండెడి మృతదినములయందు చేయతగిన శ్రాద్ధమును మలమాసము సంభవించినప్పుడు రెండుమాసములయందును జేయవలయునని గాలవుడును ప్రతిమాస సంబంధమగు మాసికములును ప్రతిసంవత్సరాబ్దికమును మన్వాది యుగాదిశ్రాద్ధములును రెండుమాసములయందును జేయవలయునని మరీచియు చెప్పెను. ఇట్లు చెప్పియున్నందున ఆచారప్రకారముగా చేసికొనవలయును. ఆగ్న్యాధేయము, ప్రతిష్ఠ, యజ్ఞము, దానము, వ్రతములు, వేదవ్రతములు, వృషో

త్సర్గము, చూడాకర్మ, ఉపనయనము, మాంగళ్యము, అభిషేకము, మొద
లగునవి మలమాసములో జేయకూడదనియు శుక్రుడస్తంగతుడైనను
మలమాసములయందు సమస్తకర్మలను జేయుగూడదు. నూతనముగా
దేవతాదర్శనము జేయగూడదని వృద్ధమనువు చెప్పెను.

## వృషోత్సర్జన విధానము.

303—శ్లో. కామ్యమనియు నైమిత్తికమనియు వృషోత్సర్జనము
రెండువిధములు. కార్తికమాసమునందుగాని వైశాఖమాసమునందుగాని
కామ్యవృషోత్సర్జనము జేయవలయును. మృతినొందినవానియొక్క పద
కొండవదినమునందు నైమిత్తిక వృషోత్సర్జనము చేయవలయును. స్వర్గ
ఫలమును గోరినవాడు మలమాసములో వృషోత్సర్జనము చేయకూడ
దనియు పదకొండవదినమునందు జేయునప్పుడు మలమాసమైనను చేయ
వచ్చునని గర్గుడు చెప్పెను. మలమాసములో మృతినొందినవారికి పంద్రెం
డవదినమునందు సపిండీకరణము జరిగినప్పటికి, నిజమాసములో తిరిగి
ఆద్యమాసికమును పెట్టవలయును. దత్తుడును ఈప్రకారము చెప్పుచు
మలమాసములో మృతినొందినవారినిగురించి ఆద్యమాసికమునకు ఆవృత్తి
కలదనియు నిజమాసములో మృతినొందినప్పు డితరమాసికములకేగాని
ఆద్యమాసికమున కావృత్తిలేదని చెప్పెను. మలమాసములో మృతినొం
దినవారిని గురించి పదమూడవమాసమునందు ప్రథమాబ్దికమును పెట్ట
వలయును. మధ్యను అధికమాసమువచ్చిన నీప్రకారము చేయవలయును.
చివర నధికమాసము వచ్చినయెడల పంద్రెండవ మాసమునందే చేయవల
యునని యితర స్మృతులలో నున్నది. మధ్యనధికమాసము వచ్చినప్పుడు
ఊనాబ్దికము 355-వ దినమునందు చేయకూడదనియు 385-వ దినమందా
చరింపవలయు ననియు ధర్మవేత్తలు చెప్పిరి. ఈప్రకారము మలమాస
ములో జేయునప్పుడు వృషోత్సర్జన ఊనాబ్దికాదుల విషయమై చెప్పిరి.



ఇట్లు భారద్వాజసగోత్రుడును, తలముడివంశమునందు జనియించిన
యల్లాజియను విద్వాంసుడు సమస్త ధర్మశాస్త్రములను సత్పురుషుల
యాచారమును భారద్వాజసూత్రమును వారిచేజేయఁబడిన భాష్యమును
ఆపస్తంబసూత్రమును ఇతర మునీశ్వరసూత్రములను వారివారి భాష్య

ములను అన్నియుజూచి పైతృమేధికమును ఆహితాగ్నిని గుఱించి బ్రహ్మ
మేధమును మన్వాదిస్మృతుల నాలోచించి పైతృమేధికమను గ్రంథ
మును లోకోపకారము కొఱకు ప్రయోగ ప్రాయశ్చిత్త
ధర్మశాస్త్ర సహితముగా నుండు నటుల వ్రాసిన
మూల గ్రంథమునకు ఆంధ్ర తాత్పర్యము
గ్రంథాంతమందు చేర్పించి
ముద్రింపఁబడెను.



